శా. లావణ్యమ్మున మించి నీలగిరిలీలం బొల్చు నెమ్మేను నున్
శ్రీవత్సాంకిత వక్షమాశ్రితజనశ్రేయంకరాపాంగమున్
ప్రావీణ్యాన్వితముక్తమానసలసద్భద్రాంఘ్రియుం దేజముల్
దేవప్రస్తుతిగల్గునట్టి పరమున్ దేవేశుఁ గీర్తించెదన్."

రేఫ శకటరేఫమైత్రి స్వార్థకసంధులు మున్నగునవి యీ కవి కనకక్షమతములు గావు. లక్షణశ్రద్ధాళువుగాదృష్టితోఁ బరిశీలించి యింకనుగలిగిన విశేషములను వెలువరించుటకు వలసిన యవకాశమిందు లేకపోలేదు. ఇందనుస్యూతమైన విషయ ప్రపంచము సూచికవలన వెల్లడియగునుగాన నిచ్చటఁ బ్రత్యేకవుకరణము చేయఁబడుట లేదు. శ్రీ వేంకటేశ్వరునకు రంగశాయికవిచే సమర్పితమై నిర్మాల్యవైభవమునంది కొనిన యీ వనమాలా సౌరభము లు నేఁటివఱకును దాళీదళ సంపుటములలోఁ నణఁగి మాఁగియున్నవి. నేఁడివి యుద్ధరింపఁబడుచున్నది గావున అవి వాఙ్మయ లోకమున సీమావధులై కల్యాణకరములు కాఁగలవు.

తి. చంద్రశేఖరన్.

# విషయసూచిక

| విషయము. | పుట. |
|---|---|

## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.

# వాణీ విలాస వనమాలిక.

## ప్రథమాశ్వాసము

### అవతారిక

శా. శ్రీ విశ్వంభర లాస్యపాద సదుర స్సీమోరు పీఠంబులన్
తీవ్రుల్ మీఱంగ శంభు శక్ర ముని వాణీనాథ ముఖ్యుల్ నుతుల్
గావింపన్ శుభదాధిక ప్రభలచేఁ గల్యాణవద్వేంకట
గ్రావాధ్యక్షతఁ బొల్చు వేల్పుఁ గొలుతున్ గైవల్య సంసిద్ధికిన్

సీ. వరనీల చికుర శైవాల జాలమ్మున
నిందిత వదనపూర్ణేందు విభవ
మతుల విశాల తరాక్షి మీనంబులు
కమనీయ దంత ముక్తా ఫలములు
నులలితదరహాస శుభ్రడిండీరమ్ము
మధురాధరామృత మహితసుధయుఁ
గలిత త్రిరేఖా ప్రకాశి తగళదర
మామోద పృథుల కుచాచలములు

తే॥గీ॥ మానితోజ్జ్వల జంఘకామకరములును
లీలఁ దనరారు పాదప్రవాళ లతిక
యమర గాంభీర్యగతి జనకానురూప
మమర సుప్రాంగన లమేలుమంగఁ గొలుతు

ఉ. హారి కిరీట భాక్ప్రవల హారికి వారణ దైత్యవీర నీ
హారికి రౌద్ర్య భూధరవిహారికి దేహవిభాజితార్తి నీ
హారికిఁ గాలకూట పరిహారికి సంతత సంశ్రితామృతా
హారి కజహ్నుగ ప్రకర హారికి ప్రమ్రొక్కెదఁ గార్యసిద్ధికిన్.

చం. జగములకెల్లఁ దల్లియన సారనిదానతఁజెందు తండ్రికిన్
మగనికి ధైర్య భూతిగనమల్ విహితంబుగఁ గూర్చునేర్పునన్
సుగుణతఁ బుట్టినింటికెనిఁ జూచ్చినయింటికిఁ గీర్తి రాఁగ న
త్యగణిగ సన్నుతుల్గసిన యద్రిసుతన్ మది నెంతు నెంతయున్.

చం. అనువుగ దేవ తిర్యగచరాఖిల మానవ మానకల్పనం
బనుచతురాననత్వము యథాస్థితిగా వెలయంగఁ జేయుచున్
మును మినుకుల్ తదీయగతి ముఖ్యములై నెరయంగ రంగునన్
దనరిన వాగ్వధూసహితు ధాతను సృష్టివిధాతఁ గొల్చెదన్.

కం. క్షోణీ చక్రశ్రోణిన్
వేణీ రుచి విజిత నీలవేణిన్ ఘన క
ల్యాణిన్ నతగీర్వాణిన్
వాణిన్ శుభవాణిఁ దలఁతు వనజజు రాణిన్.

కం. సంచిత వంతుని విష్ణు
ధ్వాంతార్క ప్రతిభు సుగుణవంతు ననంతున్
శాంతు నిరంతర కరుణా
క్రాంతున్ గాంతున్ నుతింతుఁ గమలముఖు ననఘున్.

మ. హరి సేనాపతియై సమస్తపతితవ్రాతాళిక సంహార శౌ
ర్యరసోదంచితుఁడై రమేశ భజనారంజన్మహాయోగి భా
సుర చిత్తాబ్జ వికస్ఫురైకవిలసద్భానాకృతిన్ బొల్చి భా
స్వర కారుణ్యసుధానిధానుఁ డగు విష్వక్సేనుఁ బ్రార్థించెదన్.

కం. ఆది మదీయ కవిత్వము
సాధి మహిన్ సుకవి తురగసమితికి ననుచున్
బ్రోదిగ మఱిఁ బాదుకొల్పిన
యాదిమ వాల్మీకి కవి మహాత్మునిఁ గొల్తున్.

ఉ. వేదపుఁ బాదునన్ స్మృతులు విత్తులుగా నితిహాస వృక్షసం
పాదన చేఁ బురాణము లపారసమంచితశాఖలై తగన్
మోదముతోడ భాగవత ముక్తిరసైక ఫలప్రసంగతా
స్వాదన కేళిఁ దనరు వ్యాసమునీంద్రుని సన్నుతించెదన్.

చం. గురువరవర్యుఁ గణ్వముని గోత్రుని వామనదేవపుత్రునిన్
స్థిర శుభచర్య ధర్మపురి శ్రీనరసింహ పదప్రసాద సి
ద్ధరఁ దగు సాధు ప్రకటిత స్థిర భాగవత క్రమాఢ్యునిన్
చిరమతి రామభద్ర గురుశేఖరునిన్ భజియింతు నిత్యమున్.

సీ. భవభూతి శివభద్రు బాణు మయూరాఖ్యుఁ
గలభుని హేరంబుఁ గాళిదాసుఁ
గవిమిత్రు శ్రీహర్షు భట్టభారవిన్ జయ
దేవు మల్హణు శుకదేవు మాఘు
భాట్యుఁ బ్రభాకరు భద్రు శంకరు గు..
కవ్యా.. గీర్వాణ కవులఁ దలఁచి
భీము సూరయఁ దిక్క.. పెగడ నన్నయ పోత
నార్యు నెల్లూన సోము నమరు రంగ
తే.గీ. నాథు శ్రీనాథు గౌరన నవ్యకావ్య
భాసురాంధ్రకవిత్వ ప్రబంధ బంధు
రార్థ సర్వజ్ఞ నిపుణ మహాకవీంద్ర
వరుల నభినుతి గావింతు గరిమ మెఱయ.

ఉ. సారత రాచికార్థక విశారద శిల్పక ముఖ్య మాధురీ
ధారల సత్కృతుల్ పదులు తాము రచింపఁగ లేక యూరకే
నేరని ప్రజ్ఞలన్ సుకవి నింద యొనర్చుట, వానరంబు తె
వ్వారల వెక్కిరించి శుభవైఖరిఁ బూనఁగ నేర్చు చాడ్పగున్

ఆ.వె. అనుచు నిష్టదేవతాభివందనమును
వరకవీంద్రనుతియు నెరయఁ గుకవి
నిరసనము చేసి నెమ్మితో నొక కృతి
నమరఁ బూనియున్న యవసరమున.

సీ. * వేలుపు మిన్నల విందు మానిక కందు?
కలిమింతి పొందు వక్షంబువాఁడు
సోఁకు మూఁకల హత్తి వీకచూపెడు సత్తి
శాఁకల బాఁకతి గలుగువాఁడు
మగరాల జిగడంబు మహిమంబు మకుటంబు
తల నొడికంబుగఁ గలుగువాఁడు
తమ్మిచుట్టఁపు జేపు నెమ్మివెన్నెల ప్రాపు
గ్రమ్మినకనుచూపు గలుగువాఁడు
తే.గీ. శేషనారద గరుడ సంసేవ్యమాన
చారు చరణాంబుజ ప్రభోదార సకల
దాస మానస సంతోషదాయకుండు
వెలయు గల్యాణ వేంకటాచల విభుండు.

---

వేలంపు మిన్నల విందుతాలి మానికందు. అని మూలపాఠము
* ఇందు గణభంగమును, బట్టి పై పాఠము సరియని యూహింపబడినది.

మాతులుంగ తమాల మన్మథ(ప)టసాల
మాలతీ హింతాల తాల సాల
సరళ చూతాంకోల శర కదంబ రసాల
వకుళ కుద్దాల బిల్వ ప్రియాళ

తే.గీ. పనస లికుచామలక లుంగ కనక తిలక
హింగు నారంగ తుంగ లవంగ రంగ
దమిత సుమఫలతరు కుంజ యమి మనోజ్ఞ
కుశల హర్ష ప్రదము నైమిశవనంబు.

ఉ. తామరసోద్భవుండు ప్రమదంబునఁ బుణ్యము తెల్లఁ బ్రోవు గా
నేమి యొనర్చి ధాత్రి నిడి యిల్చిన చోటది పుణ్యభూమి నాఁ
దా మది గోరికన్విడువఁ దారక యచ్చట నుర్వి దాని చే
నైమిశ కాననంబన ఘనం బగు తద్వన సీమ యొంత యున్

తే.గీ. సింగముల సంగతిన్ ఫణినివహ ములరు
హరి మదేభేంద్ర రక్షణ మాచరించు
పుండరీకాక్షి సారంగములను బ్రోచు
సహజ నన్యోన్య వైర ప్రచార ముడిగి॥

వ. తద్వనంబున—

ఉ. కుత్స మరీచి కౌశిక భృగు చ్యవనాంగిరసాత్రి కణ్వులున్
వత్స పులస్త్య మంకణ కణాదులు [illegible] సత్ప్రభావ మా
త్సరము మాని నుండగుచు నొప్పెడు సూతుఁడు చెప్ప వించు రా
జత్సుగుణాఢ్యుఁడై మెఱయు శౌనకుఁ డాతనిఁ జూచి యిట్లనున్॥

శా. సూతా! నైగమ భానుసార్థ పదవీ శోభాప్త మేధా లస
త్ఖ్యాతా! శాస్త్రపురాణ సంహిత కళా ధారా విలాసచ్చో
జాతా! పావన రోమహర్షణ తనూజాతా! సదా తత్త్వ వి
ద్యా తాత్పర్యయుతా! బుధానుమత చర్యాస్ఫీత! ధీరవ్రతా!

కం. యుక్తాగమోక్తి స్మృతు లను
రక్తిన్ గను విస్తరించు రహి స్మృత్యర్థో
ద్యుక్త గతి పురాణము లా
సక్తిన్ బ్రకటించు సకల సారార్థములన్

మ. అనినన్ సూతుఁడు శౌనకాద్యమల సంయమీంద్రులం జూచి యో
యనఘాగ్రేసరులార! మేలు, భవదీయంబైన సంప్రశ్న మా
వనమాలిన్ శుభశీలి దాసజనసంపత్స్ఫురత్సత్కృపా
వనశాలిం గది భక్తి నెన్నఁ దగు కైవల్యాభిలాషస్థితిన్.

కం. మీరడిగిన ప్రశ్నలు హరి
గౌరవ మహిమములు తేటగాఁ బలుకఁ బడున్
సార పురుషార్థదాయక
మై రహిఁ దగు విష్ణుకథా ఘామృత పదవుల్.

చం. విలసిత బుద్ధి నిచ్చుటలు విశ్రుత ధర్మము, నీతి తోడ ని
శ్చల గతిఁ గూర్చుటర్థము విశేషద క్లృప్తి మెలంగు కామినిం
గలయుట కామ, మీ త్రియుగము గాచిన విష్ణు రమేశు భక్తితోఁ
గొలుచుట మోక్ష మచ్యుతునిఁ గోరి భజించినఁ గల్గు కోరికల్.

కం. కోరక యారక గొల్చిన
వారికి నపవర్గ పద మవారిగ నొసఁగున్
జేరక నెట్లయినన్ భవ
తారకమగు విష్ణుసేవ తథ్యం బరయన్.

తే. గీ. క్రమ పురాణము లుపపురాణములు స్మృతులు
త్రిగుణయుతములు, పదునెనిమిదింట నవియు
నందు సాత్త్వికములు హరి నభినుతించు
నల రజస్తమములు ధాత్రృహరులఁ బొగడు.

చం. హరియొకఁ డెల్ల దేవతలదాక్ష్యమునన్ జనకోటి పూజ నే
ర్పఱుపఁగ దాన కైకొనుచు భవ్యమనోరథ దాయియై తనున్
సురపథపాతి తోయములు సొంపున వార్ధిఁ జేరినట్లు న
ప్పురుషవరేణ్యుఁ జెందు నెట బొందిన వేల్పుల మ్రొక్కు లన్నియున్.

కం. ఆరోగ్యమ్మున్ భాస్కరు
సారజ్ఞానమ్ము గొలుకు శంకరు, ధనధా
న్యాద్యాధి కగ్ని, ముక్తికి
నారాయణుఁ గొల్వఁ దగు జనంబుల కెల్లన్.

సీ. వెస ఋగ్యజుస్సామవేదముల్ సకల పు
రి ప్రతిపాద్యముల్ మఱియు నవియు
హరి హర మాహాత్మ్య వరసూచకంబులౌ
నందథర్వణము మంత్రాత్మక మగు

నుపవేద వేదాంగయుక్తములగు నందు
నైదగు శాఖల, నాలు సూత్ర
ములఁ, జొప్పు ఋగ్వేద మెలమి యజుర్వేద
మన్ని సూత్రంబుల నెన్న నైను

తే.గీ. దాలు శాఖల సామంబు నన్ని సూత్ర
ముల వెలయు సప్తగానల లలిఁ దనర్చె
బ్రాహ్మ్య మష్టవిధమ్ములఁ బరిఢవిల్ల
ననఘరీతి సహస్రశాఖాన్వితముగ.

వ. సూత్రమ్ము లెవ్వియనఁ జేని, బోధాయనీయాపస్తంబ సత్యాషాఢద్రాహ్యాయనాగస్త్య ఆశ్వలాయన శాకల్య కాత్యాయన వైఖానస శౌనకీయ భారద్వాజాగ్ని వైశ్య వాకూల మాధ్యందిన కౌండిన్య కౌశిక బు లష్టాదశంబులు, ఇవి యొక్కొక్క వేదంబున శాఖలని సూత్రంబులు. పూర్వోక్తలీల నమరు నైదు కల్పమ్ములు నాలంగమ్ములును వినుండు—

తే.గీ. ధరణి నక్షత్ర కల్ప విధాన కల్ప
శాంతి సంహిత కల్పముల్ సరసత నివి
దాన కల్పము శిక్షప్రధాన మంగ
షట్క మిరవగు కర్మ ప్రశస్త మగుచు.

మ. మను కాత్యాయన విష్ణు దక్ష గురు యామ్యంబుల్ తగన్ గౌతమం
బును శాతాతప యాజ్ఞవల్క్య హారీతంబుల్ వ్యాస వాసిష్ఠ శౌ
ఖ సంవర్త పరాశరాత్రి లసదాపస్తంబముల్ భార్గవం
బు నగా మేల్ స్మృతులొప్పు శంఖ లిఖితాఖ్యన్ గూడి సద్దెన్నిదె.

వ. ఇవియె ధర్మశాస్త్రంబులగు న్యాయ తర్క మీమాంసాద్వయ సాంఖ్యయోగ శాస్త్రంబు లాఱు ప్రధాన శాస్త్రంబులు. భరత శిల్ప కల్ప కళా స్వరాశ్వ రత్న శాస్త్రంబులును, ఆయుర్గాంధర్వ ధనుర్వేదాది వేదంబులును, ఉపవేద శాస్త్రంబులనందగు, నింక నాగమంబుల తెలంగఁ దెలింగించెద—

సీ. వైఖానసము భాగవతము ఋగాగమ
పాంచరాత్రంబులు వైష్ణవమును
వాసుదేవార్చనా వైభవములు చెప్ప
శైవ దీక్షలు మహాశైవ సోమ
ములు శైవ సిద్ధాంతమును జిడంబర వివ
రణ మాతులమును సరవిని బెక్క
భేదంబులన్ శివప్రియకర పూజ లి
య్యాలును విపరింపు, సౌర బౌద్ధ

ఆ.వె. ములును గణపతి యది వెలయు దేవి పరమ్ము
లగుచుఁ బదియునాల్గు సమరు బెరసి
యిరువదెనిమిదగుట నిందు రమాధీశ
పరముగాదు నెరుపఱతు వినుఁడు.

కం. వేదోక్త మంత్ర తంత్రము
లాదిగ వైఖానసార్చ నా రూఢిఁ బెరుఁగన్
శ్రీ దగు వేంకట ఘటికా
ద్రీశ్వరుల ముఖ్యమ్ము లగుచు నతితంత్రములన్.

వ. అవియు వైఖానస మరీచి భృగ్వాత్రులు ప్రవర్తకులు గా బలిపూరావాస క్రియాధికారంబు లాదిగా నిరువదెనిమిది తంత్రంబులం బరగియుండు.

కం. పాగన్తాఖ్యంగల్గిన
యాగమ మిది నీల భూధరాంతముగన్
బాగగు బహుభేదార్చన,
నాగతిఁ బాజనలు యోగ్యనగు హరికెంటన్.

కం. పదునెనిమిది బుక్కుల కా
స్పదమగు నప్పురుషసూక్త పద్ధతి పూజా
పరతికిఁ దవరు బుగాగమ
మిరవుగ గృహదేవతార్చనేప్సితమగుచున్.

ఆ.వె. బ్రహ్మరుద్రశక్తి రాత్రులు మాని న
వగ్రహాఖ్య లమర వరుస వేద
మనుర రచితమ్ము దద్యుతార్చనకు గా
రచనఁ జేయఁ బాంచరాత్రమయ్యె.

వ. అది తంత్రక్రమం బయ్యె. వైష్ణవాగమంబు క్రియాయోగంబగు. క్రియాయోగం బగు శివాగమంబు లాఱునుం బదినాల్గు భేదంబులం బ్రవర్తిల్లుచుఁ బంచాక్షర్యాది జప భేద పార్థివ లింగార్చనాది లింగభేదార్చనామహిమలును దివ్యస్తవ వైభవోత్సవవిధానంబులును వివరించు. సౌరంబు సూర్యోపాస్తియు, గాణాపత్యం బష్టావింశతి గణపతి పూజావిధులును, బౌద్ధంబు పాషండక్రమంబులును విస్తరించు మఱియును—

తే.గీ. తనరు సింధ్రాణి త్రిపురసుందరియు వాణి
యనెడు తదునాల్గు నామము లతిశయిల్ల
గలవు తన్మామ సేవకాగమము లవియు
శుభ విద్యగా నిందుఁ బరిఢవిల్లు

వ. శ్రీవిద్యా కాళి మాతంగి శూలినీదుర్గ లను సిద్ధా భువనేశ్వరీ వారాహీ పూర్వకంబు లగు విద్యలమరు. సాంఖ్యాయన వామకేశ్వర బద్ధా మహేశ్వర యామళాది

† ఇట నుత్తరార్థమున ప్రాస భేదంచినది

తంత్రంబు లమరు. భైరవా కాశదక్షిణామూర్తి కల్పాదులనేకంబులును, రుద్ర భైరవ యామళ జ్ఞానకులార్ణవాది చతుర్దశ భేదంబుల మంత్ర తంత్ర యంత్ర జపహోమ దాన తర్పణ విప్రభోజన విధానంబుల వామదక్షిణాచారంబులం బ్రవర్తిల్లు వెండియు.

సీ. కూర్మమాత్స్యాగ్ని లైంగ్యములు వాయు స్కాంద
శివ పద్మపురాణముల్ తామసములు
బ్రహ్మాండ వామన బ్రాహ్మ్య మార్కండేయ
బ్రహ్మకైవర్తముల్ పటుభవిష్య
ములు నాఱు రాజసంబు లురుభాగవత వై
ష్ణవ పాద్మ వారాహ నారదీయ
గారుడంబులు సాత్త్వికంబు లాది పురాణ
సమితి యష్టాదశ సంఖ్య నిట్లు

తే.గీ. నారసింహంబు శైవంబు సౌర విష్ణు
ధర్మ ముఖ్య పురాణముల్ దలఁచు నుప పు
రాణములు సంహితలును విరాజితముగఁ
బదియునెనిమిది విద్యలై ప్రబలు నివియు.

వ. అగస్త్య సనత్కుమార, ఉమామహేశ్వర, సూతసంహిత లాదిగాఁ బదునెని మిదియగు నిట్లు.

ఉ. ఆరసి యీ పురాణ వివిధార్థములెల్ల గ్రహింప వేడ్కతో
మీ రిటు కోరికిం బలుకు మేలిమి ప్రశ్నము నుత్తరంబుగా
గౌరవ మొప్పఁ జెప్పెద వికాస మనస్థిరులై వినుండు దు
ర్వార మహాఘవారణ మపార శుభంబు హరి ప్రసంగముల్.

వ. అని పలికి.

ఉ. కంతుని గన్న తండ్రి సుమకాంత నిశాంత హృదంతరుఁ శుభా
త్యంత నిరంతర ప్రదు, ననంతు ననంతశయాను సర్వ వే
దాంత నిశాంత సంతత దురంతపహారు పరాత్పరుఁ రమా
కాంతుఁ దలంతుఁ దచ్చరణకాంతి భజింతు నుతింతు నెంతయున్.

ఉ. భాసుర వేదకల్పక విభాగిత భవ్య శిఖాగమోగ్ర శా
ఖ్యాను మునిప్రతోష దరహాసు విశిష్ట పేశలాత్త గీ
ర్వ్యాసు మనస్సరోజ హరివాసు పరాజన వాసు సంతతో
ల్లాసు మునీశు వ్యాసు సుధీను మదీయుఁ దలంచి మ్రొక్కెదన్.

తే.గీ. అనుచు హరిగురు వందన మాచరించి
యంచితోక్తుల వల శౌనకాది మునుల
సావధానత వినుఁడని చతుర మధుర
రచన సూతుఁడు వల్కె ధీరతర మతిని

మత్తకోకిల. నిర్వికారుఁడు నిర్గుణుండును నిత్యుఁడుఁ విభుఁడాద్యుఁడుఁ
నిర్వికల్పుఁడు నిష్కళంకుఁడు నిర్మలుండు నిరీహుఁడుఁ
సర్వభర్తయు సర్వవర్తియు సర్వజీవమయుండు భా
ఘూర్వహ ప్రణవస్వరూపుఁడు తొల్త బ్రహ్మమనం దగుఁ

కం. ఆ నిరుపమతర సత్య
జ్ఞానానందాత్మ తోడఁ గలసిన దగుచుఁ
దానున్నది లేనిదియై
పూనికతోఁ బ్రకృతి చేష్టపాలువడయుండుఁ

తే.గీ. నిస్తరంగా(బ్ధి) కరణి సమస్త వస్తు
శస్తమై పూర్ణత నఖండ నిస్తులగతి
విస్తరిల్లు నపార గభస్తి సమితి
వాస్తవంబగు నంచితాఖ్య స్వమహిమ

ఉ. జగములు సత్తు సత్యమని సార వివేకముచే నెఱుంగ వా
దగునది జ్ఞాన మయ్యెఱుకదాల్చి ముదంబెదఁ బాయకొల్పటిం
పుగనది చిత్సుఖం బనఁగఁ బొల్చుఁ దదీయమహత్సుఖంబు లీ
రగణిత మా నెఱుంగుటకు నారసి పల్కుట కాగమోక్తికిన్

సీ. ఎలమి మహానుభావులు మానవులు తదా
నందశతంబు నింపొంద మనుజ
గాంధర్వమగు దేవగాంధర్వ ముదిసూఁటు
నగు (గుణింపఁగఁ) బైతృకాఖ్య సముల
చిరలోక లోకుల చినుదంబులు నూఱు
నాజానజానంద మనురునొకఁడు,
కవి నూఱు కర్మదేవానంద మానూఱు
పొందగు దేవతానంద మగుట

తే. గీ. శక్ర జీవ ప్రజాపతి సరసిజాత
జాత పురుషాహ్వయంబుల శతగుణోత్త
రోత్తరాధిక్య మానంద మొనరు తుదిని
కలదు పురుషునియందు భాస్కరునియందు

వ. అట్టి పురుషానందంబె బ్రహ్మానందం బగుటకు వరుణ భృగు సంవాదం బెఱింగించెద.

చం. వరుణుని పుత్రుఁడా భృగుఁడు వశ్యతఁ దండ్రినిఁ జూచి బ్రహ్మమే
కరణిదియొ నాఁ ఎపుఁడనుడు గైకొని చేసిక నెద్ది నావుడున్
ధరఁగల భూతకోటివిదితంబుగఁబుట్టు నడంగ హేతువై
పరిగిన యన్న మన్నపరిపాటి యెఱింగి మఱెద్ది నావుడున్

కం. ప్రాణమె బ్రహ్మంబనఁ ద
త్ప్రాణ్యను మెఱిఁగి భృగువు బ్రహ్మము నడుగన్
రాణఁ బ్రిగుణ క్రియా సం
త్రాణంబగు మనసు బ్రహ్మతత్త్వం బనుఁడున్

చం. వరుణభవుండు మానసము వారక నారసి బ్రహ్మ మెద్దినా
గురుఁడును జ్ఞానమే యనుఁడు కూరిమి మీఱ నెఱింగి బ్రహ్మమే
ర్పఱుపు మటన్న చో, సుతుని శోధిమ మెచ్చుచుఁ జిత్సుఖంబె శ్రీ
కరమగు బ్రహ్మ మా యెఱుక కల్గిన మానవుఁ డొందుఁ దద్గతిన్॥

కం. అని నిజ తనయునికి న్మని
వినిపించిన వరుణువలన విజ్ఞానమునన్
దనరి భృగుఁ డట్ల బ్రహ్మము
గని మనె నని యతఁడు మానిగణముల కనిరెన్.

కం. ఆ దినుతేజోనిధి యతఁ
డాదట లీలావినోదియై లోకములు
త్పాదింపంగఁ దలంచి మ
హా దయతోఁ జూడఁ బ్రకృతి యప్పుడ వొడమెన్

క. ఆండజ నవలంబన చే
నిండిన తత్ప్రకృతివలన నైరిఁ బెక్కుగా బ్ర
హ్మాండములు త్రిగుణయుతములు

చం. బహుళతఁ బద్మజాండములు భాసిలఁగాఁ బరుఁ డంతఁ దద్బహిర్
విహితశుభాకృతిం దనరి విశ్వమయస్థితి వాసుదేవుఁడై
మహిమ నిధానమయ్యెడ రమాసతియుం దను గొల్వఁగా మహా
ద్వ్యూహవికృతి వ్యక్తిత పరివార సమేత విభూతి నేర్పడై

సీ॥ మహనీయ మణిహేమ మయ కిరీటంబును
కౌస్తుభమణి పతకంబు హార
కేయూర కటక సత్కృత భూషణంబులు
శంఖ చక్ర గదాసి శార్ఙ్గ కలిత
ఘనచతుర్బాహులు కాంచనవసనంబు
మేఖలా కింకిణీ మిళితకటియు,
నిందిరా సుందరీ మందిరవక్షంబు
డంబైన కంబు కంఠంబు గలిగి

తే.గీ. గరుడ సైన్యేశ ముఖ్యేశ్వరులు నిత్య
ముక్తు లంచితభక్తిసంసక్తిఁ గొలువ
హరియు సొంపొందు వైకుంఠపురము నందు
లీల శేషునిపైఁ బవ్వళించి యుండు.

కం॥ ఔదుంబర వృక్షంబునఁ
బొదవు తత్ఫలము లట్ల బ్రహ్మాండము ల
య్యాదిమ తనువున కంటె మ
హోదితమగు మాయకంటె నుజ్జ్వల మయ్యెన్

తే.గీ. మహదహంకార సురపర్త్య మారుతాగ్ని
కమల భృత్స్వాలు నావరణములు గాఁగ
ప్రకృతిచేఁ గప్పఁబడి లెక్కపఱుపరాని
యండముల్ నిండె సకల దిగంతరముల.

ఉ. అండము లిట్లు చాలఁగ నయంబగుచుం బర వాసుదేవుఁ డెన్
దండ సమస్తదిక్కుల నుదారత నిండఁగ మాయ యప్పుడా
చండతర ప్రభా విశదసాంకళల్ గొని చొచ్చి యన్నిఁటన్
దండిగ నుండి తత్కమలనాభ విధానవిరాజమానతన్

కం. అచ్చట నండంబులలో
నచ్చుగ శ్రీ విష్ణుతేజ మను తన కూటు
బొచ్చ్యయత విరాట్పురుషం
డెచ్చుగఁ గనుపట్టఁ బ్రకృతి హితసంగతిచేన్

సీ. అది విరాడ్రూపమా నఖిలపూర్ణతఁ జేసి
క్షీరాబ్ధియందు దాదిశేష శయ్య
శ్రీధరానీళలు సేవ యొనర్పఁగ
యోగనిద్రారతి నుండు మూర్తి
ప్రద్యుమ్నుఁ డనఁదగు ప్రాణికోటుల కెల్ల
నాధారమగుచుఁ బదాత్ముఁ డైన
విష్ణుఁ డయ్యనిరుద్ధ విఖ్యాతి విలసిల్లు
పాతాళమున లోకపంక్తిఁ దాల్చి

తే.గీ. ఒకడు శిరః పాణిపాద విభాసితుఁడును
ఘన సహస్రఫణాన్వితుఁ డనుపమాన
మూర్తి సంకర్షణుం డిట్లు, మురవిదారి
క్రీడఁ గావించు నిజమాయ తోడఁ గూడి.

కం. భోగార్థముగా బ్రహ్మం
బిగతి పరవాసుదేవుఁ డింపరతో జ్యో
త్స్నాగత శశియును బోలెన్
బాగగు కందర్పకోటి భాసురలీలన్.

ఉ. ఏ సతిచూడ్కిచే జగము లెన్ని పరిస్ఫుట మందు నొప్పు పా
టేసతి సేయఁగా భువన మింపయి యంతమునందు నట్టి ల
క్ష్మీసరసీరుహాక్షి యొదఁ జెల్వగు భంగిఁ బ్రసాద్యభూతి ది
వ్యా సమవైభవంబుగ మహాపురుషుండు వసించు నెంచఁగన్.

చం. జగములకెల్లఁ దల్లి సిరసంపద కెల్ల నివాసభూమి యై
మగఁడెటులుండు నచ్చట రమాలలనాఖ్యఁ బొసంగి వెండియున్
దగు ధరణీస్వరూపమునఁ దాలిమి లోకములన్ ధరించి యొ
ప్పగు రసవాయు రూపముల నర్మిలి నీళయు నాగ లీల పై

కం. మేలిమి చూపులచే ప
ద్మాలామర తతికి సిరులపారము గాఁగన్
శ్రీ లెల్లనైజ కళలఁగ
జాలఁగ లీలావిభూతి సలుపున్ మతియున్

చం. అరుదుగ వేదసంతతుల యంగములన్ బ్రథవించు ధర్మముల్
విరజయ నా దనర్చునటు వేదనలున్ రుజలున్ జరల్ సమ
త్సర ముదడాంబికుల్ పొడమువందము లేవది హేయశూన్య మీ
శ్వర సమ నిత్యముక్తజనసంతతి యొప్పు నిరంజనస్థితిన్.

శా. చూడంగూడునె! రుద్రధాత్రుదివిజస్తోమంబులా దిక్కులన్
గూడంగూడునె! నిత్యముక్తతనులన్ గ్రోధాదులచ్చోటునన్
నాడంగూడునె వేదశాస్త్రినుత సద్వాదంబులం గాక వా
దాడంగూడునె! తన్మహామహిమ ముద్యద్బుద్ధి నెవ్వారికిన్.

కం. పరిఘ గతి విరజ వలగొని
పురి వరణోన్నత్య సౌధ పుణ్య సరోభా
సుర వీథీ మణివేదీ
తరు మోదీకృతత వెలయు ధన్యోజ్జ్వలమై.

సీ. సరవితోఁ జండప్రచండ భద్రసుభద్ర
జయ విజయులు విధాతయును ధాత
ప్రాచ్యాది దిగ్ద్వార పాలకుల్ కుముదుండు
కుముదాక్షు పుండరీకులును వామ
నుండల సర్వనేత్రుండును మొగి సుప్ర
తిష్ఠిత బలులందు దిగధిపతులు
పరవాసుదేవుండు పద్మయుఁ బ్రద్యుమ్నుఁ
డనిరుద్ధ సంకర్షణాగమములు

తే.గీ. శాంతమూర్తియు రతియు నిచ్చలు వసింతు
రాది వరణంబునందుఁ బ్రాగాది గాఁగ
నమరు రెండవయది కేశవాదిమూర్తు
లవల మాత్స్యాది మూర్తుల యావరణము.

తే.గీ. నవనిధులు సత్యుఁ డచ్యుతానంతవిభుఁడు
సైన్యపతి ముఖ్య హరిపార్శ్వ చరులు నాల
వయదియగు నట్టి మూఁటి యావరణమునను
వెలయ నుందురెప్పుడా విష్ణుఁ గొలిచి.

కం. వేదములు ఋక్కులున్ గ్రతు
భేదములున్ గరుడ జంఘ భేదులు ధర్మం
బాదట సావిత్రియు మొ
దాదులు నుందురు పంచమావరణమునన్.

సీ. అట్టి సప్తావరణాళి మధ్యంబున
సహస్రతోన్విత మగుచు దివ్య
సభ యొప్పు సురసిద్ధ సాధ్య మరుద్గణ
మను సేవ్య మగుచుఁ బావకసహస్ర

ఉ. లీలగ విష్ణు నాభికుహరీకృత చారుసరోజ మధ్యదన్
జాలఁ బరిస్ఫుటంబగుచుఁ జయ్యనఁబుట్టిఁ జతుర్ముఖుండు త
త్పాలితుఁడై తపంబు సలుపన్ హరి మెచ్చి వరంబు లిచ్చినన్
జాలె నతండు సృష్టివిధి చాతురికిన్ ఘనమేధ సొంపునన్.

వ. అట్టి చతురాననజనక నాభిసరోరుహుండగు నారాయణునకు నాగారం బైన క్షీర పారావారంబు.

శా. శ్రీరామామణి పుట్టినిల్లు హరికిన్ జిత్తంబు రంజిల్లు సా
రారావంబుల నుప్పతిల్లు సౌగంధ్యారంబు వాటిల్లు ష
ట్పారావార పర ప్రభావ శుభ శుంభత్స్ఫూర్తి పరిల్లు నా
క్షీరాంభోనిధి నెన్న శక్యమె! ఫణిశ్రీ నేతకున్ ధాతకున్.

సీ. గుటిసెన్న నెఱమిన్న తరి సన్నరుచిఁగన్న
వినుమన్నియల యొన్నికనుఁ బొసంగి
తెలితమ్ములల గుబ్బ్యఁజిబ్బ్య బలుబెబ్బ్య
కోడజేడిసగమి పోడి మలరి
నెరపూన్కి హా(రి) కున్కి మెరున్కి మినుజిన్కి
బలువైన వలుపుటాకటము గలిగి
పగచిప్ప వగబుప్ప తగ రవ్వలుగ నవ్వ
గల మునివిపతులు సలుపవనరి

తే.గీ. పరిపరివిధంపు గరిమంపుఁ బెరిమ నింపు
మించుటంచెల రాయంచ లంచితముగ
మెఱఁగు జిలిబిలి వెలిపమ్ము లలకు కొనఁగ
నమరి విలసిల్లు క్షీరాబ్ధి యతిశయిల్లు.

మత్త. వెండికొండల వంటి యున్నతి విశ్రుతంబగు కూర్మముల్
మెండుగా నొకఁజోటికందెను మిక్కుటంబగు నక్రముల్
చండసంచర దండకాండ సుజాత రీతుల మీనముల్
దంగిసుండఁ గరళ్ల తుంపర తండ మెల్లెడ నిండఁగన్.

ఉ. ఒప్పగు నప్పయోమయ మహోదధి మధ్యమునన్ సితప్రభల్
గప్పుచు నాలుగెన్నిదుల లక్షల యోజనముల్ వెడల్పుగాఁ
గొప్పగు సైకతం బొకటి కోటికి ప్రభవించు దీవియై
యెప్పుడు విస్మయాకరము నింపగు దివ్యతరు ప్రసంగతిన్.

శా. పూర్ణం బిందెల నాకు జొంపములు నొప్పన్ సత్ఫలశ్రేణిచే
తేవన్ జూడ్కికి విందొనర్చుచు నిరూఢిన్ వాసనల్ వింటఁగా
దేవ ప్రీతిదమౌ సువర్ణకదళీ దివ్యప్రభాశ్రేణు నా
నా వైచిత్రులనెన్న నెన్నఁగఁదగున్ రాజించుచున్ బొంచఁగన్.

చం. మినుకుకడాని చెక్కడపు మేలిమి మానికపు సోపానపున్
బనిహరుళుల్ వెలంగఁగ శుభంబును రమ్యము సప్తలక్ష యో
జన గుణామమున్ విబుధసన్నుతమైన విమాన మొప్పు నం
దనుపమ శేషశయ్య రవు యయ్యవనీసతియున్ భజింపఁగన్.

సీ. పాదశిరఃకర్ణ బాహూరు నేత్రముల్
మోహనాకృతులకు మురువు చూప
పరగ నిస్సారు యేబది యోజనమ్ముల
(శ్రీ) దివ్యదేహమ్ము చెలువుగులుక
శ్రీవత్సకౌస్తుభ శ్రీ విభాసివక్షమ్ము
దిక్కుల నెక్కులు మిక్కుటముగ
ప్రస్ఫురన్నిగనిగ ప్రకటిత ప్రహ్లాసా
ప్రారంబు భుజాంతర స్థలిని మెఱయ

తే.గీ. వైజయంత్యాఖ్య మాలికల్ వైభవముగ
మేరు సంకాశు భక్తమిత హృదయ
వీక్షణానంద సంధాన (ద) క్షు చరణ
రుచి మెఱయు నికి యోగనిరూఢుఁడగుచు.

సీ. వెలయ నిర్వదియైదు వేల యోజనముల
పటిమంద విస్తృతశతా నంఘ్రియుగము
నందుల క్షైపి వేలగు యోజనముల మీ
క్షై మకరాకృతి సమము జంఘ
లేఁబది రెండు వేలి నకర సమాణ
మొనర నిర్ద్ఃబు లౌసగారుయుగము
నంతయి వృత్తమై యులరు కంఠంబు నే
బది వేల నేసూలు వదన శశియు

తే.గీ. చంపకము బోలి నాస పంచ శతసంఖ్య
లక్ష యోజనముల్ సు విలాస బాహు
లుంగరమ్ములతోఁ గూడ నంగుళములు
దనరు నిడివి సహస్రయోజనము లగుచు.

కం. విరివిఁ సహస్రయోజన
పరిమితమగు పుండరీక పత్రసదృశమై
కరుణామృత ధారా జగ
దురు కారణ నేత్రయుగము పొల్పుగ మఱియుం.

తే.గీ. మకరకుండల కర్ణయుగ్మంబు మెఱయ
నర్ధ చంద్రాభమగు ఫాల మమిత రత్న
హేమమయ కోటిసూర్య విభానుహితము
నైన మేటి కిరీటంబు నమరమెఱయ.

ఉ. చారుపర ప్రవాహబలసంగతమై తగి కోట్ల సంఖ్య క్రొ
క్కారుడు మెఱుంగు లేక గతిఁగైకొని నిల్చిన రీతి సారహే
మోరు వరాంశుకంబు కటి నొప్పగ వక్షమునందు నంబరా
ధార శుభర్క్ష పంక్తుల విధంబున హారములా రచింపఁగన్

సీ. నవరత్నమణిమయ నానా ప్రభాయాన (గృ)
మానంబునందు సమస్తదేవ
మానులు జయజయమహిత శబ్దంబుల
సేవింప నప్సరల్ చేర నాట్య
గతులఁ బ్రౌఢిమ చూప గాయక తుంబురు
నారద వీణా నినాద మెసఁగ
కల్పప్రసవ ధూపకాశ్మీర కస్తూరి
కాసారభవ్యులు క్రందుకొనఁగ

తే.గీ. ఘనచతుర్ద్వారబంధుర కనకఖచిత
మందిరంబున నిత్య సన్నుతులు గొల్వ
గరిమఁ బ్రహ్లాదముఖ భక్తగణము, లూడి
గములు గావింపఁ బేరోలగమున నుండి.

తే.గీ. లలితమణి హేమ భూషణాలంకృతాంగు
లగుచుఁ జండప్రచండులు సమరవీర
శక్రశక్తి బలోత్కటుల్ సరిఁ దూర్పు
వాఁకిటను గొల్తురెపుడు సద్వారజాత్ము.

కం. కుముద కుముదాతకునక్షుల
యమగణపతు లమితగణ సమన్వితులై శ్రీ
రమణాలయ యామ్య ద్వా
రమునన్ సేవింతు రతివిరాజిత భక్తిన్.

ఆ.వె. శంఖకర్ణ వరుణ సర్వనేత్రులు శతా
నీకుఁ డాది గాఁగఁ జోకఁ దనరి
మహిమ మెసరఁ బశ్చిమద్వారమున నుంద్రు
కమలనయను గొల్చి ప్రమద మెసఁగ.

కం. పద్మాక్షు ధనదదుర్గలు
పద్ముఁడు చంద్రుఁడు మఱియు బార్శ్వచరుల్ త
త్సద్మోత్తర గోపురమున
పద్మాధిపుఁ గొల్చియుంద్రు పరమప్రీతిన్.

శా. లావణ్యంబున మించి నీలగిరి లీలన్ బొల్చు నెమ్మేను సు
శ్రీ వత్సాంకితమౌ మాశ్రిత జనశ్రేయంకరా పాంగముల్
ప్రావీణ్యాన్వితముక్తమానస లసద్భక్తాంఘ్రి పంకేజముల్
దేవప్రస్తుతి గల్గుపట్టి పరముల్ దేవేశుఁ గీర్తించెదన్.

కం. క్షీరాబ్ధినుండు శ్రీమ
న్నారాయణు విష్ణు నలిననాభుఁ దలంపన్
వారలు సుఖులై తత్పద
వారిజములు గాంతు రనిన వైభవ మరుదే!

ఉ. ఈ గతి నుండు విష్ణుఁ బరమేశ్వరు నాత్మఁ దలంచి రేని య
య్యోగివరేణ్యు లెంతయు శుభోచిత లీలఁ దదీయసన్నిధిన్
బాగుగనుండి తాపములఁబాసి సుఖస్థితి నంత నమ్మహా
భాగుని దివ్యదేహమున బాగుగఁ గూడుదు రైక్యవైఖరిన్.

కం. ఏ తత్పుణ్య చరిత్రము
ప్రాతః కాలమ్మునందుఁ బఠియించిన వా
రా తత సౌఖ్యాన్వితులై
పాతకములఁబాసి ముక్తిఁబడయుదు రెలమిన్.

తే.గీ. రేపకడ మాపు స్మరియింపఁ బాప మడఁగు
నిలఁబఠించిన పుణ్యులే కొసఁగు సుఖము
ముద్గలుఁడు వేడ నిది ధాత మున్ను దెలిపె
క్షీరసాగర మహిమ మచ్చికదలిర్ప.

వ. అని గిరిజకుఁ బరమేశ్వరుం డానతిచ్చి వెండియును.

తే.గీ. అట్టి క్షీరాబ్ధిశాయి యయో నబ్జనాథుఁ
డూహ మెఱయంగ రెండవ వ్యూహమునకుఁ
బ్రభుతఁ బ్రద్యుమ్న సంజ్ఞచే విభవమొందె
నంత నజు ఫాలమున ఘర్మమమరఁ బోనమి.

చం. ఘనతర బుద్ధ్యధిప్రతిభఁ గైకొని ధాత్రిఁ బడంగ నందు (నే)
జననము నందితిన్ హరిని బ్రకటాంశము దాల్చి శూల శో
భన కర సజ్జటా మకుట భాసురవైఖరి నంతఁ జేరి యా
వనజజుఁ జూచి యేమిపని పంచెదొ నేయుదునన్న నాతఁడున్.

మ. ననుసంకర్షణు నంశఁ బూని జగముల్ నాశమ్ము గావించు న
ప్పనికిన్ బూన్చిన నియ్యెగింటి వినుమో పద్మాక్షి! క్షీరాబ్ధి శ
య్యను బ్రద్యుమ్నుఁడు నైజతేజము నెయ్యంబొప్పఁ గావించె సృ
ష్టిని వాణీపతికిన్ సహాయుఁడగు చున్ జెన్నొందు లీలాగతిన్.

వ. అది యెట్లనేని—

సీ. శిరమున నభము బాసురముఖ బున నగ్ని
నిద్రమని విప్రుల నిలమి జెళ్ళల
దిక్కులఁ గన్నుల దినకరు నాసిక
వరుణ ని మిత్రునిఁ గరయుగమున
సకలామర దనర్థ సంఘు దిక్పాలుర
బ్రాణముల న్వాయు పటలము మది
(సరి) నానిన తరిష్ఠము కుక్షి నగముల
నుజ్జ్వల ద్వయుల మహోవాదభుజను

తే.గీ. మేహనమునఁ బ్రజాపతుల్ మేటి కటినిఁ
బితరు లూరుల వైశ్యులు గ్రతువు లభిల
పశువృగాండ తతి రోమపంక్తి వసుల
శైలములు శల్యముల నాడిసమితి నదులు.

కం. పదముల శూద్రులు భూమియు
హృదయంబున సురుఁడు భానురేఖ గణముల సం
పదలున్ షడృతు వేళలు
నుదితంబుగఁ జేసె నిజమహోజ్జ్వల లీలన్

వ. మఱియు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబు లధో భాగంబులును, భూర్భువస్సుపర్మహర్జన స్తపస్సత్యలోకంబులు నాభ్యూర్ధ్వాంగంబులు నుం గా విరాడ్రూపంబు భాసించె నతఁడు క్షీరాబ్ధిశాయియుం గూటస్థుండును విరాట్పురుషుండును విశ్వమయుండు బ్రద్యుమ్నుండు ననం బరగి వెండియు:—

సీ. అణుపరిమాణుఁడై యఖిలదేహంబుల
నేకాకృతిని జీవుఁడెలమి నున్కి
నచట నంతర్యామియై కాలధర్మముల్
క్రమము దప్పకయుండ గతుల నరసి
సకల చరాచరసంఘములకు నైజ
కర్మంబు లెయ్యెడఁ గలుగ నలయ
నప్పు డట్టిన కల్గుఁ ట్టుగ నసియించు
ననిరుద్ధనాముఁడై యబ్జనాభుఁ

తే.గీ. డమరు సంకర్షణాఖ్యచే నవని దాల్చి
విలయవేళల ముఖఘోరవిష మహోగ్ర
వీతిహోత్రునిచే లోకవితతి నణఁచు
నతివ! తెల్పితి నాల్గువ్యూహముల తెఱఁగు.

మ. గుఱి నండో పరిఁ గారణాఖ్యమగు వైకుంఠమ్మునన్ క్షీర సా
గర సీమన్ జనకోటి యాత్మల విలాసస్ఫూర్తిఁ బాతాళ గ
హ్వరసీమన్ వరవాసుదేవు డనఁ శేషన్ బాల్చి ప్రద్యుమ్నుఁడున్
ధరపై నయ్యనిరుద్ధమూర్తియు నసంగస్వామియు న్నాదగన్.

కం. అని యాత్రిపాద్విభూతియు
ఘనతఁ జతుర్వ్యూహములును గోరికి వృంద
ట్లునువుగఁ దెలుపుట లిది చది
విన వినిన్ శుభము లొదవు స్వదినము లుడుగన్.

వ. అనిపల్కి రోమహర్షణి వెండియు నిట్లనియె

ఉ. తామసయుక్త విగ్రహముదాల్చి రమాధవుఁ డుండు శేషుఁడ
న్నామ మనంతసంజ్ఞయు ఘనమ్ముగ సర్వచరాచరస్థ శో
భా మహితోర్ధ్వలోకములు భవ్యకిరీట వినూత్నరత్నముల్
గా మహిమన్ సహస్రఫణ గౌరవ మాభువనంబు నిండగన్.

కం. గంగా ప్రవాహసంగతి
రంగచ్ఛవి కిరణ భరణ రాజితహిమవ
త్తుంగాంగ ద్యుతితతి ధృతిఁ
దాంగుచు దశదిశలనెల్లఁ బూర్ణము గాఁగన్.

తే.గీ. అట్టి సంకర్షణుని మహిమాతిశయత
విష్ణుచక్రంబు లీలకాయల్ లీలఁ దతిమి
దుష్టనిగ్రహమును ఘన శిష్టపాల
నంబు సేయుచు వెలఁగు నిత్యంబు నచట.

శా. కూర్మం బావరణాంగ సంస్థితిని దత్కోణీ ధరప్రక్రియన్
గూర్మిన్ జెల్వగు దాని మీఁద జగముల్ క్రోడంబు దంతంబు చేఁ
బేర్మిన్ బూనఁ బదియ సంగతగతిన్ బృథ్వీధరేంద్రాళి యున్
శర్మాధిక్యము పూని శేషుఁ డమరున్ జాతుర్య సుస్థితిన్.

ఆ.వె. అనుడు శౌనకాదు లనఘాత్మ! పరమాను
దేవవలన సృష్టి భావ మెందు
వలనఁ గలిగె దెలియఁ బలుకవె! యనవుడు
సూతుఁ డిట్టులనియెఁ బ్రీతి తోడ.

చం. ప్రకృతియు నంవనర్చు బహుభంగుల సంపుటి చేసి మాయ యా
సకల విచిత్ర సృష్టి నది జ్ఞాననిరుద్ధుల చే నవిద్య నాఁ
బ్రకటము నందుచున్ ద్రిగుణ భావము నందుచుఁ గారణమ్ము నా
నొకటియ యై నిదానమున నొప్పు గుణమ్ములు వేఱు వేఱుగన్.

కం. వినుఁడదియు మహత్తత్త్వము
గనుచు నహంకార భూతగణ తన్మాత్రల్
జనియించఁజేసి వరుసన్
దన గుణములఁ బ్రబలఁ జేసెఁ దత్త్వములఁ దగన్.

తే.గీ. సరవి సాత్త్వికంబు జ్ఞానకర్మేంద్రియ
చిత్తములను గనియె హత్తి తామ
సంబు గనియె భూత జనక తన్మాత్రల
రాజసంబు తమకుఁ దేజ మొసఁగ

సీ. శబ్ద తన్మాత్రఁ బుష్కరముసు దాని చే
స్పర్శంబు స్పర్శచేఁ బవనుఁ డమరె
పవనిలజను రూపతన్మాత్ర రూపత
న్మాత్రచేఁ దేజంబు సాత్రమయ్యె
తేజో భవంబగు ధృతి రసతన్మాత్ర
యా రస జనితమై నీర మమరె
నంబు గంధంబు నటు గంధ తన్మాత్ర
చేత ధరిత్రి సంభూతమయ్యె

కం. నీ లీల తెలిసెఁగ చాతురిఁ
జాలఁగ సృష్టింప శక్తి సమకూరదు నీ
పాలన్వసించి కొల్చెదఁ
బాలింపుము శోభనకర భవబంధహరా !

చం. అని నతియించు ధాతఁ గని యాత్మజ! నీమది సంశయమ్ము మా
ను నిఖిల భూతకోటుల విభూతన వర్తన లన్నియు న్ననున్
గనుఁగొని (నీవు) నిర్గుణ వికాసు ననున్ సగుణప్రధాను గా
వినుతి యొనర్చితిం దమిని వేడుకయయ్యె సరోజ సంభవా !

ఉ. నాదగు మేనలోకములు నవ్య విచక్షణ ! నీవు చూడఁగాఁ
బావ గుపట్టి లీలఁ గనుపట్టితి నీకు మదీయచూలస
త్స్వాద పరీక్షణన్ గలుగు భద్రములన్నియు నింక నిట్టి మ
ద్వ్యాప నమున భజింపుమఁ గృతార్థతనుందుము నీరజాసనా !

కం. కనుఁగొనిరొందు నన్నున్ నీ
వనువుగ సృజియించు సృష్టియందునఁ దేజః
ఖనియగు మద్వీర్యం బెం
దును నీకు బలం బొసంగుఁ దోడ్తో మహిమన్.

మాలిని. అని యిటు నియమింపన్ హరి చిత్తాంబుజాతం
బొనరఁగ హరి రూపం బొప్పఁ గన్గొంచు వేడ్కన్
వినమిత (శిరుఁ)డై యా వేధ శ్రీనాథు నాజ్ఞన్
బనువడ నొనరించెన్ భక్తి తోడం దపంబున్.

కం. భావించి శౌరి పరమున
నా విధమైఁ గనిన జగములన్నియు బయలన్
దా వీక్షించి సృజించెన్
శ్రీ వెలయఁగ వర్తమాన సృష్టి యనంగన్ ॥

సీ. ప్రాకృత వైకృత ప్రకటిత ద్రవ్య గు
ణంబులు నాఁ ద్రివిధంబు లగుచుఁ
బ్రబల మహత్తది ప్రథమ సర్గంబగు

... లీలమై పాత్రికా
హంకార మగుచు యిలరు నేం

ఆ.వె. వట సమస్త జీవవరణ మబుద్ధి కృ
తంబు నైన యట్టి తామసంబు
నాలవది యనెల్ల వారి లీలలైన ప్రా
కృతము లనఁగ సర్గ కీర్తితములు.

కం. ఆ యేకటిది వైకృతమగు
భూరి నగనికుంజలతలు భూరుహ తతులున్
ధీరాండజ పశు మృగము ల
పారము లివి యష్టమంబు బహుధాకృతులన్.

సీ. అవనిపై మఱియును నావాస విజ్ఞాన
రహిత నాహారనిరతుల వస్తు
తులు ఘ్రాణమున నె సిచ్ఛలు నెఱిఁగెడు వృష
ఖర మహిషాజ సూకరము లుష్ట్రి
రురు కృష్ణ గవయాము లరయ ద్విశఫములు
నిలఁ దురంగాదు లేకశఫము
లాఱునుం బంచనఖా ఖభగాది క
ద్వాదశమును మకరాది జలచ

తే.గీ. రములు కంక గృధ్ర రాజహంసానేక
ఖగ గణంబులేక గణన మెఱయ
తిర్యగాఖ్య నొప్పు ధృతి నమానుష మైన
సర్గ మమరు నవమ సంజ్ఞ నలరి.

కం. ఈ మూఁడు వైకృతములు మ
హా మహిమన్ దేవ సర్గ మది యష్ట విధం
బై మెఱయు దశమమున గ నది
తామరస జనకు సన్నాయతగ వారి నేసెన్.

సీ. సుర పితరులను కిన్నరకింపురుషుల చా
రణ పన్నగుల యక్ష రాక్షసులను
గరుడాప్సరసల భాస్కర మరుత్తుల సిద్ధ
సాధ్యుల భూత పిశాచములను
గంజజుఁ డిమ్మిగి గణములుగాఁ జేసి
యేను నాదను ? మోహ మెసఁగు చంద
నాదుల విషయేచ్ఛ వాఱంగ క్రోధంబు
చిత్త విభ్రమమును జెంద నొవ్వి

కం. మీ సృష్టి చాలు ననవుడు
నా సనకులు వనులఁ జేరి యనుమోద తపో
వ్యాసంగ వృత్తి నుండిన
చో సరసిజభవుఁడు సృష్టి చొప్పరసి తగన్.

చం. బొటమనవ్రేల సూరువులఁ బొక్కటఁ ద్వక్కున ఘర్మబిందులన్
బటుతర నాసికాస్యకరుల ఛాయ రూపంబునం గనుదోయిఁ బద్మజుం
డటఁ గనె దక్షనారదుల నా భృగుసింహుల పులస్త్యు న
జ్జటిలు వసిష్ఠు నాంగిరసు శాంతు మరీచిని సత్త్రినిం దగన్.

తే. గీ. దక్షిణస్తనసీమను ధర్ము వెన్ను
నందు ధర్మము మృత్యువు నాత్మఁ గామము
ముఖమున వ్యాణి పథరోష్ఠమునను లోభ
వర్తనంబును బుట్టించెఁ బద్మభవుఁడు ॥

కం. కను బొమలయందుఁ గ్రోధం
బొనరఁగ మేఢ్రంబునం బ్రమోదు లపానం
బునఁ బాపాశ్రయనిఋతి
...     ...     కర్దముని విధాత సృజించెన్.

ఉ. ఒప్పుల కుప్పయై మెఱయుచున్న తనూభవ వాణిఁ జూచి తా
నప్పుడె మోహ ముప్పతిల నంగజుఁ బొందఁగఁ బూను ధాత పెన్
దొప్పు దలంగి క్రూరతకుఁ జొత్తురె యందు మరీచి ముఖ్యుల
రొయ్యప్పమిఁ జుల్కనాడిన నిజోచిత హీనతకున్ దలంకుచున్.

శా. దేహం బప్పుడు వీడినం దది నల్దిక్కుల్ భరింపన్ దమో
నీహారంబులు పుట్టె దాని వలనన్ నీరేజ సంజాతుఁడు
త్యూహన్ వే ఱొక దేహమంది నిజకృత్యోపాయ హీనస్థితిన్
మోహంబందిన వేదముల్ వొడమె మోముం దన్నులన్ నాల్గై.

తే.గీ. మఱియు ధర్మగతులు మఖమంత్ర తంత్రము
లాశ్రమములు పడక లమరఁ బొడమె
తూర్పు మొదలుగాఁ జతుర్ముఖ ముఖముల
సామ ఋక్యజుములు శాస్త్రములును.

వ॥ అవి యెయ్యవి యనిన.

చ. వనజభవుండు పెండియును బాగుగ గాత్రములన్ గుణత్ర్యులన్
మనమున సంగకత్త్వల క్రమంబున దేవగణాళి నప్సరో
జనమును బ్రహ్మమానుల విశాలజగత్పరిరక్షణ క్రియా
ఘన పరిణుకాల వస్తుగణ కల్పనఁ జేసె మహానుభావతన్.

తే.గీ. మహదహంకార భూతములున్ మఱియు నింద్రి
యములు పదునొండు ప్రాణంబులైదు ప్రకృతి
వఱల నిరువదినాల్గు తత్త్వములు నవల
జీవుఁ డివ్వల పరమాత్మ స్థిరత నెలయు.

కం. ఇరువది యేడవ తత్త్వము
పరమాత్మాకృతియ యగుచుఁ బరగెడు కాల
స్థిరవైఖరి యొఱిఁగించెదఁ
బరగు పరబ్రహ్మ మదియె భావించు నెడన్.

కం. కాలగతి నిర్ణయములు
పోలింపఁగ సకలధర్మములకున్ మూలం
బౌలీల దెలియఁగ వశమే
కాలము బ్రహ్మము తెలివి గలవారలకున్.

వ. అది యెట్లనిన—

కం. పదునెనిమిది నిమిషము లిం
పొదవఁగఁ గాష్ఠయగు గాష్ఠ లాఱగ నిర్వదియున్
ఒదవు కళ, కళలన్నియు క్షణ
మదవన్ క్షణషట్కమే కమగు నాడియగున్.

కం. ఘటికాద్వయము ముహూర్తం
బటు మూఁడు త్రిపాదయుక్తి యామంబగు న
ప్పటి యామాష్టక మొకదిన
మిటులని పదునాల్గు మాస మిరుపక్షములన్.

సీ. క్రమమునఁ బగలింటి గడియల పాటి ప్రా
తస్సంగవములు మధ్యాహ్నవేళ
యపరాహ్ణ సాయంబులను కాలములు సమ
మగు పితృపనువన నమరు సంధ్య

కం|| అరయ బార్హస్పత్యము
సారము నక్షత్రచంద్ర సంజ్ఞల మానో
దారత సూత్ర మహత్త్వా
లారూఢిన్ జగము బ్రోచు నర్యముఁడు మహిమన్.

చ. తరణియె నుమ్ము కర్మఫలదాయియుఁ గాలనిరూపణ క్రియా
పరుఁడును సాక్షి దేహమయ భావుఁడు సత్త్వ రజస్తమో గుణా
కరుఁ డుదయప్రవృద్ధి లయకారణుఁడున్ విభుఁ డంతరాత్మ య
హరుఁడు హరుండు సంతత జగన్నయనుండు తమోఽపహర్తయున్.

కం. కృతముఖ్య చతుర్యుగములు
ధృతి నాల్గున్ మూఁడు రెండు తెలియఁగ నొకటే
యతులిత దివ్యాబ్దము లం
చ్నతి సంఖ్యలు నెనిమి దాఱు నాలుగు రెండున్.

కం. శతసంఖ్యలు ధర్మమునకు
గతి పదములు కృతను నాల్గు కలి నొక్కటి గా
వితతముగు నేండ్ల వరుసనై
యతులిత భాగములు సంధి నల్పము నవియున్.

ఆ.వె. పరగు భూర్భువాది పదవుల కెల్ల న
త్యున్నతంబు దివ్య మొప్పు నైన
సత్య లోకమునకు స్వామియౌ చతురాస్యు
నాయువది వినుండు హర్షమొదవ

కం. అలఘు చతుర్యుగములు వే
యలవడ నొకపగలు నట్లె యగు రాత్రికిన్
గల రొక పగలున మన్వం
త్రులు పదునలుగురును మనుస తోడ జగములన్.

చం. అసురుగ డెబ్బదొక్కటి మహాయుగముల్ మనుకాల మింద్రు ల
ట్లన పదునల్గురౌ నెడల నచ్యుతుఁ డప్పటి కప్పుడా కృతుల్
గొని మునిదేవ సంఘముల కోరిక దీరఁ జరించు, ధాత ని
ద్ర నొన యున్నలోకములు దాఁచుఁ గ్రమ్మఱ బుట్టు మేల్కొనన్.

ఉ. హర్షము గల్గి పంకజభవాంచిత నిద్ర రమేశుఁడైన సం
కర్షణు వహ్ని భూర్భువముఖ స్థిరలోకములన్ దహింప ను
త్కర్షతఁ దచ్ఛిఖిప్రభల కాఁకల కోర్వక యా మహాన్నిరా
మర్త్య జనమ్ము లేగుదురు మాన్య భువర్భువనమ్ము జేరగన్.

తే.గీ. ఏక తో భూర్భువస్స్వర్గ లోకములకు
మిగిలి పొంగసి పయోరాశి మెఱయ శేష
శయనుఁడై యోగనిద్ర నిశ్చలత లోక
సంస్థితోదరుఁడగుచు నాశార్జి యుండు.

కం. హరి పరమేశ్వరుఁ డిట్లగు
సరణి జనుర్లోక వాస సంసేవితుఁడై
మెఱయుటు దైనందినమునఁ
బరగు నిటుల నేఁబదేండ్లు పటు వగునంతన్.

సీ. దినము మిట్టి రేఁబవళ్లను బక్షమాస వ
త్సరము లైనట్టి వర్షములు నూఱు
బ్రహ్మకు నాయువు పద్ధతి నేఁబది
యగుటఁ బరార్ధమ్ము నాఁ దనర్చు
నిప్పుడు పూర్వార్థమెప్పుగఁ జనుట ద్వి
తీయపరార్థమై తేటపడెడి
నవి రెండు నైనచో నటు బ్రహ్మకల్పమన్
సంజ్ఞ చెల్వగు నట్టి సరసిజాక్షు

తే.గీ. నాభిపద్మంబు భువనజన్మతకుఁ బాదవు
నవియె తగు పద్మకల్పాహ్వయమున నిట్టు
లమరు పూర్వపరార్థము లవని నిప్పు
డైనయట్టి ద్వితీయ పరార్థమునను.

తే.గీ. హరివరాహాకృతిం బొల్చె నట్టులగుటఁ
బరగు శ్వేతవరాహకల్పంబు నాఁగ
మెలఁగు కల్పమ్ములవి పెక్కు జలజనాభు
నకు నిమేషంబులగు నెన్నఁ బ్రకటితముగ.

కం. కాలము భగవదధీనము
కాలాశ్రయ మఖిలభూతగణ లోకమ్ముల్
కాలమయుఁ డచ్యుతుఁడు త
త్కాలాధిపుఁ డతఁడనంగ గణుతింపఁ దగున్

సీ. యుగములు నాలుగు దగ జనుచోటు భూ
లోకమ్ము పొలియుటు లోకతోడఁ
దగ యుగప్రళయమ్ము ధాత నిద్రించుచోఁ
బొందుగ నదియ దైనందినంబు

కం. అతులిత మతులగు స్వర్గ
చ్యుత నరకచ్యుతుల నెఱుఁగఁ జొప్పడునే! త
త్కృత కర్మంబులను గుణ
ప్రతతుల రూపముల వలనఁ బ్రస్ఫుటలీలన్.

వ. అనిన విని శౌనకాదు లిట్లనిరి.

కం. అండాండము పిండాండము
రెండొక రూపంబె యనుచు ఋషాత్మకళా
పాండితి ధీ (యుక్తి) తులఁ గా
మొనుగ వినియుందు మిట్టి మేలులు చెప్పుమా !

చం. అన విని సూతుఁడిట్లను సముంచితమా పరమాత్మయందు న
య్యనుభవ నడకముల్ గలిగినట్టి విధంబును పిండ సంభవం
బును వినుచోటు నైక్యమగు బుద్ధి నెఱుంగుఁడు తత్త్వసంగతిన్
ఘనత వివేకయోగములు గాఁ బసఁగెడు నిశ్చయంబుగన్

కం. గాత్రములు ప్రకృతి మయములు
చిత్రంబుగ బ్రహ్మమయుఁడు జీవుఁడు ప్రతిజగ
ద్ధాత్రి చతుర్విధ తనువు
లాత్రస్థితిఁ దత్త్వమయము ప్రకృతియ యగుటన్.

సీ. వాత పైత్య శ్లేష్మజాత పంచాశయ
పచన మై యన్నపాన వివిధ
సారము నాత్మ మనోరంజనం బగు
రస మజ్జయులు నస్థి రక్తములగు
మొగి నధమము సులయాత్ర రూపం బగు
పురుషుని శుక్లంబు పొలఁతి రక్త
మును సమమైన నపుంసకుం డగు రక్త
మధిక మైనఁ బుట్టు నతివ వీర్య

ఆ.వె. మధికమైనఁ దనయుఁ డనువుగ జనియించు
శుక్లభిన్నమైన సుతయుగంబు
వేసి దినము పుత్రి పేర్మితో సమదిన
మైన సుతుఁడు ఋతుదినాళిఁ గవియు॥

శా॥ అంతన్ జడ మరుత్ప్రఘట్టనగతిన్ హా కృష్ణ! గోవింద! యం
చెంతే వేదన నొంది తన్ను దలఁకిందిడ్వంగ ద్వారాంతరా
న్యంతః ప్రస్రవ భేదగాత్రుఁడు నవీనాలోచన ప్రక్రియా
సంతాపాన్వితుఁడై ధరం బడి వగన్ జర్చాత్ముఁడౌ నత్తరిన్.

కం. నీళ్లాసవమునఁ జల్లఁగ
బొల్లగు విజ్ఞానబుద్ధి పూర్వ వివేకం
బెల్ల న్మాని తమోవృతి
నల్లల్లన నేడ్చుఁ గ్లేశ మడరన్ బేర్చున్.

మ. మశకీ కీట తృణాది బాధ లొదవన్ మాలిన్యదేహమ్మునన్
కృశుఁడై క్షుత్తృటి బాధఁ జేయ మిగులన్ గ్లేశంబు దుఃఖంబు ము
ర్దశలున్ రోగములొందఁ గుందుచు మనస్తాపమ్ముచే నింద్రియ
ప్రశమద్దుర్బలత న్వెలంగు వివిధ ప్రారబ్ధ లబ్ధ స్థితిన్.

ఆ.వె. గర్భనరక బాధ ఘనబాల్య దుఃఖంబు
గురుల శిక్ష నలఁత తరుణజన వి
యోగపీడ గ్రహసముద్ధరణ క్రియా
తాప మృత్యు వృద్ధ దశల కీడు.

కం. తొడర వాడలు నిలుకడ యని
పడుతురు నందనులు వెడఁగువడు తొడుసుగ నె
వ్వడు దొడరెడి యలజడులను
గడువంబడి పొడము పూర్వగతి నిమిషమునన్.

ఉ. స్వేదజ బుద్బుదాండజ విశేష జరాయుజ ముద్భిజంబులున్
బ్రోఁది ననేకవర్తనలఁ బొల్పగు సృష్టి నిజాంగకంబు ల
ట్లాదట బాధనొంద జననాంతదశల్ పడఁడా విశేషసం
పాదిత ముక్తిమార్గగత పావనయోగ నిరూఢిఁ దక్కినన్

కం॥ చెవిగల జంతువు లెల్లను
నవిరళముగఁ బిల్లపొడము నండంబులచేఁ
బ్రవణమగు గూఁ గలయవి
యవనిన్ బతువక్షి మృగ జలాకర తతులన్.

సీ. స్థావర జాతు లెంచంగ నిర్వది లక్ష
లటు క్రిమి కీటంబు లైదు నాలు
లక్షలు పక్షులు లలిఁ బదిలక్షలు
జలచరంబులు నవ సంఖ్య లక్ష

లమరంగఁ బతుమ్మృగాశ్వాదు లిర్వది పది
లక్షలు నాలుగు లక్షలైన
మానవు లేతత్ప్రియాణ మాయుష్య ని
ర్ణయ మట శతసంఖ్య నలవచేత

ఆ.వె. నిర్మితమ్ము నగుచు నెగడిన యట్టి యీ
జంతుతతులు మనుజ సంఖ్య లైనఁ
గమలనాథు నాజ్ఞ గడవఁగ కొనంగను
మిథునసృష్టి వలన మెఱసె నెందు.

ఆ.వె. ఇట్టి మిథున సృష్టి నెసఁగె జగంబు స్వా
యంభువాదిగాఁగ వతని పుత్రు
లాగఁ బ్రియవ్రతుండు నుత్తానపాదుండు
క్షాత్ర ధర్మనిరతి జగతి మనిరి.

కం. భృగువు మరీచ్యాంగీ రసు
లగణితగతి బ్రహ్మకుల మహాత్మ్యులు రై
రాగఁ దక్షప్రముఖు లెటిపెదఁ
దగుఁ జాతుర్వర్ణ్య భవ విధంబులు దెలియన్.

సీ. అబ్జజు తనయుఁడైనట్టి మరీచికిఁ
గర్భజు సుతకు శ్రీకాంత సముఁడు
కశ్యపుఁడు సుకర్మ క్రమమున నుదయించి,
రా సుకర్మకు విరించాన్వయుండు
గంగయఁ బుట్టిరి శుభతఁ గశ్యపునకు
దక్ష పుత్రిక యందు ద్వాదశాఖ్య
లమరగ నాదిత్యు లావిర్భవించిరి
యందు వివస్వతుఁ డనెడి సూర్యు

తే.గీ. వలన వైవస్వతుండు వైవస్వతునకు
మనువు మనువున కిక్ష్వాకుఁ డినకుల ప్ర
వర్తకుఁడు పుట్టెఁ బతురాస్య వలనఁ బొడమి
నట్టి భృగునకుఁ గర్దము పుట్టెనైన.

కం. ఖ్యాతికిఁ బుట్టిరి ధాత్ర వి
ధాతృలు శ్రీ యనెడు కన్య తగ ధాతకు సం
ప్రీతి మృకండుం డతనికి
భూతిన్ జిరకాలజీవి పుత్రుఁడు పుట్టెన్.

తే.గీ. మఱియు నొక కామినికి భృగు మౌని వలనఁ
గవిపృథుఖుఁ డాతనికిఁ బుట్టెఁ గావ్యుఁ డనఁగ
నసురగురుఁ డన నఖిలవిద్యానియాధి
పమరు శుక్రుఁడుం దేజోవిహారుఁ డగుచు.

కం. బాగుగ నతనికిఁ జ్యవనుం
డాగమనిధి పుట్టె ఋచికుఁ డతనికిఁ బొడమెన్
ఆ గుణికిన్ జమదగ్ని సు
రాగళ, నాతనికిఁ బరశురాముఁడు పొడమెన్.

సీ. ఘనతరాంగిరస ముని శ్రద్ధయందు బృ
హస్పతి సంవర్తుల నిడి సుతుల
నేని రాకా మాధినీ హరిణీ సుమ
వతులఁ గన్యల గుణవతులఁ గనియె
నత్రికి ననసూయ కమృతాంశు దుర్వాసు
లనఁగ దత్తాత్రేయుఁ డనఁగ నలువ
రుద్రుండు విష్ణుంశు రాధి జన్మించిరి
క్రతునకు సూనృత వ్రతపవిత్ర

ఆ.వె. చర్మలగు పవిత్ర సహచరుల్ పొడమిరి
దేవలుండు గనియె ధీరుఁడగు ప్ర
జాపతిన్ మహాత్ముఁ డా పావనుఁడు సత్త
భార్యల యెడఁ జాలఁ బ్రజలఁ గనియె.

కం. సరవి హవిర్భుక్త యనా
తరుణియెడఁ బులస్త్యమౌని తఁగఁగిన్నరులన్
గర మధికులఁ గింపురుషుల
గరిమన్ విశ్రవసుఁ గాంచెఁ గౌతుకమొప్పన్.

కం. ఆ విశ్రవసుఁడు గనియెన్
రావణునిం గుంభకర్ణు రాక్షస వంశ
శ్రీవిస్తారు విభీషణుఁ
బావనుఁడగు ధనదునిన్ ద్విభార్యల వలనన్.

సీ. పులహుండు గతియను బాలఁతుక యెడ నకి
యాంసుల శ్రేష్ఠుల ననల భార్య
యగు క్రతుక్రియ (వ ?) ల్లి ననఘులౌ వాలఖి
ల్య సహస్రములఁ గాంచె నంచితముగ

తగ సుధర్మణుఁడు చిత్రాసతీ మణి యందు
శ్వశిరస్కు సద్వ్రతు సరసుఁ గనియె
నల వసిష్ఠుఁడు నూర్జ యను లలనామణి
వలన నిశ్చయ తపఃకలితు లైన

తే.గీ. చిత్రకేతు సదోశ్యాద్యశేష సప్త
మానులఁ గాంచె మఱియొండు (మగుఁ) వలన
వినయచర్యుల శక్త్యాది మునుల ఘనుల
వితతతేజుల నూర్వుర సుతులఁ గనియె.

చం. జననుతుఁ డందుఁ బెద్ద యగు శక్తికిఁ బుట్టెఁ బరాశరాఖ్యుఁడ
య్యనఘుఁడు విష్ణుసన్నిభుఁ డహర్పతితేజుఁ డతండు వ్యాసునిన్
గనియె మహామహుం డతఁడు గాంచె శుకున్ గమాలాధినాథ (ప)
ద్వనరుహ చంచరీకగుణవంతుఁ బ్రశాంతు నితాంత శాంతునిన్.

కం. నారదుఁడు బ్రహ్మచారి య
నారాయణ పాదపద్మ నవ్యమరందా
సారాత్మేందిందిరుఁ డను
సారజ్ఞాన ప్రమందు జననుతుఁడయ్యెన్.

ఆ॥వె॥ తీవిఁ గర్దమునకు దేవహూతికిఁ బుట్టెఁ
గపిలుఁ డఖిలయోగ కారణుండు
ఘనత మఱియుఁ బుత్రికా నవకము పుట్టి
బ్రహ్మసంభవులకుఁ బత్ను లైరి.

తే॥గీ॥ దక్షునికి వేలసంఖ్యఁ బుత్రకులు పొడమి
సంగరాహిత్యులై తపశ్చరణ మనిరి
పూఁతు లేఁబది యేన్వురు పూర్మిఁ బొడమ
నైమ్మిఁ బదునల్వురను ధర్మునికి నొసంగె.

కం. పదు ముగ్వురు కశ్యపునకుఁ
బదపడి శశికిన్ ద్రిణవక వాలామణులన్
మదనారి కొకతె మిత్రుని
కొదవగ నొక కన్య నగ్నికొక్కతె నొసఁగెన్.

తే.గీ. అమరు నా ధర్మునికిఁ బ్రియయైనది కన్య
యందుఁ బుట్టిరి నరుఁడు నారాయణుండు
నఖిల లోకోపకార మహానుభావు
లమితతేజులు మునినుతు లనఘు లగుచు.

కం. పావకుఁడు స్వాహ వలనన్
బావక పవమానశుచు లనఁగఁ బవమానుఁ డనం
గా వెలయువారిఁ గనెఁ ద
త్పావనులకుఁ బంచనవ విభావసులు సుతుల్.

సీ. కశ్యపుఁ డదితియ న్స్వామినియందు ధా
త్రర్యమ మిత్ర వివస్వ దర్యమ పూష స
విత్ర విష్ణునాములై వెలయ రవుల
దితిఁ గాంచె దితికి హిరణ్యకశిపు హిర
ణ్యాక్షులు పుట్టిరి యా హిరణ్య
కశిపుఁడు ప్రహ్లాదుఁ గమలాక్షహితుఁ గాంచె
రూఢి నాతనికి విరోచన బలి

తే.గీ. బాణులాదిగఁ దత్కులప్రభువులయిరి
దనువువల్లను విశ్వజిత్తునముచి వరు
ణులు పులోమాదిదానవుల్ కలిగిరెలమిఁ
గాశియు వినాశుఁ గ్రోధుని గనియె మఱియు

తే.గీ. మేనకకు భీమసేనోగ్రసేను లాది
యైన గంధర్వముఖ్యులు సూనులైరి
సురభికిన్ గోగణమ్ములు సుధయు నప్స
రసలు పుట్టిరి యెంతయు రాజితముగ.

తే.గీ. వెలయ వినత కనూరుండు విహగవిభుఁడు
జనన మందిరి సనూరు సంజాతులైరి
ఘనత సంపాతియు జటాయువు నట శ్యేని
దేగలన్ గ్రోధగుణము నాశీఁ గనియె.

కం. మృగికిన్ మృగసంతతియును
సుగకున్ సిద్ధమునివరులు సుర గద్రువకున్
దగ శేషుఁడు వాసుకిముఖు
లగు పన్నగు లుద్భవిల్లి రధికస్ఫూర్తిన్.

తే.గీ. ధాతకును బుట్టి రెలమి విధాత ధాత
లక్ష్మియను కన్యకయును విలాసలీల
నట్టి లక్ష్మికి హృదయంబు నందుఁ బెక్కు
ప్రజలు పుట్టిరి లోకముల్ పరిఢవిల్ల.

కం. వరుణునికి జ్యేష్ఠకుఁడ స్థలుఁ
డరుదుగ ధర్ముఁడను సుతులు నట నందిరి నాఁ
దరుణియుఁ బుట్టిరి దేవలుఁ
డరయఁ బ్రజాధీశుఁ గాంచె నంచిత వృత్తిన్.

సీ. అతనికి సుతు లేడ్వురందు ధూమ్రునకు పరు
ణుండు బుద్ధికి సాధ్యుఁడు నమ్మ
నస్వికి నిర్మోకుఁడు నహుషుఁడు రథకును
శ్వాసనకు సనిలుండు శాండిలికి న
నలుఁడు ప్రభాస కుజ్యులు లష్టవసువులు
లలిఁ బుట్టి రందు నీత్య లఘుతేజుఁ
డగు ప్రభాసునికి నాంగిరసాత్మజ
యోగసిద్ధికిఁ బుట్టె నుచితబుద్ధి

ఆ.వె. యమరు విశ్వకర్ముఁ డమర శిల్పాచార్యుఁ
డమిత మహిమ ధర్మ సంగనకును
సవిత్ర రామహర్ష శమములనం బుట్టిరి
యందు సవిత్రునకు మహాభిభూతి.

కం. బడబాకృతియగు త్వాష్ట్రికిఁ
బొడమిరి యశ్వినులు దేవపూజితు లార్యుల్
కడు నాయుర్వేదజ్ఞులు
కడకుఁ లోకోపకార కారణులగుచున్.

కం. రుచికున కా యాకూతికి
నచలితుఁడగు యజ్ఞమూర్తి యజ్ఞుండు యశః
ప్రచుర శ్రీ దక్షిణ యను
సుచరిత్రయు నుద్భవించె శోభనలీలన్.

తే.గీ. ఆది మిథునంబు లైరి దాంపత్యమునేమి
వారి తనువులఁ బొడమె దేవముని సమితి
క్రమముతో నిట్లు కమలజాంగముల వలన
సృష్టి విస్తారమయ్యె భాసిత నిరూఢి.

తే.గీ. సారయ ధర్మునికిన్ భయ నిబుతి మృత్యు
లనెడి తనయులు జనియించి రాసుతులకు
నేని ధృతరాష్ట్రి శౌకి భాసియును శుకియు
పుత్రికలు పుట్టి రంతయుఁ జిత్రముగను.

సీ. కాకికిఁ గాకు లులూకముల్ జనియించె
శ్యేనికి డేగలు పూని భాసి
కిని కంక గృధ్రముల్ ఘనభాసములు ధృత
రాష్ట్రికి హంస చక్రాంక టిట్టి
భంబులు శుకికి నేర్పడ శుకమ్ములు పుట్టె
మతి కశ్యపునకును హరిణి చంద్ర
మందమతంగియు మతి శ్వేతశార్దూల
సురసలుం బుట్టి రాసుభగల యందుఁ

తే.గీ. ఇంద్రదమంపకు ఋక్షముల్ షట్పదములు
హరిణికి న్యాసరమ్ములు హరిణచయము
మంద కైరావతమ్ము సన్మహిను సురస
కఖిల వృక్షతతుల్ పుట్టెనమితముగను.

కం. ఆ సురసకు గంధర్వియు
భాసురముగ దాని కశ్వపంక్తులు వొడమెన్
వాసిగ మాతంగికి ది
గ్భాసుర గజములు జనించె భవ్యస్ఫూర్తిన్.

ఉ. నళినభవైకమానసమునన్ జనియించిన యా ప్రజాపతుల్
గల మనువుల్ జగమ్ములు వికాస సమగ్రముగాఁ జరాచరం
బులు మిథునోద్భవంబులుగఁ బూని సృజింపఁగ నంత ధాత ని
శ్చలమతి వాణిఁగూడి వరసౌఖ్యములన్ భరియించె హెచ్చుగన్.

కం. ఇది భూతసంభవస్థితి
చదివిన వ్రాసినను వినిన సకలార్థమ్ముల్
పొదలఁగ నాయుశ్శ్రీ సం
పదలొంది సుఖింతురెందు భవ్యస్ఫూర్తిన్.

## భూలోక ప్రమాణము.

వ. ఇట్టి సకల జంతు నివాసంబగు మధ్యమభువన ప్రమాణంబు వినుండని సూతుం డిట్లనియె.

కం. భూలోక స్థితియంతయు
వాలిన్ మైత్రేయుఁ డడుగ నతి విశ్రుతమా
లీలఁ బరాశరముని వా
గ్జాలత వివరించిట్టి సరణియన తెలిపెదన్.

శా. భూలోకాంచిత మధ్యభాగమున నొప్పుఁ మేరుశైలంబు నా
నాలంకార తట ప్రవేశ వినిస్సద్వ్యాప్త ప్రభారత్న శృం
గా లోలామరసిద్ధచారణ విహారానంద సంధానతా
కేళీ కానన సారసాకర ఖగ ప్రేంకార సారస్థితిన్.

సీ. ఆదియౌఁ జౌశీతి సహస్రయోజనముల
విశదోచ్ఛ్రయంబు షోడశ సహస్ర
యోజనంబుల పాతు నొప్పు నచ్చటి వెడ
ల్పంతియు మీఁదట నమరు విరివి
యరయ ద్వాత్రింశత్సహస్ర యోజనముల
చదరమ్ము వన సరస్సారనదుల
పురములఁ దగు బ్రహ్మపురము తన్మధ్యమ
వీథిఁ బద్నాలుగు వేల యోజ

తే.గీ. నముల విస్తారమగు చుట్టు క్రమత దిగధి
పతుల నగరమ్ము లెనిమిది భాసురముగ
భూమి కామరగిరి మిద్దె ప్రేమ దాని
కర్ణికల్ నవఖండ సంగతుల వెలయు.

సీ. గిరికిఁ బ్రాచ్యాదిగాఁ గేసరముఖశైల
ములు లస దౌషధి కలన దనరు
(వై ?) తంకమును మాల్యవన్ముంజవంతమ్ము
లరయ శీతాంతముల్ గిరివరములు
పరగు త్రికూటంబులశిరమ్ము పతంగ
ములు చకనుల్ నిషధంబు ప్రచురలీల
శిఖివాస జారుధ? నీమాఖ్య గంధమా
దన కపిలాఖ్యల ధరణిధరము

ఆ॥వె॥ లెలమి శంఖకూట బుగుఖ హంసములు కా
లాంజనమ్ము నాగ మనైడి గిరులు
కలవు చైత్రరథము గంధమాదన వైద్వి
జములు నందనమ్ము నమరు వనులు.

కం. అరుణోద మహాభద్రము
లరయఁగ నసితోదకును మహాబ్ధమును నా
సరసులు నాలుగు తూరుపు
గుఱిగా నర్థసల నమరుఁ గుధరస్థములై.

ఆ వె. నీలగిరియు శృంగశైలమ్ము శ్వేతాద్రి
యుత్తరమున నుండు నొగి హిమగిరి
రెంమి నిషధశిఖరి హేమకూటము దక్షి
ణమున వరుసగాఁగ నమరియుండు.

కం. వానికి గిరులకు నడుమగు
ధారుణి పదివేల పరిమితము యోజనముల్
మేరుగిరి దక్షిణోత్తర
ధారుణీధరములకు సంధి తగఁ దత్సంఖ్యన్.

కం. అల హిమవంతం బాదిగ
గల షడ్గ్రావముల పొడవు గమకము సరియై
విలసిల్లు నొక్కటియుం
బలవడి ద్విసహస్రయోజనాన్వితమగుచున్.

కం. సురగిరి దక్షిణమునఁ గిం
పురుషము హరిభరతవర్షములు దగు చుట్టున్
బరగు నిలావృత ముత్తర
ధర రమ్య హిరణ్యకములు తగఁ గురువనఁగన్.

తే.గీ. మేరుగిరి తూర్పు భద్రాశ్వ మారయంగఁ
బడమటఁ గేతుమాల్యనాఁ బరగు వీటి
సంధి తొమ్మిది వేల యోజనము లమరు
వెలయ నలువంక నయ్యిలావృతము నటుల.

సీ. మఱియుఁ బ్రాచ్యాదిగా మందర గంధమా
దన విపుల సుపార్శ్వ ధరము లుండు
నొనరఁగఁ బదివేల యోజనోన్నతి నంత
వెలుపుచే నిలావృతము చుట్టు
కనకాద్రి పూర్వాద్రిగాఁ గదంబంబు జం
బు వట పిప్పలము లొప్పుగఁ దనర్చు
నొనర వేయున్నూరు యోజనమ్ముల వెడ
ల్పమరఁ దదాఖ్యల నమరు దీవు

తే.గీ. అరయ నేనుఁగు తలలంతలైన పండ్లు
ధరణిఁ బడి జంబుఖండంబు దిరిగి దాని
పేర నదియై ప్రవాహ ప్రవార దక్షి
ణాభిముఖ్యతఁ బ్రబలు రసాన్వితముగ.

ఉ॥ ఆ నది నీరు ద్రావిన మహామహు లందఱు క్షుత్పిపాసలున్
బూనక రోగదుర్దశలఁ బొందక యింద్రియవృద్ధిఁ జెంది యం
దేనియు దేవతాకృతుల నింపుగ నుందురు పైఁడి యయ్యె జాం
బూనదనామకన్ దటిని పొంతలఁ జెన్నగు మన్నుమిన్నలన్.

చ. హరిపదజాత తీర్థము సుధాకరుఁ బొంది సుమేరుసంగతిన్
సిరిఁ దఱుకొత్తు తూర్పుదెస సీత యనందగి దక్షిణాది గా
నరసురసేవ్య యై యలకనందన చక్షువు మేటి భద్రనా
గరిమను బశ్చిమోత్తర ముఖంబుల వారిధిఁ గూడు వేడుకన్.

సీ. క్రమములోఁ బ్రాచ్యాదిగాఁగ మర్యాద ప
ర్వతములు రెండేసి ధృతి సుమేరు
గిరినంటి వార్ధులు దరియఁ జొచ్చి వసించు
నొగి నెనుబది వేల యోజనములు
నిడివియు వెడలుపు నెరయంగఁ గైలాస
గంధమాదనముల కవల జఠర
దేవకూటము లొకదెస నిషధము పారి
యాత్రము నొక్కెడ నా త్రిశృంగ

తే.గీ. వారు ధీగిరు లొకదిక్కు మేరువునకు
బాహ్యశైలంబు లివి యెల్లఁ బ్రజల లీల
నదులు వనములు భూములు విదితమగుచు
నిట్టి చందాన వానితో నెనయుచుండు.

తే.గీ॥ వెలయు ఖండమ్ములం దెల్లఁ గులశిఖరులు
నదులు ప్రత్యేకమగు పెక్కు లొదవియుండు
దేవగణములు సతులతోఁ దిరుగుచుండు
రత్న వర్ణంబులను రమ్యమైన యెడల.

కం. అచ్యుతుఁ బాతకసహితులు
చొచ్చుట లే దమిత సుకృతశోభన మతుల
త్యుచ్చయ ఫల శేషము వా
రిచ్చోటుల ననుభవింతు రతి మోదమునన్.

సీ. యుగభేదములు లేక యొప్పు నెప్పుడు నొక్క
తీరున విభవసందీప్త మగుచు
హరి హిరణ్మయక కింపురుష భద్రాశ్వ ర
మ్యక కురు కేతుమాలాదు లైన

వర్షముల్ భారతవర్షంబు కర్మై క
భూమి లక్ష్మీనాథ నామ కీర్త
నంబు తద్దాస్యంబు నవ్య తచ్చరితాను
లాపముల్ పోకార్చుఁబాప సమితిఁ

తే.గీ. గాన నిది మేటి నదులలో గంగఁ బోలి
వ్రత దినంబుల హరిదినవ్రతము లీలఁ
దానముల లోన నయ్యన్నదాన మహిమ
వర్షముల లోన భారత వర్ష మొప్పు.

సీ. సప్తకుల పర్వతంబులు చాల నదులు
గిరులు వనములు దేవతాగృహ నికుంజ
పుంజములు పెక్కులీ వర్షమున, నిలావృ
తమున గిరిజయు హరుఁడుండు రమితె సుహిమ ॥

ఉ. గిరిసుత చారుయౌవన సుగీత కళామహిమాఢ్య లైన సుం
దరు లటి కోట్ల సంఖ్యలు మునంబునఁ గొల్వఁ బురారిఁ గూడి త
ద్గిరి తరు దీర్ఘికా నదుల క్రీడలఁ (తే?) వ మెలంగు నందు నే
పురుషుఁడు చేరరా దరుగఁ బోల్తుక రూపముపొందు గావునన్.

తే. వాన కురియంగ నోషధుల్ వర సుమఫల
పూర్ణమగు క్షుత్పిపాసలు పుట్ట వచట
వారి తనువులు పదివేల వత్సరములు
జరయు రుజయును శోకమ్ముఁ బొరయ కుండు.

కం. గౌరీపతి గిరిశానన
వారంబుల మెలఁగు నితరవసుధఁ గల జనుల్
శ్రీరమణు హయగ్రీవు క
శారమ్ముం గొల్తు రా యిలావృతభూమిన్.

తే. పాతకా ప్రాప్తమది పుణ్యభావ లబ్ధ
మరయ నయ్యష్ట వర్షంబు లచట విష్ణుఁ
డమరుఁ బ్రత్యేకనామంబు లవధరించి
యచటి జనములు గొల్చి కృతార్థులగను.

సీ. హరివర్షమున నరహరినాము విష్ణుఁ బ్ర
హ్లాదాదులు భజింతు రనవరతము
చెంది కింపురుషము నందు శ్రీ రఘురాము
హనుమదాదులు గొల్తు రధిక భక్తి

ఘనతతోఁ గేతుమాల్యను గామదేవుని
నిందిర సేవించు నెల్ల వేళ
నా కురుధర వరాహస్వామి సత్తను
జగతి విభుండు నిచ్చలు భజించు

ఆ॥ వె. మహిమ రమ్యకమున మత్స్యమూర్తి న్మను
వనుదినమ్ము గొల్చు నా హిరణ్య
యమునఁ గూర్మదేవు నమరంగఁ బిత్ృవిభుం
డర్యముఁడు నుతించు నధికభక్తి.

శా. భద్రాశ్వమ్మునఁ గల్గువారలు లసద్భావంబునం గొల్తు రా
రుద్రుల్ భారతవర్షసంభవులు కారుణ్యాత్ము నారాయణున్
భద్రాకారుని వ్యాసవంద్యు బదరీభర్తన్ సదా నారదో
న్నిద్రప్రోత్రవరిత్ర పాత్రుఁ బరము న్నిత్యాత్ము సేవింపుచున్.

తే.గీ. ప్రకట శుభపుణ్యు లగుచుఁ దద్భజనపూజ
నా కథాధారణముల ధన్య ప్రవృత్తిఁ
జెంది యుందురు సంతతానంద మహిమఁ
గాన భారతవర్షంబు ఘనత మెఱసె.

తే.గీ. జలనిధికి నుత్తరము హిమశైల దక్షి
ణంబు తొమ్మిదివేల్ యోజనంబు లైన
నిడివి భారతవర్షంబు నెరయఁ గర్మ
భూమి యగు సప్తకులగిరుల్ పొలుపుమీఱు.

కం. మలయము వింధ్యము బుక్షము
నలవడ మాహేంద్ర పారియాత్రక సహ్యం
బులు శక్తిమంతమును నాఁ
గల గిరులివి భరతవర్ష కుశల స్థితముల్.

వ. హిమవంతంబున శతద్రుత చంద్రభాగలును పారియాత్రంబున వేదస్మృతి ముఖ్యంబులును వింధ్యమున మందాకినులును బుక్షంబున నిర్వింధ్యా పయోష్ణులును సహ్యంబున గోదావరీ భీమరథీ కావేరీ కృష్ణా వేణీ తుంగభద్రలును మలయంబునఁ గృతమాలా తామ్రపర్ణులును శక్తిమంతంబునఁ గుమారీ బుషికుల్యలును, మహేంద్రంబునఁ

ద్రిసామా మునితుల్యులును నను పుణ్యనదులు దర్శన స్పర్శన స్నానపాన విధంబుల జనులం గృతార్థులం జేయుచుం బ్రవహింపు, మఱియుం బెక్కుగతుల బహు నదీనదంబులు పొడిమి భారతవర్షంబునం దనరియుండు.

కం. వారుణ లంకా నాగక
శేరు గభస్తులును సౌమ్యసేంద్రము లు తగన్
ఛారదము తామ్రపర్ణము
నా రహి ద్వీపములు జలధి నడుమ న్వెలయున్.

ఆ. ఒగి సహస్ర యోజనోజ్జ్వల విస్తార
మగుచు లవణవార్థి తగిలియుండుం
బూర్వపను గిరాతు లేర్పడం బడమట
యవను లుంద్రు నడుమ నవిరళముగ.

కం. చాతుర్వర్ణ్యజు లుందురు
నాతతగతి నిపట నిల్చి యంచిత లోక
ప్రాతాప్తియుం దిర్య
గ్జాతిత్వము నిరయవసతి గలుగు జనులకున్.

ఉ. తూర్పునం గామరూపకులతో విహరింతురు దాక్షిణాత్యుల
య్యాస్పన సంద్రము మాగధికు లుత్తరభూమిని సౌరభ్యదకుల్ ।
నేర్పునం బశ్చిమాశం గడు నెమ్మిగ మాళవులుందు రన్నిటం
దేర్పడు మేలిమా కురుమహిన్ మహిదేవతలుండు రెంతయున్.

తే.గీ. చతుర నారాయణాది దైవతము సకల
జంతు కోట్యాకరంబును జంబుఖండ
మండితా ఖండ నవఖండ మండితంబు
నైన యీదీవి భరతవర్షా (ఖ్య?) మరయ.

వ. సముద్ర లక్షద్వీపమ్ములు గాక యంగవంగ కళింగ కాశ్మీర కాంభోజ కామ రూప సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర మగధ మాళవ నేపాళ కేరళ చోళ పాంచాల గౌళ మలయాళ సింహళ ద్రవిళ ద్రావిళ కర్ణాట మరాట కరహాట లాట కానాట ? చైద్య పాండ్య పుళింద ఆంధ్ర మాణ దాశార్ణ భోజ కురు కుకురు కొంకణ టెంకణ గాంధార విదర్భ విదేహ బాహ్లిక బర్బర కేకయ కోసల కుంతల ఘూర్జర శూరసేన మత్స్య మాథుర సింధు పారసీక యవన జాలంధ సిద్ధి అవంతి కాశ బంగాళాది ఛప్పన్న దేశంబులుం గలిగిన భారత వర్షంబునందు.

మ. హరి శ్రీ వేంకటరంగ సద్మముల యందా నీలశైలాదులన్
హరి వేధో మరకాని సన్నుతులఁ దానర్చావతారమ్ములన్
బరగున్ బుణ్యనదుల్ చెలంగ జనులీపట్లన్ మహాజంతు సం
కర సంఘమ్ములఁ బుట్టి మానవగతిన్ గైకొంద్రు భాగ్యస్థితిన్.

ఉ. దాన తపో వ్రతాధ్యయన ధర్మవిధానములన్ రమాధిపా
నూన కథాప్రసంగ భజనోచితకర్మములన్ కృతార్థులై
మానితమోక్ష మార్గ మసమానతఁ గాంతురు భారతంబునన్,
గానఁగ నచ్చునే! యితరకాననశైలధరాతలంబులన్.

ఆ.వె. పారమైనయట్టి నేరేడుదీవిని
రాజితమగు లక్షయోజనముల
విరివి దానిచుట్టు నెరయ నంత వెడల్పు
నమరు లవణజలధి యధిక మహిమ.

క. పూనిక ప్లక్షద్వీపం
బా నీరధి చుట్టునుండు నది జంబూ ద్వీ
పానూన దైర్ఘ్యక ద్విగు
ణానుగతిన్ సకల వైభవాకర మగుచున్.

సీ. అందు మేధానిధి యను రాజు తనయుల
పేర వర్షములేడు పేర్మిఁ దనరు
శిశిర శిఖోదయ శివసేవకానంద
శాంత ధ్రువా భయ సంజ్ఞ లమరు
కులగిరులగు నందు గోమేధ చంద్ర నా
రద దుందుభులను వైభ్రాజకమును
సుమనసంబును నాఁగ మునిగణగంధర్వ
సన్నుత సేవ్యమై భాసురమగు.

తే.గీ. నదులు శిఖియు సుదస్త్రయుఁ ద్రిదివి యమృత
సుకృతయు విపాశ యమరయు శోభనగతి
మఱియు నదులును దేశముల్ గిరిపురములు
వనులు గలవెన్నియేనియు ననుపమముగ.

క. స్థైర్యము జంబూవిస్తృతి
ధార్యము ప్లక్షంబు దనరు బహుశాఖలతో
నార్యక కురక విదగ్ధ్యుల
వార్యత భావికులు నాల్గు వర్ణము లరయన్.

చ. అనువుగ నైదువేలదశాబ్దములుం బ్రతివారి కాయువం
ద నుపమ భోగయుక్తుల జరా మయ శోకభయంబు లీర్ష్యయున్
దనుకవు వారియందుఁ గడుఁ ధర్మము పొల్పగు ద్రేతయుం బలెన్
జనమతి నెల్లకాల మరు శాశ్వత పుణ్య సమగ్ర వైఖరిన్.

క. శ్రీ మహిశాఖవుఁ డచ్చటి
లోకులుఁ దనరంగఁ బూజ లంది శుభములొసఁగు న
ట్లా మహిత ద్వీపము చు
ట్టా మరనుతి నిక్షుజలధి యావృతి నమరున్

సీ. ఇ సమితికు జలధి చుట్టును శాల్మలి ద్వీప
మొప్పు చతుష్షష్టి యోజనముల
పతి వపుష్మంతుఁడు తత్సుతుల పేరిట సప్త
వర్షములనువుగ వరుస తోడ
కాటోన్నత బలాహక ద్రోణ కుముద కం
క మహిషాఖ్యల గిరు లమరు నచట
శ్వేతయు హరితజీమూత రోహిత వైద్యు
తలు మానసయు సుప్రభలును నదులు.
యోనియదితృష్ణ నివృత యొప్పు చంద్ర
తోయ శుక్లవిమోచన లాయతమగు
జాతు లటఁ గపిలా రుణ పీత కృష్ణ
లమరుఁ బ్లక్షం తరిక ధర్మానుసరణి.

క. భగవంతుఁడు విష్ణుండనఁ
దగి తజ్జనపూజ లొంది దయతో మనుచున్
మిగులనట దేవతలు త
జ్జగతిన్ బ్రజఁగూడి యుంద్రు సాన్నిధ్యమునన్.

క. మూరుగ యచ్చటఁ బ్లక్షో
దార ప్రామాణ్య వృత్తిఁ దగు తద్వీపం
బాసూధిగఁ జుట్టి సురా
వారిధి యంతయు వెడల్పు వారక యమరున్.

సీ. ఘనతఁ గుశద్వీప మెనిమిది లక్షల
యోజనమ్ములు దాని కొనరు రాజు
జ్యోతిష్మదాఖ్యుఁ దత్సుతుల పేరిట వర్ష
ములు మద్భిద వైస్ఫ రనుములను వేణు

మత లంబనాఖ్యలు ధృతిఁ బ్రభాకర కపి
లులు నా నమరు పౌరులు విభాతి
సౌరివిని దమిసులు శుష్మిణుల్ స్నేహ మం
దే హలు లు వర్ణ్యులు తెలివి నంద్రుడు.

ఆ.వె. సోమ విద్రుమములు నా మతి హర మంద
రములు సురు కుశేశయములు బుష్ప
వంతమునుదమాంత మెంతయుఁ గులగిరుల్
నదులు పనులుమిగులఁ బొదలు నచట.

చ. వెలయు విధూత పాపయుఁ బవిత్రశిలాభిద సమ్మదంబు సాం
శలరెడు విద్యుదంబు మహితాభయు నాయతధూర్వహల్ నదుల్
గల (వ ?) టు దర్భ చాల యొడికంబుగ మిన్నొరయు న్విశాలమై
చెలువగు బ్రహ్మరూపుఁడగు శ్రీధవుఁ డిచ్చు నభీష్టభోగముల్.

ఆ.వె. అమరు దాని చుట్టునంత వెడల్పున
ఘృతసముద్ర మెలమి వితత మగుచు
నందు నలరు క్రౌంచమనుదీవి పదియాఱు
లక్షయోజనముల లలిత మగుచు.

సీ. అందున ధృతిమంతుఁడను రాజు తత్పుత్రా
ఖ్యాన వర్షమ్ము లచ్చోట నమరుఁ
గుశలోద ధరమాసగురువిచల ప్రివ?
రహములు నర్ధతారకము లనఁగ
దుందుభి యాఖ్యయుఁ బొడరు దేవతల కా
వాసమై కులగిరు లమరు నచట
క్రౌంచ వామనగంధ కారక రత్నాది
వ్యావృత దుందుభు లనఁగఁ బుఁడ.

ఆ. వె. లీక మనొడిచేర జోఁక నొండొంటికి
ద్విగుణ మగుచు నదులు తేజరిల్లు
గౌరి సంధ్య రాత్రి ఖ్యాతి మనోజవ
పుండరీకయును గుముద్వతియును.

వ. అచట రుద్రరూపమ్మున నభిమతార్థమ్ము లొసఁగు.

క. పుష్కర పుష్కలధిషణులు
నిష్కంటక మైన తిష్యనికరంబును శో
చిష్కేశప్రభ వర్ణ చ
తుష్కం బలరారు నచటి ధూర్వహ మహిమన్.

వ. నిరాతంకులు దేవనిభులు నగు జనంబులుగల క్రౌంచద్వీపంబు చుట్టు నంతియ విస్తారంబున దధిజలధి దనరు దాని వలగొని ద్వాత్రింశల్లక్షయోజనంబుల వెడల్పున శాకద్వీపంబు నమరు తత్పతియగు భవుని కుమారనామంబుల జలద కుమాల సుకుమాల మణిచక కుసుమోత్త సమీక మహాద్రుమంబులను సప్తవర్షంబులు గలిగియుండు—

తే. గీ. అంత యుదయంబు జలధార మంధకేయ
రైవతకశాక ములక్షముల్ రమ్యకేస
రీ సమాఖ్యలం గులగిరుల్ భాసుర మగు
వాన కురియక సస్యముల్ పనుధం బ్రజలు.

క. చారు నళినీసేతువులు సుకు
మారీ వైణికలు నాకుమారిగ భ (స్తుల్?)
చారుమతి ధేనుకలు (నా?)
నారూఢిగ నదులు వెలయు నతి శోభనమై.

క. తద్గిరి తటినీ మారుత
సద్గంధము సోంకినంత సంతోషిత భా
స్వద్గాత్రు లగుచు శాక వి
షద్గతు లాతంకములును బాయుదు రచటన్.

తే. గీ. మగ మగధ మానసాఖ్యులు మందలుగను ?
నాల్గుజాతుల జనులు, శ్రీనాథుం డచట
సూర్యరూపమ్ముచే నిచ్చు శోభనములు
ధర్మ మభివృద్ధియగు వాని దడవదచట.

వ. మగాది నామంబులం దదన్వర్థ నివాసంబులగు నాల్గుదేశంబులు గల యట్టి శాక ద్వీపంబుచుట్టు నంతియ విస్తారంబున క్షీరసాగరంబు చెలువొందు

తే. గీ. అమరుక్షీరాంబునిధి చుట్టు నావరించి
యరుబదియు నాల్గులక్షల యైన యోజ
నముల వెడలుపుగలిగి విస్తారమగుచుం
బుష్కర ద్వీపమొంతయుం బొలుపు మీఱు.

ఆ. వె. సొరిది నతల వితల సుతల మహాతల
తల తలాతలములు దగ రసాత
లంబు లాఖు గడచినం బయి పాతాళ
మమరుc గార్ద్రివేయ సమితి కలిగి.

సీ. భక్ష్య భోజ్యములు పానార్హ రసములు
గోపుర ప్రాసాద కుడ్యచయము
సాంకవ మృగమద చందన కుంకుమా
ద్యంచిత సౌగంధి కావళులును
గడవ సింపెన్నంగc గల భూషణములు
హీర మౌక్తా హార చారు మణులు
పీతాంబర దుకూల ధౌతాంశుకంబులు
కమనీయ రూపముల్ గల్గు చెలులు.

తే.గీ. శారికా కీర మాయూర చారు పక్షులు
కమలకల్హార శోభిత విమలవారి
పూర కాసార వార గభీరనదులు
లీలc జెలువగు సప్తపాతాళములను.

తే. గీ. శుక్ల కృష్ణా(రు)ణక పీత — —
శర్కరాద్రి మయములు కాంచన మయమ్ము
లగుచు నతలాది లోకము లతిశయిల్లు
నమిత వైభవ భోగ భాగ్యాయతముగ

ఉ. పన్నగరాజ భోగమణి పంక్తులcజీcకటి బాయ విక్రమా
భ్యున్నతి శ్రీధరుం డసుప సూర్జిత భానుశత ప్రభా సము
త్పన్నవిభూతి వొప్పు నతి పాతక దుష్టనిరాసనంబునన్
జెన్నగు విష్ణుచక్రములు చేరి సురాసుర నాగసేవ్య మై

క. స్వర్గమున కంటె భోగా
పవర్గ సమ్యక్స్తు విభవ నందితమై వై
సర్గిక తేజోమయ మగు
నిర్గత కలుషమ్ము సుకృతనిలయంబగుచున్.

ఉ. తనరిన యట్టిలోకములు దా గనుకన్గొనివచ్చి నారదుం
డసుపమ భోగలీల నైన యానె నురాలయమెన్నc గార్ద్రివే
యనిలయభూముకంచము మును లామరులు గ్నవను బత్కాc గాదె యుం
ద్రుని సముఖంబునందుc గను దోరపు వేడుక లాత్మ సంధిలన్.

చ. తగ నట నాట్య భోగవతి దాపున వృక్ష లతా వితానముల్
బగిభగ తాల్చు తెల్లదలఁ బూర్ణము నాక నికేతనాల తమ్ములన్
మగువలఁ దాముఁ బన్నగకుమారులు వీణియలు న్మృదంగముల్
ధిగధిగ దింధిమార్భటుల దిమ్మని మ్రోయఁగఁ జేతు రెప్పుడున్.

ఉ. పల్లవితాళ్లు తెల్లదలఁ జల్లుచు గాంగ తరంగ శీకరో
త్ఫుల్ల సరోజకైరవ మధుద్రవ రంగదభంగ వాసనల్
మెల్లన మెల్లనన్ జనుసమీరకిశోరము లల్లఁ జాల రం
జిల్లఁగఁ జేయు నెల్లపుడుఁ జిల్వకుల ప్రబలంబులన్ దగన్.

మ. బలిదైత్యాధిపసద్మ పద్మనిలయ ప్రాంతోరు కాంతార వృ
క్ష లతాంతాగ్ర మరంద కందళిత సుస్వాంత ప్రసక్తాళి సం
కుల ఝంకార విరావ సంగత లసత్కుంభీనస స్త్రీ మిథః
కలనా గీతము లందు దంపతుల యక్కల్ దీర్చు నత్యాకృతన్.

క. ఒక్కొక్కటి పదివేలగు
నెక్కుడు విస్తారమట్టి నియతిన్ సంధుల్
పెక్కు వగు నవి యగున
య్యిక్కువ పాతాళభువన మీగతి నమరున్.

తే. గీ. అట్టి పాతాళభువి దక్షిణాశ ధర్మ
రాజపాలిత నియమమున్న లోఁజ బెక్కు
గలవు పాతకజనుల నాకరములగుచు
ఘోరవిగ్రహ జంతుసంగులము బెరయ.

వ. తత్ప్రకారంబు క్రమాంతరంబున నెఱింగించెద నింక జ్యోతిశ్చక్రోర్ధ్వలోక విధంబు వినుండు.

సీ. మేరుశృంగాగ్ర సమ్మిళిత హైమ శింశుమా
రము సప్తలోకముల నమరు నరుబ
దియ మూఁడు లక్షలు దీర్ఘమయ్యుఁ గులాల
చక్రంబు రీతి నిచ్చలను దిరుగు
నంతియు యుదయాచలాస్తాద్రి మధ్యంబు
నందు జ్యోతిశ్చక్ర మనుసరించి
రోజు లిర్వదినాల్గు గూటి నిర్వదిరెండు
లక్ష లేఁబది వేలు లలిత వస్తు

తే.గీ. సగరి ముక్తికిఁ జను శివశర్మ తెలియఁ
పుణ్యశీల సుశీలు రద్భుతము గాఁగ
మున్నెఱింగించిన విధంబు లెన్నికలర
నూర్ధ్వలోక ప్రకారము లొనర వినుడు.

ఉ. మంద విభాకరుల్ మిగుల మందమతుల్ వికృతాకృతుల్ సదా
నంద విదూరులల్పసుఖనందితులైన పిశాచకోటు లిం
పొంది పిశాచలోకమున నుందురు భక్తి విహీనులై శివున్
జందన గంధులన్ గలని పారె భజించినయా ఫలమ్మునన్.

కం. అక్షీణధనము ధాత్రిన్
నిక్షేప మొనర్చి దాన నిరతి దగని వా
రక్షయులు గుహ్యకులు తగు
దక్షత వసియింతు రలఁ దగుపాటి మదిన్.

ఆ.వె. గీతములను దేవతాతతి మెప్పించి
దానధర్మ నిరతిఁ దనరు ఘనులు
శాంతి సౌఖ్యయుతులు గంధర్వు లచ్చటి
వలన నుందు రధిక వైభవమున.

మ. ఘనతా విద్యలు శిష్యసంతతికిఁ బోకం దెల్పుచున్ వారికై
తనయస్నేహత నన్న పానములు నిత్యం బొప్పఁగాఁ బెట్టి తి
న్నని భక్తిన్ గురుదేవతాభజన లెన్నన్ గల్గి విద్యాధర
త్వనికాధిన్ వసియింతు రవ్యల ప్రమోదశ్రీ విశాలస్థితిన్.

సీ. వ్రతపర్వతో నేకవార సంభోగిని
కామ్యవ్రతోక్తములు గల్గ లలన
పురుఁడొత్తి గొనిపోవఁ బత్నియా సతియును
విగతాత్తి వొరఁ బొందు విద్రుమోష్ఠి
ధవుని నాజ్ఞయోగ సిద్ధపతుఁ గూడిన చెలి
కారయు పతిభక్తి సలుపు సుదతి
తగ దేవరన్యాయతన్ సుతుఁ గనునింతి
స్వర పూజనాదర సారసాక్షి

తే.గీ. పాలకడలి జనించి కన్నట్టి సట్టి
మేనకయు రంభ మొదలగు మానినులను
గలసి మెలఁగుదు రప్సరోగణ నివాస
మైనచో నది త్రిదివాలయంబు నాఁగ

తే.గీ. అమరపురికి నధోభాగ మవని కెగువ
యంతవట్టు భువర్లోకమనఁగఁబరగు
గుహ్యక పిశాచ సిద్ధ సంకులము వెలఁగు
వలన నెంతయు వాయు సంకలిత మగుచు.

ఉ. కొద్దివి మానసుల్ కలిగి కూర్మి చెలంగ్ తమతోడ వాడఁగా
నొద్దికమీఱ స్వల్ప విభవోచితులై యొకవేళ స్వర్గమున్
దద్దయు వేడ్కఁ జేరుచును ధారుణి నెప్పుడు సంచరింతు రు
ద్యద్దురితమ్ములం దొరఁగి ధర్మమెఱుంగక వార లెప్పుడున్.

కం. తదుపరి భాగము నందున్
విదిత మహద్వస్తు విభవ విశ్రుత మగుచున్
పొదలెడి వన దీర్ఘికలన్
జదలన్ బ్రాగాదిగా విశాలము లగుచున్.

కం. అమరావతి యర్చిష్మతి
ప్రముదిత సంయమని పుణ్యవతి యమలావ
త్యమిత శుభగంధవతి యం
క మహోదయ మనఁగ వరుసగా దిక్పురముల్.

ఉ. సత్యము శౌచమున్ దయయు సౌమ్య సుశీలములున్ గ్రతుక్రియా
కృత్యము నాహవోచిత రణస్థలవైభవ మార్య కోవిద
స్తోత్ర్య యశస్ఫూర్తుల్ విబుధ సజ్జన పోషణ సత్ప్రసంతతుల్
నిత్యము గల్గ వార లటు నెమ్మది నుందురు స్వర్గసంస్థితిన్.

తోటకము॥ త్రిదివమ్మున గల్గిన దీపితసంపదలన్నియు నొప్పగ వ్రాల్పడుచు
లాదవందగు కర్మములందగసంపదలన్ దెసలన్ లలితోజ్జ్వలమై.

సీ. అందుల స్వర్లోక మతివైభవాస్పద
మచ్చట వైజయిశాలి శయత
దినము రాత్రియు లేక వివిధ సౌగంధికా
దిక భూషణాన్విత ప్రకట దివ్య
తర విమానమ్ములందరుణీ మణులఁ గూడి
మొప్పెడిర్వది వదియుండ్ల ప్రాయ
ములవను తనువుల నాకామ కేళి
ల పరోపరంబుల నసమ సరస

తే.గీ. గతుల విహరింపు చమృతాబ్ధి కడ జనించి
నట్టి కారుణ్య రూప విహారులైన
యప్సరసలుందు రచ్చట నరువదాఱు
కోట్ల సంఖ్యల దేవేంద్రు కొలువు చెలులు.

కం. నందన మను వనమున హరి
చందన సంతాన పారిజాత ద్రుమములున్
మందార కల్పకమ్ములు
నం దమరుల కొసఁగు కోర్కె లన్నియు దలఁచన్.

కం. చింతామణి యనబంగరు
కాంతుల దేవతల కోరికల నీయ శుభో
దంతముగ సకల విభవ వి
రంతర సౌఖ్యముల సురపురం బతుల మగున్.

కం. త్రిదశవరు లచ్చటున్న
ప్పుడు మూఁడగు కోట్ల నైజబంధుర తేజో
విదిత దశదిశా భాగా
స్పదులై చరియింతు రాత్మ భామలతోడన్.

ఉ. తెల్లని మేను నెమ్మొగము తేటయు నొప్పగు మూపురంబు ను
త్ఫుల్లసితాబ్జనేత్రములు కోరపువాలము మేలిశృంగముల్
పల్లవభాతి పాదములు బాగగు కర్ణములుం దెలంగఁగా
నల్లన నందికిన్ మమత నందమృతంబిడె ధేను వత్తఱిన్.

కం. వీరలు యాజక వర్యులు
పారతర విశీర్ణ సప్తసంతాన యుతుల్
ఘోర శుభధర్మ కీర్తివి
హారులు నచ్చట వసింతు రతి విభవమునన్.

సీ. వైజయంతీ? నామ వరసౌధమున సుధ
ర్మాఖ్య సభాస్థలి నమిత భూష
ణాలంకృతాంగుఁడై యప్సరల్ సేవింప
గరుడ గంధర్వ కింపురుష యక్ష
కిన్నర పన్నగ గీర్వాణ తతు. సిద్ధ
సాధ్యామరుల్ గొల్వ శక్రుఁ డుండు
నుచ్చైశ్శ్రవంబన నొప్పు నైరావత
మనఁగఁ జతుర్దంతి యందమొంది

తే. గీ. వరసుధా రస పాన దుర్వార బల వి
లాస సౌందర్య ధైర్య లీలా విహారు
లమరు లచ్చటి సూరులు ననఘ మతులు
నందు రందుల నెంతయుఁ బొందుగాఁగ.

కం. క్రమమొప్పఁ ద్రిదివ విభవము
లమరంగా వీతిహోత్ర యమ నిరుతి సరి
ద్రమణీశ సదాగతి ధన
ద మహేశుల పురము లమరుఁ దత్సమ మగుచున్.

ఉ. ఒంటను రెంటఁ దొమ్మిదిట నొప్పుగ నైదిటఁ బద్దకొంట నే
డింటఁ ద్రయోదశస్థితి రహిం బదునాలుగు మూఁడు నాల్గునా
నొంటుగ లక్షలా మడల యున్నతి రాశులు సూర్యుఁడాది గా
నంటి నవగ్రహమ్ములకు నబ్జుని పత్నులకున్ గ్రమంబునన్.

కం. పదియేను లక్షలన్ ధ్రువుం
పాదవంగ ధృవుఁ డధివసించు జ్యోతిశ్చక్రా
స్పదుఁ డగుచు శింశుమారము
కుదుర మురంగ నూర్ధ్వభువన గుణధారకుఁడై.

కం. హరి నామజాపకులు శ్రీ
హరి భక్తులు హరి దివసమహావ్రత నిష్ఠుల్
కర మర్థి నుండు చోటై
పరగు మహర్లోకమువలెఁ బ్రస్ఫుటమహిమన్.

కం. వనజజు మానస పుత్రులు
సనకాదులు మెలఁగు శాంత సాత్త్విక తేజః
ఖని యైన జనుర్లోకం
బనఘంబై యవల వెలయు నంచి తలీలన్.

మ. అనశన స్వవ్రతుల్ కుశ దళాంబు నిషేవణు లాత్మదృక్కులున్
వనజ నేత్రాంఘ్రి పాదయుగ వాంఛిత మానసు లుండు చోటునై
తనరు తపోమహత్త్వమున ధార్మికులై తగు యోగిపుంగవుల్
ఘనతుభలీలఁ జెందుటకుఁ గాఁగ నిదైన తపోఖ్య ? మవ్వలన్ .

ఉ. నియమపరాయణుల్ సవననిర్మల కర్మ నిరూఢు లాత్మ యో
గయుతులు రాజయోగులు వికాసమహర్షులు మౌనిసంఘముల్
నయవినయాన్వితైక గణనన్ భజియింపఁగ నల్వ యుండు చో
టయమయ సత్యలోక మిలనై తగు సర్వ మనోజ్ఞ సంపదన్.

ఆ.వె. ధరణి యంతవిరివి పరగు నంబరము వి
స్తారమంతె కోటిసంఖ్య యోజ
నంబు లవని మీఁద నాకంబు పొడవగు
వసుధయగుచు భూర్భువనము పొసఁగు.

సీ. మేటి స్వర్గమునకుఁ గోటి యోజనముల
పొడవు మహర్లోక భూమి దాని
కవ్వల రెండు కోట్లగు యోజనంబుల
దవ్వు జనర్లోక మవ్వలినికి
నంతియ పొడవగునట తపోలోకంబు
గూటి దానికి చతుష్కోటి యోజ
నములపై సత్యలోకము ప్రకాశిత మగు
గుఱి దాని కెన్మిది కోట్ల పొడవు

తే.గీ. నందు కార్య దైవతంత్ర మింపొందు నందు
సవలఁ బదియాఱు కోట్ల పైనంద మమరు
మహిత దేదీప్యమాన విమాన కాంతి
నచటు రేయుఁబవళ్లు లే కతిశయిల్లు.

సీ. కల్పాంతమున లోకగణము నశ్యంబగు
నంమనఁ గృతకములనఁగఁ బరగు
స్వర్లోక పర్యంత సరణి మహర్లోక
మది కృతకాకృతకాఖ్య నొప్పు
నపల జనర్లోక మాదియౌ లోకత్ర
య మకృతకముగు మహా విభూతి
స్వప్రకాశంబు లౌ సరవిని లోకముల్
వెలగ పంటను బీజ వితతి వోలె

తే. సబ్జజాండకటాహమ్మునందు నుండు
నర్థ మది భూమి విస్తార మవని మీఁది
లోకములు నాలుగంతియ వీఁక పొడవు
దాని విధములు చెప్పితి వసుసతోడ.

కం. నిడివియు వెడలుపు లాతుం
బొడ వేఁబది కోట్ల సకల భువనము లగుటే
ర్పడ మును మీకెఱిఁగించిన
పడు వాద్యంతమ్ము గూర్చి వచియించెదఁగా.

తే. భరత హరివర్షయుతము కింపురుషము తగ
మూఁడు తొమ్ముదు లిరువది యేడు వేలు
హిమనిషధశైలముల యోజనములు సమత
నాలువేల్ మేరుగిరి దక్షిణాశయందు.

సీ. పదునాల్గువేల పాతొదవు సుమేరువు
చుట్టు నిలావృత క్షోణిగూడ
చతు రుత్తర త్రిదశ సహస్రము లందిచి
రమ్యక ముఖ్య వర్షములు శ్వేత
నీలశృంగాద్రు లెన్నికఁ ద్రయస్త్రింశ త్స
హస్రములే భరత వర్షాళి భంగి
దక్షిణోత్తరముల లక్ష యోజనములు
తే.గీ. ఖ్యాతిగ భద్రాశ్వకేతు మాల్య
లమరుఁ బదునాల్గు వేలు ప్రాగపరదిశల
వరుస వేయేసి యగు మాల్యవంత గంధ ?
మాదనము లయ్యి లావృత మహియుఁ గూడు
జాడ రెండును లక్ష నేరేడు దీవి.

చ. అమరిన దీని చుట్టు లవణాబ్ధిముఖార్ణవ సప్తయుక్త ప్ల
క్షముఖ మహాంతరీపముల గైకొను కంధులయంత దీర్ఘమై
క్రమమున రెట్టియై నెరయగల్గినకోట్ల విరాయదు లక్ష లే
డు మెఱయ దీర్ఘవిస్తృతి పటుత్వము లేకవిధంబునం దగున్.

ఉ. మూటిగ నిందు కవ్యల విశుద్ధసువర్ణధరిత్రి యిర్వ దా
కోటులు నిర్వదెన్మిది యకుంఠిత లక్షలఁ జక్రవాళ యు
క్పాటవమైనలోక మద పాటిగ నిర్వదినాల్గు కోటులన్
దాటినఁ గోటి లిప్పడిటపైఁ బడి యవ్వల నందయుక్తమై.

కం. గరోత్తదశ మాధారో
ద్వర్తుల గతి మూఁడు పదులపై నై దగు వి
స్ఫూర్తిన్ లక్షల దగు నిటు
కీర్తి (లః) విస్తృతము కోట్లు కృతి నేందియా.

వ. చతుర్భాగంబు ? నట్టి సంఖ్యం బంచాశత్కోటి భూమండలంబు లెక్కలైన దిం గనుపట్టు సూర్యాది గోళాగ స్థితియు వివరించెద.

సీ. నరకోత్తరకము నరకములు శేషుని లోక
మిరువది నాల్గు కోట్లై సంగుఁ దొంబ
దెనిమిది లక్షల నైనయుఁ ద్రింశత్సహ
స్రములు పై సంధుల నమరు సప్త
పాతాళపంక్తి డెబ్బదివేలు దానిపై
నినమండలము లక్షలిరువ దైదు
కోటు లప్పటికిఁ గీల్కొను మహేంద్రాదుల
యధ్రువలోకపరిమిత మవిరళముగఁ

తే.గీ. పదియు నాలుగు లక్ష లేర్పడ మహర్జ
నన ముఖ జగంబు లవి వరుస నగు కోటి
రెండు నెనిమిది పదియుఁ బండ్రెండు కోట్ల
నలువ లోకంబుదనుక నిట్లలవడంగ.

కం. ఘనతఁదగు నవలఁ గోటియు
నెనుబదిపై యాఱులక్ష లేఁబది కోట్ల
యనువున నూర్ధ్వాధో భా
గ నిరూఢిఁ లోకపంక్తి క్రమమున నమరుఁన్.

వ. ఇట్టి లోకంబుల నుత్తమంబగు భూలోకంబు నందు భరతఖండంబు రమ్యంబగుట
గాళ్ళనఁ దత్ప్రభవంబు లెఱింగింపవలయునని సూతునిం గనుంగొని యెందువలన భరతఖం
డం బత్యుత్తమంబయ్యె వివరింపవలయునని మునులు కౌతూహలాయత్తచిత్తులై యడిగిన.

శా. వ్యాఖ్యా పార్శ్వతట ప్రసంగ సుకృత వ్యాదిష్ట కాసారతీ
రాలోలన్మణి హేమసాలగత దివ్యానందసంవాసలీ
లా లావణ్య విమానరాజ శుభదోల్లాస ప్రభా దేహదీ
ప్త్యాలంకార విలాస భావ్య దరహాసాంచన్ముఖ శ్రీధరా !

కం. సనకాది యోగి మానస
వనజోదిత మిత్ర రుచిరవరచరణా (బ్జా ?)
వనజాతాకర తీర్థా
వన భూతా ! శేషశైలవాసఖ్యాతా !

పంచచామరము. విరించి వాసవాదివంద్య ! వేదవేద్య ! భూధరా !
చరాచరప్రపంచగర్భ ! సర్వలోకసాదరా !
కరారవిందకీలి తత్ప్రకాశ పాండు సద్దరా !
పరాపరేశ ! వాసితాహిపర్వతాగ్రకందరా !

వ. ఇది శ్రీ మదలమేల్మంగావేంకటేశ్వరవరప్రసాదసుకవితావిచిత్ర కుత్స గోత్ర
పవిత్ర మహాంకాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్రపాత్ర వినయగుణ

సమేత వేంకటపతి కవి సహాయ తేకుమళ్లాన్వయపయఃపాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబాకప్పరామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్రపవిత్ర ఆపస్తంబసూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయి ప్రణీతంబైన వాణీవిలాసవనమాలిక యను మహాప్రబంధంబునందు నైమిశావాస మునిప్రశ్నయు వేదశాస్త్రపురాణ సంహితా గణనయు బ్రహ్మస్వరూపానందతారతమ్యంబును త్రిపాద్విభూతియును సృష్టిప్రకరణాద్యచతుర్వ్యూహలక్షణంబులును ప్రాకృత వైకృత దశవిధ సృష్టి ప్రకరణంబులును వాణీపరిగ్రహనిమిత్తనిర్గత చతుర్ముఖ పూర్వదేహ భవ యక్షరాక్షస సంధ్యా నీహార తమోద్భవంబులును వేదాది సకలవిద్యాసృష్టియును శబ్దబ్రహ్మ నిరూపణంబును మిథున సృష్టియందు నానావిధ పశుపక్షి మృగ గజాశ్వమనుజసంభవంబును, పిండోత్పత్తియు జీవజాతి గణనంబును సకలధాతవంశావతారయును మేరుజంబూద్వీప నవఖండ ప్రమాణంబులును సప్తద్వీపోపద్వీప సముద్రప్రమాణ తద్దేశావాస జనాయుర్నిర్ణయ తత్తద్వస్తునిరూపణంబులును గిరినదీనదసంఖ్యయుఁ బాతాళలోక ప్రమాణంబులును శింశుమార జ్యోతిశ్చక్ర విధంబులును సూర్యలోకప్రమాణంబులును పంచాశత్కోటి ప్రమాణ భూలోక విభాగ యోజనసంఖ్యానంబును నను కథలంగల ప్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము

శ్రీమద్ధేమాంభోరుహ
ధామ ప్రేమానుగత సదావినుత శ్రీ
రామా మోహనకర దే
హా! మహితోదార! వేంకటాద్రివిహారా!.

వ. దేవా! అవధరింపు మక్కథికుండు చతుర్దశభువన క్రమంబు లెఱింగించిన భరత ఖండ స్థిత పుణ్యస్థల నదీ తీర్థ ప్రభావంబు లెట్టులని యడిగిన, శౌనకాది మహామునుల కా సూతుం డిట్లని చెప్పందొడంగె.

సీ. గంగాసరస్వతీ కాళిందులుం సింధు
సరయూ శిలల్ శోణ చంద్రభాగ
గండకి నర్మద కౌశికి గోమతి
సుముఖి విశాలయు శోణ భద్ర
యరుణయు వరుణయు నళియు గౌతమి తుంగ
భద్ర మలాపహ భవహారిణియు
నిర్వింధ్య కృష్ణవేణియు భీమరథి పయో
ష్ణయు దారు సువహ దృషద్వతియును

తే.గీ. దమన గరుడ పినాకిని తామ్రపర్ణి
వైఖ మణిము క్తి ప్లుతి వేగవతి సువర్ణ
ముఖరి బాహుద సురస కుముద్వతియును
క్షీరనదియును గావేరి సారనదులు.

చం. చెలువగు పుణ్యశైలములఁ బుట్టి హరిస్థల సంగతంబులై
యలఘు మునీంద్ర సేవ్యములు నంచితధర్మ నిరూపణమ్ములై
తలఁపఁ గనుంగొన న్వినఁగ ధన్యసుఖాస్పద దీప్తవర్తనం
వెలయును భారతాఖ్య పృథివీ జనభాగ్య నిధానముల్ నదుల్.

వ. మఱియు వరుసగా హరిహర నిలయ పుణ్యతీర్థ నదీ నద మహిమంబులు సెప్పెద సావధానులరై వినుండు.

కం. శ్రీ వైకుంఠమ్మున ల
క్ష్మీ వనరుహనయన గొలువ శేషగరుడ భ
క్తావళి భజియింపఁగ మా
ధవుఁడగు వాసుదేవుఁ డాద్యాకృతియై.

సీ. ఆమోద నగరి వ్యూహాత్మకుఁడగుచు శ్రీ
కరలీల (నుండు ?) సంకర్షణుండు
రమణీయమగు ప్రమోదమునఁ బ్రద్యుమ్నుండు
సమరు వ్యూహాత్మకుఁ డగుచు నటుల
నొందు సమ్మోదంబు నందనిరుద్ధుండు
విధిలోకమున నుండు విష్ణుఁ డనఁగ
వలనొప్పు సూర్యమండలమునఁ బద్మాక్షుఁ
డమృతాబ్ధి శేషశయానుఁడుండు

తే.గీ. వెల్లదీవినిఁ దాఁక వితతసంజ్ఞ
నుండు బదరీవనమ్మున నొనర ధర్మ
నందు జనియించి నారాయణాఖ్యుఁ డగుచు
నరునితోఁగూడి విహరించు గరిమ మెఱయ.

మ. అది పుణ్యస్థల మాద్య మంచిత ఫలం బౌటన్ దదశ్వర్యచేఁ
బదియుండై తగు మందఁగొండకడ సద్భక్తావనప్రక్రియన్
గుమరై యోగనిరూఢతన్నగులఁ దేగుల్ పుణ్యతీర్థంబు లు
ద్భితసంఘంబులు విస్మయం బెసఁగు రీతిం జొచ్చు నచ్చోటునన్.

తే. గీ. చెంతఁ గేదారమున శిలాకాంతుఁ డీశుఁ
డమర నద్వైతబోధ మహత్త్వతత్త్వ
యోగవిభవంబు చేనుండు యోగివినుతు
నేప భవబంధ హరణమై నేమమెసఁగు.

ఉ. తామరసోద్భవుండు సుకృతస్థల మెయ్యెడ యోగ్యతలంప ని
భూమి వటించు నేమినిడ పూనికనచ్చటనిల్పఁ గాల్పనన్
నైమిశనామమై మునిజనమ్ముల కున్కియఁ బుణ్యదంబు నా
నామహనీయ కాననమునందున శ్రీహరియుండు నిత్యమున్.

కం. చెంగటఁ జెల్వగు కురుధర
ణిం గల పరపుణ్యతీర్థ నిర్మల సుకృతో
త్సంగాస్పద కారుణ్యా
పాంగుండౌ హరినిఁ దలఁచ నమరున్ శుభముల్.

మ. నరగంధర్వ సురామరాదులకు నైనన్ జేరఁగా రానిచో
స్థిరచక్రాఖ్య సరస్తటంబున హరిక్షేత్రంబునా నొప్పగున్
గిరి, తచ్ఛాయలఁ జక్ర శార్ఙ్గ దర లక్ష్మీ దామ చిహ్నమ్ములీ
లరహిన్ దెక్కగు రూపులం దనరఁగు సాలగ్రామ నామంబులన్.

తే. గీ. ముక్తినగరము లన్నిట నెల్ల మొదలిదా న
యోధ్య సరయూనదీతీర యోగ్యభూమి
రాఘవాఖ్యఁ జెలంగు శ్రీరమణుఁడచట
సేవకాభీష్ట దాయియై శిష్ట వినుతి.

చం. విధిముఖ దేవతాస్తుతుల విశ్రుత వారు సురూప మొప్పఁగా
సుధ నిలింపు లే నగవు నొందఁగ మోమున దుష్టనాశన
ప్రథ దగుకాత లోకహిత భాసురచర్య వసించు నెప్పుడున్
మధురను బాలకృష్ణుఁడన మాటికి సేవకకోటిఁ బ్రోచుచున్.

కం. వరసౌఖ్యదమగు మాయా
పురమున మధుసూదనుండు పొలుపగు భక్తి
స్ఫురిత మతిన్ సేవించిన
నరులకు సౌఖ్యప్రదాయి నా ముని వినుతిన్.

కం. సగరతనూభవ భస్మము
తగ గంగా జలముగలియఁ దమమునరింపన్
నగవాపుఁడు తలఁదాల్చన్
భగీరథు (ని ?) మెచ్చి నలుఁ పంపినదానిన్.

ఉ. అచ్చటి నందియుర్ ఘనఘనార్భటి శీతనగంబు మీఁది క
త్యుచ్చయ తచ్ఛిలాచయ తలోపరిభాగ వికీర్ణ తూర్ణ దీ
వ్యచ్ఛల మున్నతి ప్రకట భంగ సురంగ దభంగవైభవో
ద్యచ్ఛటుల ప్రవాహ బహుధాగతు లల్లన నుల్లసిల్లఁగన్.

సీ. శుభ్రశైలోయాకృతాభ్రయై విభ్రమా
దభ్రయై యూర్మి యగభ్ర యగుచు
ప్రమదయై శోభితకుముదయై ప్రీతముని
శమదయై విబుధసంభ్రమద యగుచు
ఖ్యాతయై హరి పదజాతయై హతదోష
జాతయై సుగుణసంఘాత యగుచు
పూతయై సజ్జనాధారయై జహ్నుకు
మారియై లోకోపకార యగుచు

తే.గీ. వెలసి విలసిత జలచర కుల కలకల
లలిత విహగ సమూకుల కలిత తట సు
ఫలిత తరుకుంజ పుంజ నిర్ఝర చలన
రణన వేగాతిశాంతి సౌరస్రవంతి.

చం. దరదరు పుండరీక విశద స్ఫురదుజ్జ్వలదాతపత్ర శో
భర వరరాజహంస యసమానకనద్ఘనమీనసాధనో
త్కర మకరీతురంగమ సకాశవనస్థమదేభయుక్త సా
గర కలుషాపి వారణ వికస్వర వాహిని వాహినీస్థితిన్.

కం. చెంపె భగీరథు రథము పి
ఱుందనె చనదెంచి సుకృతరూఢి మహీభృ
న్నందనతను పాలితయం
బుం దనుపుచు వారి ననిచెఁ బుణ్యగతులకున్.

శా. ఆ గంగాతటినీవరంబు హిమశైలాగ్రంబు నందుండి పు
ణ్యాగణ్యస్థితి నాశ్రితాళికి నిత్యానందముల్ గూర్ప రా
గ్యాగరత్న గ నాజగత్పతికి నీహార్ వే హరిద్వార భూ
భాగం బందుఁ దనర్చెఁ దద్ఘనఘృణా పారీణతన్ బొల్చుచున్.

కం. దేవనది యా జగత్పతి
పావన చరణముల తొఱఁగి పటుసూక్ష్మంబై
యీవల వెడలెఁ బ్రకాశత
నావిధమున నది శతాధ్వయై విలసిల్లెన్.

చం. సరసిజసంభవుండు మురశాసను గూర్చి భజింప నర్హమౌ
ధరణి మదిం దలంచి ప్రమదంబున గంగతటిం బ్రకృష్టయా
కరుఁడగుటన్ బ్రయాగ మనఁ బ్రస్ఫుటమయ్యెఁ దదీయ ధాత్రి శ్రీ
వరుఁ డల ధాతయాగమున వత్సలతన్ బొడసూపె నేపునన్.

తే. గీ. అటులఁ బ్రత్యక్షమై పర మహుగు మనిన
నీ త్రివేణి మకరమున నెవ్వరేనిఁ
గ్రుంక భవబంధ మణఁపుమీ! కువలయమున
నిలిచి మత్కృతిపాలన మెలమిఁ జేయు.

కం. అని వేడిన నలినజునకు
వనమాలి వరంబు లొసఁగి పర గంగా యా
మున వారి సరస్వతిఁ గూ
డినచోట మాధవసమాఖ్య దేవ న్విర్చెన్.

సీ. సంవర్తవేళ నాశనము నందనిదయ్యె
నఖిల తీర్థాస్పదమయ్యె వరణ
యసి యను ధునులఁ బెంపెసఁగఁ గూడినదయ్యె
శ్రీవిశాలాక్షీశ్వరీ పతికిని

దివ్యతారక జపస్థిర బుద్ధి కనుపగు
చోటయ్యెఁ బశు పక్షికీట మృగము
లైనను మృతిఁజెంద నపవర్గము పొందఁ
గల తీర్థమైన యాకాశి యందు

ఆ. వె. నొక్క పుణ్యతీర్థ మొప్ప విష్ణుఁడు గాంచి
యొలయు విస్మయమునఁ దలఁ గదల్పఁ
గర్ణభూష దానికడఁ బడి మణికర్ణి
కాఖ్య తీర్థమయ్యె నందు మీఁద.

కం. ఉత్తరవాహిని యగుచును
నుత్తర శ్రోతంబు లైదు నగు తద్భూమిన్
హత్తుగ వెలగొని గంగయు
నుత్తరముగఁ బడెను ముని సురోత్తము లెంచన్.

ఉ. ఆ తరణమ్ము లెన్నఁదగునట్లు గజాననుఁ డష్టదిక్కులన్
గావఁగ డుంఠి ముఖ్య పటు భద్రవరాఖ్యలఁ గాచ దుర్గలున్
భావజశాత్రవాంశజుఁడు భైరవుఁడున్ బెరివారిఁ బ్రోచుచున్
గావలి యుండ లెంగఁ దగు కాశిని లోకశయాన నామతన్.

కం. నెలకొనియుండ గంగ గ్రుంకిడి
జలజాక్షుని విశ్వనాథు సందర్శింపన్
గల యనఘు లిహపరమ్ముల
విలసిత సౌఖ్యములఁ గాంచి వెలయుదు రలమిన్.

మ. గయుఁడను వాఁడు రాక్షసుఁ డఖండిత సత్త్వసమగ్రుఁడై ప్రజన్
భయ మొదవంగ బాధ లిడఁ బద్మదళాక్షుఁ డెఱింగి వానిపై
రయమునఁ జేరి పెన్గద శిరంబున వ్రేయుచు వాని వడి మ
త్యయ పదపీడ చేసి విదితమ్ముగ నిల్చె మునుల్ నుతింపఁగన్.

కం. అపు డసుర విష్ణుదేవుని
విపుల పదస్పర్శనమున విద్యాయుతుఁడై
యపరిమిత చరితు నచ్యుతుఁ
గృపాయుతుఁ బొగడుచును బల్కెఁ గేవల మైత్రిన్.

ఉ. నీ పదపద్మసంగతి ననింద్య చరిత్రుఁడనైతి నిప్పుడీ
వే! పరమాత్మ సద్వరము వేడుక నాదగు వత్స సీమ నీ
వీ పగిది న్వసించి సురలెల్ల భజింపఁగ నుండి పిండ మిం
పోపిక నెవ్వరే నిడిన నున్నతిఁ దర్పితరుల్ చెలంగఁగన్.

చం. అనవుడు మంచిదే యనుచు నబ్జజ శంకర కార్తికేయుల
ర్యమ శని చంద్రు లింద్రుఁడు గణేశుఁ డగస్త్యుఁడు కశ్యపాది స
న్మునులట నంఘ్రిపంక్తు లిడఁ బూన్చి గదాధరుఁ డట్లు నిల్చె భూ
జన పితృకోటి ముక్తి గనుచాయ నయంబగు నగ్గయన్ దగన్.

తే. గీ. అటు పవిత్రమంతైన నాగమోక్తిఁ
బిండ మిడ సప్తగోత్రజుల్ పేర్మి నూఱు
నొక కులము వారు కైవల్య మొనరఁ గాంతు
రట్టి మహిమంబు పొగడ బ్రహ్మకుఁ దరంబె!

సీ. అటఁ బ్రేతగిరి యన నవనీధ్ర మొక్కటి
ఫల్గుని నది చెంతఁ బరఁగవిల్లు
మును రాముఁడట నిజజనకుని మృతి విని
పిండ ప్రదానంబు పేర్మిఁ జేయ
నరుదేర, గయయందు నావరణము చేసి
పాలకుల్ పో నిమిషతియు నవలఁ
బేర్మిమైఁ గయిసేసి పిండము ల్గొనుటకు
గయ ఋహ్యఁ జాఁచు వీఁక న్వచింప

తే.గీ. నాలుక వెలార్ప ఋహ్య విలోల మయ్యె,
మున్నె యిసుమున ఫల్గుని సన్నుతాంగి
సీత పిండము లిడినచో భూతలేశుఁ
డిడఁగఁ బితరులు రాముఁడు దెంచి యతఁడు.

కం. ఏమి నిమిత్తము రారన
భూమిజ యిడుటచటి యేరు పూనికఁ బలుకన్
రామామణి ఫల్గుని నట
భూమిన్ గుప్తముగఁ గోపమునఁ బల్కెఁ దగన్.

కం. అంత గయాపాలకుల
త్యంత భయభ్రాంతి నిటుల నఖిల జనుల్ శా
పింతు రిట వలవదని భూ
కాంతుని వేడంగ బుద్ధగయఁ బిండ మిడెన్.

కం. ఇప్పుడు సీతారాముల
యొప్పందము నెఱుఁగఁ జేయుచున్నది యదియున్
జొప్పడు రామగయ యనఁ
జెప్పఁగఁ దరమే! తదీయ చిర మహిమంబుల్.

శా. తరఁగ త్తుంగతరంగసంఘములు తోరంబై కడు న్వేడుకన్
గంగా వాహిని రా సముద్రుఁ డతిలోకంబౌ ప్రవాహంబు నా
గంగా లేక హరిం దలంప నది పోకన్ వేయి పాయల్గ డిం
దంగాఁ జేయుచు విష్ణుఁ డందు నిలిచెన్ దాఁ బావన ప్రక్రియన్.

కం. గంగ శుభాస్పద యనితత
రంగిణి యఘహారి తీర్థరాజం బేల
త్సంగము కొంతయు నొప్పగు
బంగారము పరిమళమునఁ బాటిల్లు గతిన్.

కం. మనువులు మును లఖిల సురల్
దినములు సేవింతు రట్టి తీర్థోత్తమమున్
మనమునఁ దలఁచిన శుభమగు
మునుకడలం గలుగు టరుదె మోక్షం బెలమిన్.

ఉ. ఎవ్వఁడు గ్రుంకు నర్మ్యాదల నెవ్వఁడు మాధవుఁ గాంచు భక్తిమై
నవ్విమలాత్ము వంశకరులౌ పితరుల్ ఘనపుణ్యలోకముల్
నివ్వటిలంగఁ గాంతు రని స్మృతి పుట్టెరు చూడఁ గ్రోలఁడున్,
నర్మ్యల కైన నెన్నఁగ ఘనంబగు పాపము లూడు నన్నియున్.

ఆ. వె. తలఁచినంతఁ దీర్థములఁ గ్రుంకు ఫల మగు
నచటి మట్టి నుదుట నమరిఁ దాల్పఁ
దలను జలకణములఁ జిలికించి కొననెల్ల
పుణ్యగతులు గల వగణ్యగరిమ.

సీ. మహిమ మేపాదిగా మాసముల్ పంద్రెండుఁ
కృష్ణ గోదావరి ధృతి సరస్వ
తీనది వేత్రవతిన్ దుంగభద్రా ర్క
భవలం దమస సరయుభున భీమ
రథిఁ దామ్రపర్ణి నారసి రేవ నిరసించి
యఖిల లోకుల యఘం బణఁచి యుట్టి
నదుల తీర్థము పావనము చేయ క్రమమున
నా గంగ కెన్నంగ నజుని వశమె!

తే.గీ. నదులలో గంగ మేలంద్రు త్రిదశవరులు
తత్ప్రమంబగు తీర్థంబు దలఁప విష్ణు
మూర్తు లయిన సాల్గ్రామముల నిమజ్జ
నాంబుపూర తాశ మందు లే దరసి చూడ.

కం. సూర్యునికిఁ ద్వష్టృ పుత్రికి
నార్యస్తుతిఁ బుట్టినట్టి యముని చెలియ ల
య్యార్యాధి వినుత చరణు న
వార్య మతిం గూర్చి తప మవశ్యతఁ జలిపెన్.

శా. కాళిందీ ప్రతనిష్ఠకున్ హరి నిజాకారమ్మున న్వచ్చినన్
కాలారణ్యము సన్నుతింపుచు నెదన్ బ్రాప్తిన సిగ్గొందఁ గా
హేలాదృష్టిఁ గనుంగొనం దెలిసి నీ యిష్టార్థమున్ గూర్తుఁ బొ
మ్మీ! లీలాకృతి నీ తటమ్మునను నెమ్మిన్ బుట్టి యుప్పట్టునన్.

కం. అనవిని కాళిందీ నది
మనమున ముద మొదవ సూర్యమండలమున నుం
డి నిగిడి కళింద శైలము
నినుపుచుఁ బ్రవహించి గంగ నెమ్మిన్ గలసెన్.

సీ. యమునకుఁ బ్రత్యక్షమైన యాకృతి జగ
త్పతి యవంతీ పురి నతిశయిల్లె
నదియగును మధుర యట్లపవర్గదం బౌటఁ
గనుగొను జనులకు నొసగు శుభము
లబ్జాక్షుఁ డంతఁ గృష్ణావతారము నొంది
జలధి మధ్యమునఁ ద్వష్టసుతు చేత
వితతమై తగు ద్వారవతి యాదవేంద్రుండు
డంబగు నందవ్రజంబు నందు

ఆ. వె. గోపికా ప్రియుండు నా పట్టి బృందావ
నంబు నందుఁ జెలఁగు నందసుతుఁడు
ననఁగఁ గాళియహ్రదావని గోవిందుఁ
డగుచు నమరె సేవకావనతను.

కం. గోవర్ధనమున గోపతి
గోవల్లభుఁడైన శౌరి గోమంతమునన్
బావనత భక్తలోచనుఁ
డై వెలయు భవమ్మమున మహత్త్వము వెలయన్.

తే. గీ. గోపపురి గోపతి యనంగఁ గొమరు మిగుల
నమరు, రాముఁడు చిత్రకూటమున, రామ
సఖ్యుఁ డుండు నందిగ్రామమునర్య, రామ
భూమి, జానకీ ప్రియుఁడుండు భూరి మహిమ.

కం. భాసుర పుణ్యద మైన ప్ర
భాసం బను తీర్థ ధరణిఁ బద్మదళాక్షుం
డా సక్తి విష్ణుమూర్తి య
నా, సురనుత మహిమ వెలయ నవ్య స్ఫూర్తిన్.

కం. శ్రీ కూర్మంబునఁ గూర్మం
బై కవ్వపుఁ గొండ తాలుపన విలసిల్లెన్
లోకన్ మలభీషణమున
శ్రీకరగతి గది యనంగఁ జెలఁగున్మహిమన్॥

సీ. శైలోత్తమంబగు నీలాచలమ్మున
నలువకుఁ బ్రత్యక్షకలనఁ దోసఁగి
పురుషోత్తమాఖ్య నద్భుత మహత్త్వంబునఁ
గను పట్టు, వినుతించి వనజభవుఁడు
బహు నివేదనములు విహితోపచారముల్
గావించి లోకైక పావనమగు
నా క్షేత్రమున నైవ్వరంతర జాతి భే
దము లెంచరేని యిడుముల గాంతు

తే.గీ. రనుచు భగవదనుజ్ఞ నయ్యబ్జునఁ గాంచె
నచటి జలనిధి నైకాల్యమైనఁ గ్రుంక
శుభము లిహపరసౌఖ్యముల్ విభవ మెసఁగు
నందుఁ గలదొక్క సరసి పుణ్యతను మెఱసి.

మ. దళమై యంతటఁ బద్మకల్ప సమయాంతంబందుఁ బుణ్యాస్పద
స్థల మిచ్చోటనని యాత్మలోఁ దలఁచి యింద్రద్యుమ్న భూపాలుఁ డి
చ్చట నీలాచల పుణ్యతీర్థమున నాశ్చర్యమ్ముగాఁ గాకి క్రుం
కి లసద్వైఖరి రాజహంసమగుటల్ గీర్తింప వించు న్వేసన్.

కం. నీలాచల విభుఁ గొల్వఁగ
మాళిం జనుదెంచి విష్ణు నచ్చటి గిరిపై
నా లోకింపఁగ లేమిన్
జాలా సంతాపమంది జనవిభుఁ డంతన్.

మ. తపమున్ జేయఁగఁ బద్మకల్ప మగుడంతన్ ధారుణీ చక్ర మ
ల్ల పయోరాశి మునుంగఁగా నృపతి లీల న్నీలశైలమ్మునన్
నిపుణుండై కమలాక్షుఁ జక్రధరు నర్చించెం దపశ్చర్య చే
నపుడా శ్వేతవరాహ కల్పమగుచో నా ధారుణీ భర్తతోన్.

కం. సురలచే "యంబుధి లోనన్
దరంగములఁ గూడి రత్నదారువు వచ్చెన్
హరికరుణ గా నెఱుంగుచు
స్థిరమతిఁ బన్మూర్తిఁ దానఁ జేయుము భక్తిన్"

సీ. అని పల్కుటయు నట్లు యవనీశ్వరుఁడు వరి
చేరిన దారువు నారసి కను
సంతసమ్మునఁ దెచ్చి యింతటి పుణ్యుఁడో
దీన నేనవ్విష్ణు దేవుఁ జేయ,
నని చింతనము సేయ హరి యట కొక్కవ
డ్లంగి యై వచ్చి పొసఁగఁ జేయు
దాపరణమ్ములో నది సేయునంతకుఁ
జూడకు మని పల్కి వేడుకలరఁ

తే.గీ. పెక్కు దినములు సేయుచోఁ బేర్మిఁగర వ
దాంగుళములు లానఁ గూర్చి యపుడు నృపతి
తొంగిచూచిన, నతఁడు తొలఁగి చనియె
యపుడు వగనొందు నృపతితో నభవాణి.

కం. వాసిన్ బలభద్ర సుభ
ద్రా సహితు జగత్పతిని ముదంబున నిల్పం
గా, సమకొను మటు లందుట
కా సరసిజనాభునకుఁ బ్రియం బన, నతఁడున్.

వ. తద్దారు శేషంబునఁ బరుష స్తంభంబు నా సేసిన స్తంభంబును దద్విగ్రహంబులును నగ్గిరియందు నునిచి యప్పుడు—

చం. నలువ యొంటింగి తెల్పిన దినంబున శ్రీధరుఁడన్ బ్రతిష్ఠ యొ
సలిపెద నంచు నచ్చటికిఁ జయ్యనఁ బోవఁగ దేవ మౌనితో
నైలమి వసించియున్న పరమేష్ఠి నృపాలునిఁ జూచి యోతపో
బలయుత! యీతురాక యిటు ప్రస్ఫుటమయ్యె మదీయ దృష్టికిన్.

ఉ. నీ విటవచ్చు నంతన యనింద్యచరిత్ర! యనేక కాలముల్
పోవ, విదర్భరాజు హరిఁ బూనిక నీలగిరిన్ బ్రతిష్ఠ మే
ధానిధి చేసి తత్పురము దా పరిపాలన సేయుచున్నవాఁ
డో విమలాత్మ! నా, నపుడు నుర్వి విభుండు విధాతతో ననున్.

కం. వి శానరించిన దేవుని
నేనె ప్రతిష్ఠించు సుకృత మిది! మహాత్మా
ధీనుత యని ప్రొక్కిన చో
వా శారదుఁ బంచె నట్టి యనుశాసనరింపన్.

చం. అతఁడు తపోబలమ్మున గజాశ్వరథావళిఁ జేసి వైరి సం
తతిఁ దఱిమించి వేఱె గృహపంక్తు లొనర్చి జగత్పతిన్ రమా
యుతు నటనిల్పఁ బో, వలవదుండెద నిచ్చట నంచు సత్కృపా
మతి విలసిల్ల నచ్యుతుఁడు మానవనాథునితో ముదంబునన్,

సీ. పలుకు డింద్రద్యుమ్నుఁ డలఘుచింత వహింప,
నీవు కట్టిన గృహ నివహమునను
బ్రతి పాయనమ్ము నేర్పడ సప్తరాత్రముల్
వసియింతు, సేవించు వార లచట
మద్దర్శన ఫలం బమరఁగఁ గైకొందురు
నని, భగవంతుఁ డిట్లాడి పలిత
పావనుఁడౌ జగత్పతి డోలికా యంత్ర
మా రథోత్సవము జ్యేష్ఠాభిషేక

తే.గీ. మాదిగా నట్టి విభవములతఁ డొనర్పఁ
బ్రబలి దారుపర బ్రహ్మ భవ్య నిగమ
వాక్య వైఖరిఁ గను పట్టె వసుధ యందు
నట్టి పురుషోత్తముని నేఁ యమృతపదము.

కం. ముదమున భూపతి గ్రుంకిడ
నది యింద్రద్యుమ్న సరసి యనఁదగు ప్రథయం
బొదవ వటపత్ర శయనునిఁ
గదియం జని కాంచెనట మృకండజుఁ డెలమిన్.

కం. వినుఁ డచ్చట మార్కండే
య నిరూఢాఖ్యాతి నర్థమునువగు సుకృతం
బన ఘం బత్యద్భుత మా
వనధి దరిన్ నీల శైల వైభవ మరయన్.

తే.గీ. అచట మృతిఁ జెందు జంతుకాయములు పూతి
గంధరహితముల్ శంఖచక్ర ప్రచిహ్న
తాస్థి పంక్తులునగు నట్టి యద్భుతములు
గలవె! యెందేని యీతే మార్గమ్ము నరయ.

తే.గీ. సింహగిరి యందుఁ దగు మహాసింహుఁ డనఁగ
శ్వేతశైలమ్మునందు నృసింహ రూపి
యా యహోబల గరుడ శైలాగ్రముల ను
దనరు దపనీయకశిపు మర్దనుఁ డనఁగ,

మ. భవనాశీ నది పాపహారి యగు తత్ప్రాంతనిర్యద్గుహల్
నవరూపంబుల నారసింహులు జనానందమ్ముగా నుగ్ర రూ
ప పరత్వంబులు గల్గువారు గలరా పట్టుల్ రహస్యమ్ము లౌ
నవదాతాబ్జదళాక్షు దివ్యకథ లాహా! యెన్నఁగా శక్యమే!

మ. ఘటికాద్రిన్ దశమాచరించు మునులం గావన్ సమీరాత్మజున్
బటుసత్త్వాన్వితు నిల్పి సప్తఋషులన్ పాలింపఁ బ్రత్యక్షమై
నటనన్ శ్రీ నరసింహదేవుఁడు బుధానందమ్ముగాఁ జెల్వగున్
త్రుటికాలమ్ము వసించు మానవులు తృప్తిన్ గాంతు రద్ధా యనిన్.

సీ. అనఘుఁడౌ గౌతముండాశ్రమాంతరమునఁ
విత్రితిసుల పూజ పేర్మిఁ జేయ
నీవార సస్యమ్ము నెమ్మిఁ బ్రోఁది రాయనర్చు
దినము మధ్యందినమునకు పొదవు
తన్మహత్త్వమునకుఁ దాళకింద్రుఁడు పశు
వై వచ్చి మేసి సంయమి పరుండు
తృణముచే నదలింప ధృతిచెడి కూలినఁ
గటకటపడి మునిగణవరులకుఁ

ఆ.వె. తెలుప శంభుశిరము నెలవగు గంగ ని
యావుమీఁదఁ దెమ్ము హత్య తొలఁగు
ననుడు మౌనియట్లు, నా సహ్యగిరి యందు
శివుగుఱించి తపము సేయుటయును.

సీ. హరుఁడు ప్రత్యక్షమై యతని కిష్టమొనర్ప
గంగఁ బూనుతలంగేలుంగ లేమి
నౌదుంబరపు వ్రేళ్ళ నందమై నాసికా
చిలుముల నల్లన చెలఁగ విడువ
నచ్చోటు సహ్యాద్రి త్ర్యంబకంబనఁదగు
నా గంగయుఁ బ్రవాహ మడర వెడలె

తే.గీ. గంగ కటమున్న వచ్చుటఁ గలిగె వృద్ధ
గంగ యనుపేరు గౌతము కతనఁ జేసి
గౌతమీనామ, మయ్యావు నైకొనుట ను
విమల గోదావరీ నామమును బొసంగె.

కం. భాగీరథి జాహ్నవి యన
నా గంగాతటిని కాశియందు వెలసి తా
నా గౌతమిఁ గలియన్ సిం
హగతుఁడై గురుఁడు పొలయు నయ్యబ్దమునన్.

ఆ.వె. రక్తరుచినిఁ బుక్కరత్రయంబున నాసి
కా త్రియంబకంబు గదిరి జలధిఁ
గలియు వృద్ధిగంగ జలము లంతర్వేది
దనుక నుండు సురలు మునులు పొగడ.

వ. అట్టియెడఁ గ్రుంకులిడు జనులైన నిహపర సుఖంబులం బడయుదురు. తర్పణమ్ములొనర్పఁ దత్పితరు లక్షయపదవిం జెందుదురు. ఇమ్మహానది యుభయ తటంబుల బహుదివ్యస్థలంబులు గలవు. గరుడనదీసంగమంబున వాసర యనందగు నచట సరస్వతీ భజనంబు విద్యాప్రదంబగు, గౌతముండు కుశచేఁ బశువు నడంచినయెడఁ గుశతర్పణంబను పుణ్యస్థలంబయ్యె. మునిగణంబులారాధింప నందతికి సన్నిరూపులై విరూపాక్షుండు ప్రత్యక్షుండైన కతంబునఁ గోటిలింగస్థానంబనం బరగు. సకల వేదోపనిషత్సారంబులగు మంత్రంబుల మునివారంబులు నారాయణుఁ గైవారంబు సేయుచుండెను మంత్రకూటంబును, ప్రణీతాసంగమంబునఁ గాలగళుండుండుటంజేసి కాళేశ్వరం బనందనరు, నారామచంద్రుండు సీతాసమేతుండై పంచవటంబున నుండుట భద్రాచలంబనం దదీయవిహారచిహ్నంబులిపుడుం గనంబడు. పదంపడి సీతావియోగంబున శపియించి దేవమునిప్రార్థితుండై శబరీ తీర్థసంగతిం బవిత్రంబగునని గోదావరి ననుగ్రహించి నిజధనుష్కోటిచే మార్గం బేర్పరిచిన నంచితంబుగ రామపదభావసూచకంబై కరిరి గౌతమిం గలసినయెడ యతిసుకృతప్రదమగు మఱియు సరసిజభవసవనస్థానంబగు ధర్మపురి రామేశ్వరసన్నిధి బ్రహ్మతీర్థ యమ కోధా శేషహ్రదాది పుణ్యలాంఛనంబులం బరగి యుండు.—

కం. ఆ ధర్మపురిమహత్త్వము
సాధు స్తవనీయ మమిత శాశ్వత మగుటన్
వేధయును దెలియనేరం
డాధరఁ దగు యోగనృహరి యంచిత లీలన్.

కం. నందిత విబుధుఁడు రాగా
నందనృసింహుఁడు బుధజనప్రియుఁడై యా
నంద ఫలప్రదవిభవా
మందవిహారతఁ బొసంగు మహనీయరుచిన్.

కం. ధృతి మలిన హరియగుటన్
కృతశాపం బనఁగ వెలయుఁ గేవలభాసం
గతుఁడగుదుఁ బాపహరుఁడన
నతిశయుఁడగు సేవక ప్రియాభీష్టదుఁడై.

కం. లలితాంధ్రభూమి శ్రీ కా
కుళమున నంధ్రపతి యనఁగ గోవిందుఁడు ని
ర్మల చర్యఁ దనరు తైర్థిక
ఫలరూపంబగుచు భువనభాసుర మహిమన్.

చం. ఇలఁగడు పాపసంగతులు హింసకులున్ తితుల్ తమంత దా
రలవడ నాస్థలంబు గన, నందు వసించిన, పుణ్యమూర్తులై
వెలయఁగఁ బాండురంగమున విఠ్ఠలనామ మురారి యొప్పఁ, ద
ల్లలిత మహత్త్వ మెన్నఁగఁ గళానిధిజూటున కైనశక్యమే !

చం. తనుభజియించు శేషు నిల ధారుణిభృద్వర రూపమొందఁగా
ననిలుని వాదుచే నొదవు నట్టులొనర్చి రమాసఖుండు శ్రీ
వనిత తపమ్ము మెచ్చి నుతవైఖరి వక్షమునన్ ధరించె భ
క్త నికరసౌఖ్యదాయి యనఁగాఁ దగు వేంకటనాథుఁ డప్పుడున్.

సీ. అంజనధర గరుడాచార్య వృషశైల
నారాయణాద్రి కనక శిఖరులు
నీలాద్రి చింతామణి గిరి వైకుంఠాద్రి
వారాహ వృషశైలమేరు గిరులు
సింహాద్రి తీర్థాద్రి శేషాద్రి పుష్కరా
చల వేంకటాద్రులు నెలమి శ్రీని
వాసాద్రి శ్రీశైల భాసుర సంజ్ఞల
గుణకృతనామముల్ కోట్లుగలఁది.

తే.గీ. కడఁగి పాతకచయములు గాల్చువలన
నమృత మైశ్వర్యము నొసంగు నంయువలన
వేంకటాచల నామంబు వెలసె మిగుల
నచటఁ గల్గు ప్రధానతీర్థాళి వినుఁడు.

ఆ.వె. స్వామిపుష్కరిణియు స్కందధారయు దేవ
తీర్థ పాపహరణ తీర్థములును
దురితదూరమైన తుంబురుతీర్థ మా
కాశగంగ యనఁబ్రకాశకములు.

వ. గిరిపాదంబునఁ జక్రతీర్థాద్యష్టాదశతీర్థంబులును మార్కండేయపాండవ తీర్థంబులును, అరుంధతీతీర్థంబును మఱియును—

కం. ఇవి మొదలగు శుభవిభవా
త్యధికశ సార్ధ త్రికోటి యగు తీర్థముల్
నవకాంచన తరుకుసుమా
ద్భుత గరిమన్ మేరుసమతఁ దద్గిరి యమరున్.

కం. విరివియు నిడివియుఁ బొడవును
తిరము మొప్పఁగ నేడునైనుబదియు నాలుగు రెం
డురుతర యోజనముల చే
నిరతాంద్యుగ్ దత్ప్రభావ మెన్నఁగవశమే.

కం. శ్రీ వేంకటగిరి మహిమం
బా వేలుపుఁబెద్దయైన నభినుతి సేయం
గా వెరివెఱుఁగంగఁడెంతయు
శ్రీవైకుంఠంబె యది విశేషఫలదమై.

సీ. మున్ను శ్రీవైకుంఠమున కేగి నారదుం
డట నుండి క్రమ్మఱ నరుగుదెంచి
తన కెదురైనట్టి మునికదంబముఁ జూచి
వినుఁడు రమాసఖుం డనఘమూర్తి
దేవుఁడు వైకుంఠ దివ్యవిమానాధి
రూఢుండై విరజయు రుచిరసరసి
గతిఁ దన్ను భజియింపఁగా శేషగిరి మీఁద
నున్నవాఁడని తెల్పి విన్నయట్టి

తే.గీ. సనక శుక వామదేవాది సంయమీంద్రు
లుత్సవంబున నట కేగి యుచిత రీతి
నా జనార్దను భజియించి రట్టి విష్ణు
సేవ లిహపర సౌఖ్య శుభావహములు.

కం. గంగాది దివ్య తీర్థము
లంగజహరముఖ్య దేవతాళియుఁ దచ్ఛై
లాంగణమున వసియించు ను
సంగతి హరిపాదభజనఁ జరితార్థకమై.

కం. గిరి శిఖిముఖమై మ్రొక్కిన
సరసత జనవినుతి సేయ సకలశుభంబుల్
జరిగింతు రనిన హరిఁగను
పరమ మహాపుణ్యమెన్న బ్రహ్మకుఁ దరమే!

శా. క్షీరాంభోధి జనించి యంచిత తపశ్శ్రీ వేంకటాధీశ్వరుగ్
గారాబంబునఁ బెండ్లియాడుటకు నై కల్యాణ పద్మాకరో
దారాంచత్తటు కుంజపుంజ విలసత్ప్రాటీర వాటీ కుటీ
కారాధార సుగంధ బంధుర తను వ్యాపార హేలాగరిక్.

కం. వలపు గ నలమేల్మంగన్
గలుముల చెలిఁ బెండ్లియాడి కంజదళాక్షుం
డలరుం జెలువగు సొబగున
నిలపైఁ గల్యాణ వేంకటేశ్వరుఁడనఁగన్.

వ. తత్కారణంబున శ్రీవేంకటపతి రమాసక్తుఁడనఁ బరగు.

తే. యాదవాద్రియు నారాయణాద్రి యనఁగ
నమరు నగ్గిరి మూని జవనానాము
రక్తిఁ గొలుపొందియుండు నారాయణుండు
తత్పదాంభోజభజన మత్యంతశుభము.

కం. తిరునారాయణపుర మనఁ
బరగిన తద్ధాత్రిఁ గల్గు పాండురకాంతి
స్ఫుర దురు మృద్ధారణ మన
నరులకు నారోగ్య మఘవినాశనము నగున్.

సీ. నలువ యజ్ఞముసేయ వెలయు సత్యవ్రత
క్షేత్రమ్మునన్ హస్తిశిఖరి మీఁద
వేగవత్యుత్తరభాగావనిన్ ధాత్రి
వరుఁడైన తద్యజ్ఞవాటమునను
హరిపొడల్చి నాకాంచి నబ్జజమూర్తులు
కమలాక్షుఁడు యథోక్తకారి మఱియుఁ
బరమేశ్వరుండును పాండవదూత మ
ధూన్మథన నృసింహులాగ త్రివిక్ర
ముండు నయ్యష్టభుజుఁడు ప్రవాళ వ
ర్ణుండు దీపాభుండు నిండువేడ్క

తే.గీ. నుండుదు రయోధ్య కాశియు నొప్పుకాంచి
మొదలుగా సప్తపురముల విహితసుకృతి
మహిమ లత్యద్భుతంబులు మదనవైరి
వెలయుఁ గామాక్షితోఁ గూడి వేడ్క నచట.

కం. వినుఁడట గృధ్రసరస్తటి
మున నున్న జటాయువునకు మోక్షప్రదుఁడై
తనరారు విజయరాఘవుఁ
డనుపమధృతి వెలయు సేవకానందగతిన్.

మ. స్తుత సమ్యగ్గుణ! శాలిహోత్రముని తపస్స్ఫూర్తిన్ భజింపన్ బ్రత
ప్రీతలీలన్ విపులాంశజన్ గనకవల్లిన్ బెండ్లియై సంతతా
తతహృత్తాప వినాశనాఖ్యవరతీర్థ స్వార్థకారిత్రుఁడై
ధృతమాహాత్మ్యుఁడు వీరరాఘవుఁడు నాదీపించు వీక్షాటవిన్.

కం. శోణాద్రిఁ దుంగశయనుఁడు
ఖ్యాతి గజస్థలమునన్ గజార్తిఘ్నుండున్
భాతిగ బలిపురిలో సం
ప్రీతి మహాబలుఁడు నుండు శ్రీకరలీలన్.

తే.గీ. భక్తిసారమ్మునన్ జగత్పతి వెలుంగు
నైంద్రమున దేవదేవేశుఁ డనఁబొసంగు
మహితమున బద్మనేత్రుఁడు రహిఁ జెలంగు
స్వర్ణమందిరభూమి సువర్ణుఁ డమరు.

సీ. ఝిల్లికావనమున శ్రీముష్ణదమ్మున ?
సారమౌ మణిముక్తతీరభూమి
వృద్ధాచలముచెంత వెస నిత్యపుష్కరి
ణీతటమ్మున శుభఖ్యాతిమెఱయ
మునులెల్లఁ దపములిమ్ముగఁ జేయువారల
రహిఁ బ్రోవ శ్వేతవరాహమూర్తి
దనుజు హిరణ్యాక్షుఁ దునుమంగ శంఖచ
క్రికరముల్ పెఱిఁడిచక్కటిని దాఁచి

తే.గీ. వాని నటఁగూల్చి ధరఁదాల్చి మానితముగఁ
జరణయుగి రసాతల మురస్థలమునొకటు
కుప్పగించుచుఁదల్లీల కొమరుమిగుల
నున్నవాఁడిప్పుడందఱౌ చిన్నలెఱుఁగ.

కం. శ్రీముష్ణమహాత్మ్యంబా
తామరసజుఁడింపుతో సదా కొనియాడున్
ధీమజ్జన సుకృతఫలం
బామహి నశ్వత్థసేవ లతిసుఖదంబుల్.

కం. ఏ దినమైనన్ వారం
బేదైనన్ రాత్రియయిన నే వేళైనన్
మోదంబున భజియించిన
నా దివ్యాశ్వత్థమొసగు నఖిలశుభంబుల్.

తే.గీ. నాభి పద్మోద్భవుం డగు నలినజునకు
హంసమై తత్త్వబోధన మమరఁ జేసి
ఘోటకాకృతి వేదముల్ గూర్చి నొసఁగ
నా చతుర్ముఖుఁ డబ్జాత్ము నభినుతించి.

శా. నైజాకారముఁ జూపవే! యనుచు నానందార్ద్రుఁడై శౌరి వి
భ్రాజల్లీల వికుంఠధామయుతుఁడై పక్షీంద్రనాగేంద్రులున్
దేవీయుక్తుఁడు సైన్యపాలకుఁడు నర్థిన్ నిత్యుల్ గొల్వ ల
క్ష్మీ జీమూత శిరోజ, నీల, ధర, నెమ్మిం జేరి సేవింపఁగన్.

తే.గీ. పరిణవమయ వి[తా ?] నప[టము ?] ఁజతుర్వేద
రూపశృంగయుక్తి నేపుమీఱ
నట్టి సెజ్జలోన నబ్జజుఁ డలరంగ
గానుపించె వేల్పుగములు పొగడ.

వ. అట్టి శ్రీరంగవిభునిం బ్రార్థించి నిజార్చనలు గైకొనుటకు గృహదేవతగా నలువ నిలుపుకొనియె నంత.—

ఉ. గంగకు సహ్యనందనకుఁ గల్గిన వాదమువల్లఁ గోప ము
ప్పొంగఁ గవేరకన్య కడుఁ బూన్కిఁ దపం బొనరింప మెచ్చి శ్రీ
రంగ విభుండు వచ్చి వరంబుగ వేఁడె, నిజోదరైక సీ
మం గుదురై వియన్నదికి మక్కువ నెక్కుడు నేసియుండఁగన్.

చం. అనవారి చంద్రపుష్కరిణి కవ్వల నివ్వల నీ ప్రవాహముల్
దనరఁగనుండు మీ నడుమఁ దార్కొని నిల్చెద నంచుఁ బల్కె న
ట్లన నటధర్మవర్ముఁడు దయాకరు శ్రీహరిఁ గూర్చి నిష్ఠ సొం
పానరఁ దపమ్ము సేయ హరియుం బొడసూపి నృపాలుతోడుతన్.

వ. కాలాంతరమ్మున నచ్చట వసియించెద ననియె నంత—

సీ. విను త్రిరాత్రుల జాహ్నవీనది యొగి పంచ
రాత్రు లర్కజ సప్తరాత్రుల యొడ
గౌతమి రేవతి ఖ్యాతి నాలుగురాత్రు
లను జన దురితమ్ములను హరించు
నా కవేర కుమారి యాక్షణమ్మునఁ గ్రుంకు
లిడు వారి పాపమ్ము లెడలఁ జేయు
నట్టి కావేరి మధ్యావనిఁ జంద్రుండు
హరిఁ గూర్చి విరతుఁడగుచు ఘోర

తే.గీ. తపము గావింప మురదైత్య దమనుఁ దలఁచి
నీవలె తపంబు గావింప నేర రెవ్వ
రనుచుఁ బ్రత్యక్షమైన యబ్జాత్మునకు న
మస్కృతులు సన్నుతులు సేసి మహితభక్తి.

కం. నా పేరట నెల్లప్పుడు
నీ పుష్కరిణీ వరమ్ము నింపొందంగా
నో పరమపురుష! వరమీ
వే, పూనిక నిచట నిల్వవే యన వేడ్కన్,

వ. అట్లయని వరంబొసంగి యంతర్హితుండయ్యె నంతకుమున్న—

మ. తప మిట్లుంగని బ్రహ్మదేవుఁడు గురంధామున్ సదా పూజ నా
ద్యపరబ్రాహ్మ్యులఁ దృప్తుఁజేసి యతఁడెంతే వేడ్క నిక్ష్వాకు పన్
నృపతి శ్రేష్ఠున కిచ్చెఁ దత్కులజులా నీరేజపత్రాక్షు న
చ్చపు భక్తిన్ భజియింప రాఘవుఁడు తచ్చారిత్ర సంయుక్తుఁడై,

కం. పూజలు సేయుచు దానవ
రాజైన విభీషణునకు రమణనొసంగెన్
దేజోధనుఁడా నెల్ల మ
హాజను వనమాలి గొంచు నురుతరభక్తిన్.

కం. లంకకుఁ బోవఁగఁగని యా
పంకజనయనుండు లేమి భారతవర్షం
బింక వసలే దనుచు గరు
డాంకుని హరినెంచి రంత నమరులు మునులున్.

సీ. అంత విభీషణుఁడా శౌరిఁ దెచ్చుట
ధర్మపర్వఁ దెలిసి తా నెదురుగఁ
జని సహ్యజా మధ్యసైకత వాసుని
గావించి యర్చనల్ పావనాన్న
పాన నైవేద్యముల్ గూనితగతిఁ జేయ
నా రాత్రియుండి దైత్యాధినేత
మఱునాఁడు నెజ్జ సంభ్రమమున నెత్తఁబోఁ
గా వేరియున్ శీతకరుఁడు ధర్మ

వర్మయాను వేఁడు వరములు పేర్మి సురల
తలఁపఁ బరికించి శ్రీరంగధాముఁ డచట
నిలచి తరలక చెంత చింతిలెడు దైత్య
విభుని నూఱడఁ బల్కుచు వేడ్కతోడ.

ఉ. అంత మురాంతకుండు దనుజాధిపు నిత్యను గొల్వవచ్చు న
ట్లెంతయు వేడ్కతోననిచి యేపున నచ్చటి ధర్మవర్మకున్
సంతసమొప్ప నస్యశుభసౌఖ్యము లిచ్చి సమస్తలోకులున్
మంతుకు నెక్కి నేఁపల సముంచితభక్తి భజింపఁ ద్రిరేన్.

కం. శ్రీరంగ రంగ యని మన
సారంగఁ దలంచు జనుల నమరగఁ బ్రోచున్
సారంగ వరదుఁ డగు నా
శ్రీరంగవిభుండు విబుధ సేవితుఁ డగుచున్.

కం. క్షేత్ర ప్రదక్షిణా ధ్వర
వ్రత స్థిరతీర్థ నపకలిందు గదమునో ?
మిత్ర స్వర్ణాంగులు
హరి చిత్రాకృతు లగుదురందుఁ దెలు వెసఁగంగన్.

సీ. ధరణి సోమకులుండు ధర్మకేతనుఁ డందు
నపవర్గమొందె రంగార్చనమున
గ్రామయాచక పాతకత బతితుం డొక
విప్రుండు మృతుఁడైన వేడ్కవాని
వెలఁది జారిణియైన ఏతసద్గుణుఁ డొక్కఁ
డుదయించి ప్రముచ్చునై యర్వియందుఁ
దిరుగుచు రంగమందిరముఁ గన్గొని స్వామి
సొమ్ములు దొంగిలఁ జూచి తోడి

తే.గీ. దొంగలును దాను డిగ్గ్రయఁ దొంగి గుఱుతు
లమర రంగాధిపునిఁ జూచి యటఁ బ్రసాద
మొనర భుజియించి తతివేచికొని కవేర
కన్యకా పులినోర్వి దాఁగంగ నంత.

ఉ. వెల్లువ వచ్చి చుట్టుకొని వేగమునన్ బలునీఁట ముంచినన్
గల్లరి దేహముల్ విడిచి కమ్రవిమానగులై ఖగంబులం
దెల్ల సుఖంబు లం గనఁగ నింపుగ వారలకిచ్చె నంత శ్రీ
వల్లభుఁ డాత్మ దివ్యపదవాసము భాసుర సార సత్కృపన్.

ఆ.వె. బంధుమంతుఁ డనెడి పార్థివుఁడటఁ బూర్వ
భవమునందు విష్ణుభవన మార్జ
నంబు సేయు ఫలమునఁ జక్రవర్తియై
రంగభూమి సౌఖ్యరమ వరించె.

కం. కావేరి విరజ రంగము
శ్రీ వైకుంఠంబు దలఁప శ్రీరంగ విభుం
డా వాసుదేవుఁ డతనికి
నా వాసంబైన సెజ్జ యా ప్రణవ మిలన్.

కం. ద్వీపాంతర దేశాంతరు
లౌపాతకులైనఁ దద్దిశాభిముఖ శుభ
వ్యాపారగులై మ్రొక్కఁ ద
యా పరుఁడగు రంగభర్త యభిమత మొసఁగున్.

తే.గీ. చంద్రపుష్కరిణీ సహ్యజా నిమజ్జ
నముల జనకోటి కన్యతీర్థములు దలఁచు
టఘము లీ రెంట నొట్టి తీర్థాళినైనఁ
దలఁపఁ బుణ్యంబులొదవు నుదారమహిమ.

కం. ధారుణి నరుఁడై పుట్టియు
శ్రీరంగనివాసు శేషశిఖరి నివాసున్
జేరి భజింపక యుండిన
నారకపుఁ డతఁడు కొన్నినాళ్లకు నైనన్

కం. పుట్టుగ నెచ్చట దానముఁ
బట్టిన నఘమొదవు రంగపతి నిలయమునన్
బట్టిన నిచ్చినఁ బుణ్యము
గట్టిగ లభియించు జన నికరమున కెల్లన్.

సీ. హరిఁగూర్చి చంద్రుఁ డత్యంత తపమ్ము గా
వించిన గురుశాప వికల మణఁగ
నిజ శంఖతీర్థము నీరజారి శిరమ్ము
పైఁ జల్లి శాంతి శ్రీపతి యొసంగు
నది శంఖతీర్థమా నిటఁ గ్రుంక నీరు లొందు
నని శ్రీనివాసుఁ డయ్యవని నిల్వ
తత్పుర శ్రీనివాస క్షేత్రమున సహ్య
కన్య దక్షిణతటగరము కొలఁది

తే.గీ. మున్ను రాముడు నా తీర్థమునను గ్రుంకి
సర్వసర్వంసహాభార చరితులైరి
సంయమీశ్వరు లట శేషసరసి యందుఁ
దపము గావించి యెంతయు ధన్యులైరి.

కం. ఉద్దాలకుఁడున్ శంఖుఁడు
నద్దనుజారాతిఁ గొల్చి రహరహమును న
య్యుద్ధిక నిరుపార్శ్వములన్
దద్దయుఁ గావేరి ప్రబలత న్ప్రవహించెన్.

కం. ఆపూర్ణశాంతరూప
శ్రీ పటిమన్ మిగుల వెలసె శ్రీరంగపురిన్
దీపించు భక్తవత్సలుఁ
డై పూర్ణస్వామి దేవతావళి గొల్వన్.

తే.గీ. వైభవాన్వితమైనట్టి వ్యాఘ్ర నగరిఁ
బంకజాక్షుండు దగు మహాబాహుఁ డనఁగ
మిగులఁ జెలువగు నాకాశ నగరభూమి
మురవిదారి చెలంగు శ్రీ హరి యనంగ.

సీ. వారక యుత్పలావర్తంబునన్ శౌరి
మణి కూటమున నుండు మణివిభుండు
భక్తస్థలంబున భక్తిప్రధానుండు
మెఱయుఁ గృష్ణక్షేత్ర సరణి విష్ణుఁ
డౌనరు శ్వేతహ్రదంబున శాంతమూర్తియు
రహి నగ్నినగరి సురప్రియుండు
వైకుంఠమున మాధవస్వామి పురుషోత్త
మమున భక్తసఖుండు నమరియుండు

తే.గీ భార్గవస్థానమున నుండు భర్గుఁడనఁగఁ
జక్రతీర్థమునన్ సుదర్శనుఁడు నంది
పురి మహానంది కృష్ణతుల్యా రుచిర ధరఁ
దగు మహావిష్ణుఁడెంతయు ధన్యలీల,

శా. కావేరీ తటినీ తటమ్మున జగత్కల్యాణదంబై మహా
త్మై వెల్గొందు రథంబునై సకలదివ్యశ్రేణి కీర్తింపగాఁ
బ్రాశస్త్య స్థితి శార్ఙ్గపాణి వెలయున్ భూపాధిప స్తుత్య ని
త్యావాసంబగు కుంభకోణమున భక్తానంద సంధాయియై.

తే.గీ. చక్రపాణియు నాఁగ నచ్చటనె వెలఁగు
గంగ తనయందుఁ డిందు పుష్కరంబు లడఁగ
నచటి తీర్థంబునకు పుష్కరనిన, నచటి
మహిమ లిఁక వేఱె చెప్పెడి మాటలేల !

కం. ఇతరస్థలముల పాపము
లతులిత పుణ్యస్థలముల నడఁగు నచటి విన్
ధృతిఁబాయుఁ గాశిలోపల
చ్యుతమగు నది కుంభకోణ శుభతీర్థమునన్.

తే.గీ. అందుఁ గుంభేశ విశ్వేశులాది గాఁగ
నైదు శంభునివాసములమరు నచటి
స్నానపానంబు లిహపరసాధకములు
శార్ఙ్గపాణి పదార్చన జన్మఫలము.

సీ. శ్రీరంగనిలయమ్ము చెంత నుత్తరమున
నుత మునుఁ డనఁగడు నొప్పమీఱు
విలసితమగు కపిస్థల పుణ్యభూమిని
గూర్మిని గజరక్షకుండు వెలయు
పాండవ బగుపట్టి పార్థస్థలంబున
వెలఁగు పుత్యాకారుఁడలఘు మూర్తి
చిత్రకూటమ్మున శివనాట్యవీక్షణ
రహిఁబొల్చు గోవిందరాజ శౌరి

తే.గీ. విబుధసంసేవ్య మైనట్టి వృషపురమున
శ్రీమహితుఁడా వృషాశ్రయ స్వామి వెలయు
సంగమ గ్రామసీమ నసంగుఁ డమరుఁ
జారుమణి మంటపమున సుల్లారి యుండు.

కం. సింహక్షేత్రమున మహా
సింహంబు శరణమున దనుజసింధుర విదళ
త్సింహుఁడు శరణాఖ్యుఁడు ఘో
రాంహోదూర ప్రసిద్ధి నతిశయ మందున్

కం. శ్రీరతి నిబిడన్ నిబిడా
కారుఁడు ధాన్యపురి జగత్పతి గోష్ఠా
గారత గోపతి కురుకన్ ?
శ్రీ రమణీపతి వసించుఁ జిరతర మహిమన్.

మ. అతిలోకోజ్జ్వల సుందరేశ్వరుఁడు మీనాక్షీ సహాయస్థితిన్
కృతమాలానది చెంత సంతతము తాన్ గీర్తింపఁగా సుందరా
స్వితరూపమ్మున సుందరుండనఁ దగున్ నీరేజమిత్రాత్మజాం
చితదిక్ప్రస్ఫుటమైన యట్టి మధురన్ శ్రీ భూసతీసేవ్యుఁడై

తే.గీ. దక్షిణోదధి చెంగట పర్ణశయన
భూమిశయనాఖ్య మెసఁగ సంపూర్ణమహిమ
నఖిలలోక మనోభీష్టదాతి మహిత
దక్షుఁడై నట్టి శ్రీవత్సవక్షుఁ డమరు

కం. భ్రమరంబున శౌరియనా
నమరుఁ గురంగమునఁ బూర్ణుఁడనఁ జెలువొందున్
విమలతటిస్థలి విష్ణు
డు మహార్తిన్ గాలమేఘుఁడున్ జెలువొందున్

తే.గీ. పొలుచు వృషభాద్రిపై మహాపుణ్యుఁడనఁగ
సంజ్ఞకం పరమస్వామి సంజ్ఞఁ దనరు
మంగళాకమున ధన్వినా మహిమ మీఱు
క్షుద్రమత్యంతరమున నమ్యుతుఁడు మెఱయు.

కం. శ్రీమద్ద్వారంబున నా
తామరసదళాక్షుఁడమరు దామోదరుఁడు
శ్రీమహిమన్ గుణనాథుఁడు
నా మహితాకృతి వహించి నతముని జనుఁడై.

సీ. కౌండిన్యుఁడను విప్రు కాంత సుశీల యా
పద్మనాభ వ్రత పటిమ సల్పి
సకల సద్భూషణ జాలముల్ దాల్చి కాఁ
పురము సేయఁగ గర్వమునఁ దదంగ
మైన సూత్రంబేల ననుచుఁ దత్పతి సతి
సందిటఁ దగు నది సడలఁదీసి
యగ్నిలోఁ బడవేయ నంగన పగనొంది
కడువేగఁ దిగిచి తాఁ గైకొనుటయును

ఆ.వె. సతని సిరులు దొలఁగె నయ్యనంతాత్మక
ఖమున నది దొలఁగి భ్రమసి ద్విజుఁడు
పరగ నే ననంత పద్మనాభునిఁ గాంతు
ననుచు నిల్లు వెడలి చనిచని యడవి.

కం. చనిచని దక్షిణముఖుఁడై
వెనుబడలిక నరుగుచున్న పృథివీసురునకున్
ఘనుఁడైన యయ్యనంతుం
డనువొందఁగ వృద్ధవిప్రుఁడై కనఁబడెన్.

కం. కనుపట్టి భక్తసులభుఁడు
గనకఁ బెన దరిద్రమెల్లఁ గడ తొలఁగంగాఁ
దన నిజరూపముఁ జూపిన
వినుతించెన్ ద్విజుఁడు వేయు విధముల భక్తిన్.

వ. ఆ విప్రుని యంసమ్మున నిజకరతలం బభయప్రదానంబుగా నిడి పల్కించె నదియాద్యనంతరంగ, నతనికిమ్ముస్స విప్రరూపంబునం గనఁబట్టిన యెడ భోగానంతంబర్యా, నమ్మహిమ దెలియంగ నంగజహర సరసీజాసనుల కలవియగునే! తామ్రపర్ణీతటంబున నిట్ల నంతశయనుఁ డమరె నని—

కం. పులహుఁడు భీష్మునితోడ
జలజాక్షనివాస విభవ సన్మహిమంబుల్
తెలిపి శిష్టులగరిమల
విలసితమతి వినుతించు వేడుక నలరున్,

సీ. పంచతత్త్వంబులుఁ బంచపవనంబులు
నై దరణ్యంబులు నా(ది)గాఁగ
గణుతికి మిగుల శంకర నిలయంబులు
గలవందుఁ గాశి శ్రీకంఠు జీవ
మితరమౌ దేశము, లెల్లఁ దద్దేహమ్ము
లెన్నఁడు లయమొందకున్న కతన
నవిముక్త నగరమ్ము, నానందవనము మ
హా స్మశానంబు శివాలయంబు

తే.గీ. ననఁగఁ దనరు పంచక్రోశ మమితవిభవ
మచట మృతిఁ జెందు క్రిమికీటకాది జంతు
వులకుఁ దారకమనువు శివుండొసంగి
రుచిర శుభతర నైజసారూప్య మిచ్చు.

కం. ఆ పంచక్రోశధరా
వ్యాపకమౌ తీర్థనికర మభవుని మూర్తుల్
దూపట్టు నసంఖ్యములై
పాపహరము లఖిలలోకపావన మగుచున్.

ఉ. భైరవమూర్తి యై శివుఁడు పంచశిరస్సుల లోన నొండు దో
స్సారతఁ ద్రుంచి తత్కలుషశాంతికి నందు మెలంగి చేరఁగన్
మీరెడు బిందుమాధవ సమీపముఁ జెంది తదీయ దీక్షచేఁ
దీఱెఁ గపాలతీర్థమున దేవనదీతట సీమనొప్పఁగన్.

వ. అట్టి కాశీస్థలంబున లోలార్క కేశవబిందుమాధవుల నివాసమహిమలు ననేక తీర్థంబులుం గలవు. గంగాప్రవాహం బుత్తరవాహినియగుట సకల లోకోత్కృష్టం బగు చుండియు—

శా. కేదారం బతిపుణ్యతీర్థవర సంకేతంబు తత్స్నాన స
మ్మోద స్వాంతులు తృప్తిఁ జెందుదురు సంపూర్ణ ప్రభారాశికిన్
బాదై యచ్చటి మంచుఁగొండఁ గనుచున్ బాలేందు చూడుండు క్రి
వ్యాదామిత్రసురుల్ తనుం బొగడ తేపం బొల్చు వాత్సల్యతన్.

ఉ. సూరనుతా ప్రవంతిదరి సోమశిఖామణి యుండు సర్వదా
తీరయుగమ్ము నందు మునిదేవనికాయము లాశ్రయింపఁగా
గౌరియుఁ దానుఁ బెక్కుదలఁ గాలగళుండు వసించు నెంతయున్
గౌరవలీలఁ దన్మహిమ కంజభవుండు నుతింప నింపుగన్.

సీ. గోదావరీ జన్మకుతలమ్మునన్ త్ర్యంబ
కుఁడు ధర్మపురియందుఁ గుంకి రామ
లింగంబు కల్యాణ రంగస్థలిన్ గేత
కులు నాగవల్లులు నెలమిఁ బూజ
సలుప నాసంగమేశ్వరుఁడనఁ జెలువొందు
సప్త గోదావరీ సారభూమిఁ
దనరు ద్రాక్షారామమున భీమలింగంబు
నతి పాతకములు పుణ్యములుగఁ జేయు

తే.గీ. కృష్ణవేణీ తటమ్మునఁ గృపదలిర్ప
నమరు నమరేశ్వరుండు మహావిభూతిఁ,
దత్తటమ్మున శ్రీగిరి తనరు శిఖర
దర్శనమ్మున మోక్షప్రదాయి యగుచు.

కం. అచ్చటిస్నానము దానము
లచ్చయ ఫలదములు పావకోజ్జ్వలులనురుల్
సచ్చరితులు మునులా శివు
నచ్చపు భక్తిన్ భజింతు రంచితమతులై॥

కం. తన నీటఁ గ్రుంకువారల
ఘనదురితము లెల్లఁ బుణ్యగణములుగావే
నొనరించుఁ గృష్ణ యచ్చట
ననుపుగఁ బాతాళగంగ యన ననుపమయై.

కం. ఏ రాజు పేరుదలఁచిన
ఘోరాఘములణఁగు రాజకులయశశ్రియా
శ్రీరాముఁడు నారాయణ
సారాంశభవుఁడు నిజానుజ సహితుఁడగుచున్,

సీ. తుంగభద్రాతీర తుంగభూమిస్థు మ
తంగునిఁ గాంచి సాష్టాంగ మొరఁగి
యుష్మన్నివాసాశ్రమోచిత మగుట నీ
తటిని పుణ్య ఫలప్రదాయి తలఁప
నిచటి మహాత్మ్యము లెఱిఁగింపు మనపుడు
రాముని (తో) ముని రాజు పల్కె
ప్రేమ నీనదిఁ గ్రుంకఁ బితరులు దాన స
త్పుణ్య లోకావాప్తిఁ బొలుచు మనుజ.

ఆ. వె. దమరులెల్లమున్ను హరుఁజూడఁగాఁ గోరి
తపము లిచట నేయ స్థాణుఁ డమిత
రూపగతులఁ దోఁప రూఢి నిట్లనయంపు
మనుచు సురలు వేఁడు టిష్టమూర్తి.

కం. ఎనిమిది రూపము లమరఁగ
గనుపట్టెన్ బ్రహ్మశిలను గమలాసనుఁడున్
సనకాదులు నిగమోక్తుల
మునుపచ్చటఁ బొగడినట్టి ముఖ్యాహ్వయతన్.

తే. గీ. శంకర స్థలవాసు విశ్వజన సేవ్యు
న వ్విరూపాక్షు సేవించి యభినుతించు
వారల పవర్గ సురుచిరావాసు లరయ
... ... ... ...

కం. సురలెల్ల వరములడిగిరి
చిరకాలంబచట నున్కి సేయఁగ హరుఁడున్
ధరనే రాముఁడ నర్యాద
తరుచర పతులగుడు మీరు దశముఖ వధకున్.

చం. అని వరమిచ్చి భూతపతి యాతఁడె నీ నిపల్కి క్రమ్మఱన్
మునిపతి రాముతో నని యా మున్ను వసిష్ఠుఁడు దేవతాలినం
దనుఁడు తపంబుచేసి రిటఁ బాసమొనర్చినఁ గోటి శంకరున్
స్మరహరుఁ ద్రిలోచనుం గవిన శంకరరూపము గాంతు రెవ్వరున్.

వ. అని మునిపతి జనకునకు తెలియంగించిన నతండు నచ్చటి కోటిశంకర విరూపాక్ష బ్రహ్మలింగంబుల దర్శించెనని పులకలుంచు వెండియు శాంతనవున కిట్లనియె.

కం. ఆతత కృష్ణా తటినీ
జాతాంచద్దేశ సహ్యశైలాగ్రనిఁ బ్ర
ఖ్యాతమగు మహాబల శివుఁ
డా తరుణేందుధరుఁ జూడ నమరు శుభమ్ముల్.

కం. ఏక శిలా నగరమ్మున
బ్రాకటముగ స్పర్శవేది భాసం బమరెన్
శ్రీకంఠుఁడు శంభుఁడు లిం
గా కృతి విలసిల్లు నే వరుఁడగుచున్.

ఆ. వె. నంది కొండ నైదు నదులు పినాకినీ
వ్యాయము క్షీరనదియుఁ దగు సువర్ణ
ముఖరి పాపనదియుఁ బొడమి తత్తటములఁ
బెక్కు శివునియున్కి లెక్కకలర.

కం. సంగమ కోటీశ్వరముల
రంగగు పుష్పగిరియందు రహిమాలస్థా
నాంగణ మున నుత్తర ది
క్సంగ పినాకినిదరిన్ వృషధ్వజుఁడుండున్.

ఆ. వె. ముదముతో సువర్ణముఖరి యుత్తర వాహి
ని యగు నచటఁ గాశి క్రియఁ దలిర్చు
శ్రీకాళహస్తియందు లీల సోమాద్రిని
వెలయు శివుఁడు భక్త సులభుఁడగుచు.

కం. పాలేటిగట్టునన్ బటు
హాలాహలగళుఁడు మునుల యాశ్రమములనం
లీల విరించి పురంబునఁ
బ్రోలుచు మేలైన బిల్వపురమున నుండున్.

కం. సిద్ధిద మగు ఋషివింధ్యము
సిద్ధాచల ముఖ్య హరని వేశంబులునున్
శుద్ధమగు దక్షిణాశా
విద్ధ పినాకిని సమీపవిపుల స్వాలయముల్.

సీ. నైమిశారణ్య పుణ్యక్షేత్రమునను వే
దారణ్యమున దండకాటవి యెడ,
కంటకారణ్య ముఖపుణ్యభూముల
హరుఁడు వసించు మహా మహిమను
బేర్మి ఛాయావన బిల్వ వాశీర
చిరబిల్వ తాళవిశేష వనుల
దర్శించు జనుల పాతకము లణంచుచు
శితికంఠుఁ డుండు భాసిత నిరూఢి.

తే.గీ. మధురలో సుందరేశ్వర మహితమూర్తి
సరవి దక్షిణకాశి విశ్వపతి తంజ
పురిని బృహదీశ్వరుండు సొంపుగ హరిహర
సముఁడు శంకర నారాయణమున నుండు.

ఆ.వె. సహ్యగిరి నగస్త్య సంయమి తపము గా
వించి తామ్రపర్ణి వెంటఁ గొనుచు
మనికియైన మలయమున గుప్తగామిగా
నొనరఁజేసి పొదమునఁ జెలంగె.

చం. అదియు నిజాంబుపూరముల నాదటఁ దామ్రముఁ బుట్టఁ జేయుచున్
బొదలి సముద్రుఁ జేరు నెడ ముత్తెము బుట్టఁగఁ జేయు తత్తటా
స్పద శివమందిరాళు లసంఖ్యము లెన్నఁగరాదు నేరి క
భ్యుదయ మహామహత్త్వము లపూర్వము లాయత తచ్చరిత్రముల్.

కం. వేదగిరి పక్షితీర్థం
బాదట నిజమహిమ తెలియ హరుఁడిం పొందున్
శ్రీ దనరు వేంకటాద్రిన్
బాదుగఁ గపిలేశ్వరుండు ప్రస్ఫుటలీలన్.

సీ. అనిల తత్త్వము కాళహస్తి జ్ఞాన ప్రసూ
నాంబాధిపతి యుండు నచట నెపుడు
నగ్ని తత్త్వంబగు నరుణాచలం బాది
తత్త్వంబు కాంచి సదాశివగృహ,

మఱి పురమ్మును గేశవాలయమును ద్రిమూ
ర్త్యావాసమును జగద్వ్యాప మఖిల
సిద్ధిద లయకాల చిత్కామ పీఠ త
పోమయ తుండీర పురములు దగు

మహిమఁ గన్యా తిరిష్ఠ ? నామమును బదియు
రెండు పేరులఁ జెలువగు పృథివిసతికి
మూర్ధ కేదారమును గనుబొమల నడుము
కాశి, యోనిప్రదేశమై కాంచి మెఱయు.

ఆ. వె. సహ్యగిరి జనించి శంఖమాలాన్విత
జలధిఁ దరియఁ జొచ్చి కలియుఁదనుక
నఖిల దేశ తాగ్రహార పుణ్యస్థలా
ధార నిరతిదగుఁ గవేరకన్య.

శా. ఆ కావేరి తటమ్మునన్ను ధరాధ్యక్షుండు రాముండు సీ
తాకాంతానుజ యుక్తుఁడై యనల తీర్థంబొప్పఁ గావించె వి
ద్యాకౌతూహలురై మునింగి రట సద్యద్బ్రహ్మ విజ్ఞాన ని
ష్ఠా కాంక్షన్ వసియించు మర్త్యులు రమేశస్థానవాసుల్ తగన్.

సీ. దనుజు విభీషణుం గని రాముఁడిట్లను
దశముఖ సాంగత్యతత దురితము
లణఁగ నిచ్చటఁ గ్రుంకుమా యగస్త్య వినిర్మి
తం బైన కావేరి దానధర్మ
ములు కోటి గుణితమౌ ఫలిత మిచ్చునటన్న
నెలమితో నతఁడు కపులును మునులు
స్నాన దానమ్ముల ఘనానుతులైరట్లు
నట నిజాలక్ష్మణుఁడా చరించి

తే.గీ. రంత గౌతమ పులహ సంయములు గొ...పఁ
గలశజుఁడు నచ్చటయుఁ బూజలఁ గరింప
న య్యగస్త్యుఁడు నుతియించి యనఘు రామ
చంద్రుతో నిట్టులను మృదు చతురఫణితి.

ఉ. ఓ పృథ్విపాలి రాజపు వివేకివి వేల్పవు కర్తవైనచో,
గో ద్విజపక్షు నేయ మిలఁ గ్రూరత రాసుర మర్దన క్రియా
దీప్త మహోఘముల్ తొలఁగు ధీవినుతా,! యన నట్లు చేసె ధా
తృ ప్రముఖామరుల్ పొగడ దేవమయుండగు రాముఁడచ్చటన్.

తే. గీ. అట్లు గాయత్రిశిల మున్న యాత్రఁ జేసి
యచటి మునులఁ బూజించి యవని విభుఁడు
దనరు కావేరి దక్షిణోత్తరతటముల
ననుజుఁడును దాను వేర్వేఱ నభవు నునిచి.

సీ. మున్ను దైత్యులు కపుల్ గోత్రపసవ మొనర్చి
హరుఁ బూజ నేసి కృతార్థు లైరి
యపు డగస్త్యుఁడు రాఘవాధిప! ప్రఖ్యాత
ఘాఘుత్ము వో బ్రహ్మ యనుచు నింద్రుఁ
డమల గాయత్రీ శిలాగ్ర జపమ్ముచేఁ
గావేరిఁ గ్రుంకుడు పాపనతను
దత్పాప మెడఁబాసి తగ స్వర్గపాలన
మహిమచే సుజనైకమాన్యుఁ డయ్యె.

ఆ. వె. ననుచుఁ బల్కి రాముని యయోధ్యకుఁ బంపి
స్నాన జపములచటఁ దాను మునులు
నాచరించి పుణ్యులై వెండియును రాముఁ
గాంచి రతని పురిని గౌరవమున.

ఉ. అనది చెంత నర్కుఁడు మహాతపముం శివుఁ గూర్చి సేయుచో
నానతవత్సలుండు భవుఁ డబ్జ (సఖా ?) కరమిత్తునన్నఁ ద
ద్ధ్యానుఁడు బ్రహ్మరుద్రహరిభావను వేదమయత్వ మాత్మ ధా
మానుభ పావనీ? జన సమాజ కృతార్థతయప్డు వేఁడినన్.

ఆ. వె. హరుఁడు నట్టిపరము లర్కుని కొసఁగి దా
కర్మసాధ సానుకరణ నచట
నర్క పుష్కరిణి తటావనిఁ గావేరి
దరి నసించె మునికదంబ మలర.

వ. సకలమునులచటఁ గ్రతువులాచరించుటం జేసి తత్ప్రష్టంబులు రాసులై యున్నవి. అవి ధరించిన మహాపాతకములడంగు.

కం. కావేర్యుత్తర తటమునఁ
బావన హైమవతి గలియు ప్రాంతమునఁ దప
శ్శ్రీ వెలయు కణ్వమునివరు
నీ విను తాశ్రమము పొల్చు దివ్యాకరమై.

సీ. వ్యాఘ్రకేతుఁడు హైమవతి పురంబేలుచు
నగస్త్యర్కకుండ మధ్యావనీ స్థ
లంబునఁ జాల యజ్ఞంబులు సేయుచుఁ
గణ్వుని కేనూఱు గ్రామములను
దక్షిణ యొసఁగ నాథన్యుఁడు తన ప్రియ
శిష్యుని నధికారిఁ జేయ నతఁడు
దమ నాముఁడాబ్రహ్మ (తతి !) ంచిన మునర్చి
యల్పకాలమ్మున యముని జేర

ఆ.వె. చెక్కు నిరయగతులఁ జిక్కి బ్రహ్మసురుఁ
డగుచు నంత కృమిరూఁడై జనించి
కణ్వముని యున్కి కడఁ గల్గు కావేరి
మునికిని పూర్వ జన్మముల నెఱింగి.

చం. ఘనుఁడగు కణ్వమౌని పదకంజములన్ బ్రణమిల్లి కావవే
యన, నతఁడన్నియుం దెలిసె నైనను శూద్రుఁడ వీ కవేర క
న్య నొసఁగు నీటఁ గ్రుంకి శివునర్చనచేసి ప్రదక్షిణాళి వం
దనములు సల్పనీ కలుషతాపము లెల్ల నటంచుఁ బల్కినన్.

తే.గీ. వాఁడు నట్టుల యేనేండ్లు కామదేవుఁ
బూని పూజించి కావేరిఁ దానమాడి
యంతఁ బ్రమథులు సేవింప నభవుఁజెందె
కణ్వముని నెంచి తత్కృపా కలన వలన.

ఆ.వె. అగ్నిదత్తుఁడనెడి యవనిసురుం డందుఁ
గ్రమము తోడఁ దర్పణములు సేయ
ముక్తి కర్గెనంచు మొనసి తత్పితరులు
చనిరి మోక్షమునకు ఘనత మెఱయ.

సీ. అది కణ్వముని భూమి యందుకుఁ జెంగట
వెలయఁ గావేరితోఁ గలసెఁ గపిల
కపిల కోరికలిచ్చుఁ గావేరి యఘ హారి
తలఁచిన ముక్తి ప్రదంబగు నట
హరిహర బ్రహ్మాదు లమరులు మును లుందు
రచ్చోటఁ దపమున యజ్ఞభర్త
తనదుఁడై శివసఖిత్వమునందె నయ్యాగ
యాజ్ఞవల్క్యుని సుతుఁడైన చంద్ర

తే.గీ. కాంతి విజయ మహామేధ లంతకారి
గుణిచి తప మొనరించి శంకరుఁడు పరము
లడుగఁ దన మోక్ష మిమ్మని యధిక కఠిన
భాషులై వేఁడుటయుఁ బశుపతి కడంక.

కం. పదునాల్గువేల శిష్యులు
పదపడి మీరిపుట ననుభవము లొదవఁ గాఁ
గదనమున మడిసి తుదఁ గనుఁ
డ దురితచరితమునఁ దనరి యపవర్గమ్ముల్.

కం. అన వారలు ఖరదూషణు
లును త్రిశిరస్కుండు శిష్యులున్ దైత్యులునై
యినకులుఁడు దునుమ మోక్షము
గని రామేశ్వరుఁ గవేరకన్యక చెంతన్.

గీ. దర్పకారి మరుద్వృద్ధిఁ [illegible] దా దక్షిణమున
మూఁడు గిరులఁ బ్రతిష్ఠించి పూజ సల్పి
రవియు శ్రీరంగ సామీప్యమైన భూమి
రత్నగిరి తూర్పుదెసను విరాజితముగ.

కం. ఈశాన భాగ నేశము
లాశంకరు నిలయములు మహాశుభదంబుల్
కాశిఁ దోఁడై నగు వి
శ్వేశ నివాసములు కాని హితఫలదములై.

కం. కుశలింగము సంవర్తక
పశుపతియును నిఖిలపూజ్య భానురచర్యల్
విశదమగు గజారణ్యపు
నిశాకరమకుటుని సేవ నియతఫలమగున్.

సీ. శ్రీరంగభూమికిఁ దూరుపుదెస నుంచి
కావేరి శతవిధగతులఁ బ్రబల
నప్పు తత్త్వము శోభనాకరంబై యొప్పు
జంబూసహితమైన జంబుకేశ్వ
రం బపవర్గమయంబైన కుంభేశ
ధామంబు పంచనదంబు బ్రహ్మ
హత్యా ఘహరణ విఖ్యాతి మధ్యార్జున
మొప్పగు మాయూరపురము సిరుల

తే.గీ. వెలయు శ్రీ పంచముఖ హర నిలయములును
భోగమోక్ష ఫలప్రద పుణ్యమయము
లభ్రపురిఁ గల్గు సభఁజూచినంతఁ బొసఁగు
నిహపర సుఖమ్ము లెవ్వరికేనియైన.

తే.గీ. శంఖముఖియనఁ గావేరి జలధిఁ గలియు
నెడలఁ దనరొత్తు హైమవతీశ్వరుండు
మఱియుఁ గావేరి తటమున నిరవుకైన
హరుని నిలయము లవి పెక్కు సురుచిరములు.

కం. ధరణీ జలా నలా నిల
సురవర్త్మ ప్రకటతత్త్వ శోభితములు ను
ర్వరఁ గాంచి, జంబుకేశ్వర
మరుణాద్రియుఁ గాళహస్తి యంబరపురముల్.

తే.గీ. కాశిఁ గాంచిని మధురఁ బ్రకాశలీల
నన్నపూర్ణా విశాలాక్షి యాశ్రితావ
నాతి మతియైన కామాక్షి ఖ్యాత రూప
వతి మహోన్నతి మీనాక్షి యతిశయిల్లు.

కం. జ్ఞానప్రసవాంబయు స
న్మానిత మూకాంబ యధిక మహిమన్ విద్యా
దానాస్పద భ్రమరాంబయు
భూనుతి నంబాత్రయంబు పొలుపుగు మిగులన్.

వ. పశ్చిమ దక్షిణ జలధి తీరంబుల నదరూప కావేరీ తటంబులను గోకర్ణ శంకర నారాయణాద్యనేక దేవస్థలంబులు గలవవి యధిక ఫలప్రదములగు మఱియును.

కం. ధర సుబ్రహ్మణ్యంబునఁ
గర మర్థిన్ స్వామిమలను గల్హార గిరిన్
సరసపు మహిమన్వేలయున్
వరుసఁ గుమారత్రయమ్ము వర్ణింపంగన్.

వ. అని తెల్పిన సూతుం గనుంగొని మునులు డమరుక త్రిశూలపాణి యగు త్రిలోచనుం డుమాపతి లింగాకృతి న్వసించుటకుఁ గారణం బెఱింగింపుమనిన, నక్కథికుం డిట్లనియె.

తే.గీ. దారుకావన మౌనీంద్ర దారకామి
తైన వృషవాహనుని శేఫమవనిఁ బడఁగ
నపటి మునులెల్ల శపియింపనభవు శక్తి
యూతముగా నది ధరఁబడె నతులగతిని.

చం. కనుఁగొని విన్ననై మునినికాయముపైఁ గినియంగ లేక ప్ర
సన్నన నిజమూర్తి నంతయు ఘనమ్ముగ లింగమునందుఁ జేర్చి శం
భునిఁ గని బ్రహ్మ విష్ణు మునిపుంగవ శక్రసురాళి వేఁడి కో
లనువుగఁ బూర్వపర్వ నగజాధిపుఁడుండఁగఁ జేసి యమ్మ్యోడన్.

మ. హరుఁడా లింగమునందుఁ బొందొనరఁగా నాత్మీయతేజమ్ము ని
ర్భర మోహమ్ము వహించియుంచుటు, హరి బ్రహ్మేంద్రులు న్మానులున్
ధర నీ యాకృతినుండు నీశ్వరుఁడు భక్తశ్రేణి యర్చింప సు
స్థిర సౌఖ్యమ్ము లభీష్టముల్ కరుణతోఁ జేకూర్చుచున్ ధీరతన్.

చం. అని ముని కోటి మున్నగ సురాళి సన్నుతి సేయ శంకరుం
డనుపమ లీల ధాత్రి శుభదాధిక పుణ్యనదీ తటమ్ములన్
ఘనుల ధరాధరమ్ములను వ్యష్టి సమష్టుల నిష్ఠ నిల్చెఁ డ
న్గను గానఁ బూజసేసిన సుఖస్థిరులై జను లుల్లసిల్లఁగన్.

తే.గీ. అనఘ ! పార్థివమున వ్యష్టి సమష్టుల
నైన స్ఫటికరత్న మాననీయ
రజత నూత్న హేమ రచిత లింగాకృతిఁ
బూజసేయఁ గల్గు పుణ్య సమితి.

వ॥ అట్టి లింగాకృతిం దగు హరునికి హైమాక మందర మేరు కైలాస గంధమాదనంబులైదు నత్యంత ప్రియకరావాసమ్ములయ్యె, నందు గంధమాదనమ్మున—

ఉ. రాముఁడు రావణుం దునిమి రాజితపుష్పక మెక్కి తమ్ముఁడున్
భూమిజ రాక్షసాద్రిచర ముఖ్యులు గొల్వఁగ వచ్చి ప్రేమతో
నామహి రామలింగము మహాద్భుతవైఖరి నిల్పి వింటిచే
నామికఁ గోటి తీర్థము నయంబుగఁ జేసె శుభప్రదమ్ముగన్.

సీ. అమరుఁ బ్రభాసతీర్థము తిరువదినాల్గు
నందు ధనుష్కోటి యతిశయిల్లు
కోటి తీర్థమ్ము నెక్కుడు ఫలప్రదమగు
కపిసురనామముల్ గల్గు శంభు
లింగముల్ తీర్థముల్ సంగతిఁ బెక్కగు
నట్టి సేతువుఁ జూచినంత ఘోర
పాతకమ్ము లడంగు నాతీర్థములఁ గ్రుంకి
హరుని సేవించిన యట్టి ఘనుల

తే. మహితసుకృతంబు లింతని మట్టుగలదె!
కాశి రామేశ్వరంబు ప్రఖ్యాత మఖిల
సౌఖ్యదమ్ములు మోక్షప్రశస్త పదము
లనుచు సూతుఁడు మునుల కిట్లనియె మఱియు.

చం. వసుమతి నెన్నఁ నీ భరతవర్ష మశేష విశేష పుణ్యదం
బసమ మహోత్సవార్చన కథానుభవాకర మార్యసంగతం
బు సకల వస్తుభోగపరిపూర్ణము కర్మఫల ప్రదాయి యిం
దు సరవిఁ జేయు తత్ఫలము తోడనె చేకుఱు నెక్కుడై తగన్.

సీ. సత్త్వరజస్తమస్సహితులౌ జనములు
సాత్త్వికసాత్త్విక సహితమైన
దేవత్వ మొందఁ గాంతేనిటు సత్కర్మ
మాచరించిన దాన నదియుఁ బొసఁగు
బ్రహ్మవిదాత్ముఁడై పరమేశ్వరునిఁ, గొల్చి
బ్రహ్మపదస్థుఁడై పరఁగవిల్లు
మఱియుఁ గ్రియాయోగ మహనీయ వృత్తిచే
భజియింప ఫలము ప్రాపతియొసంగు

తే.గీ. భాగవత సజ్జనైక సంభాషణముల
స్నాన దాన వ్రతాది విధానములను
హరి హర ప్రతి మార్చనాద్యాగమముల
భరతవర్షజులకు శుభప్రదతు లొందు.

చం. హరిపదసేవ తద్వినుతు లచ్యుతు దివ్యకథానులాపముల్
దొరకనిచోఁ బ్రవిష్టపము దుర్గతి దుర్గతి, విష్ణుకీర్తనం
బరమపదమ్ము గావుతను భారతవర్షము నందుఁబుట్టి త
న్నెఱిఁగి మెలంగకున్న నరులెన్నఁగ వానరముల్ లులాయముల్.

శా. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనఁగాఁ బొటిల్లు వర్ణమ్ములన్
బ్రహ్మద్యంచిత విద్యలన్ వరకళా పారీణ వేదాంగ వి
ద్యాబ్రహ్మజ్ఞాన ధురీణతా విభవతన్ బ్రావీణ్య సద్వైఖరిన్,
బ్రాహ్మణ్యమ్ము జగత్ప్రసిద్ధమగు భూభృద్దేవతాసామ్యమై.

వ॥ చతుర్వర్ణ్యులందు శ్రేష్ఠులగు భూసురుల గోత్రప్రభాషాశ్రమభేదసదాచార క్రమంబులు వినుండు—

సీ. భృగు వీతహవ్యవార్ష్ఠియస విష్ణుః
ర్ధన విరూపాక్ష గౌతమ వసిష్ఠ
శప్నికార్ష్ణిముద వైన్య కణ్వ విశ్వామిత్ర
కశ్యపాగస్త్య మౌద్గల్య హరితు
లత్రి భరద్వాజు లష్టాదశ గణాఢ్యు
లందు దే.తర వత్సాష్టి షేణ
వ్యాఘ్రసైతిశాయన జాబాల్యనూపక
ప్రాచీనయోగివిరోచితవటు

తే.గీ. ఔర్వ జమదగ్ని దేవరాతాప్నవాన
మునులు శ్రీవత్స సావర్ణు లానరు మందుఁ
డా భృగుగణమ్ము సప్తదశానురూఢి
సంఖ్యదగు సంయమీంద్రులు జగతి నాఁడు.

తే.గీ. మాక వాధూల లుపవేద మానయాస్క
వీతహవ్యులు నార్ష్యులు వైతహవ్య
గణము త్ర్యార్షేయ మది యేకగణము ప్రవర
కలియనైడల వివాహముల్ గాదు నేయ.

వ॥ యస్కుఁడు మిత్రుడు వార్ష్ఠియసగణమ్ము

తే.గీ. మసృణభద్రణ త్రసదస్యు మానులు శఠ
శారుకుత్సోపమితులును బాదరాయ
ణౌపగవిసాంత్య కాముకు నరుణ తుండ
సాత్యకులు విష్ణువర్ధనసారగణము
వ॥ అష్టాదంష్ట్రి ముద్గల వృషన్యసులు విరూపాక్షగణమ్ము.

కం. గౌతమయాశ్వలభ్యులు (?)
ప్రాంచిగనాశిజుఁడు కక్షవంతుఁడు బృహదు
క్థాతతులు వామదేవుఁడు
గౌతమమునిగణము లెన్నఁగా ధరయందున్

కం. ధర నాపరద్వసు వరా
శరులు ప్రమదసంకృతీంద్రశకుంతులు మిత్రా
వరుణోపమన్యు కౌండిన
గురు ద్వివతులు పూతి మాషకుఁడు వాసిష్ఠుల్

సీ. అంగిరసుండు మహావయ్యుండు ఋతుఁడు
కపిసంయమి ప్రభుగణము ధరణి
కాత్స్న్యమదుఁడు శునకక్షి శౌనకుఁడును
విదితమ్ముగాఁ గాత్స్న్యమదగణమ్ము
వైన్యుఁడు పార్థుఁడుర్వరగణ మయ్యెను
భృగుగణ కలిత మాగతి నెన్న
మిలి నంగిరుండజామిళుఁడు కణ్వగణమ్ము
నెలమి పృథ్వచ్యుతుం డిధ్మవాహుఁ

తే.గీ. డ య్యగస్త్యగణమ్మగు నవనియందు
కేఫశాండిల్యనీవృశ (?) కృతులు పూలి
మాష పత్సార దేవలఖాను లసితుఁ
డరయఁ గశ్యపగణమునాఁ బరగు ధరణి.

సీ. బాదర బృహదగ్ని బభ్రు లోహితమను
జాలకి చికితులు వాలుకియును
వాపల్గ పను యాజ్ఞవల్క్య కౌశికదేవ
కాలఖవో లూక కామకాయ
నులు దేవరాతుఁడు శలిల శాలంకాయ
శాలావతాగ్నులు ఛందరసుఁడు
నఘమర్ష పూరణ కాత్మక శ్రీమత
పారిథాపక శృంగ పనస జాత

తే.గీ. వైకహవ్యక ధూమ్రముఖ్యా లలధనంజ
యుఁడు రైవత్రిశభుండు కరుండు నూను
కైశిరికులును గాధిజగణము మువ్వ
దెనిమిదగు సంజ్ఞ మునీంద్రు లిద్ధమహిగు.

కం. ముద్గరభర్తాశ్వాంగిర
సద్గురులును దార్క్ష్యనామ సంయమి నరుఁడుఁ గా
మౌద్గల్యగణము వాఁటి ల
సద్గతి నాంగిరసుండు చయ్యనఁ గలియున్

సీ. అంబరీషుఁడు యౌవనాశ్వ కుత్సులు పింగ
దర్భశంభులును మాంధాత హరిత
పరమునిగణము శౌవాశ్వపవిత్రులు
నచనానసాత్రియాలా గరిష్ఠ

యతిథియు నత్రిగణాన్వితు లాంజాయ
నాత్రేయఋషులును బృహస్పతియును
వైశ్య ఋుగ్వాగ్నులు వాందనకతశృంగి
శైశిరకపి గార్గ్య శౌనకులును

తే.గీ. ఖ్యాతిగల సద్వసుస్తంబ దూతవచను
లా భరద్వాజగణమగునవని, ప్రవర
గణము గలిసినఁ బెండ్లిండ్లు గాదుసుమ్ము.

... ... ... ... ...

తే.గీ. హరితుఁ డాంగిరసుఁడు గూడ నగునుగాని
యన్యయుక్త వివాహము ల్లఘుము నొందుఁ
బతితవర్తనుఁడనఁగఁ జొప్పడు వరుండు
గాన గణగోత్ర మరయ సౌఖ్యప్రదంబు.

కం. కర మనలువితోడ విరా
ట్పురుషుని వదనమునఁబొడము పుణ్యాధికులన్
నిరుపములగు భూసురు లీ
కరణిన్ గోత్రవిధ మరయఁగాఁ దగువరుసన్.

సీ. ఆశ్వలాయనము ఋుగామ్నాయ మమరు బో
ధాయ నాఘేయ కాత్యాయనములు
సరవి హిరణ్య కైశంబు సత్యాషాఢ
ములరు నాపస్తంబ మయ్యజుస్సు
ద్రాహ్యాయనం బనఁదగు సామ మదిసత్త
దాన మష్టబ్రాహ్మణానుమోధి
నైనమిది సూత్రమ్ము లిల మూఁడు వేదముల్
క్రమమున శాఖలుగలవు సత్త

తే.గీ. సంఖ్య షడశీతి సాహస్రసంఖ్య లానరఁ
దగు నథర్వణ మొన్నమంత్రి త్రిసంగ
గతులు నలువదినాల్గు సంస్కారములు ద్వి
ధర్మములు విప్రులకుఁ గుణధర్మసరణి.

ఆ.వె. అఖిలదేవమయులు సామ్నాయవేత్తలు
మోదరతులు తీర్థపాదు లనఘు
లతిపవిత్రమూర్తు లవనిదేవత లౌట
విప్రజన్మ మరుదు విబుధవినుత.

ఉ. ఎన్నఁగ జీవసంతతుల నెల్ల జనించికదా మనుష్యుఁడై
యన్నిఁట సంకటస్థితుల నంతఁ ద్విజన్మ తనూభవత్వమున్
గన్న విప్రుఁడై పొడమఁగావలె పుట్టినయంత మాత్రుఁడా,
సన్నుతఁ గర్మముల్ సలుప సద్వినుతిన్ ద్విజుఁడౌ తలంపఁగన్.

కం. వేదములు చదువు విప్రుం
డాదట జ్ఞానాత్ముఁడైన యటు బ్రాహ్మణుఁ డి
ట్లాదరణఁ బ్రియతైక వి
ధోదిత భాగ్యస్వరూప ముర్వీసురుఁడగున్.

తే.గీ. అట్టి భూసురకర్మ మెంతైనఁ గలదు
కాలకర్మ వివేకముల్ గరిమ నెఱిఁగి
మెలఁగ నపవర్గ సౌఖ్యమ్ము గలుగుగాక
యితర వృత్తులఁ జిత్సుఖ మేలఁ గలుగు.

వ॥ అట్టి బ్రాహ్మణ స్వరూపంబు వినుండు.

చం. ధరణిసురుం గనుంగొని ముదంబున లేచి నమస్కరించినన్
గర మనురక్తి వస్త్రముఖ గౌరవ వస్తువులిచ్చినన్, మహా
దరమున నన్నపానముల దావలమై పరితృప్తుఁ జేసినన్
నరుల ఫలమ్ము లెల్లగణనన్ మితమౌనె సురాళికేనియున్.

కం. పెద్దలఁ గని లేవని నరు
నొద్దన్ గల సిరియు నాయు వొగి నెగయున్ దా
పొద్దిక లేచిన నవి యం
బద్దయతో నధికమగుచు సంతస మొసఁగున్.

చం. పొడగనినంతఁ బాపములుపోవు నమస్కృతులాచరించినన్
బొడరు శుభమ్ము పూజలిడఁ బొరవు మోక్షముగల్గు భక్తి నెం
బడిఁ గనకాంబరాదులు కృపామతి, నిచ్చిన ధేనుధాన్యముల్
పుడమియు నిత్తురేనిఁ గ్రతుపూర్ణఫలమ్ములు బొందు హెచ్చుగన్

కం. పరదైవము లవనీసురు
లరయఁగ నిర్దోషులైన నఘయుతులైనన్
బరికింపఁదగదు వందన
పరితోషిత వస్తువులకుఁ బాత్రుండగుటన్.

వె. కాణ బధిర కుబ్జ ఖండరోగగ్రస్త
దిగ్ధనికులు నైన నెరను లెస్సఁ
జనదు శ్రాద్ధకాల సముపాగతావని
సురులఁ బూజసేయ శోభనమ్ము.

గీ. అరయ క్షత్రియ వైశ్య శూద్రాదులైన
యితర వర్ణ్యులు మ్రొక్కకయుని దీవ
నలు వొసంగఁగఁ గాంతు రా ఖలులు నిరయ
వాసులగుదురు దౌర్భాగ్య వర్తనమున.

). సభ దేవతాగృహమ్ముల
విభవాస్పదయాగవితతి విప్రు నొకరినిన్
విభుఁడని నమస్కరించిన
శుభము దొలఁగు నిరయవసతి సొరిది మెలంగున్.

వె. మధుపుబారువానిఁ బనిగల్గునాతని | తైలమూర్ధ స్నానదాన నిరతు
నుదకపాత్రహస్తు నుద్దేశించిన మ్రొక్కు పాతకాస్పదంబు ప్రజలకెందు.

). ధనగర్వితునకుఁ బలితున
కనయము నవివేకికిన్ దురాచారునకున్
మును కలుగ మ్రొక్కిడినన్
ఘనకల్మషము లొదవు పుణ్యగణములు సమయున్.

). దైవాధీనము జగము ల్
దైవము మంత్రములయందుఁ దన్మంత్రము భూ
దైవత వశ్యంబగుటను
దైవము బ్రాహ్మణుఁడె కాక, తక్కొరుగలఁడే!

విప్రులతోడ బొంకు నవివేకియు, నిచ్చెదనంచు నీని వాఁ
డప్రతిమ ప్రభాత్ముల ననాదృతిమై మది నింద సేయు వాఁ
డప్రియభాషణుండు కలుషాత్ముఁడు వైతరణీ సమగ్ర ఘో
ర ప్రబలీకృతానల భరంభరఁ గాకల నొందు నంతయున్.

. లోకాధీశ్వరుఁడైన విష్ణుఁడు సుశ్లోకించు ధాత్రీసురా
నే కాంచత్ప్రతిభల్ ధరాధిపులు నైన్యే భంగులన్ గొల్చి కా
దా ! కీర్తుల్ గని తెక్కగాలములు నీ ధాత్రీతలం బేలి యా
నాకావాసమునం దెలంగిరి జనానంద ప్రకాశీతులై.

శా. కోటంబూనిన పర్వతప్రతతి నగ్గుల్ సేయుటల్ సత్ప్రసా
దాపూర్ణస్థితి వృక్షవృద్ధముల నుద్యత్పల్లవ శ్రీకరా
టోప ప్రక్రియ నుండఁజేయుటలు మట్టున్ మీరయున్ లేనిత
ద్వ్యాప్యపరమ్ములు, వానిలెక్కగొన దేవవ్రాతముల్ చాలునే !

కం. వసుధామరు నర్చించినఁ
బొసఁగు ద్రిలోకాధినాథపూజాఫలము
ట్లసదృశగతిఁ దన్ముఖమున
వెసఁ దృప్తిఁగాంచు భూతవిసరము హరియున్.

కం. వారల ప్రతిష్ఠ సలపన్
సారస నాభాదిదేవసమితిఁ బ్రతిష్ఠల్
గూరిమి నేసిన ఫలమగు
ధామణి నిహపరసుఖ ప్రదాయకులగుటన్.

మ. గ్రహచారమ్ముల కీడుబాయు శుభముల్ గామ్యార్థముల్ గల్గు దు
ర్గ్రహ పైశాచిక బాధ లెల్ల నణఁగున్ బ్రారబ్ధనాశంబగున్
రహి విష్ణుండు ప్రసన్నుఁడౌ యముఁడు చేరన్ రాఁడు, సద్భక్తితో
విహితాంచన్మతి విప్రపూజ సలుపన్ విశ్వేశుఁడింపొందుటన్.

ఆ.వె సకలవర్ణములకు జననియు జనకుండు
గురుఁడు దైవ మిష్టుఁ డరయ విప్రుఁ
డఖిలభూత సేవ్య నచ్యుతు నవరావ
తార మెన్నిచూడ ధరణిసురుఁడు.

కం. భావమున విప్రుఁడే నిజ
దైవంబని యొప్పఁడెంచు ధన్యుఁడతఁడు నా
నా విధసౌఖ్యములొంది ము
దా [విభవత ?] బ్రహ్మలోక మమరఁగఁ జెందున్.

చం. నయవిదులై గృహోపకరణమ్ము లొసంగిన నింత లిచ్చినన్
రయమున నన్నవస్త్రశుభ రాజిత గంధవిశేష హేమ ర
త్న యుత విభూషలం దనిపినన్ గుసుమంబులు వీడ్య మిచ్చినన్
దయ దనకొత్తఁ బ్రోచిన, ముదంబులుగాంతురు తజ్జపోత్తముల్.

తే.గీ. వారి నవమానమొనరించువాఁడు, వాదు
లాడువాఁడును నిరసించు నట్టివాఁడు
దూషణము సేయువాఁడును దోషయుక్తు
లగుచు యమబాధ నొందుదు రనుదినమ్ము.

క. విద్యావంతుండైన న
విద్యాయుతుండైనఁ గ్రూరవృత్తిఁ దిరిగినన్
సద్యశ్శుభదుని ద్విజు నన
వద్యునిగా నెఱుఁగువాఁడు వరసుకృతి యగున్.

ఉ. ద్విజుఁ గనుఁగొన్న మాత్రమునఁ దేలుచు భక్తియు లీప్సితార్థముల్
వ్యజనము లన్నపానములవారిత భక్తినొసంగఁగాఁ దగున్
సృజన మొనర్చె విప్రుల, విశిష్టుల పూజకునై విధాత మున్
వృజిన మణంచి పుణ్యములు వేడుక గూర్తురు వారలేరికిన్.

క. వచనములు వజ్రనిభములు
ప్రచుర వచోరచన లమృతరసవంతము లౌ
వచరింప భూమిసురులకు
సుచరిత్రత వానికెనయా! సురలెయ్యెడలన్.

క. ధారుణ్యమరులఁ బ్రోచిన
వారల పితృభక్తి తృప్తవర్తనులై వి
స్తారానందసుఖమ్ముల
పారము గావించి మిగులఁ బ్రబలుదు రెందున్.

క. స్వారాజైనను విప్రుల
గారింప దరిద్రపాప కలితుండగున్ ద
ద్దారిద్ర్యాన్వితుండైనన్
వారల కృపగల్గఁ దివిజవరుఁ డగు పేర్మిన్.

క. గో భూ హిరణ్య కన్యా
వైభవ హరిమూర్తిచయము వారికి నొసఁగన్
శ్రీభద్రప్రాభవముల,
నా భూమీసురులకరుణ నతి సుకృతి యగున్.

తే.గీ. అఖిలదానమ్ములకు నెక్కుడైనయట్టి
జ్ఞానదానమ్ము సేయు మహానుభావు
లగుట విప్రుల కొసఁగిన యట్టి దాన
మమిత నిరయాబ్ధితరణ మయ్యన్వయులకు.

క. ఎంతని తెలుపఁగవచ్చు ద
రంతము తన్మహిమ లెన్న నవని సురులకున్
వంతలు మాన్పుచుఁ దత్పద
చింతారతి భక్తిసలుప సేమము లొదవున్.

ఆ.వె. అట్టి యగ్రభూములయందు నాల్గైన యా
శ్రమము లమరు బ్రహ్మచారియు గృహి
వితత వననివాసి యతి యనఁగా, వ్రత
శ్రీలఁ గొనెడి వటుని రీతి వినుము.

సీ. ఉపనయనాది గా పఠితమును ద్విదిన గా
యత్రి ప్రాజాపత్య మవల వలయు
నాగవ్రత చతుష్కావధిగాఁ దగు
ననఘ పఠితవ్రతం బట్లనయగు
వరుస సంవత్సర పరిమితంబవి యాచ
రించుట బ్రాహ్మ్యమౌ నెంచ వేద
సంగ్రహణాంతంబు సలుప నైష్ఠిక మిట్టి
నాలుగు తెఱంగుల నయ మలర్ప.

ఆ.వె. వెలయ బ్రహ్మచర్యములు ననిష్ఠిప కృ
త్యాది కర్మనిరతి యదియ వార్త
యజనకర్మయుక్తమగు వస్తుసంపాద్య
మదియ సంచయాఖ్య నమరు మతిని.

కం. మేలి యయాచ్ఞావ్రతమున్
శాలినమను నాల్గుగతులఁ జను గార్హస్థ్యం
బోలి నికృష్టములగు వా
గ్జాలాహార విఘసస తతి కడువేడుకలన్.

కం. నూతన ఫల లబ్ధంబు పు
రాతనవస్తువుల విడుచు రహి నైజ ప్ర
ఖ్యాతియగు వాలఖిల్యులు,
ప్రాతఃకాలమున లేచి పరికించి దిశన్.

కం. చవియచట దొరకినవికై
కొన, నౌదుంబరులు, దాను గోరకనే వ
చ్చినదినుయాదృచ్ఛికు లను
వనవాస చతుష్టయంబు వర్తిలు వసుధన్.

సీ. మకుటాశ్రమప్రధాన కుటి చకుండును
శర్మోదసజ్జన జ్ఞాననిద్ధైన
యట్టి యశ్వోదుంబరాఖ్యుఁడు కేవల
జ్ఞాన నైష్ఠికత ప్రహస్వామహాఁడుఁ

డటు బ్రహ్మతత్త్వ విద్యావంతుఁడైన ని
 శ్రేయసుఁడను యతుల్ చెలఁగ నట్టి
రీతుల బ్రహ్మచారియు గృహస్థుండు వా
 నప్రస్థుఁడును యతి నాల్గువిధము

ఆ.వె. లగుట బ్రహ్మచారి కటు విద్యయు గృహస్థు
నకును భిక్ష వానస్థున కిల,
యతికి (స్వ) ర్గ మొసఁగు టత్యంత దురిత చూ
తత్తదుచిత వస్తుదాన మహిరు.

ఆ.వె. వేదమార్గగతులు విడిచి శాబర మంత్ర
తంత్ర నిరతుఁడైన ధరణిసురుఁ డ
సగ్నికుం డనంగ మగ్నుఁడౌ పాతక
ర్మములఁ బతితుఁడగుచు మందబుద్ధి.

కం. భార్యాయుతుఁడై పావక
కార్యంబే విప్రుఁడైన క్రమమునఁ జేయం
డార్యత్వరహితుఁ డాతఁ డ
నార్యుఁడు కర్మముల వేదవంతుండైనన్.

సీ. అట్టి చతుర్వర్ణ్యులైన భూసురులు ని
 జాశ్రమాచార నిత్యక్రియాభి
రతులైన వారి శ్రీపతి దయామతిఁ బ్రోచి
 నిర్మలగతి నిచ్చు నిఖలభూత
సము లతిశాంతులు సత్యవ్రతుల్ పర
 ధనదార విరహితాత్యనఘమతులు
నాశావిహీనులు నతిలోభ మోహ దం
 భ వివర్జితులు ధర్మభద్రయతులు

తే.గీ. మానితామ్నాయ తత్పరులైన వారి
నఖిల భూకాంతరాత్మయు యజ్ఞభర్త
యైన శ్రీవిష్ణుఁ డిష్టదాయకుఁడు నగుచు
సంతసము నొంది రక్షించు సంతతమును.

కం. సంతోషమానసుఁడు వే
దాంతశ్రవణుండు పితృమహావ్రత సవము
దంతర్ముఖుఁడగు విప్రు ని
రంతరముగ్ బాయకుండు నచ్యుతుఁ డెలమిన్,

సీ. యజనయాజనము లధ్యయన మధ్యాపన
 కృతిదాన దాన ప్రతిగ్రహములు
బ్రాహ్మణ కర్మముల్ బ్రహ్మచారికి గురు
 శుశ్రూష భిక్షాన్నమిశ్రభక్తి
నిత్యకర్మక్రియా నిరతి యధ్యయనంబు
 శౌచ దమ క్షమా శాంతిగతులు
ననలార్క సేవన మనుదినగురువంద
 నంబు విద్యాసంగ్రహంబు సతులఁ

తే.గీ. గదియుటలు, భాషణములు వీక్షణము మాను
టఖిల వేదాంగములు నేర్చి యాత్మగురుని,
కభిముఖంబగు దక్షిణ లమర నిచ్చి
యతని యనుమతి గృహ యాట లక్ష్మవృత్తి.

ఉ. మంచివియుక్ సమానములు మంగళముల్ విహితార్థవృత్తి న
త్యంచిత ఘోషవర్జితము రై తగు నక్షరనామధేయముక్
గాంచన దీప్తదేహరుచి కన్నులతేటయు సస్మితాస్యముక్
గొంచెపు మధ్యముక్ సొబగు గొప్ప పిఱుందును గల్గి వెండియుక్.

చం. తివడపుఛాయలో చిఱుతగువదమ్ము లరోమశమ్మురై
రవణము మీఱు గుల్ఫము లరంటుఁ నిద్దపుటూరువుల్ స్మర
ప్రపణశరాసనమ్ము గతిఁ బాటిలు కన్బొమ లింద్రనీలపుక్
సవరనిఱుంగురుల్ మెఱుఁగు శంఖవిడంబన మొప్పుకంఠముక్.

కం. చెలువలరు ముద్దుఁబలుకులు
తిలపుష్పము బోలునాస తేటగుజెక్కుల్
పలువరుసదట్టము స్నైతి
గలవెంద్రుక లమరు మంచికన్యక్ ధన్యక్.

కం. వరియించి గృహస్థుండై
గురువుల గురుసుతుల నైనఁ గొలిచి యతిథులం
బరిరక్షింపుచుఁ గర్తా
చరియుండై మెలఁగవలయు సాధులు పొగడక్.

సీ. అట్టి భూసురుఁడు బ్రాహ్మ్యముహూర్తమున మేలు
 కాంచి కాంచనదుకూలాంచితు హరి
నాత్మస్వరూపు నిత్యానందు నెన్నుచు
 ధర్మార్థ హృదయమ్ము దనర నర్థ

కామములఁ విడువ విఘ్నములేక ధర్మంబు
చేకుఱుగాక, నిశ్చింతుఁడగు మఁ
గర మర్థి ధర్మమేమును గాక పుణ్యనదీ ఫు
రా రణ్య ముని నృప ధీరభాగ

తే.గీ. వత మహద్వ్రితయుత పత్నివ్రతల గాంచి
వెలయు పురమైన నరువది విండ్లపట్టు,
పల్లెయగునేని ఐదివిండ్లపట్టు, నిఋతి
భాగమున కేగి యచ్చట బాగుమీఱ.

ఆ.వె. గాలికెదుటఁ ద్రోవ గ్రహతారకలఁ గంచు
గోనుపర్వనిలయ కుంజ జల స
మీపములను సస్యమేదిని రేఁగల
బైట మలముఁ విడువఁ బాడిగాదు.

ఉ. ఊపిరి బిగ్గఁబట్టి తడవుండ కుదఙ్ముఖుఁడై పవల్ల, రే
యోపిక దక్షిణాభిముఖమొప్పఁ దృణావృతమైన ధారుణిన్
జూపడకుండు నిమ్మమునఁ జుట్టు జనావళి లేనిచోట, మూ
ర్ధోపరివస్త్రుఁడై నిజభుజోన్నతి జన్నిద మాదటం దగన్.

తే.గీ. మలవిమోచన మొనరించి కెలన మఱలి
చూడ కొకచేత శేఫంబు కూడఁబెట్టి
పుట్టి మూషకఘాతమ్ము పులినజలము
లను గలది కృష్ణభూములదినునుగాక.

కం. తరబడిమృత్తిక శౌచము
కొఱకై వలకేలఁ బూనిగుఱుతుగఁ గొలనుం
దరికేగి దూరముగఁగడు
నిరవుగ వసియించి మృత్స్నకొలమింగొనఁ దగన్.

సీ. ఆమలకముపాటి నమర మృత్పిండముల్
గొని గుదమున నైదు నొనర నొకటి
లింగంబున న్వామసంగకరంబున
ముమ్మాఱు నిరుగేలు మొనయ రెండు
వామపాదమున శ్రేపన్నది వరుసలు
నుభయపాదమ్ముల నొనర రెండు
మాఱులు మేదించి మన్నిడి శౌచమ్ము
గావింపఁగ గృహస్థ కర్మమిట్టి

తే.గీ. సరవి కిన్నిటఁదగు బ్రహ్మచారులకును
విధవలకుఁ దద్ద్విగుణము ఋష్య విను వనస్థ
వితతికిఁ జతుర్గుణంబగు యతులకట్లు
నమరు నందష్టసూంశార్థ మైదువలకు.

కం. ద్వాదశగండూషమ్ముల
మీఁదట జన్నిదము దాల్చి మిలివార్చుచు సం
మోదత ములు పాల్పట్టియుఁ
బాదగు జేనంతపుడుకఁ బల్తోమఁదగున్.

కం. ఘన తృణ పర్ణ త్రాశన
మనువగు దర్భముల వైష్ణవాహుముల వినా,
వినుఁ [డు ?] ప్పినుకును మాగా
జు నిటిక శిల బూది యాముక శుభములఁ బాపున్.

కం. వలగొనురీతిగఁ దోమ
న్వలయును దర్జనినిఁ దోము వైవది పాపం
బిల నయినహితము రుచ్యము
తలఁపన్ దృఢకరము దంతధావన మెలమిన్.

ఆ.వె. దంతశోధనమున దానమొనర్చుచో
భోజనమున దేవపూజ తఱిని
జపము సలుపునెడల స్మరకేళియప్పుడు
మౌననియతి వలయు మహీసురులకు.

కం. మలనిర్మోచన మనఁగాఁ
గలుష విమోచనమనంగఁ గలదిరు తెఱఁగుల్
దలఁపఁగఁ దైలాభ్యంగము
మలహరణస్నాన మనఁగ మహి నెన్నఁదగున్.

కం. పర్వముల షష్ఠిదశముల
సుర్వీధరు తిథిని సూనై యొగినంటిన శ్రీ
ధూర్వహత దొలఁగి యాపి ప
చర్వణ చండాలయోని జనియింతురిలన్.

కం. తలఁగడుగుటు పళ్ళుఁదోముట
వలనుగ రవిగురు భృగుకుజ వాసరముల యం
దిల శ్రాద్ధ జన్మదినములఁ
దలఁపఁగ వ్రతవాసరములఁ దగ దఘముగుటన్.

కం. తాపముగాంచియు మృత్యుల
త్రిపటిమయునదృఢమున్ దరిద్రత కోర్కుల్
ప్రాపించుటలగు రవి మొద
లౌ పర్యయవాసరముల నభ్యంగములన్.

ఆ.వె. మంత్రహీన మదియు మల విశోధనమునఁ
బరగు మంత్రయుక్తిఁ బ్రబలు నైదు
తెఱఁగులగును నార్యసరణికిఁ బ్రథమణ
స్నాన మర్హమా ప్రమాణ రూఢి.

కం. సంకల్పపూర్వకంబుగఁ
బంకహరణ మరయఁ బుణ్యపావనతీర్థం
బింకువ ? తో నదికర్మ ల
తాంకూరవసంతసమయ మాహ్నిక ఫణితిన్.

సీ. కంఠకటిస్నాన కాపిల మంత్ర ప
స్త్రీవర్తనములన నైదు విధము
లవియు [శక్త్యుచిత ?] ములగు నాలుగాశ్రమ
ముల వారికర్హమ్ము మూఁడువేళ
లందుఁ గ్రుంకిడుటలు నాగ్నేయమగు భూతి
చే నగు స్నానమ్ము మానితముగ
నీయందుఁ గ్రుంకుట నిరయహేతువు మంగ
ళార్థమ్ముగా స్నానమాచరింప

ఆ.వె. ఒలయునేనిఁ దటిని వారి దిక్కుబునఁ
దెచ్చి స్వర్ణమునిచి యిచ్చఁ గాఁచి
నైన నింటు స్నానమర్హమా పుణ్య, తీ
ర్థములఁ గ్రుంకవలయు దార్ఢ్యగులకు.

కం. స్నానాంగంబగు దైవత
మౌనిప పితృతర్పణములు మఱిఁజేయఁదగున్
బూనిన పవిత్రమంగుళి
లేనిది దురితముగు గర్హితంబగుటన్.

కం. తడిధోవతి విడువఁగఁదగు
వడిబైటికి వచ్చి నీఁటివైపుగ విడువన్
గడదొలఁగుఁ బుణ్యములు తటి
విడిచినయది భుజము దేర్ప వృథ గ్రుంకిడుటల్.

తే.గీ. ఆర్ద్రవస్త్రమ్ము సడలించునపుడు కటికి
నూర్ధ్వభాగమ్ము సం దిగిచుర్వి నిడఁగ
వలయు దిగజార విడిచినఁ గలుష మొదవు
జలము దరిఁజల్ల భూతతృప్తులు ఘటిల్లు.

చం. అజినమునందుఁ బేటి నిడినట్టివి యంశుకముల్ ధరించుటల్
ద్విజులకు సర్వమౌ కలిమి లేకువఁ బట్టువియౌవికంబులున్
రజత సువర్ణ భూషణవిరాజిత వైఖరి సౌఖ్య మాటచే
సుజనులు సృష్టిదోషమని చూడ రదెందుఁ బవిత్రమై తగున్.

చం. నుదుటను గోపిచందనము నూత్నగతిన్ ధరియించి నిష్ఠతోఁ
గుదురుగ వార్చినట్టి క్రియకుం దగు కేశవముఖ్యనామముల్
పది పదునాల్గు సంగములఁ బట్టుగ నెట్టుగ నంటు చోటఁ దెం
పొదవఁగ నంగుళమ్ములు సమున్నతిఁ బూర్వవిధమ్ము దెల్పెదన్.

సీ. వ్రేళ్ళదు సమముగావించి ముంచిన నీళ్లు
మాషమగ్నంబగు మాత్రమున్న
గాఁగ గోకర్ణ వికాసత మున్నాలు
తలమార్గమునఁ గ్రోలి తవిలి రెంటఁ
గరమార్జనము సేసి మఱిరెంటి నోష్ఠముల్
దవిలి చెక్కులరెంటఁ దుడిచి యొకటఁ
జరణద్వయిని జల్లి శిరసంటి తుదివ్రేళ్ల
యిడి నాసక్రిందొంటఁ బిడికిలించి.

తే.గీ. మొనయ నంగుష్ఠ తర్జని ముక్కుగోళ్ల
కడ ననామికఁ గన్నులా కరణిఁ జెవులు
కడను బొటమన నాభి వక్షము తలమున
శిరము భుజములఁ దుదివ్రేళ్లచే స్పృశించి.

తే.గీ. ప్రణవపూర్వక వ్యాహృతుల్ వరగ వేద
మాత యర్థమ్ముతోఁగూడ మానియగుచు
నపుడు మధ్యమ తర్జని నంటు నీక
కడమ వ్రేళ్లను నాసికఁ గదియఁబట్టి.

కం. ప్రాణన్ ముమ్మాఱు దపఁగఁ
బ్రాణాయామంబనంగఁ బరగు నటులుగా
రాణనొనర్పుచు వాగ్గీ
ర్వాణ స్తుతిమార్జనములు వలయుం బిదపన్.

సీ. అష్టాక్షరయుతంబు నంబుదైవత్యంబు
నవపదంబులునైనయది ద్విరుక్తి
పదునైనిమిదియగు పావకం బొకనాల్గు
హరిపదంబొక రెండు నన్నిగూడి
తరపతుల్ పదునొండు నైతిఁ బదునొక్కఁట
హృదయంబు మునిసంఖ్య నెసఁగఁగఁగఁదుదఁ
బదముల రససంఖ్య నొదవు ననేథల ?
శిరసున మార్జన మిరువదియును

తే.గీ. నాల్గుపాదాంతముల మార్జనంబులు దగు
మొదలు నడుమను పాతకములు వహించుఁ
దొమ్మిదింటి మీఁద సూర్యోక్తి తొడరి రేపు
జలము మధ్యాహ్నమున నగ్నిసంధ్యయందు.

కం. గుఱిచిన మంత్రంబులచే
నిరవుగఁ బ్రాపింపవలయు నెలమి నుదకముల్
మఱి మార్జనములు పదియే
నరయఁగఁ బదయుక్తి వలయు నామ్నాయగతిన్.

కం. సాయం ప్రాతర్వేళలఁ
బ్రాయశ్చిత్తార్ఘ్యయుగము బరగు న్నాల్గై
యాయస్త్రము లుపసంహృతి
నాయతమతిఁ జేయవలయు నవనిసురులకున్.

తే. గీ. బ్రహ్మశీర్షమ్ము దండమ్ము పద్మజాస్త్ర
మనఁగ మందేహముఖ్య దైత్యాళి పాహ
నములు శస్త్రాస్త్రములు దైత్యసముదయంబు
నడుప ప్రక్షేపమున్నై యడరు వరుస.

సీ. అదిపుట్టులనఁగ మున్నసురులు సురలును
స్వర్లోకపాలనాచార్య మహిమ
లభిలషించి విరించి నర్థించి నిష్ఠతో
సవనతంత్రమ్ములు సలుప నందు
నసురులు దృఢచిత్తు లగుచుఁ దత్కార్యంబు
గావించి బల్మిచే గర్వులగుచు
స్వర్గమ్ము నైకొన్న సర్వగీర్వాణులు
సరసిజాసనుఁ జేర నరిగి మ్రొక్క

తే.గీ. యసురు లధికత స్వర్లోకమాక్రమించి
రింక వారలగెల్చుట కెత్తెఱఁగొ !
కరుణ మముఁ బ్రోవవే ! యన్నఁ గమలభవుఁడు
వారి నందఱి నిజకృపా వారిఁ దేల్చి.

ఉ. వారలు తామసప్రకృతి వైభవమొందిన నేమి యింకిటన్
మీరలు బ్రహ్మచర్యమున మేలిమి తేజము గాంచి దైత్యులన్
మీఱుట కేను దెల్పెద నమేయవిశాన్వితుఁ డర్కుఁ డెంతయున్
ధీరమతిన్ సహాయముగ దెల్లి జయంబు భరింతు రంతయున్.

శా. నాచే నిర్మితమైన స్తోత్రమిదిగో నాపేర వర్తింప నెం
తే చాతుర్యత నుత్తరాంసమున వర్తింపంగ సవ్యంబగున్
బ్రాచుర్యంబుగఁ దా నివీతమగు నొప్పన్ గంఠదామస్థితిన్
సూచింపంగ నసవ్యమా నరునకచ్చో దక్షిణాంసోద్ధృతిన్.

కం. దేవఋషి పితృప్రీతిగ
నీవిధముల నుండు వరుస నింగితకర్మ
ప్రావీణ్య స్థితిఁ దత్తే
జోవిలసితులగుచుఁ గనుఁడు శుభములు ఘనతన్.

చ. అని పరమేష్ఠి పల్కిన రయంబున దేవత లట్లుచేసి యా
వనజసఖుండు తోడుగ నవార్యుల దైత్యుల గీటణంచి హె
చ్చునఁ ద్రిదివంబు చేకొనిన, సోలుచు దానవులెల్ల నెప్పు ద
య్యును నిజుసందెలం దొడరి యేఁచుచునుండెద రుగ్రశౌర్యతన్.

ఉ. అత్తఱిఁగెల్లి దేవతలు నబ్జజుతో వినిపింప ధాతయున్
మత్త నిశాచరప్రహత మంత్రపరంబగు వేదమాతృకన్
హత్తిజపించుచున్ వికసితాంజలిఁ జల్లుతదంబు లాహవో
ద్వృత్తుల దైత్యులం దునుమ వేమఱుఁ దద్వృజినంబు దీఱఁగన్.

కం. ఈయాదిత్యుఁడె బ్రహ్మం
బాయతగతి ననుచుఁ దిరుగుటది తలఁపఁగఁ జాం
ద్రాయణ ఫలదంబై పు
ణ్యాయత్తులఁ జేయు మిమ్ము నని విధియించెన్.

కం. ఆదికారణముగ నేత
ద్విదితోక్త క్రియలొనర్చు విప్రులు మహిమా
స్పదమౌ తదస్త్రముల నిం
పొదవఁగ నుపసంహరించు టొప్పగు నియతిన్.

తే.గీ. వెస తకారాదిగా మున్ను విడిచినట్టి
యస్త్రగూఢ మహామంత్రమైన లలిత
శుభద గాయత్రిఁ గ్రమ్మఱించుట తు యాది
యైన వర్ణక్రమమ్మున సర్వమగును.

సీ. ఈరీతి గాయత్రి హృదయస్థముగఁ జేసి
చెలఁగి సంధ్యోపాస్తి సలుపవలయు
క్షేత్రజ్ఞు ననుమతిఁ జేకొని యభ్యాస
నాసీనుఁడగుచు దిశాంగణములు
బంధించి పరమాత్మ భవ్యసుషుమ్నచేఁ
గడఁగి బ్రహ్మస్థాన గతునిఁ జేసి
మది నుండినట్టి బ్రహ్మమ్ము శిరుఁడు స్వర్ణ
చోరణోరుపాపు పానార్హహృదయు

తే.గీ. నలఘు గురుతల్పగైకదుష్కలుష జఘను
తత్ప్రసంయోగ చరణుఁ బాతకచయాంగు
రోమకూపోపపాపు నిరూఢ వృజిన
పురుషు నీలాంగు నంగుష్ఠతర శరీరు.

క. మారుత బీజాక్షరమున
వారక శోషింపఁ జేసి వరశిఖి బీజో
దారత దహించి వెలికిం
దారిచి మటకేయఁ జేయఁ దగు నమృతమునన్.

తే. గీ. అతుల మది సుధాప్లావన మమరఁ జేసి
బ్రహ్మసంస్థానగతుఁడగు పరము మరల
నా సుషుమ్నాధ్వమునఁ దెచ్చి యచట నిల్పి
హృదయపద్మస్థు గావించి విదితమతిని.

సీ. ధర్మంబు దానికందంబు జ్ఞానము నాళ
మైశ్వర్యముఖు సౌన్ని దమరు దళము
లవిరూ దిశాపులు లచటవైరాగ్య క
ర్ణిక, కేసరంబులు నిఖిలదేవ
గణము తత్కర్ణికాగత రవిబింబంబు
నడుమ చంద్రుఁడు వాని నడుమ వహ్ని
యందుఁ జతుర్భుజమై హేమమయ మురు
రత్నకిలితము విరాజమాన

తే.గీ. మైన పీఠిక నీవారశాగ్రసూక్ష
పరిమితాణు శరీరుఁడు పసిమివన్నె
ననుపమానుండు, శంఖ చక్రాదిశస్త్ర
ధరుఁ డనేక విభూషణాంబర ధరుఁడును.

కం. శ్రీవత్సకౌస్తుభాది మ
హావైభవ భూషణుఁడు రమాన్వితుఁ డురు తే
జోవంతుఁడు మూర్తిత్రయ
భావుఁడు వేదమయుఁడగుట భావింపఁదగున్.

వ. అతఁడె ప్రణవస్వరూపంబగు నత్తెఱంగెఱింగించెద.

సీ. మఱి ప్రకోష్ఠమ్మున మణిబంధకూర్పర
తలకరాగ్రములు తత్తలము వెనుక
నంటఁగఁ గరశుద్ధి యగు నంతట నకార
మును నుకార మకారములును గూడఁ
బ్రణవ మట్టి యకారపటిమ ఋక్సంగతి
బ్రహ్మదైవత్యంబు పరగు జాగ్ర
మగు నవస్థయుఁ బ్రథమాంచిత సవనంబు
నాహవనీయాగ్ని యగుచు సురభి

తే.గీ. ముద్ర సృష్టి క్రియయుఁ గర్మముఖ్య విద్య
యగు నుకారము గార్హపత్యాగ్ని విష్ణు
దైవతంబు యజుర్వేద భావి స్వప్న
మగు నవస్థయు యోనిముద్రాంకితంబు.

శా. ఆత్మ జ్ఞానము పాలనస్థితి ద్వితీయంబౌ మకారంబు రు
ద్రాత్మీయంబును సామవేదము సుషుప్త్యవస్థయున్ శంఖ ము
ద్రాత్మస్థానము దక్షిణాగ్నియుఁ దృతీయంబౌ మఖంబొప్పు నా
త్మోత్కానందవిధానతం దనరు సంహారక్రియారూపమై.

కం. తత్తద్బీజాక్షరముల
హత్తుక పలుకంగఁ దనరునట్టి త్రివర్ణో
పాత్తమగు ప్రణవమంత్రము
చిత్తమ్మునఁ గుదురుగాఁగఁ జేయఁగవలయున్.

తే.గీ. ఇట్టి ప్రణవము జరియింప నెలమి రేపు
మాపు గావించు కల్మషముల్ మాయ ప్రతి ది
నంబు తేజంబు బలము నత్యధికమగుచు
నాయువొనఁగూర్చు నిది నిక్కమే యెడలను.

కం. ఆదిన్ సుముఖాన్వితము
బ్రాదులు నిర్వదియునాల్గు నంగోపాంగా
పాదితమగు న్యాసంబులు
పాడుగ గాయత్రి హృదయ పఠనము వలయున్.

తే.గీ. మధ్యమునను బదింటికేమఱిక నొకటి
తగుఁదురీయ జపింపంగఁ దనరు నిత్య
కర్మతాధిక భూసుర గణములకును
కవచము సురభి ముద్రాష్టకంబు పిదప.

తే.గీ ఆల ఋగాముల నెనిమిదేసక్షరములు
నగుచు నిర్వదినాల్గు గాయత్రి యాయు
ధర్వణంబునఁ బదునొంటఁ దగు మరియ
సాంగ నిగమఫలంబిచ్చు జాపకులకు.

కం. ఎచ్చోట నర్ఘ్యమొత్తిన
నచ్చో గాయత్రి నొడువనగు నుదయముగా
నచ్చో నుత్తిష్ఠత నినుఁ
డప్పుగ నుదయించునేని వాసీనుఁడునై.

ఆ.వె. సంధ్యవార్చుచోట సలుపక గాయత్రి
యొండుచోట నేయ నుక్కమఱల
సంధ్య వార్పవలయు శాస్త్రవిధిజ్ఞుల
మతము లిట్లు ద్విజవితతులకెల్ల.

కం. ప్రాతఃకాలంబున న
త్యాతతమతి ప్రాఙ్ముఖుండు నపరపు సంధ్యన్
బ్రీతిన్ బ్రత్యఙ్ముఖుఁడగు
రీతిన్ జపియింపఁదగు గరిష్ఠ స్థిరతన్.

సీ. రమ్య పీఠిక కంటె రాంకవశార్దూల
చర్మ కుశాసన సరణి మేలు
స్ఫటిక పద్మాక్షాది జపమాలికల కంటె
నంగుళి సంఖ్య శుభాస్పదంబు

లంతకంటె ననామికాంగుళిగాఁ దత్పర్వ
సంఖ్యఁ జేయుట ప్రశస్తంబు లిట్టు
లుత్తమంబగు వేయి నొగి మధ్యమము నూఱు
పదియైన నధమమన్నది మిగులఁగ

తే.గీ. నెలమి గాయత్రి జపియించి యెసఁగు శుభము
నాల్గుదిక్కుల సాదరమున నడుమ క్రిందఁ
క్రమము వసియించు సద్దేవగణములకును
వందనమ్ములు జేసి గోవిందు నెంచి.

కం. ఉత్తమ శిఖరంబుల సుమ
హత్తరగతిఁ బుట్టి విప్రులభ్యర్థింపన్
చిత్తమ్ము వచ్చు నెడలను
హత్తుగ ధరఁ బర్వతముల నమరుము దేవీ !

కం. అని, వేదమాత! వరదా !
జనని ! కృతిన్ బ్రహ్మవర్చసము తేజము న
వ్వనజాసన లోకాప్తియు
ఘనత న్నా కొసఁగుమనుచుఁ గడుభక్తిమెయిన్

తే.గీ. గోగణములకు బ్రాహ్మణ కులజులకును
ఘనత శుభమగు ననుచు వందనమొనర్చి
సవితృనకు మ్రొక్కి బ్రహ్మయజ్ఞమున దేవ
మనుజ పితృభూత యజ్ఞక్రమములఁ జేసి.

వ. కర్తారంభకర్మ సమాప్తుల నాచమనంబు సేయందగు తత్ఫలంబు వినుండు—

కం. పానత్రయమున ధృతి నో
ష్ఠానూన స్పృశిత మూర్ధమంటుటచే నెం
తే వితరాంగ స్పృక్కుల
నా నిరుపమవేద్య...... లరయ ఫలముగున్.

కం. సారోపాస్తికి మధ్యా
హ్నాదిన్ వార్పిసప్తమాన్విత పదమా
సారతర మంత్రమున నొక
టారయ గాయత్రిచేత నర్ఘ్యద్వయమున్.

కం. ప్రాయశ్చిత్తార్థంబును
ధీయుక్తి నొనర్చిన వినుతించిన పిదపన్
గాయత్రిం దుదన్ సేయన్
న్యాయంబగు కర్మములకు నందితబుద్ధీ.

కం. హరిపూజ దేవయజ్ఞము
కరమొప్ప నొనర్చి భూతగణతృప్తికిఁ గా
నిరవైన వైశ్వదేవము
స్థిరమతి సేయంగవలయు స్మృతిముఖఫణితిన్.

సీ. బ్రహ్మయజ్ఞంబది పటుదేవముని పితృ
తృప్త్యర్థ సంకల్ప ధృతి ముఖాంగ
ములు సృజింపుచు వేదములు నాల్గు నుపనిష
త్తులు నిగమాంగమ్ము లెలమి సూత్ర
మమర మీమాంసాద్వయంబు నధ్యయనంబు
శక్తికిఁ దగినంత చదివి తర్ప
ణములు సేయుచు నాది నంజలి మున్ని వేళ్ల
సవ్యోపవీతుఁడై సరసిజభవ

తే.గీ. ముఖ్యసురులకు వ్యాసాది మునివరులకు
సరవి నివీతీ కృతాంజలి సంధి దగవు
పితృవితతికెల్ల నపసవ్యవృత్తి బెద్ద
వ్రేలిమొదట నొనర్చుట విధిదలంప.

కం. సురపైతృక భూతమనుజ
పరితుష్టికి వైశ్వదేవపటిమన్ లౌక్య
స్ఫురితాగ్ని నితరు లటు గృహ
పరుఁ డౌపాసనమహాగ్ని వడి వేల్వఁదగున్.

సీ. పాసఁగఁ బ్రాణాయామపూర్వక సంకల్ప
మమరఁగ నాత్మశుద్ధ్యర్థ మన్న
శుద్ధ్యర్థ మను పంచసూన నిర్హరణార్థ
మిష్టదైవప్రీతి కొసఁగ నుతిక
మంటుచు గృహమున నైన యన్నము దెచ్చి
యచట పాక మొనర్చ నటులఁ జేసి
సాజ్యహూనదియుఁ బంచవిభాగములు జేసి
పరిషేచన మొనర్చి ప్రథమ భాగ

తే.గీ. కలిత మార్జన విధములు గల్గు పంచ
శూనపాతక హరణమ్ము నైనయట్టి
విధి వశాదులు లగ్ని లో వేల్వ వలయుఁ
దత్తదర్థక మంత్రయుక్తముగ మఱియు.

కం. విను రెండవ పాల వ్యం
జనయుక్తంబన్న మగ్ని సరస నుదీచిన్
దన రార నష్ట భస్మం
బున నిడి సేచనము చేసి పూనిక నంతన్.

ఆ.వె. ప్రేను మొదటిపాఁ రెండవ పాలును
గూర్చి పటిమమునను నేర్చి ధర్మ
మున కధర్మమునకు నొనరంగ స్వాహాంత
మనెడు మంత్రసేచనా నుయాధి.

సీ. దానికి నుత్తరధరణి నాప్యాదులి
పరిషేచనము దాని నైరయ నోష
ధి యట రక్షోజనస్థితి కగు నేకసే
చనము 'గృహ్యాతి' నాసరణి నగ్గి
ధర్మాదులికిఁ జెంత దక్షిణమున నేక
పరిషేచనస్థితిఁ బరిఢవించి
యా యధరాత్కృతి క్రమంబునందుఁ గా
మాఖ్యాది నామములు లనియు గూఁడు,

తే.గీ. వేఱువేఱుగ సేచన విధు లొనర్చి
యచటఁ బృథ్వ్యాదిగా బ్రాహ్మణాంతముగను
బదియు నొక్కటిగా జలములొసఁగఁ జుట్టి
మొదల దాఁకి దక్షిణంబుగ మఱియును.

కం. ప్రాచీనవీతిగ పితృగ
ణోచితముగ నొకటొనర్చి యొగి పరిసర్యా
సేచన మమరఁ దదుత్తర
మై వెలుఁగు రుద్రునకు మహాబలి యిడుదుర్.

తే.గీ. అది ప్రదక్షిణ సేచనమాచరించి
రేయిఁ బగలిటుఁ గల భూతతృప్తికి బలి
[మిగిలి] నన్నంబు కొన్నిటి మీఁద నిడుచు
వ్యాహృతి నం న్నగదానంబు గొనక.

కం. ప్రాణాయామము సేయుచు
నాణెముగఁ దృతీయభాగ మయగతిఁ ద్రిదగ
శాస్త్రిణుస్నా రాయణు స-
ప్రీణన మొనరింపవలయుఁ బృథుకల్పోక్తిన్.

సీ. పరగునట్టి తృతీయ భాగశేషంబున
దేవయజ్ఞము నొంతేని భౌతి
కంబగు సవనంబు గావింపఁ దనరు ప్రా
ణాయామ సంకల్ప ధీయుతముగ
పరిషేచన క్రియల్ పాటిల్ల నగ్నిలో
దేవతలకు వేల్చి తెఱఁగు లమర
దనల దక్షిణ భాగమునఁ బితృప్రీతిగా
నపసవ్యమున స్వధా యనఁ జతుర్థ

తే.గీ. భాగమునఁ దెచ్చి యిడి మతి భౌతికమగు
క్రతువున కల తృతీయ భాగమున నెత్తి
రమ్యసూత్రిత శిఖ్యుత్తరమున నునిచి
మనుజసవన మొనర్పు క్రమంబు వలయు.

కం. పంచమభాగం బగ్ని ను
దంచితముగ వేల్వ వలయు నవని వినీతిన్
మింపుగఁగఁ బరిషేచనములు
నెంచఁగ మునురీతిఁ జేసి యొంతయు బ్రీతిన్.

తే. అగుఁ "ప్రజాపతయే" యను నాహుతి త్ర
యంబు నయ్యగ్ని వేల్చి శేషాన్న మెల్ల,
నొగి గృహద్వారమున నిల్చి యుదకయుక్తి
నష్టదిగ్వాయసముల కాహారమిడుచు.

కం. వైవస్వత కుల సంభవ
మై వెలసిన శ్యామశబళ కాఖ్యానములన్
దేవగు శునులకు యమప
ద్యాపనమున బలియొసంగ నగు శాస్త్రోక్తిన్.

ఆ.వె. భూతికామి పూర్వరీతి, సామ్రాజ్యార్థి
పొలుచు కేతుభంగి, భోగకాంక్షి
చక్రవృత్తి పుత్రసంపన్నకుండు వ
ల్మీక గతి బలియిడ తెస్సయగున.

కం. పాద ప్రక్షాళకులై
యాదట వసియించునట్టి యభ్యాగతులన్
దాఁ దోడ్కొని చని యర్చా
పాదకులై భోజనమ్ము పంక్తి నిడఁ దగున్.

వ. అంతకు మున్న యొనర్పం దగు దేవపూజాక్రమంబు వినుండు.

సీ. ఘన శంఖ చక్రలాంఛన మష్టదళ పద్మ
భాసురాలంకార బంధురమును
బహుదివ్య గంధ ధూప ప్రసవామోద
మగునట్టి పీఠి కల్యాణ రజత
తామ్ర శిలా మృత్స్న దారు మయంబులు
నైన శ్రీహరిమూర్తి నావహించి
రంగవల్లి వితానాంగణము విచిత్ర
విహితమౌ దేవతా గృహమునందుఁ

తే.గీ. బ్రాహ్మముహూర్తంబున శుచియునై పరమ నియతి
సమతఁ జిత్తంబు హరిపదాబ్జముల నిల్పి
భద్ర సంశోధితాసన ప్రౌఢి నమరి
మాతృకాంగ కరన్యాస రీతి మెఱయ.

ఉ. అచ్చట నష్టదిక్పతుల నావహనం బొనరించి రాక్షసా
త్యచ్చయవర్గముల్ దొలఁగ నూర్ధ్వగ దేవత లెల్ల రాఁగ భా
స్వచ్ఛలనాత్తఘంటిక ధ్రువమ్ముగ మ్రోయఁగఁ జేసి దిక్కులన్
హెచ్చు నిజాసనస్థితికి నింతయు బంధనమున్ ఘటింపుచున్.

కం. కలశమునందుఁ బ్రియార్తులఁ
గల త్రిదశులఁ దీర్థచయాము గంగా ముంత్రో
క్తుల నావహించి శంఖము
జలజాహిత దైవతముగ సమకూర్పఁ దగున్.

తే.గీ. శంఖ చక్ర గదాపద్మ శార్ఙ హస్తు
నిందిరా సుందరీ సదా మందిరోర
హారు కౌస్తుభ వక్షు నీరేరుహాక్షు
నచ్యు తరిపాసపదను ధ్యానం బొనర్చి.

క౦. శాంతు ననంతుని లోకా
క్రాంతు రమాకాంతు భక్తగణవంతుఁ గళా
వంతు మహోదాంతుఁ గుణ
వంతుని నా వాహనంబు వలయుం జేయన్.

తే.గీ. అఖిల జీవాంతరస్థు మహానుభావు
నణువునకు నొద్దిగొప్పకు నధికమైన
యట్టి విభునకు రత్నసింహాసనంబు
నార్యుఁ డిడ నగు భక్తి తాత్పర్యములను.

క౦. ఆద్యుం డాగమచయ సం
వేద్యుఁడు నిజభక్త సుజన వివిధామయ స
ద్వైద్యుఁడగు విష్ణుమూర్తికిఁ
బాద్య సమర్పణము సేయఁ బాటి బుధులకున్.

క౦. నీరేజ భవాండమ్ము
నీరనిమగ్నమగునపుడు నిద్రారతి చే
నారాయణుఁడగు హరికి సు
ధీ రతి నర్ఘ్యంబొసంగు తెలిఁగొప్పమరన్.

క౦. ఆ చతురానన రుద్రులు
వాచంయమివరులు నెన్న వాఁచించినచో
వాచామగోచరుండగు
నాచతురున కొసఁగవలయు నాచమనమ్ముల్.

క౦. శ్రీసూక్త పురుషసూక్త మ
హా సూక్తములన్ సుధాబ్ధి సంచిత లీలా
భాసురుఁడగు శ్రీ విభునకు
వాసిగ నభిషేచనమ్ము వలయుం జేయన్.

క౦. కనకాక్షహరణుఁ గ్రమ్మఱఁ
గనకాన్వితపీఠి నునిచి కనకాంశుకముల్
కనవేడుక గాఁ బెనుతో
క నకుచిలప్రీతి నొప్పఁగా నిడవలయున్.

ఉ. బంగరు కమ్మిగుల విభాసితమౌ దర మౌక్తిక ప్రభా
సంగతయజ్ఞసూత్ర మురుసార మృగీమద కుంకుమార్ద్రితో
త్తుంగ సుగంధి గంధముల తోరములై యరుణప్రభాస్థితిన్
రంగగు మేలియక్షతలు రాజితలీల నొసంగగాఁ దగున్.

చం. కలువలు చంపకమ్ములును గస్తురి పట్టెలు జాజిపూలు మొ
ల్లలు విరజాజులొప్పు ముకుళమ్ములు పొన్నలు బొండుమల్లియల్
జలజములున్ జిల్లుల్ల వరసౌరభ సంగతనవ్య పుష్పముల్
వలయు రమాధినాథ పదవారిజ పూజకు భక్తకోటికిన్.

శా. ప్రాల్గిన్ శ్రీహరిపూజ కొక్క తులసీపర్ణంబు సద్భక్తితో
సాలగ్రామముపై నొకండు దళ మిచ్చన్ బూజ గావించు నా
శీలాన్నత్యుఁడు పాతకావళుల నిశ్చింతన్ విసర్జించి త
త్త్రైలోక్యంబున మించఁ గాంచు విభవాత్యంతస్థితిన్ నిత్యుఁడై.

కం. తులసీదళావచితికిన్
[దులయగునే !] యితరపూజ తోరపు భక్తిన్
గలిగిన సువర్ణపుష్పము
లలవడఁ బూజించుటొప్పు హరి చరణములన్.

తే. గోఘృతంబును సాంబ్రాణి గుగ్గిలమ్ము
నగరు కురువేరు మొదలు దశాంగములను
ధూపమొసఁగుచుఁ గర్పూర దీప మిడిన
నిరయబాధలు తొలఁగు వర్ణితనియాధి.

ఆ.వె. భక్ష్య భోజ్య లేహ్య పానీయ చోష్యమ్ము
లాది గాఁగ బహువిధార్థయుక్త
కనకపాత్రపంక్తి కమలాక్షునకు నివే
దనము సేయవలయు ధన్యమతిని.

కం. హస్త ప్రక్షాళనము ప్రబ
శస్తగతిం జేసి సుదళ సత్క్రముకమ్ముల్
విస్తుల చూర్ణమ్మున్ సా
మ్యస్తుతి పాత్రస్థవీడ్య మగు హరికొసఁగన్.

ఆ.వె. అగు త్రిలోక తిమిర హరణుఁడౌ హరికి నీ
రాజనమ్మునర్చి రమణ వలయు
భాగవతుల కెల్ల భగవత్ప్రసాదమ్ము
తీర్థయుతము గాఁగ ధృతి నొసంగ.

సీ. మహితసౌరభపుష్పమంజరి, తుళసీ ద
ళంబుల మంత్రపుష్పంబొసంగి
న్యాయంబు దప్పక నరపతుల్ భూమిఁ బా
లింపంగ వలయు మేలిమిగఁ గాల

గతులు దప్పక వాన గల్గఁగా వలయు స
స్యములు పండఁగవలె నధిక శుభద
సౌఖ్యమ్ము లమర దేశమ్ము లుండఁగవలె
గో బ్రాహ్మణులకు నెక్కుడుశుభమ్ము

తే.గీ. అ మరవరెంచు సాష్టాంగ మాచరించి
నృత్తముల్ సల్పి కీర్తించు నియతివలయు
నచ్యుతుని సన్నిధిని బాపహారణమునకు
నంతకంటెను క్రియలు లేవరసిచూడ.

చం. కల కొలఁదిన్ సుగంధి కనకప్రసవాంశుక నృత్తగీత ని
శ్చల బలుభక్ష్యభోజ్యముల సౌరభలేప బహూపచార సం
కలిత మహానురాగమునఁ గంజదళాక్షునిఁ గొల్చువారికిన్
దలఁగు విపద్దశల్ శుభము దార్కొను సౌఖ్యము లుల్లసిల్లఁగన్.

కం. స్రక్చందనాదు లతి నుతి
వాక్చాతురి మెఱయ భక్తవత్సలుఁడగు స
ష్యక్చరితున కర్పించిన
దిక్చయ పాలైక విభవ ధృతి గాంతు రిలన్ ॥

చం. అనుదిన మర్థి విష్ణుఁడని యంచిత భక్తి నమస్కరించి పూ
జనములొనర్చి చుట్టములు సాధులు బాంధవు లాశ్రితుల్ ముదం
బున వసియింప నచ్చట విభుత్వముమాని సమస్తవస్తువుల్
దనకును బంక్తికిన్ సమవిధంబున వడ్డన సేయుటొప్పగున్.

తే.గీ. పరఁగ నాత్మార్థ పాకియుఁ బంక్తిభేది
యను పృథక్పాకి బ్రహ్మఘ్నులనఁగఁ దగుట
నట్టి కృత్యము విడచి శ్రీహరి నివేద
నాన్నము భుజింపఁదగు దామసాళి విడిచి.

కం. అన్నము లోపలి సారం
బెన్నఁగ నమృతమటఁ గలుష మేర్పడ సురయౌ
నన్నమునఁ గలియు సారం
బెన్నఁగ మలమండ్రు శ్రుతి విహిత వాక్యవిదుల్ .

కం. మానియు మితాశనుండ గు
మానవుఁ డపవర్గమొందు మ [తి] ద్వాత్రింశ
న్మాన కబళోదనుఁడు సుఖి
యౌ ను ద్రివారావగాహి యటు వక్తుఁ డగున్.

కం. ఆపోశన మాపోసన
మేపారఁగ నాసనమ్మునితరులిడఁ దగున్
శ్రీపతిమకు శోధిన్యబ
లా పదరజములును పోక లలి నీరు లెడయున్ ॥

కం. ఉల్లియుఁ దిలపిష్టమ్మును
ముల్లంగి యలాబు హేయభూ జనితంబుల్
వెల్లగు బచ్చలి తామస
ముల్ల నివి త్యజింప వలయు నింగితబుద్ధిన్.

తే. పీటఁ గూర్చుండి పదములు పృథివి నునిచి
యైదు వేళులఁ గబళమ్ము లనువు గాఁగ
యెడమచెయి నేలనూనక కడ మునుపక
భోజనము చేయఁ దగవగు బుధులకెల్ల.

కం. పరిషేచన మారభ్యము
పారిఁ ప్రాదక్షిణము చిత్రభక్తు లిడఁదగున్
మఱి యప్రదక్షిణమ్ముగ
నారయుంచుట లిష్టభుక్తి నియతిఁ దలంపన్.

తే. చిత్రములఁ జూచుచు చెవిరుల్ భుజింతురేనిఁ
బరగు దోషమ్ము యమునూక్త పఠనములను
గాని తీఱదు చిత్రాన్నమూని యవల
మఱుగు నేయఁగఁ దగు ధరాసురులకెల్ల.

కం. కబళ కబళమ్మునకు మఱి
ప్రబలఁగ గోవిందనామ పఠనము చేతన్
సొబగొందు మాస నిరశన
ప్రబల వ్రతఫలద మగుచుఁ బరగు బుధులకున్.

చం. మునుమును దియ్యగూర లతిమోదముతో గటు శాకతిక్తముల్
గొనకొని వెన్క నామ్లములు కూర్మిఁ దుదన్ భుజియింప మేలగున్
గనువడఁ బాయసాన్నములు భక్ష్యము లొప్పగు నుల్పిబంబులున్
ఘనతఁ బవిత్రపాణి లలనామణి వడ్డన సేయ మానకన్.

కం. రాత్రిన్ దధియుక్తాన్నము
పాత్రము భోజనము నడుమఁ బానజలమ్మున్
గాత్రమ్ము పుష్టి నేయున్
ధాత్రిన్ భక్త్యంత పానతన్ బలమొనర్చున్.

కం. పన్నుగఁ గానము చేతను
నన్నము జీర్ణింపఁ జేవ దధికంబైనన్
దిన్నదగు జాతరానల
మెన్నిక బలుమారు ద్రావ హితమగు భుక్తిన్.

కం. సలవణ జంబీర రసా
జ్యాల దేలా తక్ర ముమరుఁ జతురత భుక్తిన్
జలిపిన వెనుక, నసాక్షిగ
వలనదు భుజియింప నీయవర్తనమగుటన్

సీ. తానైన సతియైనఁ దనసుతు లైనను
సద్బంధు శిష్యులు సఖులు శ్రోత్రి
యులు నేయు పాకము వలనగు భుజియింప
రహి నెందుఁ బరపాకరతుఁడు, నెపుడు
నెచ్చట భుజియింప నిచ్ఛగించినవాఁడు
నిరయ యాతనలఁ బొరలు మిగుల
భోజనానంతరంబున నుదకము ద్రావ
నమరు తర్జని మధ్యమములనడుమ

తే. వలయు ధరఁబడవిడఁ గారవములసద్మ
తతుల వసియించు పితరుల దరికిఁ జేర
నవ్యగండూషముల త్యాగవంబు నైగ
మోక్తముగఁ జేసి వార్చి యథోచితముగ.

కం. కరములు గడుగక మున్నుగఁ
గర మమరఁగఁ బుక్కిలింపఁగాఁ దగు జలముల్
గరములు మున్నుగఁగడుగఁ బి
తరులకుఁ బుణ్యంపు హాని తప్పదెందున్.

తే. నాలుగెనిమిది పన్నెండు నోలిఁ బదియు
నాఱుగండూషములు క్రమాచారముగను
మూత్రముల సర్వవర్ణుల భుక్తి పిదప
సురతకృత్యము పిమ్మట శుచులకెపుడు.

కం. సారపురాణాగమ రుచి
చారముచేఁ బ్రొద్దు జరగ సంధ్యావేళన్
ధీరమతి సంధ్య వార్చి జ
పామోధిన్ మెలఁగవలయు హరినుతి దనరన్.

కం. కర్మములన్నియుఁ జేసియు
నిర్మలమతి విష్ణుభక్తినిరతుఁడు గామిన్
దుర్మతి దుశ్చర్యుఁడు నా
నర్మిలి లక్ష్మీశుఁ గొల్వనగున్ శుభముల్.

శా. నిర్వాహంబున సత్పితృప్రతతి నెంతే యజ్ఞకర్మంబులన్
గీర్వాణావళి, సజ్జనాతిథుల భుక్తిన్ వేదపారాయణన్
సర్వాంచన్మునులన్ బ్రజాపతులఁ బ్రాజాపత్యరీతిన్ బలిన్
దుర్వారస్థితి భూతకోటి, జనసంతోషంబుగా బ్రీతిచేన్.

కం. ముదమొదవ మెలఁగు విప్రుని
కొదవున్ సకలార్థసిద్ధి యుఱుతరసుకృతా
స్పద దివ్యలోక సౌఖ్యము
లదనందగు బ్రహ్మపదవి యంచిత వృత్తిన్.

సీ. అనఘ వానప్రస్థుఁడఖిల సంగమ్ములు
విడిచి శుశ్రూషకై వెలఁది వెంట
రా నగ్నిహోత్ర సంరక్షణముఁ జక్రి
యను లాశ్రమములుగాఁ ద[illegible]ర న[illegible]టఁ
గందమూల ఫలాదికము లిన్నిలో వేల్చి
తచ్ఛేష మగ్ని సంతర్పణముఁ,
శాత్మపోషణమున కన[illegible]స్థితిఁ జేసి
నిత్యకర్మాచార నిరతుఁడగుచు,

తే.గీ. బ్రహ్మచర్య వ్రతస్థితిఁ బరగి యజిన
వల్కలంబులు దాల్చి దేవతల పూజ
లేమఱక, భిక్షలిడుచు నెంతేని ద్వంద్వ
ములకు నోర్చి సైరించుచు నలఘువృత్తి.

కం. అవసానకాల మొదవిన
నవిరళమగు వహ్ని నాత్మ నారోపణమున్
సవరించి బ్రహ్మనిష్ఠా
ప్రవణుండై యిష్టపదము ప్రాపింపఁదగున్.

ఉ. అంతట భిక్షుఁడైన రూఢ నాత్మ నిరీహయు నిర్జితేంద్రియా
భ్యంతరవర్తనమ్ము బ్రణవార్థ జపాన్విత నిత్యకర్మముల్
సంతత విష్ణుదేవ పదసారస చింతనమున్ నిరింధనా
త్యంతిక పావకస్థితి మహోత్సవము గల్గిన ముక్తి చేకుఱున్.

కం. స్నానంబు చతుర్వర్గ ని
దానఫలప్రదము స్నానధర్మనిరతుఁడై
పూనిక భజింపఁ దివ్యుం
డా నరుఁడు మలాశి యనఁగ నవసిం బరగున్.

కం. గాయత్రిఁ బోలు మంత్రం
బేయెడలను లేదు మానసేప్సిత లోక
శ్రీ, యనుభవముల్ మోక్షం
బాయతమగు విష్ణుపదమునై పొలుపమరున్.

ఆ.వె. బ్రహ్మయజ్ఞ మఖిలపాతక హరణంబు
నఖిలదేవతా ప్రియంబు వైశ్వ
దైవమబ్జనాభ ధన్యపదావాప్తి
యతిథిపూజ సుగతి కాకరంబు.

సీ. పల్లవ తృణ దారు పార్థివోపల కృతా
సనము లామయము సిద్ధనము సేయు
ఒలుపగు రత్నకంబళి సర్వకార్యార్థ
సిద్ధిద కుశవర్గ చింతనలకు
వ్యాఘ్రచర్మము పావనము కుశాసన
మింతుక మైశ్వర్య మంగళముల
సంఖ్య కెక్కుడు పర్వసంఖ్య దానికి నెచ్చు
పుత్రజీవియుఁ దమ్మి పూసలౌక

ఆ.వె. స్ఫటికరాజతోరు [స్వర్ణ] మయమ్ములు
ననఘరత్నమయము లంతకంటె
మోడదమ్ము దర్భ ముల్లు రుద్రాక్షలు
వేదమాతనెన్న విప్ర తతికి.

కం. ఇట్టినియమములు మునుపటి
పుట్టువు సత్కర్మతతులు పుణ్యప్రదమై
పట్టుకొని మరల నవనిన్
బుట్టిన భూసురుల కొదవు బుధనుతగతులున్.

కం. విను రాజుల కాయుధ జీ
వనముల్ శిష్టావనమ్ము వారక రిపు మ
ర్దన దుష్టనిగ్రహంబులు
జను భూసురరక్షణమ్ము సత్యగుణమ్మున్.

తే.గీ. యజన మధ్యయనమ్ము దానాభిరతియు
నర్హమగు యాజనమ్ము నధ్యాపనమ్ము
దానములు గొంట నృపతికిం దగవుగాదు
ప్రబలి తామస [రాజస?] చరితుఁగుట.

చ. రహి దలకొత్తఁగాఁ బ్రజల రంజనసేయుట రాజనామతన్
వహి గను సర్వలోకహితవర్తనకై సృజియించె బ్రహ్మ దు
స్సహ ధరణీ ధరావ్యమిత సంపద సాధు జనావన క్రియా
బహుతర శస్త్రజీవిక కృపాకరభూవర వంశ మిమ్మెయిన్.

సీ. సకలవర్ణాశ్రమాచార ధర్మక్రియా
నిర్ణీతిచాతుర్య నిపుణ మహిమ
దుర్మదోద్ధతఘోర దుష్టశిక్షా శౌర్య
ధైర్యమకుటౌదార్య ధన్యగరిమ
నిఖిల దేశిక సుఖాన్విత విచక్షణ కళా
మంత్రి సామంతసామర్థ్య వహిత
ధరణీసుపర్వ నిత్య విధి ప్రపూర్ణ త
త్ఫల భాగ సంగ్రహ విలసితమతి.

తే.గీ. శక్ర యమ వరుణ ధనద సన్నుతాంశ
కలితబహుభోగదండన ఘనకృపా వి
శేష వితరణ గుణగణా శేష లోక
పాలనోత్సవపరులు భూప కులవరులు.

తే.గీ. అట్టి క్షత్రియవంశజు లఖిల భువన
రక్షణాధ్యక్ష సత్ఫలాపేక్ష ధరణి
సురులఁ బోషింప వారి తేజో విభూతి
క్షాత్రబలవర్ధనంబగు సారమహిమ.

కం. వారలకు నలిగిరేనియు
వారని తత్కోపవహ్ని వడిఁ గ్రాఁగుదు రా
నీరమునఁ బుట్టు ననలము
నీరమ్మున నణఁగు నట్టినియతి దలిర్పన్,

ఉ. పాలితలోకుఁడైన నరపాలశిఖామణి యాత్మరక్షకుల్
జాలిన భృత్యవర్గముల సారె బహూకరణమ్మొనర్చి వి
ద్యాలలితాత్మ నీతియుతు ధర్మవిచక్షణు స్వామికార్య ని
ష్ఠా లసదప్రమత్తు సరసున్ సచివాగ్రణిఁ జేయఁగావగున్.

ఉ. భూప్రజ భారమెంతయును బూనికతోడ వహించి వారితో
న ప్రియముల్ ప్రియోక్తు లట నాడుటు కొక్కని నేర్పరించి శ
త్రు ప్రశమప్రసంగముల ధూర్వహుఁడై సమ శత్రు మిత్ర శ
క్తి ప్రకృతి ప్రవీణమతిఁ గీర్తి వహించినఁ గాంచు సంపదల్.

ఉ. నమ్మిక పుట్టఁగాఁ గల జనంబులఁ బ్రోచిన కాపు విత్తమ
ట్లొమ్ముగఁ గాంచి భూపతికి నూర్జితవైభవ మావహిల్లఁగా
సమ్మతిఁ జేయు నెంతయు వశంవద సద్ధనధాన్యుఁడైనచో
నమ్మహిభర్త దేశముల నన్నిఁట మేలనఁ బొల్చు నెప్పుడున్.

కం. సత్యంబాయువు నొసఁగును
సత్యమె ధనధాన్యవృద్ధి సమకూర్చు జయా
స్పత్యము గల్గు దాననె
సత్యమె ధర్మము కీర్తి సద్వ్రత మెందున్.

సీ. పరశురాముఁడు భూమిపాలుర నందఱ
వధియించి యఖిల సర్వంసహయును
కశ్యపునకు దానకాంక్ష నిచ్చిన యంత
నతఁడు విప్రుల కిచ్చె నవని యెల్ల
భూసురు లది యేలఁ బొత్తు వోవక వైశ్య
శూద్రులు, తత్పతిస్తోమ ధనము
లపహరింపఁగ నంత నయ్యధర్మమునకు
నోర్వక నిల గ్రుంగ నూరువులను

తే.గీ. నొత్తు కశ్యపుఁ గని ధాత్రి యూరఁగి రాజు
నేర్పరింపఁగ వరము దా నెలమి వేడ
నజుని యనుమతి నతఁడట్ల యలవరించె
క్షత్రకులమును ధాత్రిరక్షణమునకును.

కం. కావున భూసురుల న్నిజ
దైవములుగ దలఁచి వర్ణధర్మస్థిరతన్
గావింపవలయు రాజ్యము
పావనమగు దండనీతి పద్ధతి దనరన్.

ఉ. ఆవుల మేపి పాలు గొనునట్టి తెఱంగునఁ దోఁటఁ బెట్టి యా
పూవులు దాల్పు చందమునఁ బొల్తుకఁ గైసానరించి క్రీడలన్
భావ మెలర్పనుండు గతి పట్టుగ భూప్రజఁ బ్రోచి వారిచేఁ
గావలె నన్నదెల్లఁ దగఁ గైకొని భూవిభుఁ డొప్పు నెప్పుడున్.

మ. చదువుల్ సాము పురాణగోష్ఠి ఘనభాస్వద్విప్ర సంరక్షణా
స్పద నానావ్రతదాన విష్ణుపదపూజా శాస్త్రవిజ్ఞానముల్
విదితాజ్ఞావిభవంబు న్యాయములు సద్విద్యాప్రవీణత్వ, మ
భ్యుదయానేక విధాన కర్మచయ మొప్పున్ రాజధర్మమ్ములై.

కం. తపములు వ్రతములు యజ్ఞము
లపరిమితము చేయుకంటె నధికము ప్రజలన్
గృప న్యాయమ్మున మనుపుట
లెపుడున్ ద్విజవరుల భక్తియొడలమి పతికిన్.

సీ. అర్థికోటికిం దగినట్టి కోరికలిచ్చి
పరిజనములకు సంబళములొసంగి
మిత్రుల నెల్ల నెమ్మిగ ధనాఢ్యులం జేసి
శత్రుకార్య విచార సరణు లెఱింగి
ప్రతికార్యమును నీతి మతి సంఘటింపుచుం
బ్రాంతవారలను శోభనత మనిచి
చారదృక్తతుల దేశస్వాస్థ్యముల్ గని
సామంత మంత్రుల జాడ లరసి.

తే.గీ. ఘనత నేపట్లం దన్నుదాం గాచికొనుచు
ధీర విశ్వాసకుల కధికారమిచ్చి
ద్రోహి కుటిలా వివేకుల దూము సేసి
రాజ్యమేలెడి యాతండు రాజవరుండు.

కం. వర్తకులకు భూప్రజకున్
గీర్తికి [దగ?] కళలొసంగి క్షితిం బేదలం దాం
వార్తకు నైక్యంగం బ్రోచి సు
వర్తనుండగు రాజు భాగ్యవంతుం డెందున్.

కం. వికలాంగుల రక్షింపుచుం
బ్రకటితసాహసుల ఘనులం బావనకులులన్
సుకరుల సైన్యేశులంగా
నకలంకత మనుచు నృపతి యతి ధన్యుండగున్.

గీ. వారు లుబ్ధు నవిశ్వాసుఁ జేరనీక
రోగి వృద్ధుని దీను నారూఢి మనిచి
న్యాయమున నర్థధనముల నధికముగను
ధనము నిచ్చింపఁ జనదు భూధవున కెందు.

ఇది రాజధర్మంబింకను గ్రంథాంతరముల నెఱుంగఁబడు వైశ్యధర్మంబు వివరించెద.

సీ. కృషియు వాణిజ్య సుకృత ధేనుగుప్తముల్
సత్యవాక్యము విప్రజనపదాబ్జ
సేవయు దానమ్ము శ్రీహరి భక్తియు
శ్రుతిరమోపాసన శాంతి సకల
శాస్త్రార్థ విజ్ఞాన శమదమ సంగతి
బ్రాహ్మణాచారత పావనాగ
మునరఁ గర్మము చేయుటు చిత్తవర్తనమును
నత్యాశ లుడుగుట లమరు వైశ్య

తే. కర్మములు దలంపఁగా హరి భజనమ్ము
విప్రభక్తి గల్గి వెలయ వలయు
శూద్రధర్మమునకు భద్రాత్మకమగు త్రి
వర్ణ సేవనంబు వశ్యకరము.

కం. ఆ చాతుర్వర్ణ్యాశ్రమి
తాచారము లాదవుకంటె నతి సులభంబుల్
బ్రాహ్మర్య శుభప్రదము మ
హాచతురతఁ దగు పతివ్రతాచార మిలన్.

సీ. పతిదైవ మనుచు సంతతము దత్సేవ సే
సిన నెల్ల దేవతల్ దనిసి గాంతు
రచ్యుతుఁ డెక్కైన నర్థించుఁ గావునఁ
బతి తుష్టి సేయుట సతికిఁ దగవు
భర్త లేవకమున్నె యరగ మేల్కాని గృహ
శుద్ధి గావించి భాసుర లలాట
తిలకమ్ము ధరియించి లలిత హరిద్రాది
లేపనరాజ నయశీల విభుఁడు.

తే. గీ. ధనువు తుది వేగ నొనరించి తనులయొడల
నలయికలు మాని వేసట నంద కటుల
సంతసంబునఁ జేయుచు స్నానదేవ
పూజనాదికములను నేర్పున ఘటించి.

తే. గీ. పొట్టు సమ్మార్జనియఁ ద్రోయి బూది కట్టి
యలుకు గనుపడనీక మూలలకు నొదిగి
చూడ్కి కింపుగ గృహము భాసురమొనర్చి
శుచి రుచులుగల్గఁ బాక [మచ్చు?] గనొనర్చి.

చ. తనపతి కెద్దియో ప్రియము తానది పూనికఁ జేసి భక్తియుక్
వినయము దాల్చి భర్త కడుపీడఁగఁ బల్కినఁ జిన్నవోక, మా
ఱనక ప్రియమ్ము లిమ్మడిగ నంచితశీలమున న్మెలంగు న
య్యనిత గదా! సమస్తజనవంద్యచరిత్ర పవిత్ర యిమ్మహిన్.

మ. పతి దుర్వారలఁ ద్రోచువారు సనకుల్ బంధువ్రజంబేర పై
నతికోపంబొనరించువార లహితుల్ హర్షించు మార్గమ్ము దుః
ఖితుఁడైనం గడుదుఃఖి, నవ్వునెడలన్ గేళిగతుల్, ఖిన్నుఁడై
న తతిన్ ఖిన్నదనంబునొందు సతివో! నారీలలామంబిలన్.

ఉ. దాసివిధంబులం బనుల, దల్లి విధంబునఁ బోషణంబులన్
భాసురబుద్ధి మంత్రిగతి, బాంధవురీతి విపద్దశన్, మహో
ల్లాస సుఖప్రసంగరతులన్ వర వారవధూటికైవడిన్
వాసిగ నట్టి శాంతి గుణవర్తిత సాధ్వి దలంచి చూడఁగన్.

కం. పతి పలుకులు జవదాఁటక
వ్రతదానము లపనియాజ్ఞవహిఁ జేయుచు న
న్మతి వాక్కాయిక కర్మ
వ్రతతులఁ బతిమీఁద భక్తి పట్టుగ నెలమిన్.

ఉ. తల్లియుఁ దండ్రి బాంధవుఁడు దైవము నెచ్చెలియాప్తుఁడున్ మనో
వల్లభుఁడార్యుఁడున్ సుకృతవైభవ మాత్మవిభుండె యన్య లా
నెల్లరు నంత్యభర్తగతి నిష్టులుగారని నిశ్చలాత్మయౌ
పల్లవపాణియే ద్వికులపావని శ్రీవనితాంశజాతయున్.

చ. విభుఁడు వివేకియైనఁ గడుఁ జీలఁడియైన, ధనాఢ్యుఁడైన దు
ష్ప్రభుత దరిద్రుఁడైన మతిబంధురుఁడైన, నబుద్ధియైన, స
త్ప్రభ రుచిరాంగుఁడైన గత సుందరుఁడైనను, దైవభావనన్
బ్రభు నతిభక్తి సేయఁదగు భామకు భర్తయె దైవ మెన్నఁగన్.

శా. గంగాస్నానము సేతు సేవయును గోకన్యాప్రదానవ్రతో
త్తుంగ ప్రక్రియ లాచరించు నెయ్యింతుల్ సాధ్వితో సాటియే!
సాంగత్యాధిక భక్తి సుస్థిర హృదబ్జాత క్రియాధారయా
శృంగారాకర భర్తృసేవ వలనన్ జెల్వొందు నంతేనియున్.

కం. పతిపూజ సకల దేవ
ప్రతతిం బూజించునట్టి ఫలములొసంగున్
బతి కెదురాడిన దానికి
గతికలదే! నిరయలోకగతి దక్కంగన్.

కం. చెదరని భక్తిన్ మదిఁ గడు
ముదమున ధర్మార్థకామ ముఖ్యార్థముల్
పొదలంగఁ బతిసేవయె తగు
సుదతికి నితరయొండుగతుల శుభములు గలవే!

చం. పురుషుఁడు స్వర్గమేల్కనుచుఁ బుణ్యసులక్షణహీనఁ జూచినన్
దొరకొను కీడు తల్లి సమిదోడులు దక్కఁగ భర్తృహీనయా
తరుణి కృతాపగాహయయి తత్పరతన్ ధవు సూర్యకాంతుఁగా
గుఱిచి నమస్కృతార్ఘ్యములు కోరిక నిచ్చుచు నేకభక్తయై.

కం. సుతులయను మతిన్ దాన
వ్రతములు గావించుకొనుచు వహి సన్న్యాస
స్థితి గొనడపడికిం దగు
మతి విధవయు సుకృతశీల మహిమన్ జెలఁగున్.

చం. తనయులు లేని యంగన ముదమ్మున భర్తకుఁ బ్రీతిగాఁగ న
వ్యవజదశాత్మఁబూజ లనువారము భూసురతర్పణమ్ము శో
భన ఘనదానధర్మములు పావనసద్వ్రతచర్య నొందినం
దనవిభుఁ గూడి స్వర్గసుఖసన్మతి నుండి చరించు నెంచఁగన్.

కం. ప్రౌఢిమ సద్వ్రతనిరతా
రూఢిన్ సార్ధత్రికోటి రోమపరిమితో
ద్ధాతాబ్దంబులు సురపురి
నోలాంచద్వైభవముల నుండున్ దిరమై.

కం. కలికాలమ్మున స్త్రీ శూ
ద్రులు సాధువులనుచు మునులతో వ్యాసుఁడు మున్
దెలిపెఁగదా! సురతటినీ
జలమత్యస్థితిని సుకృత చరితాస్పదుఁడై.

సీ. సప్తసంతాన భాస్వచ్చారు చరితులు
కదన మంపీరుహై యదరుగుండె
పితికి కండయు లేక యరులచే నీల్గిన
ఘనులు సమ్యగ్దాన కలన నమరు
వితరణ గుణులు సద్వినుత సత్యవ్రతా
చారులు వియమ ప్రచార హితులు
సుచిత వర్తనులు సర్వోపకారులు ఘన
స్వర్గాది లోకసంచారులగుదు

తే. గీ. రఖిల పుణ్యనదీ భూధరాశ్రమములు
గాంచువారలు సత్యలోకమున నుండ్రు
పుణ్యకాలమ్ము గడపని భూరి సుకృతు
లబ్జభవు నొద్ద నుందు రత్యధికలీల.

కం. ఉప రాగవిషువు లయనము
లుపవాస వ్రతదినమ్ములారి పర్వములన్
విపుల తర పుణ్యకాలము
లపరిమిత ఫలప్రదమ్ములవగాహమునన్.

సీ. గ్రహణకాలమ్మున గంగగోదావరిం
గృష్ణం గావేరిం గ్రుంకిపుటు లెప్పు
జాహ్నవీ సహ్యజా సంగాంబుధుల జగ
న్నాథ సేతువుల స్నానఫల మధిక
మగుకోటి ధేనువు లన్ని కన్యాదాన
ములు సేయు సుకృతమ్ము గాంగు కతన
స్వామి పుష్కరిణిని శశి పుష్కరిణియందు
నిత్య పుష్కరిణిని నీరయు శుభము.

ఆ. వె. వలియు జలధిం గలయు మహనీయ నదుల యం
దంతకంత తక్కువగు ఫలమ్ము
దేవఖాతసమితిం దెలియనట్లగు నర
ఖాతసరసు లల్పగత ఫలములు.

కం. కూపోదకములం గ్రుంకుట
పాపం బుపరాగవేళం బరగనశక్తి
వ్యాపారు [లు] తటి నీహ్రద
[పే] తీర్థోదకముల వారిం గ్రుంకిడంగన్

చం. ఘనతరపుణ్య తీర్థములఁ గాఁగుల [దెప్పక] స్నాన కర్మముల్
దన కల కొద్ది దానములు దాలిమి మేలిమి నేయఁగాఁ దగున్
వినఁడటు నంతకోపమిని విప్పని నీళ్లని యెంచి స్నానమున్
దనరఁగ నేయ కున్కి యగు ధర్మ విరోధము సాధునిందయున్.

తే. గీ. విష్వయన సంక్రమంబుల వెస నుగాదు
లందుఁ బర్వంబులను గ్రుంక నట్టివాఁడు
బ్రహ్మరక్షః స్వభావము న్బరగ మెలఁగు
మఱియు జన్మదకంబైనఁ గాకమొదవు.

కం. తోయము తెల్లగ గంగా
తోయము దానము లుభూమితులలకు నైనయా
నాయెడ విప్రులు బ్రహ్మస
మాయతులౌ గ్రహణకాలమగునెడఁ దలపన్.

సీ. అందు శాఖాత్రయ మనువుగఁ జదివి గ
ర్భాధానమాది యౌనట్టి వేద
సంస్కారములు గల్గు సద్గుణుఁడతఁడు బ్రా
హ్మణుఁ డాత్మశాఖ తదంగ పంక్తి
సంస్కారయుక్తుఁడై చదివిన యతఁడు వి
ప్రుండదేమియు లేక పూర్ణి సకల
సంస్కారములు గల్గి సత్కర్మరుండైన
యతఁడు ద్విజుండగు నదియు మాని

తే. గీ. కాలము నెఱింగి గాయత్రి మేలి మెసఁగ
జపము నేయుచు నాచార నిపుణుఁడైన
యతఁడు ధారకుఁ డట్టి గాయత్రి యొప్ప
డోపలుకు వాఁడు జాతి మాత్రోపజీవి.

కం. అదిగాక విప్రులెన్నఁగఁ
బదివిధములఁ బరగు చుండ్రు బంధుర కర్మా
స్పదమగు రీతుల గుణముల
విదితముగాఁ దద్విధము న్వివరింతుఁదగన్.

సీ. శౌచయుక్తుఁడై సాత్విక సద్గుణుఁడై కర్మ
పరతఁగి యతఁడు దేవద్విజుండు
తను కలమటు కోర్చి తనధర్మములు చేయు
పుణ్యుఁడు సంయమి భూసురుండు

సంతానశాలుఁడై సత్కర్మనిరతుఁడై
ప్రబలు నాతఁడు విప్రబాడబుండు
నాయుధజీవియై యౌదార్య శమదమస
త్క్రియాన్వితఁడు క్షత్రియుండు

తే. గీ. వర్తకత నుండునాతఁడు వైశ్య విప్రుఁ
డరయఁ గృషిసేయ శూద్రధరామరుండు
మలు వగల వాఁడు సంకర బ్రాహ్మణుండు
తిరుగునెపుడు పిశాచ ధాత్రీసురుండు.

ఉ. మానవచిత్తముల్ గలఁగ మాటికిఁ బల్కుచుఁ గర్మశూన్యుఁడై
దానొరులన్ హసించుచటు దబ్బఱలాడుచు నీర్ష్యచే నసూ
యాను భవమ్ము హింసలనయంబిల మాననివాఁడు ధారుణిన్
దానవవిప్రుఁ డెంచమదిఁ దాలిమి మేలిమెఱుంగఁ డెవ్వఁడన్.

కం. బరువులె మోయుచు గడు దు
ష్కర కర్మము దవిలి సర్వకటకవృత్తిన్
బరువఁపు మాటలె నిజముగఁ
బరగిన యతఁడవని గార్దభద్విజుఁ డెలమిన్॥

ఆ. వె. కులము విడిచి యన్యకులమునఁ గలసిన
యతఁడు పతితుఁడగు మహోఘమూర్తి
మఱియు నట్టిజాతి మరగి మెలంగిన
వాఁడు నట్టిజాతి వాఁడు దలప॥

కం. సందెల భోజననిద్రలు
నుండెలవలనొందు వేదనుతి పాతముగా
దెందున్ బ్రహ్మారోహత
యుంపటినిందాఁటికరములూఁదుటఘమ్ముల్॥

సీ. ఒరునింటఁగాఁపుర ముండుట కొఱగాదు
పుత్రదారలతోడి పోరుగాదు
ద్విజభృత్య బాంధవ ప్రజ వివాదముగాదు
పతితులతోఁ బ్రతిభాషచనదు
గోమహిషిక్రయమూల వర్తనగాదు
— — — —
దేవతా సన్నిధి దీర్ఘ యాత్రలఁ బుణ్య
తీర్థ స్థలాదులఁదె అవగ..యఁ

తే. గీ. తనదు విద్యయు నతిథివస్త్రములుఁ గన్న
ముంగపొత్తుట కలయంటుటం గ్రహింపఁడ
నంబు శూద్రులచేగాదు నయవిదులకు
గూఢజలపాన శౌచముల్ గూడవరయ ॥

ఆ.వె. మూర్ఖుతో వివాదమును గుంటా గోష్ఠి
స్థండిలమున భక్తి శయన దేవ
పూజనములు జపము పూర్ణ ధ్యానమురతి
నలుపఁజనదు కొట్టి జనులకైన ॥

కం. అందున వేదము శాస్త్రము
పొందెడుఁ గుమంగ ర్తయుక్తి భువనేశు హరిన్
జెంది భజించు మహాత్ములు
కెందుకు దానంబొసంగ నైసంగన్ శుభముల్ ॥

తే. గీ. గ్రామ నక్షత్రయాజకుల్ కడగు దేవ
లుండు సామాన్య విప్రులు జండకోపి
గాయకుండు సదాగతి ఖలులు పంక్తి
కర్హమగు వారు గారు శాస్త్రము రూఢి ॥

తే గీ. శ్రాద్ధముల నిట్టి వారల సంగమమర
దరయ శ్రద్ధ నానర్పఁగానగుటఁ జేసి
శ్రాద్ధమగు గానవర్త ప్రకార విధులఁ
బ్రతి శరత్తునఁ జేయమి పాపమగును ॥

కం. ఒక నెలకలదనఁగానే
ప్రకటిత వస్తువులు గూర్చి పడతుల పొందున్
రతముడిగి బ్రహ్మ విద్యా
ప్రకర వ్రతనియతి నుండియ భావ్యం బరయన్ ॥

కం. పైతృకము లిట్లు నేయఁగ
రీతియగున్ గర్త శాస్త్రవృత్తి సుగుణరూ
పాతిశయ సౌభాగ్యముల శుభ
చాతుర్యము వలయు భోక్త సమ్యక్చర్యన్ ॥

ఆ. వె. పూర్వపయస్సు, తంత్రి, పాసఁగు నధ్యయనమ్ము,
సముశుభాంగగరిమ పారనిగమ
కల్పితనియమవిధము గలవాఁడు భోక్త యౌ
భాగ్యయుక్తి శ్రాద్ధయోగ్యుఁడగుచు ॥

సీ. అమర నమావాస్యలట సంక్రమణములు
మన్వాదివైధృతుల్ మహి యుగాదు
లావ్యతీపాతలు సమ్మహాళయ పక్ష
ఘనగజచ్ఛాయాష్టకమ్ముకూడ
షణ్ణవతిశ్రాద్ధ సంజ్ఞచే నిత్యముల్
నైమిత్తికమ్ము లామ్నాయనియతి
గ్రహణాయనములఁదీర్థంబుల విషువుల
మృతదినములఁ బెట్టుటెసఁగు నిష్ట

తే. గీ. నవిరళ సంపద గల్గుచో నైన విస్త
రమ్ము సేయక నియమపూర్వముగ భోక్త
నాగ్నికుఁబవిత్రు నార్యుగా నరయవలయు
నితర కృత్యముల రోగుల నిడఁగఁజనదు ॥

సీ. గణుతింప నగ్నౌకరణ పార్వణముల సే
యమిఁ గర్తనిరయపాతముఁ బొందుఁ
దగ నిమంత్రితుఁడొండుఁ గ భుక్తిఁగొనినఁద
త్పితరుల కొంప దుర్గతుల కెక్కు
పరదినస్నానతర్పణ హీనతఁ గర్త
పితృతతితో నసద్గతి వసించు
గాయకుఁ గృతఘ్నుఁ గర్భకు వ్యాధిస్థుఁ
బతితు స్తబ్ధుని మూర్ఖుఁ బాపకర్ము

ఆ. వె. వేదరహితు వైద్య విక్రయ క్రయరతు
బాధ్యుమూఁగ బంధుజన విరోధు
నశుచి శస్త్రజీవి నంగవైకల్యు దు
ర్భాగ్యుని ననర్థితుఁగాదు పిలువ.

ఉ. వేదపురాణ శాస్త్రవిద వేది లసచ్ఛుచి శ్రోత్రియుండు మ
ర్యాది జితేంద్రియుండనఘుఁడగ్నికుఁడధ్వరి యాత్మతత్త్వసం
వేది విరాగి కర్మఠుడు విశ్రుత సద్గుణి జీవచైతన్యకుం
డాదట శ్రద్ధ కర్మమున నర్హుడు భుక్తికిఁ గానఁగ నమ్మియిక్ ॥

ఆ. వె. కర్త పాపయుతులఁ గనిపల్కఁ గారాదు
నలినముఖులతోడ నవ్వరాదు
కుటిలు మాని దైవకుఁ బ్రహ్మచారి స
పంక్తి నిడి భుజింపఁబోదిగాదు ॥

చ. కడువడి భోక్త నిందితవుఁ గైవడి వానినిగాక మేలిమా
పడుపగు నట్టివానిగ నవశ్యముగా నియమించి కర్తయుం
గుడుకొకయింత లేక పరితోషిత హృద్గతి నాఁటి తద్దినం
బెడపని నిష్ఠ భక్తిఁ దగు నేకమనస్థితి నేకవారముల్ ॥

తే. గీ. క్షౌరమభ్యంగ తాంబూల చర్వణములు
దంతధావన ముడిగి శ్రాద్ధ దినమునను
కర్తయుండుట తగవు భోక్తలకు వలయు
నన్నియుం దద్దినమ్మున కెన్నిచూడ ॥

కం. తెరువునడత పనిపాటలు
తరుణీ సంగమము మతియుఁ దగు భోజనముం
బరివర్జితమ్ము లగు నిరుఁ
దెఱఁగుల వారలకు సేయఁ దగు పుణ్యమ్ముల్ ॥

కం. ముఱుఁగుడుప వాయసమగు
సారెదిఁ సురతమున గ్రామసూకరమగు న
త్తెఱఁగుల మనుఁడౌ గృధ్రము
కరణిఁ జనియించు భోక్తృకర్తయు జగతిన్ ॥

సీ. బహుబీజయుతశాక పంక్తులు గోఁగుఁ గాదు
క్షుద్రధాన్యమ్ముల చొప్పుగాదు
వసుధ నెంచను నింద్య వస్తువుల్ కూడవు
పూర్వ సంచితములు పాసఁగవు తగ
గ్రాససంపాద్య మా మహనీయ వస్తువుల్
శాకముల్ నిశ్శబ్ద సరణిఁ దిరుగ
తోఁకలు గావించి పారిఁబోరి బేల్చక
ద్రవయుతమ్ముగఁ జేసి రవణ మొసఁగ

తే. గీ. నరఁటి పూవు దవ్వ నవినాలుగుం గంద
మూల ఫల మధుళుల శాలితండు
లములు మాష లడవి నమరిన శాకముల్
గాఁగఁ జేయ యోగ్యగతిఁ దనర్చు.

కం. అడుగకము న్నే పదార్థము
విడగా మానమున మంత్ర మేమియుఁ దాసై
పొడుపక యదుత్తరమ్ములు
తొడిఁగొల్పుచు భోక్త నియమితో గుడువఁదగున్ ॥

కం. స్థానమున నుండు విప్రుఁడు
పూనిక మంత్రములు వాడువఁ బొల్పగు శ్రాద్ధం
బూనమగుగాన వేఱొక
మానవుఁడు వలయు శ్రాద్ధ మంత్ర పఠనకున్ ॥

కం. అన్నము పరమాన్నము మృదు
సన్నుత భక్ష్యములు శాకసమితియుఁ గ్రమమౌ
వృన్నెరి నిడఁగాఁదగుసం
పన్నముగా లవణత్రకపరివర్జముగన్ ॥

ఆ. వె. భక్ష్య భక్తసూపపరమాన్నముల మీఁద
నాజ్య పాత్రమును చుటది యపర్త
మిడిన ఘృతము సురకు నైన తదన్నము మాంస
సమమటంచు ననిరి శాస్త్రవిధులు ॥

కం. తనరిడి యగ్నౌకరణము
మునుకొని పిండప్రదానమున్ బ్రాహ్మణభో
జనమున్ గర్మత్రయ మనఁ
జను నిష్ఠులు వలయు భక్తిసంపఁగఁబిదపన్ ॥

వ. ఇట్లాగమోక్తంబుగా నొనర్చిన పితృతృప్తియగు మఱియును.

సీ. ధర్మంబునన్ శశధరుడాత్మ కళలెల్ల
నుమంగ నోషధుల యందుండు గాన
నా దినమ్మునఁగోయుటదిగాదు శాకప
ర్ణమ్ములు మఱిపదార్థమ్ములెవ్వి
యాశ్రులఁబిండుట లవని దన్నుట దధి
ద్రచ్చుట కొఱగాదు తద్దినమునఁ
గపిలలఁదగు హవ్య కవ్యంబులకుఁబిదు
కంగ సంకరుల నంటంగఁజనదు

తే. గీ. తిరిజకులఁగనుగొనఁ జాల బాప
మిట్లు నడుపక తప్పినయేని సకల
పితృగణ విభూతియన నఘవితతి బొంది
నిరయమున నుండు నిజ వంశకరులఁగూడి ॥

ఆ. వె. వితతిత పక్షయుక్తి పాడ్యమి మొదలుగఁ
జంద్రకళలు గొంద్రుసరవి నిచ్చి
నష్టిపయసనుపెల నడుగు నమావాస్య
నింపఁదదిదా కుపాంపనం దనరుచు.

కం. తీవిగ నొకకళ గ్గని సి
నీవాలీనామదర్శ విరతం దగు నా
యావేళ నోషధీవల్లుల
ధారింపగ పాతకంబు ప్రబలుం జెలువా

సీ. వహ్ని సూర్యులును విశ్వవరుణదేవ వ
షట్కార నిర్జరస్వాములఖిల
దేవర్షులజుఁడును శివితోయము వాయు
పార్వతుల్ పితరులు పరఁగధనద
పశుపతులును ప్రజాపతులును గృష్ణ ప
క్షంబున గ్రహియించి కడఁగి శుక్ల
పక్షమ్మునందిత్తురా సుధాకరునకుఁ
గళలొక్కటొక్కటిగాఁగ వరుస

తే. గీ. నొక్కకళచేతఁ జంద్రుఁడుం జిక్కి సూర్యుఁ
గలయు నమవస నిట్టిది కారణముగ
నా యమావాస్య నోషధులంటఁజనదు
దడవనేరికిఁ బాపముల్ దగులుకతన

ఉ. సంతతివృద్ధిగల్గు మిగులన్ సంపదలబ్బు బ్రహ్మతేజ మిం
తెంతయు మీరు రోగభయ మేఁపడఁ గుం మతిగల్గు నిత్యముం
సంతస మొందుఁగాక సరసమ్ముగ శ్రాద్ధమొనర్ప ధర్మమ
త్యంత వివేకమున్నలయు నట్టి క్రియన్ ధరణీసురాళికిన్ ॥

కం. చాతుర్వర్ణ్యులకిట్టు ద
రీతియగుఁ జేయఁ డేని బుణసంగతులై
పాతకములనుభవింతురుఁ
గాతరరోగాదిబాధకతలొదవ నిలన్

కం. సుజనస్తుతినేతత్క
ర్మజ ఫలమమృతునికాసఁగు రహిఁదగు పిత్రూ
పి జనార్దనుఁడమ్ముతివా
గ్వ్యజవైఖరి నెచ్చుతక్కు వలసగుణముగన్.

తే. తవిలి శ్రాద్ధమ్ము లిడమి బేతాళుఁడగును
రోగపీడలఁ బొందు నిరూఢిసంత
తియును దరిద్రత్వ మెంతయుఁ దెలిసి చూడ
నది గృహస్థాశ్రమకర్మ మధిక నియతి ॥

వ. అదియు జనార్దన ప్రీతికరంబగుటఁ దద్రూపంబులగు సాలగ్రామ సన్నిధానంబు నత్యుత్తమంబగు ననుడు సాలగ్రామ మూర్తిభేద పూజా ప్రభావ జన్మస్థానంబులు వివరింపవే యనిన శౌనకాదులకు సూతుండిట్లనియె—

చం. హరిపద పూజకై యెవరు నట్టుగఁ బూవులతోఁటలన్ బరా
త్పర హృదయానుమోదమును, భాసురమా తులసీవనక్రియన్
నిరతము స్వర్గసత్యసుఖనిత్యలభోగములొంది పిమ్మటన్
మురహరి సన్నిధానమున ముక్తులునై వసియింతు రాఘనుల్.

మ. సరసీజాక్షుని యొద్దఁ గీర్తనము భాస్వల్లీలఁ గావించి త
ద్వరవాదిత్ర విశేషనాట్య కలనా వైయాత్య సద్భోగ వి
స్ఫురణ ప్రక్రియఁ జేసినట్టి నరు లిచ్ఛాసౌఖ్యముల్ జెంది త
త్పరభోగమ్ములు గాంతు రా హరికృపా పారీణభావమ్మునన్ ॥

మత్తకోకిల॥ ఇందిరా విభుమందిరమ్ముల నింపుతో జలసిక్తతన్
శాంకరాధికరంగవల్లులు సాధునందిత సత్క్రియన్
వందనైక పరిక్రమంబుల వాసుదేవు భజించినన్
జెందు నైహిక వాంఛలన్ దుదిఁ జేరు నాతఁడు శ్రీవిభున్ ॥

ఆ. వె. పంకజాక్షునునికి పట్టునఁ గొలఁకులు
నుపవనమ్ము లెవ్వ రొప్పఁ జేతు
రట్టిపుణ్యులధికు లఖిలలోకమ్ముల
వారి మహిమ లఖిల వైభవములు ॥

చం. గొడుగులు చామరంబులును గొప్పగు తీర్థపుహేమపాత్రముల్
కడగలు నాలవట్టములు పళ్లెరముల్ వరదర్పణంబులున్
సడలని భక్తి శ్రీహరికి శాశ్వతలీల సమర్పణమ్ము లె
వ్వుడు తగఁజేయు పావనుల పుణ్యము లెల్ల గణింపశక్యమే ॥

తే. గీ. వారిజాక్షుఁ డనంతావతారములను
పాలనోజ్జ్వల విభవమ్ము ప్రబలఁ దాల్పె
నవి శిలాకృతి గండకీ నమరె ననుడు
వరమునీంద్రులు తత్ప్రభావములు వేఁడ ॥

కం. అనఘుఁడు సూతుఁడుదయని
ట్లను గండకియనెడు కాంత యంచితనిష్ఠన్
మునుదపము సేసె హరిహర
వనజజాలాత్మజులుఁగాఁగ వాంఛఁదలిర్పన్.

చం. తపమొనరించినంత సురదానవహారి విధాతృశంకరుల్
కృపదళుకొత్త వచ్చి యటఁ గేవల భక్తి నమస్కరించి మీ
రపరిమితానురాగ భరితాత్మకులయ్యు మదీయగర్భమం
దుపుడు జనింపఁగా వలయు నేర్పడనంచు నుతించు నింతికిన్.

కం. త్రిగుణాత్మకులిట్లనిరో
మగువా! ధుని రూపగునీవు మహి నీయందున్
ముగురకు బుట్టెద మనుఁడా
సుగుణాకర గండకీ విశుద్ధాహ్వయయై ॥

కం. మేరు గిరిదక్షిణమ్మున
సారహరిక్షేత్రభూమిఁ జక్రనదీ తీ
ర్థారూఢిన్ బ్రవహించె సు
ధీరంజన శుభఫలప్రదీపితయగుచున్.

తే. గీ. బ్రహ్మనిర్మిత చక్ర సరస్తటోత్త
రమున బహుపుణ్య తీర్థ విరాజితముగ
గరిమ మీరయు మహాశ్శృంగ గిరివరంబు
రాజితంబగు పండ్రెండు యోజనముల ॥

ఉ. ఆగిరిసీడలన్నది మహాంబువులన్ బ్రసరించు రాళ్ళులన్
బాగగు చక్రచిహ్నములు భానుని మాడ్కి శిలంబులన్ ద్రుమంబులన్
నాగ పతంగ కీట మదనాగ మృగావళి తన్నగాగ్రరే
ఖాగత భూమినిల్చి లసదాకృతు లౌవర చక్రసంగతిన్.

ఉ. అచ్చట నాదిమూర్తులు నిజార్చకమోక్ష ఫలప్రదాతలై
యచ్చుగ నాత్మ చిహ్నముల నర్మిలితోడ శిలానురూపతన్
హెచ్చుగఁ బుట్టిరార్య వినుతేప్సితలీల ననేకరూపముల్
మెచ్చుగఁదాల్చి మాధవు నమేయశుభాకృతులెక్కువైతగన్.

సీ. తచ్ఛిలా భేదముల్ ద్వారమానంబులు
గ్రాహ్యమ గ్రాహ్య ప్రకారములును
క్షేత్ర లక్షణములు చిత్రచక్రస్ఫూర్తి
గుణములుఁ వివరింతు సరసిజాక్షి

దలఁచి నారదముని యడిగినఁ దెలియంగఁ
బల్కిన విధమెల్లఁ బ్రౌఢిమమున
స్థలజముల్ జలజముల్ సరవి సాల్గ్రామ
నామకా శిలలటు నయముతోడ

తే. గీ. కొండ పండనై యూరడి కొండుజలము
గండకీ గూడు చో శిలాకారములగు
సమరు సందున వజ్రకీటములొకటియ
యున్నచోఁ జక్రయుగ్మము చెన్నుమీఱు.

కం. రెండున్న నాగ్ని చక్రము
లుండున్ మఱి యరువదేండ్ల కాగిసూక్ష్మములై
ఖండాలి తీక్ష్ణముఖముల
నిండిన బహువర్ణ [భేద] నిరతిన్ శిలలన్ ॥

కం. శిలవెలుపల నంటినచోఁ
బొలుపుగ నొక్కొక్క చక్రముల్ బుట్టున్ లో
పలనంటు నొకటి రెండుగ
నలరెడు చక్రములు చేయు నంచితరీతిన్ ॥

సీ. బాలచక్రము పుణ్యఫలమిచ్చు యౌవన
మెలమి శుభాశుభ ఫలములొసఁగు
వృద్ధచక్రము పుణ్యవిధమల్ప మతివృద్ధ
మది శుభాశుభమిశ్ర మగుచునుండు
తద్వర్ణ గరెసు రక్తంబైన రాజగు
మసుపింగళమ్ముల మలయుభోగ
మోక్షఫలములు వశమిడా నైద ముక్తి
నిచ్చునివన్నియ పాండురమున

తే. గీ. ధనముచేకురు నతిరక్త ధాతుచక్ర
మూర్తి గారాదు పూజా సముజ్జ్వలులకు
కృష్ణవర్ణమ్ములైన శ్రీకృష్ణమూర్తి
సకల సౌభాగ్యసుఖము లర్చకులకొసఁగు ॥

తే. గీ. అందుల హిరణ్య వజ్ర కీలానురచిత
పటిమ మణిచక్రములనంగఁ బద్మములన
భేదములు చెప్పఁగాబడు చేర్మి దనర
స్థలజ జలజమ్ములను సంజ్ఞ జరుగునందు ॥

౬౦. స్థలజమ్ము దర్దురంబగు
జలజము కోమలము నునుపుఛాయల నమరుఁ
గల క్షేత్ర నిర్ణయమ్ములు
దెలిపెద వినుఁడింకఁ దేఁటతెల్లము గాఁగ ॥

సీ. వాసుదేవము శ్వేత వర్ణాకృతి హరిద్ర
 విత్రిత మా హరిక్షేత్ర మరయ
రహిఁబైఁడి వన్నె హిరణ్యగర్భంబగు
 చిరపీతవర్ణమ్ము శ్రీధరమ్ము
నారాయణక్షేత్ర మారయ శ్యామమ్ము
 కృష్ణవర్ణంబైన విష్ణువగును
దగునీలవర్ణమ్ము దామోదరంబట్టి
 దనిరుద్ధమెఁమి మధ్యాభ మాధ
తే.గీ. వంబు రక్తంబు సంకర్షణంబు కపిల
 వర్ణములు నారసింహంబు, వామనాఖ్య
 మగినెపూఁచాయ బహువర్ణ మయ్యనంత
 మిట్టిక్షేత్ర ప్రకారమ్ము తెలుఁగవలయు ॥

ఉ. శ్వేతము గ్నేశ మిచ్చు నతసీద్యుతి లక్ష్మి పొంసగు నీల మ
త్యాతత వృద్ధి శ్యామలము సంచిత కీర్తిద ముద్గవంబు రా
జ్యాతిశయమ్ము రక్తమును హైమము పీతము గౌరవర్ణముఁ
బ్రీతి ధనంబొసంగు సిరిపెర్మఁ దనర్చు ననేకవర్ణతఁ ॥

తే. గీ. తరుకు మెఱుఁగు గలది దారుప్రదంబగు
గ్రాహ్యమింకఁ దెలియఁగా వినుండు
స్నిగ్ధ సూక్ష్మ వృత్త శీతలాంగ సగహ్వ
రములు మస్తకోన్నతములు మేలు ॥

తే. గీ. ఛాయచక్రక వామ చక్రముల్ మధ్య చ
క్రంబు వృత్తవక్రకములు నిభము
లనఘములు దలంప వనమాలికాయుక్త
మమిత ఫలము గ్రాహ్యమగుచునుండు.

సీ. స్నిగ్ధంబు నిష్టార్థ సిద్ధి సూక్ష్మము దివ్య
 ఫలము శీతలము సంపత్ప్రదము వృత్త
మమరించు సద్వృత్తి యౌన్నత్యమస్తక
 మత్యున్నతి పొసంగు నగహ్వరారు

హేమచక్రకములు పరమత్స్య చక్రంబు
నతికీర్తి పుత్ర పౌత్రాభివృద్ధి
కరము మోదముగ సగహ్వరముఖిలేష్ట
ద మరయ నవకమలాభ మమిత

తే. గీ. ధాన్యధనధేనువులనిచ్చుఁ దనరుభిన్న
మధికముగ గొడ్డువెడలుపు నతికఠినము
గాని దశవర్గ రాజ్యభోగమ్ములొసఁగు
చక్రపంచక మిహపరసౌఖ్యదంబు ॥

మ. వనమాలాన్వితమైన మూర్తియొడ శ్రీవామాక్షితోనుండు న
వ్వనజాక్షుండటువంటి మూర్తితగు నెవ్వా నింట దారిద్ర్య దు
ష్టనిశాటోరగబాధ, శోక [వను] కార్శ్యంబుల్ చోరంబోళ్ళు, త
ద్జను గేహమ్మున మోక్షమంతమున నిస్సందేహతన్ జేకుఱున్ ॥

తే. గీ. ఆమలక జంబు తుల్యంబులగుచు సూక్ష్మ
చక్రయుగ యుక్తమగుమూర్తి చక్రపాణి
యిందిరా దేవితోనుండు నెంతయొంత
సూక్ష్మశిలలంత లెంతయు శుభములిచ్చు ॥

కం. క్షీరములఁ దండులమ్ముల
నారూఢిగ నుంచి కొల్వ నధికంబైనన్
ధీరులు సాలగ్రామను
లారసి గ్రహియింపవలయు నధిక ప్రీతిన్.

సీ. అగ్రాహ్యము వికరాళాతి కరాళ తి
ర్యగ్వక్త్రి పృథు వక్త్రి మన్విదిఙ్ము
ఖంబు లూర్ధ్వాధో ముఖంబులు పార్శ్వవ
క్త్రిము తుండముఖములు కడఁక బద్ధ
చక్రము చక్రంబు చక్ర వక్రము భిన్న
విషము భగ్నమనుక్త వివిధ శక్తి
చక్రముల్ గలయది సరవి ధూమ్రాభ పిం
గళ కళంక వర్ణములు మధురుచి

తే. గీ. భగ్నభగోన్నత బంధుక స్ఫటికదర్దు
రములు సందిగ్ధ వర్ణమ్ము లమిత మల్ప
మధిక మస్తక నిమ్నంబు లమరు సలిల
ధారణములైన మూర్తులు తగదు నుమ్ము.

ఉం. గుఱుతులు లేని రేఖలఁ ద్రికోణగుణంబుల వెస చిహ్నహీనతన్
బరగు చలాసనమ్ము లతిబంధుర దగ్ధత వృత్తరూపతన్
బొరిసగ మున్నతంబులును స్ఫోటములందగ భిద్ర పీఠ వి
స్ఫురణముగల్గు మూర్తులవి పూజలు సేయ రిపుహికవాంఛితుల్.

ఆ. వె. మిశ్రలక్షణముల మేలి వర్ణమ్ముల
లక్షణముల మూర్తిలక్షణములు
క్షేత్రగతులు దెలిసి చెప్పంగఁదగు బుద్ధి
మంతు లింక ద్వారమాన విధము.

కం॥ చుట్టు నొకయష్టమాంశము
పట్టగు ద్వారమ్ము శుభము పాతికపాలన్
నెట్టుకొన మధ్యమంబగు
గట్టిగఁ ద్ర్యంశకమైన కడ వహి దెలియన్.

కం. బహుమూర్తుల దెలియందగు
విహితంబగు లక్షణముల వెసక్షేత్రములన్
రహిమించు వర్ణరూపా
ద్వహముల బుధులైనవారవారిశుబుద్ధిన్.

సీ. తలఁచ మత్స్యాద్యవతారముల్ కది కేశ
వాదులు కపిలుఁడు యజ్ఞదత్త
హయ శింశుమారులు హంస పరమ హంస
కూర్మ వైకుంఠ ముకుంద పుండ
రీకాక్షులమల లక్ష్మీకాంత దేవేశ
వట క్షత్ర శయన విశ్వంభరులును
సత్యవీర శ్రీపస కనకాంబర విశ్వ
రూప తార్క్ష్యధ్వజుల్ రూఢి నమృత
† హరణ చక్రపాణులల బహురూప నా
రాయణము సుదర్శనాభిధంబు
నట జగద్యోని పారిజాతాహ్వయుండ
నంతుఁ డివి హరిమూర్తు లత్యంత మహిమ.

కం. ఇవి యేఁబది యింకన్యను
శివహరిహర పూర్వులనఁగ శ్రీమూర్తులనన్
భవినారాయణుఁడు స్వయం
భవు చతురాస్యుండనంగఁ బొలుపగుమతియున్.

---

† యెత్తుగీతి సగమాటవెలఁది సగము తేఁటుగీతిగా నున్నది.

తే. గీ. అలప్రలంబఘ్నుఁ డనఘు ప్రహాయుఁ డనంగఁ
పురుషుఁడును సూర్యుఁడనఁగ భాసుర నిరూఢి
బహువిధంబుగ మూర్తులు పరిఢవిల్లు

... ... ... ... ...

వ. ఇవి యిరువది రెండును గౌరీనాథ శివనాభాది శివమూర్తి పంచకంబునుం గూడఁగ డెబ్బదియాఱగు నిందొక్కటి బహుభేదమ్ములగు దత్తల్లక్షణమ్ము లెఱింగించెద

సీ. ఏక చక్రము దెలుపెసఁగు పద్మము పృష్ఠ
వివరమ్ము పరమేష్ఠికివి మా చిన్నె
లష్ట చక్రములు నాల్గగు వక్త్రములు హరి
ద్వర్ణమ్ము గల్గఁబితామహుండు
ఒలుపు హిరణ్యగర్భము వక్త్రమున స్వర్ణ
పటు బిందువులు శుభప్రద మదియును
హేమగర్భుఁడు ద్వారహిత నైల్య శీతల
మూర్తి శుభంబు లిమ్ముగ నొసంగు.

తే. గీ. హ్రస్వవదనమ్ము పృథునాభి యధికపృథుల
చక్రపార్శ్వగ లాంఛన సరసిజములు
[నా]ం తరధ్వని స్వర్ణమిశ్రాకృతియును
గలిగిన హిరణ్యగర్భంబు గడు శుభదము.

కం. ద్వారం బీవల నావల
నారూఢిగఁ జంద్రవర్ణమై స్థూలంబై
మీఱెడు హిరణ్యగర్భము
సార లసన్మహిని శుభము చాలఁగ నిచ్చున్.

తే. గీ. నలుపు గాఁడు గందమును ద్వారనాసికమున
బిందువు హిరణ్యగర్భ మింపొందు మిన్న
రెండు చక్రంబులును బార్శ్వరేఖ లమరు
నాలుగింటఁ జతుర్ముఖలీలమరు.

కం. తలమీఁద వలయరేఖలు
గలుగును నలువు నిడివి నోరుగల్గ స్వయంభూ
జ్వాల సంజ్ఞఁ దనరుఁ బూజా
ఫలముతులముభుక్తి ముక్తి బాగుగ నొసఁగున్.

వ. ఇంక మత్స్యమూర్తుల నెఱింగించెద దీర్ఘాకారంబులును శ్యామలచిత్ర శబ
[ల] వర్ణంబులును బృష్ఠ·చక్రయుక్తంబులునై యుండు తెఱఁగులఁ బరగు నందు.—

సీ. ప్రక్కల శబల శోభన రేఖలనుసమ
స్నిగ్ధంబు దగు కొత్తఁ జెలఁగునదియు
నట్లయ్యు బిందువులనుపొంద నొక దంష్ట్రి
విమల చక్రంబుల వెలయునదియు
ముఖమున నొక చక్రముఁగల్గి శ్రీవత్స
బిందు మాలికఁ జెన్నొందునదియు
కంచుకాయల మిన్న గల్గి చక్రద్వయ
వదనమ్ము జెలువొందఁ బొదలునదియు

ఆ.వె. నిట్టి చిహ్నములనుబట్టుగుఁ బృష్ఠ ను
పిరము బిందువులను బరగునదియు
మత్స్యమూర్తు లిట్టి మహితా కృతుల నొప్ప
కూర్మ మూర్తులకును గుఱుతులింక.

ఉ. ఉన్నత పృష్ఠ భాగము సముజ్జ్వలబిందులు వర్తులమ్ములున్
మున్నగ శ్వేతవర్ణ ఖురముల్ మకరాకృతులున్ దురంగపుం
జిన్నెల పాదముల్ దగ విశేషపు వన్నెలు స్వర్ణరేఖలున్
సన్నుత దామ మేరయగు చక్రములుండగు కూర్మపంక్తికిన్.

కం. అది పది తెఱఁగుల శ్వేతా
స్పద ఖురమునఁ జక్రకంబు సకల శుభదమౌ
వదనమున రేఖ నిశివిం
గదిసి రవివలయమ్మైదు గలది శుభమగున్.

కం. కనకచ్ఛవియౌ స్నిగ్ధా
న్నన శందపుఁ జక్రయుగమునయవృత్తంబౌ
ధనధాన్య పుత్ర పౌత్రద
మనఘంబగు కూర్మమూర్తియనుమనులిలన్.

ఆ. వె. మొసలిరూపు నిమ్న మొసఁగిన వదనంబు
నాభి చక్రకంబు శోభనాన
నంబు నలుపు నెఱుపునను బొల్చు నొక్కటి
నలుపు సీమబిందు లోలయు నొకటి.

తే. గీ. వక్ర చక్రము దక్షిణ వదన శంఖ
చక్ర చిహ్నముల్ వృత్తంబు సరసిజాక్ష
కలయములు నైదు తమ్మియుఁ గలది సర్వ
కామదంబగు కూర్మంబుగా నెఱుంగు.

కం. కమలాకృతిదీర్ఘంబై
యమరెడు దక్షిణపు వదనమటు ప్రక్కలఁ గూ
ర్మము గతియు నాభి చక్రం
బమరినఁ గీర్తిదము కూర్మమూరయ నెలమిన్.

మ. అవనిన్ స్థూలము దట్టమున్నలుపు చిత్రాంగంబునుం గూర్మ మి
ట్లు వినోదంబుగ రెండు నొక్కటిగ నుండున్ జంపమై శంఖ చ
క్ర విధంపున్ గుఱిగల్గి కోఁటి తుదఁ జక్రంబున్న [యా] రీతి కూ
ర్మ వరాహంబతి సౌఖ్యదంబు నిఖిలార్థంబిచ్చు పూజింపఁగన్.

సీ. ఎలమి వరాహ మూర్తుల లక్షణము విను
మగిసె పూచాయ నైల్యంబు శ్యామ
లాకృతి నెఱుపు నల్పమరు వర్ణములు భూ
వలయమ్ము దంష్ట్రిలు గల గుఱుతులు
దీర్ఘాస్యవలయముల్ ధృతిద్వార దేశ చ
క్రములు గల్గినదివరాహ మొకటి
మూఁడు రేఖలు స్థూలమును శక్తి లగ్నంబు
విషమ చక్రము నల్పు విధము నొకటి

తే. గీ. యలకలువ చాయ నిడి [వం?] వ యైనవారు
వరమతనువున జర్జరీ స్పష్ట మొకటి
కౌస్తుభము పాదలాంగూలకముల రేఖ
ల మరఁదగు భోగమోక్షదంబైన దొకటిఁ

తే. గీ. అంకుశాకారవదనంబునందుఁ గోఱ
గలది భూవరద వారాహ మిలను ఖాన
నమ్మునై ఛాయ స్థూలరంధ్రమునఁ జక్ర
దంష్ట్రి యుగమున్న మూర్తియు ధరణి రొసఁగు.

కం. నిడివి బృహత్కోశంబులు
నడుగులు వాలమ్ము ఛిద్రమగు తనుకాంతుల్
కడురక్త నైల్యములు నై
దాస్యతలన్ విష్టరశ్రుఁగిటి మహీంద్రుడమరయన్.

తే. గీ. పొడవగు వక్త్రమును నిగ్గులడరు మిసిమి
గలది ధాన్యవరాహమ్ము చెలువు ముఖము
పెద్దయున్నత మస్త త్రిబిందు సూక్ష్మ
చక్రముల నమృతవరాహసంజ్ఞ నమరు.

చం. వలపున నచ్చుచేఁ బొడవునందగు వెన్ను హరి ప్రకాంతి చె
న్నలరునధః ప్రదేశము మహామణి చిహ్నము వైజయంతియున్
లలిత వక్ష పార్శ్వగత చక్రములుండిన లక్ష్మిపేరిమిన్
గలుగు వరాహమూర్తి సుఖగౌరవ మోక్షము లిచ్చునెంతయున్.

తే. గీ. దీర్ఘమును గోణమును దంష్ట్ర తెల్పు మూతి
కయును శ్వేతవరాహమ్ము ఘనతనాల్గు
చిహ్నముల్ ఘోణి మోక్ష సంసిద్ధిదంబు
బ్రహ్మచారులు పూజింప భాగ్యమరయ.

సీ. నరసింహమూర్తుల నెఱిఁగింతుఁ గపిల వ
ర్ణంబులు దీర్ఘోదరములు గలవి
బహువర్ణ యుక్తముల్ బహుచక్రయుక్తముల్
కలవవి వేర్వేరుగా వినుండు
గడు కొద్ది చక్ర యుగ్మము మాలికయు బాల
నారసింహంబు సంసారహరము
ముఖయుగ్మమున స్థూలమునను విద్యుజ్జిహ్వ
మది లేమినొనఁ గూర్చు ననుదినము

తే. గీ. దీర్ఘ చక్రము మిన్నది దీర్ఘమైన
యది విభీషణ మధిక వశీకరంబు
మందదళ పార్శ్వముల నల్పు మొనయు చక్ర
మును నఖోముఖ మది యిచ్చు మోక్ష పదవి.

కం. బహువక్త్రద్వారంబుల
బహువర్ణ బహూదరములఁ బాతాళమగున్
బహు[ళో?] దరాల్ప చక్రో
ద్వహమున నది కుక్షినృహరి వైఖరి వెలయున్.

తే. గీ. సప్త చక్రము బహుముఖ స్వర్ణమయము
సరదమగు వక్త్రమతి శుభ్ర సర్వముఖము
భిన్న వక్త్రము ఛిద్రములున్న రాతి
సాఖ్య నరసింహ మది యిచ్చు నగ్నిభయము.

సీ. రక్తబిందుల విదారణమునఁదగునది
హేమప్రభస్వీకృతాస్యమగును
తలిచువక్త్రముల విదాహకమనఁదగు
స్థూలమైనది మహాజ్వాలమగును
సరవిదంష్ట్రలఁదగు జ్వాలానృసింహంబు
కాపిలం బెఱుపు చక్రద్వయమునఁ
గడుబద్ధచక్రముల్ కపిలాఖ్యచేనొప్పు
దంష్ట్రాశిఖ్యలుదగినదదియు

తే.గీ. పాలచక్రంబులో సూక్ష్మచక్రబిలము
గలది లక్ష్మీనృసింహంబు గపిలకాంతి
హాయనోరును బంగరుచాయగలది
యదియయ్యెనను బ్రహ్మచర్యార్హమగును॥

తే.గీ. నానచక్రత్రిబిందువుల్ వఱలునలుపు
చెలఁగుచున్నది లక్ష్మీనృసింహమూర్తి
భుక్తిముక్తి ఫలమ్ములింపుగనొసంగు
రాశితో దారమహిమచేఁ దేజమెసఁగ॥

కం. కపిలము త్రిబిందుయుక్తం
బుపమింపఁగఁ బంచబిందుయుక్తంబైనన్
నిపుణత యోగానందం
బపరిమితసుఖంబు పొందుమర్త్యులకగున్॥

కం. ఇవిరెండు తక్కఁదక్కిన
యవి వటువులుయతులు పక్క నర్చన సేయన్
భువినిగృహస్థులుబూనరు
వివిధైహికఫలములిచ్చు విధములు గామిన్॥

సీ. వర్తులమ్ములు కొద్దివారవిసూక్ష్మచ
క్రమ్ములుబిందువుల్ గ్రమ్మునొప్పు
నగి [నై ?] పూఛాయచేనమరు వామనమూర్తు
లాభేదములువినుఁడంచితమతి
వర్తుల హ్రస్వమ్ము వామనమొక్కటి
కడవ పూరాపురేఖలది యొకటి
సితబిందువులతసీద్యుతినొక్కటి
మాలికాహరి నీల శీల వొకటి

తే.గీ. రక్తనీలాభదధి బిందురచితమతుల
నూర్ధ్వచక్రాగ్రదధి బిందుగాప్యమూర్తి
భూమిదధ్యుక్త గోపాలనామనంబు
మృత్యుదారిద్ర్యహరణమ్ము మేటిశుభము॥

సీ. భృగురామమూర్తులు దగుపలువన్నెల
పరశురేఖలు దంష్ట్రినెరయ బిందు
సంగతి శ్వేతకృష్ణద్యుతులయణమ్ము
ధృతి చక్రమునిడిబిలము చక్ర
భాగబిందు సదంష్ట్రభాతి రేఖలు పర
శ్వాకృతినున్నట్టి [భద్ర] మూర్తి,
రాజులకర్షంబు పూజలకవివెన్కఁ
బరశురేఖా మనోహరవదనరి,

తే.గీ. యన్ని చిన్నెలులేమి శాంతాఖ్యశుభద
మట్లు మూర్యాభమున్నత మగుచు నాభి
రేఖయు మనోజ్ఞ చక్రముల్ రీతినమరు
నరియ జమదగ్ని రామాఖ్యనతిశల్లు

తే.గీ. పీతవర్ణధనుర్బాణబిందుయుతము
పరశుచిహ్నంబునగిసె పూపగిదిరామ
మూర్తులమృత్యుహరణముల్ కీర్తిదమ్ము
లింక శ్రీరామమూర్తులనెల్లవినుము॥

సీ. కుక్కుటాండమురీతి కోదండగతిఁజాప
బాణతూణీరముల్ రాణమెసఁగ
ధృతిఁబృష్ఠమునఁ బంచరేఖలుగల్గిన
బాలరాముఁడు పుత్రభాగ్యదాయి
శ్యామలోన్నత పృష్ఠసవ్యాపసవ్యతూ
ణీరకల్పద్రుమాన్వితము పిఱిఁది
ఛిద్రమ్ముగలమూర్తి చెలువుగదాశరం
థ్యాహ్వయమదియఁబూర్వానురూఢి

ఆ.వె. చాపబాణబిందు సహితమ్ము నూర్ధ్వలమ్ము
దీర్ఘనాభి చక్రధృతినినదియు
నీలజలదభాతి నైజవర్తులమ్ముకో
దండరామునఁగఁదనరియుండు॥

ఉ. నేరెడుపండుబోలితగునీలత వెన్నునుండి కోటిదాఁ
కా రుచిరాంతకాకృతివికాసము కుండలముల్ లలాటరే
ఖారతిహేమచాపమును గల్గినబిందువు కృష్ణక్షేత్రపుణ్
శ్రీరఘురాముఁడౌ కలినిఁజేరఁగనీయఁడు పుత్రదాయియై॥

తే.గీ. శ్యామమున్నతచరమంబు చాపరేఖ
లెలమిద్వారంబులన్ బార్శ్వములను రెండు
గలుగ దశకంఠహరణదోర్బలుఁడు రాముఁ
డరివినాశనమొనరించు నంచితముగ॥

తే.గీ. సూక్ష్మకేసరచక్రముల్ సూనదామ
రచితకుండలమగు వీరరామమూర్తి
పార్శ్వఖురములుదలవిల్లు బాణముగల
దృష్టరామంబు భుక్తిముక్తిప్రదంబు॥

తే.గీ. రక్తబిందువుతోడఁ జక్రములు కరాళ
విదితముఖచాపచిహ్నిత విజయరాము
మేకచక్రంబు ముఖసీమ నెసఁగుకృష్ణ
వర్ణశోభనమొసఁగు పావనశుభమ్ము॥

కం. నలుపున్న వనమాలిక శో
భిలు భానుత్రయముస్వర్ణబిందువు దలపైఁ
గలజానకీవిభుండిల
వెలయన్ సకలేప్సితములు వేడ్కనొసంగున్॥

సీ. చాపబాణాంకుశచ్ఛత్ర చామరకేతు
దామమ్ములున్న సీతారఘుపతి
వాయుహస్తద్వార్శ్వ వరచక్రకల్పకా
శోవక్త్రకుండల శ్రీవిలసిత
మదియుసీతారామ మఖిలార్థఫలదంబు
గోఖురపుచ్ఛ సంగుప్తమదియు
యిట్టిచిహ్నమ్ములనెసఁగు బహిశ్చక్ర
యుతము సీతారామ మతులమదియు

తే.గీ. చారుసవ్యాపసవ్య తూణీరయుగము
సీతచక్రంబుగలయది చెలఁగునటుల
గలుగుయుతులుండి నాల్గుచక్రములనేక
వదనయుక్తచతుశ్చక్ర మదియునుంగు॥

శా. ద్వారద్వంద్వము నాల్గుచక్రముల మూర్ధంబొంటి సొంపొందఁదూ
ణీరాద్యాయుధ కల్పచిహ్నములు వర్ణింపంగ బ్రస్ఫుటండలో
దారంబైనది పంచచక్ర మతిమోదం బాయురారోగ్యను
శ్రీరమ్యాఖిలకామదంబగు మహాశ్రీఁ బొల్చు తద్దేహముల్॥

తే.గీ. పార్శ్వయుగ్మున రెండురెండు నేర్పడఁగ శిరము
నందునొకచక్రమున్నఁ బట్టాభిరాము
డదియు నెన్నఁగ నతివైభవాస్పదంబు
మున్నుఁజెప్పిన చిన్నెలనెన్నికలర॥

కం. ద్వారద్వయమున నాలుగు
నారయఁజఠరమ్మున శిరమునందున రెండున్
జారుతరచక్రభూషా
భారత షట్చక్రమరయ ధంణిజ చిన్నెల్॥

సీ. ముందఱవదనముల్ మూఁడిటఁజక్రము
లాఱుపార్శ్వమ్ములనరుదొకటి
బాణతూణీరచాపము కల్పకమ్మసి
హాసనచిహ్నమ్ములలర సప్త
చక్రపట్టాభిసంజ్ఞంగల రాముఁడు
భీష్టదాయకమట్టి పేరిఁగల్గి
యున్నతచరమంబు చిన్నెలుదగఁబంచ
ముఖసూక్ష్మదశ చక్రములఁబొసంగి

తే.గీ. ఘనశిరఃపార్శ్వ కలితచక్రద్వయమున
నైనఁగ్రిందటఁ గూర్మచక్రాంకమైన
సమరద్వాదశ చక్రపట్టాభిరాము
డది శుభాభీష్టదాయక మఘహరమ్ము॥

౬౦. తూణీరాకృతిధనుర్
బాణము నానాయుధములు ప్రస్ఫుటమైనన్
నాణెమగు రామకుంజర
ప్రాణవమలహరణమగుచు నది జయమొసఁగున్॥

సీ. బలరామమూర్తులయలఘు నీకెఱిఁగింతు
హలముసలముల శ్వేతాభమమర
మధుబిందువులు దక్షిణాక్షిని వదనంబు
గల్గినమూర్తి సంకర్షణమ్ము
చక్రమ్ము లేకపార్శ్వమ్ము పూర్వభాగ పు
ష్కరము రక్తాభసంకర్షణమ్ము
చక్రయుగ్మము స్వర్ణసంలగ్నవదన పు
ష్కరమున్న నదియు సంకర్షణమ్ము

తే.గీ. హరితలోహితవర్ణమ్ము నెరయ స్థూల
చక్రబలరాము [మన్వయ ?] శాశ్వతంబు
శంఖచక్రగదాకృతుల్ సరవి నదుము
గలిగి కనుపట్టు శుభదసంకర్షణంబు॥

తే.గీ. గొప్పయౌను దీర్ఘముగు ఘోరు నొప్పుగల్గు
చక్రయుగ్మము వేల్పు ముసలహలాది
చిహ్నితంబును గుఱుదభాసిత నిరూఢ
వదన బలరామ మది వంశవర్ధనమ్ము॥

కం. వామదిశఁజక్రము౯ రే
ఖామానిత దక్షిణాంక ఘనలాంగల ను
ద్రేఖించు శాంతవద్మల
రాముఁడు లాంగలిక ముఖ్యరాముండు నగు౯॥

కం. అంతయు నరుణచ్ఛవి న
త్యంత లసచ్చక్రయుగ్మమగుచోఁ [దగ] న
య్యంతిక చక్రములున్నఁజి
రంతనమగు సీరపాణిరామమనఁదగు౯॥

సీ. పీతవర్ణము వింటిరీతి వక్త్రము చాప
శరశుచిహ్నముల నేర్పడిన దొకటి
కడళ ప్రచండ మాకారంబు బిందు చా
పాంబుజ బాణచిహ్నములు పిఱుఁద
ఛిద్రంబు పీతాభభద్రరేఖయుఁగల్గు
త్రిపదము రామమూర్తి యొకటి
షట్చక్ర ముభయపార్శ్వముల నాయుధములు
శోభనవదనముల్ శుశుషిరంబు

తే.గీ. కల్పకంబు నత్యంత వికసనముఖరు
రక్తమధునీల వర్ణత్రయయుక్తమూర్తి
మహిమచే నొప్పు నదియు స్వమూర్తి రామ
మోహనరమ్యు లొసంగు శుభేప్సితంబు॥

వ. ఇంక శ్రీకృష్ణమూర్తుల నెఱింగించెద—

ఉ. ఉన్నతమస్తకంబు నలువొప్పగు చక్రయుగంబు బిందువుల్
సన్నుతవేణువేత్ర ఖురసంగతరేఖలు కృష్ణమూర్తి లీ
వన్నె త్రిబిందుయుక్త మనవద్య శుభానన దీర్ఘమున్న యా
చిన్నెల బాలకృష్ణుఁడిల నేమము సంతతియిచ్చు నెచ్చుగన్॥

తే.గీ. పచ్చఁదనమున నీలిమ పార్శ్వభిత్తి
చక్రయుగ్మము వదనంబుసాటి నాభి
పృష్ఠమునఁ గూర్చరేఖ యొప్పిదఁపు వలఁద
యైనచోఁ బాపహరకృష్ణుఁడనఁగఁదనరు॥

కం. సమచక్రద్వారము కడు
నమరఁగ కృష్ణాభశోభనాకృతిఁ గృష్ణుఁ
డమర శుభంబు లొసంగున్
సుమహితముగఁ బూజకులకు సుస్థిర లీలన్॥

సీ. పదన వతోన్నతి వామపర్యంక కృ
ష్ణాభిరేఖాద్వయ హారి బిందు
మండనుఁ గాళియమర్దనుఁ డనఁదగు
సర్వశాత్రవహారి సౌఖ్యదాయి
సవ్యాపసవ్య భాస్వద్రేఖలుఁ బార్శ్వ
ఖురసూత్ర చక్రముల్ గలయుమూర్తి
యది ధనంజయవిభుఁడనఁదగి శుభమిచ్చు
రక్త బిందులు శ్యామరచితవర్ణ

తే.గీ. మొనరఁగా నొప్పు దంతి కరోపమాన
రేఖ దక్షిణమున ముష్టిరీతి బిందు
వమరఁ జాణూరమర్దనాఖ్యానకృష్ణుఁ
డమిత సౌభాగ్యమొనరించు నంచితముగ॥

తే.గీ. పార్శ్వవదనమ్ము తగు పూర్వభాగముఖము
శుద్ధనీలాంబరప్రభాశోభి కంస
మర్దనాఖ్యానమది కృష్ణమహితమూర్తి
పూజకాభీష్టదాయియై పొల్పుమీఱు॥

కం. స్థూలనుకణయుక్తములగు
మేలిమిచక్రములు సురియ మిసిమి తనురుచుల్
పాలక శ్రీవత్సాంకితుఁ
డాలలిత శమంతపేరి యశము లొసఁగుఁ॥

మ. తనుదీర్ఘంబతికృష్ణవర్ణమును సార్ధంబైన చక్రాళి శ
జ్జను నిమ్నాస్యము గల్గఁ బుత్రదుఁడు శ్రీసంతాన గోపాలుఁడౌ
ననుపుఁ శ్యామము ఛత్రరీత్యరుణబిందుల్గా శిరఃపుష్కరం
బును సూక్ష్మనన సీమ బిందువుల నొప్పుఁ కృష్ణుఁడిష్టార్థుఁడై॥

తే.గీ. కుక్కుటాండమురీతి లాంగూల వేణు-
డోలికాకుండలమ్ములుమేలి నిగ్గు
పరగ లక్ష్మీ నివాసగోపాలమూర్తి
భాగ్యదాయిని పుణ్యసంప్రాప్తమదియు॥

సీ. దామంబు పంచాయుధమ్ముల చిన్నెలు
భృతసూక్ష్మచక్రముల్ కృష్ణమూర్తి
రహిఁ నిడియై బహూదరము సేనుపుఁ దైర్ఘ్య
మమర శ్రీగోపాల మనఁగఁబరగు
దనరు నైల్యము శృంగదండ పార్శ్వము వేణు
వదనంబు తదోంగపల్లభుండు
కుండలమాలికల్ రెండు పార్శ్వమ్ములఁ
దరుయుక్త కార్ష్ణ్యమ్ము మెఱసెనేని

తే.గీ. మదనగోపాలుఁడగు నీలిమంబు నెఱుపు
చెరిసగమ్ము దీర్ఘమును సుషిరము చక్ర
శరశరాసన శంఖలాంఛనము గలుగు
నిట్టిమూర్తులు సకలశుభేష్టదములు॥

కం. వలుఁదయు రాజతబిందుల
తల నిమ్నము నిడివిగల్గు దక్షిణభాగం
బలరఁ గోవర్ధనధరుఁ
డలఘుత రైశ్వర్యదాయియై విలసిల్లుఁ॥

తే. గీ. అయిన బ్రచ్ఛన్న సూక్ష్మచక్రములు మీఁద
వస్త్రచిహ్నము క్రిందటు వరుస వృత్త
కారుచిహ్నము వస్త్రవహారి కృష్ణుఁ
డఖిలకామ్యము లొసఁగూర్చు నర్చకులకు.

క. స్థూల శుభచక్రయుగయుఁడు
మేలి గదాకార మధ్యమిశ్రిత రేఖా
ద్యాల శుభాంగుఁడు కృష్ణుఁడు
సాలఁగ ధనధాన్య విభవ సౌఖ్యములొసఁగుఁ.

సీ. కలికిమూర్తులు నిల కలసితాకృతి దీర్ఘ
మగు నంకుశాకారమైన రేగు
వనమాలికయుఁగల్గి వరకల్కి మూర్తి నా
నురుశుభసుకృతము లొసఁగ నిచ్చు
నతిరక్తతఁ సూక్ష్మమగు బిలంబును వెన్క
చక్ర శరాసనాంచత్కృపాణ
[ములుఁదనరెడు] మూర్తి కలివినాశనకర
మని యొప్పుగుఁడు శుభమునరనొసఁగు

తే.గీ. వివిధగల గహ్వరము చక్రవిధము లేమి
పూని నిర్వాణబుద్ధునిగా నెఱుగుఁ
డనఘ వినుమింక శ్రీ కేశవాదిమూర్తి
భేదములు దేటపడఁగఁ బ్రమోదమొసఁగ.

క. కనకరచిత బిందువులఁ
ఘనమై సూక్ష్మమగు చక్రకము శ్యామంబుఁ
వనమాలికచేఁ గేశవ
మనఘుఁ తుష్కోటి యుక్తమదిశుభదమగుఁ.

సీ. నారాయణమ్ములు నాభిచక్రమ్ములు
న్నతములు వలుఁదలు నలుపు లెలమి
కనకమాలికయు రేఖాత్రయయుత మున్న
తం బపమృత్యువిదారణమ్ము
స్థూలచక్రంబులు మేలి శ్యామాభయు
ననువైన దఖిల శోభనకరంబు
నేకచక్రము గానుగాకువర్ణము స్వర్ణ
కాయము వీరనారాయణమ్ము,

తే.గీ. సుముఖశోభన మధ్యచక్రములు కటుక
హార తాటంకయుతము మాయాభిధంబు
నగుచుఁ బూజాభిరతులకు ననవరతము
నాయురారోగ్య మొసఁగు నారాయణమ్ము.

క. పీతాభమేకచక్రా
ఖ్యాతధ్వజ వజ్రచిహ్నమా లక్ష్మియు
ఖ్యాతత నారాయణ మి
ట్లైతగు చక్రద్వయమున నది శుభ మొసఁగున్.

సీ. వామచక్రంబు పూర్వాగ్ర చిహ్నిత పద్మ
మమర శ్రీ నారాయణాఖ్యమదియు
ఖగచక్ర ముఖ్యరేఖలు వామచక్రముల్
రమఁ గూడియుండు నారాయణుండు
శంఖాయుధంబులు పద్మగదా వామ
చిహ్నముల్ శ్రీ లక్ష్మి వెలుఁగు గలుగఁ
గ్రమమున నేకచక్రము ద్విచక్రంబనఁ ద్రి
చక్రము చతుశ్చక్ర సంజ్ఞలందగు

తే.గీ. రమణ లక్ష్మీశయుక్త నారాయణములు
మఱియు నొకటైన నాల్గైన మహాచక్ర
ములు గుఱుతులుండి కొలఁదిమై వెలయుమూర్తిఁ
జూచినంతనె చేకుఱు శోభనములు.

శా. ఛత్రాకార దృఢమ్ము లొప్పగు చతుశ్చక్రమ్ములన్ స్నిగ్ధమున్
చిత్రానాన్వితమున్ ద్రిదినమ్ము ధ్వజ శ్రీవత్సనామాంకమున్
బాత్రంబై తగు గోఖురంబుల లసద్భద్రాసన స్థైర్య మి
ద్ధాత్రిన్ మూర్తులకెల్ల నుత్తమమునాఁ దళోక్తుం శ్రీయుక్తమై.

క. నేరేడుఁ బంటిరూపున
నాగూఢిగ నెల్ల చిన్నెలమరిన లక్ష్మి
నారాయణ మనఁదగు నది
యారసి కనుగొనినయంత నఘములు దొలఁగున్.

సీ. మున్ను చెప్పిన చిహ్నములు గలయదియు ల
క్ష్మీయను యుక్తనారాయణాహ్వయములు
గల వెన్నియైన రేఖలు మూఁడుగల్గిన
పృష్ఠగర్తమున నొప్పెసఁగు వామ

వర్తులమ్మునఁ బక్షిపరరేఖ నాగభో
గమున శ్వేతంపు రేఖలను రెంట
బొరిది నాలుగు రెండు సుషిర గంభీరమ్ము
లున్న చక్రమ్ము లౌనన్న వెల్ల

తే. గీ. భుక్తిముక్తిప్రదమ్ములౌ పూజకులకు
నలరు లక్ష్మ్యనుయుక్తనారాయణమ్ము
పరశుభంబట్టి మూర్తులు దొరకెనేనిఁ
జెలఁగి సాక్షాత్కరించు లక్ష్మీవిభుండు

క. స్థితమధ్యచక్రములు ని
గ్గలితశయమున మధువిభుఁ డుమాశ్రేయస్సం
గతి మాధవమూర్తియగుఁ
యతులకుఁ బూజార్హమగుచు సంచిత మహిమన్.

ఆ. వె. నీరదాభవర్తులమ్ము నిగ్గు చక్ర
పద్మముతుల వామభాగనిరతి
కనుతులున్న మూర్తి గోవిందుఁడియ్యెడి
శంఖవదనయుక్తిఁ బరగునదియె.

తే. గీ. వామచక్ర బృహద్ద్వారవర్తులమ్ము
కపిలరుచి మధ్యనిమ్నంబుగలుగు విష్ణుఁ
డమల నాయుధమాలిక లమర కాంత
కుసుమరుచి విష్ణుఁడిష్టార్థ విసరమొసఁగు.

సీ. బహుళ కృష్ణాభ శోభనతయును గల్గి
విష్ణుమూర్తియనంగ వెలయు నొకటి
స్థూలచక్రంబైన లీల క్షత్రియులకు
శుభమిచ్చునట్టి విష్ణుండు మఱియు
మెఱుపులీనెడు మొగ మెఱుపు మొల్లము విల్లు
తలగలమూర్తి సంతతశుభదము
బహుళచక్రంబు శోభనమగు గదయును
బెలుఁదఁగల్గఁగ విష్ణుఁడరయ నదియు

ఆ. వె. ఘనత నేకచక్రమును మహాద్భుతతేజ
మమితకాంతి వైభవములు మిగుల
శుభములిచ్చు మధునిషూదన మూర్తులై
విను త్రివిక్రముల విధములింక.

తే.గీ. పెద్ద రేఖల పద్మంబు పేర్మి నమరు
వాసుదేవాఖ్యుఁడగు మృత్యువారణుండు
కలువరేకొప్పు దీర్ఘ చక్రములు గలుగు
వాసుదేవుఁడు సకలార్థ వైభవదుఁడు.

తే.గీ. పీతవర్ణంబు సుషిరముల్ పెక్కు సూక్ష్మ
చక్ర దీర్ఘాకృతుల్ గల్గి సరస నొకటి
దీర్ఘచక్రము బిందువుల్ తెలుపు నలుపు
గలుగు ప్రద్యుమ్నమూర్తి సౌఖ్యప్రదమ్ము.

మ. ఘనమాలాంబుజముల్ జపాకుసుమ సద్వర్ణంబు దైర్ఘ్యంబుగా
నొనరన్ సూక్ష్మములైన చక్రములఁ బ్రద్యుమ్నాఖ్య మీ లక్షణం
బున సూక్ష్మంబగు చక్ర యుగ్మములచే ముఖ్యంబు బంగారు రే
ఖ నయంబౌ ననిరుద్ధమూర్తి నెఱుఁగంగావచ్చు మేధానిధీ!

సీ. ధృతి ఛిద్రము వర్తులము దీర్ఘ నైల్యాకృతి
యైనది యనిరుద్ధుఁడని యెఱుంగు
రేఖాద్వయద్వార పృష్ఠ పద్మాంకిత
[illegible]స్యచక్రంబు కృష్ణాభ చణక
కుసుమాకృతియుఁ జక్రకోణముల్ గల్గిన
యనిరుద్ధమది విభవాస్పదమ్ము
ద్వారసంకీర్ణమ్ము వనమాలచిహ్నము కృష్ణ
వర్ణానిరుద్ధంబు వాంఛితదము

తే.గీ. వర్తులము పీతవర్ణమ్ము వదన సీమ
మూఁడు రేఖలు వెన్నను బురుహరేఖ
నమరు ననిరుద్ధుఁ డిచ్చు నిష్టార్థచయము
నింకఁ బురుషోత్తమాకృతులెల్ల వినుము.

క. అతసీ ప్రభ బిందు విభూ
షితముల్ ధ్వజ పారిజాత చిహ్నిత వజ్ర
ద్యుతి వర్తనముల్ శోభన
గతిఁ బురుషోత్తముఁడు భాగ్యకలనఁ బొసంగున్.

తే.గీ. ద్వార చక్రములంకుశోదార పాశ
ములు వెలిని లోనఁ బైన సొంపలర రెండు
వదనములు సుఖగాననాదాప్తి చాప
చిహ్నములు పురుషోత్తము స్థితి వహించు.

కం. ద్వారమున రెండు చక్రము
లారయ బిందువుల నలుపులటు సితతనుచ
ప్రాకారాధియుఁ బురుషోత్తము
మైఁ బరిహించగు సౌఖ్యదాయియౌ యెల్లెడలన్.

ఆ.వె. అగిసె పూవు పసపు బాగు మైకాంతియు
బిందు శోభితంబు నొంద నదియె
స్వర్ణ చక్రమస్త చక్రములది పురు
షోత్తమంబు మోక్ష మొసఁగు నెలమి.

కం. శిరమున ననంత రేఖయు
వరచక్రము నల్ప కృష్ణవర్తులములచే
బురుషోత్తమమూర్తి యగున్
గరమర్థిన్ భుక్తిముక్తి గల్గఁగఁ జేయున్.

కం. అతి కృష్ణరక్త రేఖా
న్వితమై శాపిలము గొంత నెరయఁగ సూక్ష్మ
స్థితి చక్రం బొక్కటి సం
గతమైన నధోక్షజమ్ముగ తనుఁ జెన్నొందున్.

తే.గీ. హ్రస్వ చక్రంబు మధువర్ణ మధికమృదుల
వర్ణమున్ బార్శ్వబిందువుల్ వరుస గల్గు
నదియె యచ్యుతమగు సైష్ఠికార్చితంబు
నిహపరసుఖమ్ము లెప్పుడు నిచ్చుకతన.

చం. పరగఁగ నాల్గు నాల్గుభయ పార్శ్వగ చక్రము లేక వక్త్రముం
దిరవుగ నైదు నాయుధము లేర్పడు చిన్నెల ఛత్రకేతు భా
స్వర ముసలాంకుశంబులును జారుతరంబగు వజ్రరేఖచే
నమరదగు నచ్యుతంబు మనుజార్చన సేయ నొసంగు మోక్షమున్.

తే.గీ. చంద్రనిభ వనమాలికా సౌరచక్ర
మమరు శ్లక్ష్ణంబు నచ్యుతంబనఁగఁ బరగు
కడక చెవిలోన నాల్గు చక్రములు సూక్ష్మ
రంధ్ర వైచిత్ర్యములచ్యుత రహింద నరుచు.

కం. ద్వారద్వయమునఁ జక్రము
లారయ నాలుగు సమంబులై యుండినచో
నారయ జనార్దనంబగు
ధారుణి నర్చనలఁ బుత్రదాయి తలంపన్.

కం. శ్యామలత శిరోవర్ణం
బామికగల్గిన జనార్దనాహ్వయుఁడెలమిన్
బ్రేమించు వాసుదేవ
స్వామి యొసంగిన ఫలమ్ము చతురత నిచ్చున్.

తే. గీ. పూర్వ పశ్చిమ భాగాస్య పుణ్యమూర్తి
యరివినాశి జనార్దనంబనఁగఁదనరు
మాలికయు శీతలోత్పలలీల గలుగు
నదియును జనార్దనంబన విదితమయ్యె.

కం. నీల స్థూలాకృతియున్
మాలిక చక్రాబ్జ శంఖమానిత పదముల్
మేలిమి సితకరశీతల
లీల జనార్దనము శుభఫలితమై వెలయున్.

తే. గీ. వదన పట్టంబు చక్రముల్ పదియు రెండు
పద్మమాలికగలది జనార్దనంబు
కలువపూచాయ పట్టంబు చెలువు మొగము
గల జనార్దన మఖిల సౌఖ్యప్రదంబు.

సీ. శివర్ణమునగు హ్రస్వ ముఖాంత రేఖలు కో
ములపార్శ్వ చక్రముల్ గలిగి యల్ప
వదనంబు హరిమూర్తి వెలుఁగ గదాశంఖ
చక్ర రేఖలు నల్పుచాయ మేను
దనర నుపేంద్రుండు వినిపించితి న్నన్య
కృష్ణమూర్తుల రూపకీర్తనమ్ము
లింక హయగ్రీవు నెఱిఁగింతు రక్త పీ
తాభమిశ్రము నంకుశాకృతియును.

తే.గీ. పద్మ చక్రము త్రిరేఖ పార్శ్వ కుండ
లములుగల్గి హయగ్రీవ మనఁగు భోగ
మోక్ష విద్యాప్రదుండునై ముదమునొసఁగు
మఱియుఁ దద్భేదములు వినఁ దెలుపఁగోడ.

తే.గీ. పద్మ జంబూ ఫలాకార భాసురంబు
నంకుశాకారవదన మత్యంత దీర్ఘ
బింబములున్న హయగ్రీవ మొందుఁ గపిల
వర్ణులకు విద్య యొసఁగు నశ్వముఖుఁ డెలమి.

తే.గీ. ఐదు రేఖలు మధ్య బిందువడరఁ జరమ
నైల్యమైన హయగ్రీవనామ మట్లు
హయముఖము పుస్తకాంకంబు నబ్జముద్ర
మాలికయుఁ గల్గునది యయ్మహితమూర్తి.

కం. నిడివిమండ యథోపక్త్రికము
కడు కొంచెంబళ్వగళుఁడు గడుమాయదఁ దో
ప్పెడు నైల్యము నంకుశపుఁగా
పడు హయగ్రీవు గొసఁగు వరవిద్యఁ దగన్.

ఆ. వె. రక్తపీతవర్ణ రతి ద్వారిమాయు చ
క్రంబు స్పృక్స్ప్రవంబు గడఁక దశీ
గాకునఁ గల్గు మూర్తియాయురు యజ్ఞాఖ్యచే
భవ్య సవన విశాల ఫలదుఁడగుచు.

కం. పీతారుణ సిత వర్ణము
లాతటి జటయాయము యత్యున్నత దం
ష్ట్రాతిశయత దత్తాత్రే
యాతత శుభమూర్తి యిచ్చునతి సౌఖ్యంబున్.

కం. అరయం గపిలాననగ
హ్వర మున్నత పుచ్ఛ చక్రమది జగదఖిలో
ద్ధరణముగు శింశుమారకు
ధరణిన్ సకలార్థ సిద్ధిదము మనుజులకున్.

కం. పరుషత బహు చక్రంబుల
మురు వొప్పెడు నైదు వదనములుగల్గిన యా
హార విశ్వరూపనంతుం
డిరవుగ సంతాన వృద్ధి నిచ్చున్ ఘనతన్.

కం. పారావతోపమంబై
సారపు బహు చక్రములును స్వచ్ఛ సకల మూ
ర్త్యాకారాధాంకమ్ముల వ
దారమణుఁడు విశ్వరూపితగ శుభమొసఁగున్.

ఆ. వె. సూక్ష్మ చక్రములను శుభపృథులాస్యమ్ము
వరసుదామ కృష్ణ వర్ణములును
లలిఁదలిర్చు మూర్తి లక్ష్మిపతిఖ్యాతుఁ
డఖిల శుభములిచ్చు ననవరతము.

ఆ.వె. ముఖమునందుఁ బార్శ్వమున నైన మాయాత
గళమురీతి చిన్నె గల్గినట్టి
లలితమూర్తి యదియు లక్ష్మీపతిఖ్యాతి
యఖిల సౌఖ్యమిచ్చు నర్చకులకు.

కం. అల నానావర్ణములన్
జెలువరులచు నాగభోగసేవితుఁడైనన్
విలసిత లక్ష్మీకాంతుం
డిల నుత్తమమది గ్రహించు టెంతయు నొప్పున్.

సీ. సూక్ష్మచక్రము గౌర సూక్ష్మరేఖయును దూ
ర్వాభయ దృగ్ద్వ శ్యమగు వెడల్పు
పొసఁగియున్నఁ బురాణపురుషోత్తముఁడు వట
పత్రశాయి దలంప బహువిధమిన్న
నిడివియు వటచిహ్నముదరఁ బైచక్రముల్
వామచక్రము మణివర్ణ మమరి
తమ్మిఁ బోలిన గహ్వరమ్ము చెంగటఁ గృష్ణ
రేఖలు మతియత్న రేఖలు దగి

తే.గీ. మాలికయుఁ గల్గి శ్యామకోమలతఁ దనరు
సత్యవైకుంఠమూర్తి పార్శ్వమునఁ జరమ
మునను నయపద్మయంబున్న పుండరీక
నేత్రుఁడిచ్చు వశంకర చిత్రమహిమ.

కం. శిరమున బంగరుకొమ్మును
గలపర్తులకేసరములు గుటుచక్రగత
స్థిరకృష్ణరేఖ బిందుల
గరుడధ్వజమూర్తి సిగ్గు కలిమియొసంగున్

కం. ఖ్యాతిఁ బసిమిగోరోచన
భాతిన్ వర్తులపుఁజక్ర పటిమ మలరినన్
రీతి బహువర్ణమైనన్
పీతాంబరధరుఁ డుసిరులఁ బేగ్మనొసంగున్.

తే.గీ. వర్తులము హవ్యచక్రముల్ స్వర్ణబిందు
యుక్తమగునట్టిమూర్తి సుపూజ్యులగతి
సత్యవీరశ్రవాంచిత సంజ్ఞ సురుసర్వసౌభాగ్యదాయియౌ సారమహిమ.

సీ. ప్రహస్వాస్యనీలోత్పలాభాతివర్తుల
మైనచో నచ్యుతాపహరణమూర్తి
మున్న త్రివదనముల్ వెన్నున నొకనోరు
చక్రపాణి త్రిలోకచక్రదుండు
బాహుళచక్రముల నభ్యంతరచక్రంబు
గాఢి మాల్యము బహుగూపి శుభద
మేకచక్రాసన మెసఁగు శుభ్రము పుండ
రీకుండు మోక్షమర్మిలి నొసంగు

తే॥గీ॥ ప్రాంతచక్రమ్ములున్నచోఁ బారిజాత
హరణుఁడర్థుఁడు ప్రహ్మచర్యాశుచితికి
దక్షిణావర్తులలరు ప్రసగాద్వారచక్ర
రక్షితుఁడున జగదోద్ధ్యని రహిఁబొసంగు.

ఆ. వె. నలుపు ద్వార చక్రములు వర్తులమునిగ్గు
నన్వయాఖ్యుఁడిచ్చు నర్చకులకు
ధనము ధాన్యచయము ఘనరత్నభూషణ
పుత్రపౌత్రవృద్ధి పొల్పుమీఱ.

సీ. ద్వారస్థచక్రముల్ దగువదునాలుగు
బిలములు వర్ణముల్ పలుదెఱఁగులు
స్థితనాగభోగనేష్టితము ధ్వజాకార
చిరరేఖ స్థూలదీప్తిరుచిమూర్తి
యగు ననంతుండెన్నిదైనను బడర్హైన
బదుమూఁడు నేడునుబదియునాల్గు
నైన చక్రములననంతుండు శుభమిచ్చు
కమలంబు శంఖచక్రములుమాల్య

తే॥గీ॥ గదలుగల్గిన సర్వాకాముమఁడనంతుఁ
డతుల శోభనపూర్ణ చంద్రాకృతియును
మోక్షమిచ్చును గలుము లిమ్ముగ ననంతుఁ
డదియ సూక్ష్మాకృతిగ సుఖమావహిల్లు.

కం. ఇరువది నాలుగు చక్రము
లరయఁగఁ బద్మడెంద్రుడు నోరులబ్జము శంఖం
బిరవొఁదఁబొలబుగ్గరు
సరి విశ్వంభరుఁడు నాల్గుచక్రములున్నన్.

కం. శ్యామలము నాల్గు చక్రము
లామిక విశ్వంభరాఖ్యుఁడతిసౌఖ్యదుఁడౌ
ప్రేమన్ ద్వాదశచక్రము
హేమమూర్తియై సూర్యనాముఁడై విలసిల్లున్.

తే.గీ. పద్మపత్రాకృతియుఁ బైఁడిచాతి కలిగి
యరయ నాలుగుచక్రముల్ హైహయుఁడగు
ఘనత రెక్కలు రెండున్న గరుడమూర్తి
కలియ విషమును బోకార్చు గారుడమును.

తే.గీ. పీటమట్టుగుండలయముల్ పేర్మి రెండు
మూఁడునాలుగునైదును బైఁడినిగ్గు
గలిగి శుభచక్రముల పద్మనముల కలయిక
గలుగఁగా శేషుఁడనిమిది కలుగు లోనఁగు.

సీ. నల్లుపును శిరసునగల యేకచక్రంబు
నగుఁబాపహరణ సుదర్శనంబు
తప్పిదూ వెలుపుఁ బెద్దయునోరునిమ్న నా
[illegible]హిత పూజ్యమై యుమరియుండు
కపిలమై స్థూలచక్రంబున్న తము పూజ
తంబు నృసింహసుదర్శనంబు
కడునల్ప నగుచు రేఖాక్రమమున్న సి
ద్ధ్యసుఖద విష్ణుసుదర్శనంబు

తే.గీ. చాల్వ వక్రముఁ ద్వార పృష్ఠద్విచక్ర
ధారియైనది శుద్ధసుదర్శనంబు
ధరణిఁదగునిట్లు పెక్కు సుదర్శనములు
మూర్తిభిన్నే నిదవిలేక పూజదగదు.

వ॥ దక్షిణావర్తసుదర్శన శంఖంబు లపూర్వంబులవి భాగ్యవంతులకు లభియించు, ఏకచక్రంబులు సుదర్శనబలరామకృష్ణమూర్తులు. ద్విచక్రంబులు సర్వసాధారణంబులు, త్రిచక్రంబులు, పురుషోత్తమాచ్యుత త్రివిక్రమశింశుమారమత్స్య సీతారామ మూర్తులు చతుశ్చక్రంబులు, హరిహరసీతారామ జనార్దన విశ్వంభర కంసమర్దన గోపాల లక్ష్మీనారాయణమ్ములు పంచచక్రంబులు, వాసుదేవ పట్టాభిరామ హృషీకేశ మూర్తులు షట్చక్రమ్ములు, సీతారామసామ్రాజ్యరామ లక్ష్మీనారాయణ సంకర్షణ మూర్తులు సప్తచక్రమ్ములు, పట్టాభిరామపరాహనృసింహమూర్తులష్టచక్రమ్ములు,

పురుషోత్తమ చతుర్ముఖ నృసింహంబులు సప్తచక్రంబులు, నారసింహానంత బహురూప మూర్తులు దశచక్రంబులు, హృషీకేశ వామనానంతమూర్తులేకాదశ చక్రమ్ములు. అనంత ప్రద్యుమ్నమూర్తులు ద్వాదశచక్రమ్ములు, పట్టాభిరామ సూర్యానంత బహురూపి విశ్వరూపమూర్తులు మఱియు బహుచక్రంబులు, పరమాత్మస్వరూపంబుగా నెఱుంగుమని భగవంతుండు గరుడని కెఱింగించెనని విరించి విభీషణుని కానతిచ్చెనని సూతుండు శౌనకాదుల కిట్లనియె.

శా. సాలగ్రామశిలోదకంబు పరువెంచన్ గ్రోలినం బాపముల్
తూలున్ సౌఖ్యములొంపుఁ బడతాలంగున్ దోడ్తోసిరుల్ చెల్వగున్
లీలన్ మోక్షముగల్గు నీచరిత వర్ణింపంగఁ దత్త్వైతృకుల్
చాలా సౌఖ్యముగాంతురయ్యమృత వాసస్థైర్యమేపారఁగన్.

శా. విద్యోతమ్ముగ వాసుదేవుఁడురున్ విప్రాలికిన్ బూజగున్
ఖద్యోతాబ్జకులై కభూమణుల కెన్నన్ శేషుఁడర్థుండగున్
ప్రద్యుమ్నుండగు వైశ్యసంతతికి నాపాదోద్భవ శ్రేణికిన్
దద్యోగంబనిరుద్ధమూర్తి శుభసంధానైకపూజార్థతన్.

కం. ఎన్నెనిరోగ్యమర్చన
కెన్నఁగ విప్రులకు రాజులిల మూర్తుల మూఁ
టన్నెఱి వైశ్యులు రెంటన్
గన్నగ శూద్రులకు నొకఁటు గావ్యంబరయన్.

ఆ.వె. అతిరహస్యమైనయట్టి యీ శ్రీమూర్తి
విలసనమ్ముకొంత పలికితినిట
యెవ్వరేని చదువ నెలమితో విన్నవారయ
నఖిలసౌఖ్యచయము లమరఁగల్గు.

సీ. అట్టి శ్రీమూర్తుల నాకరంబైన హ
రిక్షేత్రదర్శన మిడియయుగు
ఫలములు లభియించుఁ బదపడి మదినెన్నఁ
బయనమై యోజనపంచకమ్ము
నరుగ దశాశ్వమేధాధ్వర ఫలమగు
దలఁచినఁ బితృసంతతులును దుష్టిఁ
బొందుదు రప్రాప్యభూరి పదమ్మున
శ్రీమూర్తి నర్చన సేయవలయు

తే॥గీ॥ వినుము తత్తీర్థకణముఁ గ్రోలినయతండు
శిరమున నంజలిఁ గొనువాఁడు మెఱయు సకల
తీర్థసుస్నాన ఫలమంది దేవదేవు
విష్ణుసన్నిధిఁ బ్రాపించు వేడ్కతోడ.

కం. సాలగ్రామపుదానం
బీలోకము లెల్ల దానమిచ్చిన ఫలమౌ
సాలోక్యహేతు వందిన
శ్రీలాఢ్యుని పితరు లెల్లఁ జెలఁగుదు రెందున్.

చం. హరిపరమైకరూపము గుసంచితమూర్తులు నాల్గు రెండు
సురహరి పూజనాన్వితు విశుద్ధమనస్కునిఁ జూచి దాన మా
దరమున నిచ్చి పూజన మదారత సేయఁగఁ బంపఁ దీర్థము
శిరమున జిహ్వ నిండ గుణశేఖరుఁ డొందు మనభీష్టవస్తువుల్.

తే॥గీ॥ దినముఁ దత్తీర్థము గ్రోలు ఘనులు విష్ణు
మందిరావాసులగుదురు మహిమతోడ
గంగ కరుగ గలేని న్యూనాంగులకును
నానదీస్నానఫల మొందు నదువలన.

తే॥గీ॥ నాలుగెనిమిదిఁ బండ్రెండు మేలిభక్తి
నిరువదియునాల్గు పూజింప నిద్ధుఁడగును
పురుషసూక్తాభిషేకమున హరి స్వరూప
మొసఁగు సందియ మెన్నరాదు చిత్తవృత్తి.

కం. ఈ గణుతి మూర్తులుండెడి
యాగృహములు దివ్యనిధులు హరిపదతీర్థం
బౌ గదతత్తీర్థము తగ
నాగుణనిధి భక్తియుక్తు లలరుఁడఁ గాంచున్.

వ॥ తత్సన్నిధి శ్రాద్ధంబు పితరుల కక్షయఫలావాప్తియగు, తద్దర్శన స్పర్శన పూజలమిత సౌభాగ్యకరంబులు.

కం. క్రతుదాన హోమకర్మ
వ్రత జప సన్మంత్ర తంత్ర వర్తనములు స
న్మతిఁ దత్సన్నిధిఁ జేసిన
నతిఫలదములగుచు నతని కపవర్గమగున్.

తే.గీ. హరి నివేదాన్న భుక్తిచే నధికుఁడగుట
శక్తి కొలఁది తదర్చన సౌఖ్యమొదవు
నెచట శ్రీమూర్తులుండు నయ్యెడల భూత
చోర రాజ భయమ్ములు చేరవెందు.

మ. కనఁ బూజించినఁ బూజసంప్రభునులన్ గారామునన్ బ్రోచినన్
విని మోదమ్మునునొంద మ్రొక్కులిడినన్ వేడ్కన్ నుతుల్ సేయ న
మ్మనుజుండీశ్వరుఁడౌ శివాకృతుల సాయుజ్యంబైనఁ దన్నాభపూ
జ, నభీష్టార్థము నొంది పాపములు వో శశ్వద్గతిన్ వర్తిలన్.

మ. హరియే శంభుఁడు బ్రహ్మశక్రముఖదివ్యానీకముల్ విష్ణుఁడౌ
హరియే లోకచయమ్ములై తనరు నయ్యబ్జాక్షుఁడే సర్వమున్
హరియే కావునఁ దత్స్వరూపమున నొప్పునట్టి శ్రీమూర్తిఁ ద
త్పరతన్ బూజలుసల్పఁగా నిహపరప్రఖ్యాతులన్ గూర్చెడున్.

కం. హరియితఁడు హరుఁడితండని
పరికించెడు భేదబుద్ధి పాపాత్ముఁడు దు
స్తరఘోరనిరయ మొందున్
హరియానతి భూతసంప్లవావధిగాఁగన్.

వ. కావున సకలదేవాత్మకుండు శ్రీమన్నారాయణుండని యప్పరమేశ్వరు నెంచి తలంచి తులస్యాదియోగ్యవస్తుధూపదీపాద్యుపచారార్చనములం గృతార్థులు గావలయునని సూతుండనఁ గొని శౌనకాదులు తులసీగోభూదానవ్రతమాహాత్మ్యంబులు క్రమంబునఁ దెలుపుమని వినయవచనులై యడుగుటయును—

ఉత్సాహ. రాజహంసనేత్ర! మౌనిరాజపూజనప్రియా!
రాజరాజమిత్రమిత్ర! రాజితాశ్రయాశ్రయా!
భూజనేష్టదాయకాతిపూర్ణసద్దయోదయా!
భూజరాజతేజ శేషభూమిభృద్వసిక్రియా!

కం. ఖరకరవైశ్వానరహిమ
కరనయనాంబర చరప్రకరనుత! స్వామి
కరచామరదండమణీ
స్థిరతో భయభాగ! శేషశిఖరిగురురాగా!

తోటకం. జనకామిత కామిత కారణ కా
ననవారణవాగవనాదరణా!
అనపాయకృపా! సునయాతిగయా
వినతాజనతాధిప! వేంకటపా.

గద్య॥ ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదాంకు కవితా విచిత్ర మహంశాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్ర సుమతి వేంకటపతిసహాయ తేకుమళ్లాన్వయపాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబా క్రపనామాత్య కుమార సకల విద్వజ్జనాధార శ్రీవత్సగోత్ర, ఆపస్తంబసూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయి ప్రణీతంబైన శ్రీవాణీవిలాస వనమాలిక యను ప్రబంధంబునందు, అష్టోత్తరశత విష్ణుస్థల మహత్త్వంబును, పుణ్యనదీ సంబంధమును శివస్థల, మహత్త్వలింగాకార పూజాఫలంబులును, బ్రాహ్మణవంశ కీర్తన గోత్రగణ నిరూపణంబును, వర్ణాశ్రమాంతరభేదసదాచారవిధులును, పాపపుర దాహనప్లావన ప్రాణాయామ లక్షణంబులును, గాయత్రీ మహత్త్వార్ఘ్య ప్రభావ యజ్ఞోపవీత సంభవంబులును, వైశ్వదేవప్రకరణ దేవపూజావిధులును, భోజన ప్రకరణంబును క్షత్రవైశ్యశూద్రజాతిధర్మ పతివ్రతాలక్షణంబులును విధవాచారగణనంబును పుణ్యకాలదాన నిరూపణంబులును, దశవిధ బ్రాహ్మణ లక్షణంబులును సముచ్చయ ధర్మంబులును షణ్ణవతి శ్రాద్ధనైమిత్తిక కాలకర్తృభోక్తృవస్తు యోగ్యాయోగ్యనిరూపణంబులును హరిపూజా వైభవంబును సాలగ్రామ గ్రాహ్యవ్యవహారమూర్తి కేశవాది బహువిధమూర్తి శివనాభాది లక్షణలాంఛనంబులును దీర్ఘవైభవంబును ననుకథలంగల ద్వితీయాశ్వాసము.—

# తృతీయాశ్వాసము

శ్రీమదలమేలుమంగా
రామాహృదయాంబుజాతరమ్య వికసన
ప్రేమాస్పదమిత్ర ! వ్యా
యామ తృణకరణ ! వేంకటాచలరమణా !

వ. దేవా ! అవధరింపు మహర్షి శనుండు శౌనకాదులకుఁ దులసీమాహాత్మ్యం బిట్లని చెప్పందొడంగె—

సీ. అరయ ద్వాదశుల క్షీరాభిషేకము సేయు
ననఘుఁడు దలఁచ నవ్వనజభవుఁడు
తత్సన్నిధిన్ గర్మతంత్రముల్గావించు
నతఁడె మహాదేవుఁడంతవాఁడు
తత్ప్రదేశమున వాద్యములు వైభవములు
గావించునతఁడు స్వర్గప్రభుండు
రహి షోడశోపచారములఁ దత్పూజలు
సలుపునాతఁడె విష్ణుసన్నిభుండు

తే॥గీ॥ నృత్తగీతమ్ము లచ్చట నెన్నిమీఱ
సేయునాతని ఫలమెన్న నాయతమగు
నవని శ్రీమహాపూజల కధికమైన
కర్మములు లేవు ధర్మైక కర్మఠులకు.

క. దుష్టుఁడె శిష్టుఁడు దుష్కుల
కష్టుఁడె సత్కులుఁడు పాపి ఘన పుణ్యుఁడగున్
దృష్టపు హరిమూర్తుల వి
స్పష్టముగాఁ దులసిపూజ సల్పినమాత్రన్.

సీ. ఎండలఁ జను జనులుండి సేదలు దీఱ
వనముగావించు పావనచరితుఁడు
చతురతఁ జైత్ర జీర్ణపద్మాకరముల గ్ర
మ్మఱ శుభస్థితిఁజేయు మహితసుకృతి
హరిహర దేవాలయంబులుగావించి
విభవముల్ నడిపించు విశదబుద్ధి
పుడమి వేలుపులకు వడుగులు పెండ్లిండ్లు
ధీరతఁజేయు సుధీవినుతుఁడు

తే.గీ. వేదలకు నర్థములొసఁగు పృథులకీర్తి
ధరణి సత్సంతతిఁ గాంచు ధార్మికుండు
వెలఁగి హరిమూర్తి పూజలు సేయునట్టి
శిష్టజనములఁబోలమి సిద్ధమరయ.

ఉ. శ్రావ్య నృత్తగీతములు గౌరవకీర్తనముల్ ఘటిల్ల నా
నావిధభక్తి నచ్యుతున నారతముల్ భజియించు మర్త్యుఁడే
శ్రీవిలసిల్లఁగా నిహమునందున్ముదముల్ సుఖవృత్తిగాంచు నా
దేవుని సత్కృపామహిమ దివ్యతరప్రకటీకృతప్రథల్.

కం. హరికింబ్రియమను సుధాసా
గర జనితంబైన తులసి కమనీయగతిన్
ధర బృందావన సజ్ఞన్
బరగుట కీతిహాస మొకటి పలికెదఁ దెలియన్.

తే.గీ. శ్రాద్ధకాలమ్ము తులసిచే నరతి సురుల
నర్చనమొనర్చు నతఁడొందు నధికపదవి
హరితిథిన్ ద్వాదశినిఁ బుణ్యమైన హరి
ములను హరిపూజ గావింపఁ గలుగు శుభము.

కం. తులసి పత్రాంచమ్ముల
నిలవైష్ణవ సమితియందు నీశ్వరుఁడుండున్
తులసిన్ జాహ్నవిఁ దలఁచినఁ
దొలఁగున్ దుస్స్వప్నగతుల దోషములెల్లన్.

వ. తత్ప్రభావేతిహాసంబు వినుండు

తే॥గీ॥ చంద్రశేఖరు సేవకు నింద్రుఁడొక్క
నాఁడు రా ద్వారపాలకుఁ బోఁడిమమర
భర్గుఁడె యిదివేళగాదని ప్రభుతఁ బలుక
నతనిఁగాదని చనెడి యయ్యమరవిభుని.

కం. చేనుండు దండమానిక
గా నిడి వలదనుచు నాఁగఁ గ్రతుభుక్పతినా
తోసేనా ! యీశంతము
గాను శరావళియటంచు ముదమున జనఁగన్.

మ. అనఘుం డీతఁడు దార్థ్యస్వరూపమున దేవాధీశు దర్పంబు మా
న్పసిజాకారము మానియున్నకతనన్ నాకారనీక్షించి పోఁ
జనునే! నీవన నెంత! సంతతము నాశక్తిన్ మహాదేవునిం
గన నిర్మించిన వారలిందు శతసంఖ్యల్ గాచియుండన్ గదన్.

ఉ. అనవిని వజ్రమెత్తి తెగటార్తునొ! వేగఁ దొలంగిపోయెదో!
యనఁ జెలునప్పు డవ్వి యహహా! బలిసీవన నేమి నీదుచే
ననువగు వజ్రమేమి! యిటులాడెడు మాటలు మాని క్రమ్మఱన్
జనుమను డామరప్రభుఁడు సద్దయెనర్పక త్రోఁచిపోవఁగన్.

కం. పిలిచెదికిఁ ద్రోఁచిన నాతనిఁ
గర వజ్రంబెత్తి దేవగణపతి వ్రేయన్
హరుఁడురక సిజాకృతిఁ జె
చ్చెఱకను దెఱువంగఁ బూన శైలజపలికెన్.

ఉ. నీదగునాజ్ఞచే నితఁడు నిర్జరపాలకుఁ డింక దిగ్గుఁడై
పాదుగ లోకరక్షణకుఁ బాల్పడియుండితఁ డిందు డిందినన్
మీఁదట నొక్కఁ డట్టిపని మేకొనకున్కి జగమ్ము వీతమ
ర్యాదఁ బొసంగు గానఁ గరుణాకర! యీతనిఁ బ్రోవుమిత్తఱిన్.

మ. అనినం దాలిమినొంది రా గిరిజ! యీ యర్చిష్మదుగ్రమ్ము దా
ల్చినఁ గాల్చున్ గౌరీ రిత్తవోవదిది యిచ్చన్నాఁ గదా శైలజా
వనితారత్నము ప్రార్థనల్ [దగవానర్పన్] దేవతా శైల భూ
వనజాప్తాభుల జ్వాలఁ బట్టుఁడనఁగా వారోర్వలేకున్నెడన్.

తే. జలధిఁ బ్రార్థించి జ్వాల తజ్జలధి విడిన
బంధురబలుండు సుతుఁడు జలంధరాఖ్యుఁ
డుదయమందిన వానికయ్యుదధి సకల
విద్యలటు నేర్ప నేర్చె నవీరవరుఁడు.

చ. సకలకళాప్రవీణుఁ డతిసత్త్వసమేతుఁడునై సముద్రసు
త్సుకమతిఁ జూచి ధాత్రిఁగలచోటులఁ గ్రుమ్మరివత్తునన్నఁ బు
త్రకు నటు నేయు మంచనుప దానవకోటులఁగూడి వేలకుం
బ్రకటితలీలఁ బట్టి భవభాసితుఁడై ధరసంచరింపుచున్.

ఉ. లోకులు చూచి భీతిల నలూనగతిం దివిఁ జేరి యచ్చటన్
నాకనివాసులం గెలిచి నాకముగా సురరాడ్గృహమ్మునన్
శ్రీకరవైభవస్థితులు జేకొని యచ్చరలెల్లఁ గొల్వ నా
లోకమనీయవైఖరి జలంధరుఁ డామయవృత్తి నత్తఱిన్.

కం. బృందానామఁ బతివ్రత
నందంబుగ రూపయౌవనాదిత శీలా
నందన్ బరిణయమై చెలు
వొంది సుఖంబుండె దైత్యులందఱు గొలువన్.

ఉ. అప్పుడు దేవతల్ వనుల నద్రులఁ గ్రుమ్మరుచున్న నారదుం
డొప్పుగ వారిఁ గన్గొని యథోచితసత్కృతు లొంద సంతతం
బిప్పగిదిన్ జలంధరుఁడహీనబలస్థితి నేచుచున్న యా
చొప్పులు దెల్పి వాసవుఁడు చోద్యముగా మునితోడ నిట్లనున్.

చం. హరిహర పద్మగర్భులకు నాదట నీ తెఱఁగెల్లఁ దెల్పఁబో
దురు సుర రాక్షసుండధిక దుర్మతి యుద్ధము వచ్చెనంచు పెన్
వెరపున నుండువారి మము విశ్వమయుల్ పరికింపలేర మా
తెఱఁగు జలంధరోద్ధతియు దేవమునీంద్ర ! యదృష్టమే మొకో!

ఉ. నావిని మెంచిదయ్యె సురనాథ వసింపుము దేవకోటియున్
నీవిట నిప్పుడే యసుర నిష్ఠుర సత్త్వమణంగఁ జేసెదన్
భావ మెలర్పనంచుఁ జని పద్మజసూనుఁడు స్వర్గసీమ నా
నావిధ భోగి నయ్యసురనాథునిఁ జేరిన వాఁడు సత్కృతిన్.

శా. ప్రత్యుత్థానము చేసి పూజలిడి శుంభత్ప్రీతిపై నుంచినన్
దైత్యేంద్రుంగని మౌనిపల్కె వినుమీ ! త్రైలోక్యమందున్ భవత్
ప్రత్యామ్నాయ బలాతిశౌర్యయుతులన్ భావింప నత్యద్భుతం
బత్యౌత్సుక్యము ధైర్యసార యన వాఁడమ్మౌనితో నిట్లనున్.

ఉ. కంటివి నీవు వేడుకలుగాఁ బదునాలుగు లోకముల్ ముదం
బంటఁగ మత్సమానబలునందుఁ గనుంగొననంటి, ఒక్కమే
వెంటలనైన మేటియగు వీరుఁడు గల్గినఁ దెల్పుమన్న ము
క్కంటికి నీకు నెక్కటిగఁ గయ్యము గల్గెడు నంచు నెంచెదన్.

కం. నీ విభవమునకు మహిమకుఁ
గావలయుం గౌరిదేవిగాఁ గల్గినచో
శ్రీవెలయ త్రిభువనములకును
దేవుఁడ వీఁక నీవె శాశ్వ దీపితశక్తిన్.

చం. అన విని మేలు మేలనుచు నాదట దైత్య బలమ్ము గొల్వఁగా
దనుజుఁడు స్వర్గముల్ వెడలి దారన రా నతఁడంత నేఁగి శం
భునిఁ గని యా జలంధరుఁడు పోరికివచ్చుట దెల్పి వేఁగ దై
త్యునిఁ దెగటార్చి శాంభ దయతో జగముల్ మనఁగా నొనర్పవే!

మ. అనుసంతత భ్రమ భూళిఁబిల్చి పటుదైత్యానీకముల్ ద్రుంపఁగాఁ
జనుచున్నన్ వడి దైత్యులా గిరివరస్థానమ్ములం గ్రమ్మఱన్
గని యుద్ధంబొనరింప దానవులు వీఁకన్ రాక్షసాధీశుఁడా
ఘనసైన్యంబుఁ బురస్కరించికొని వీఁకన్ దాఁకె శైవావళిన్.

లయగ్రాహి. బంధుర బలుండగు జలంధరుఁడు ఘాటిగ మ
దాంధ జమదార్భటి వసుంధరదలంకన్
సింధురశతాంగ భటసైంధవ బలావళులఁ
గంధులు గలంగ నిజబాంధవులు దాన
య్యంధక విరోధిబలముం ధరణిఁ గూల్పఁదను
సంధు లెడలంగ శితికంధరుని భృత్యుల్
సందులఁ జనన్ శుభధురంధరుఁడు శంభుఁడ మ్మ
తాంధస హితారి గరిమంధృతిదలిర్పన్.

ఉ. కాలము గేలఁబూని జిగిసొంపలరన్ దెలిగిబ్బనెక్కి దై
త్యాళి వసుంధరన్ గెడపినంత జలంధరుఁడీశుఁదాఁకినన్
మేలిమి కూరతన్ హరుఁడమేయబలస్థితిఁ జూప వాఁడు సు
ద్వేలతఁ బోరె వేల్పుగమి వీరు[లు]వీరల సారెచూడఁగన్.

చం. మఱియు జలంధరుండు కలుమాయలుపన్ని యనేకబాణముల్
బరపిన మోహనాస్త్రవిభవభాసురకాయిను లాటపాటలన్
నెరపఁగఁ జూచుచుండె మది నివ్వెఱశంకరుఁ డంత దేవతల్
వెరచి ముకుందుఁజేరి మొఱఁబెట్టినవించు మురారి ధీరతన్.

ఉ. లాలితమాయనచ్చుగ జలంధర రూపముదాల్చి సైన్యము
ల్లోలిఁ గలంగఁ గేతన శుభోజ్జ్వలవాజిమదేభ సంఘముల్
గ్రాల మహేశ్వరుం గెలిచి గౌరవముప్పఁగ వచ్చెనంచు నా
ప్రోలునఁ జాటఁగాఁ బనిచె భూరితరాంచిత వైభవస్థితిన్.

కం. సర్వ జగదంతరాత్ముయు
సర్వేశ్వరుఁడఖిల మయుఁడు సాక్షియునగు న
య్యుర్వీధరునకు దైత్యులఁ
బర్వెడు నిజమాయమోహ కలుచుటలరుదే!

సీ. ఇట్లు దైత్యుల భ్రమయించుచు స్వర్లోక
భాసురంబగు దైత్య భవనసీమఁ
దర్పభర్యయైన బృందాకాంత నివసించు
నంతఃపురమ్మున కరిగి విష్ణుఁ

డమలినశయ్యనొయ్యనఁ దరుణీమణుల్
సేవసేయఁ నర్హుఁగాఁ జేరి మీఁతి
బృందతో సరసంపు టందచందమ్ముల
బాహ్యరతుల్ సల్పఁ బ్రౌఢిఁ దెలిసి.

తే. గీ. యాపతివ్రత హరియాటలాత్మఁదెలిసి
పలికెఁ ద్రైలోక్యసంభావ్య భద్ర ! నీవె
యిట్టుల మర్యాదఁదప్పిన నేమి సేయ
వచ్చు శపియించుటర్హమే ! వాసుదేవ !

చం. అని వనితాశిరోమణి రయంబున లేచి శుచివ్రతచారిణియై
తనుగతకుండలీ స్థిత నిదాన మహానలమాత్మకుంభకం
బునఁ బురిగొల్ప గాత్రము బూదిగఁగూలిన విష్ణుఁడంతయున్
గనుగొని మోహమాపని వికారమునం దవిలున్న యంతటన్.

తే. గీ. క్షీరసాగరకన్యక చేరివచ్చి
బృందరూపమ్ము గైకొని పేర్మి విభుని
కట్టెదుట భస్మరాశిపైఁ గదలకున్కి
గాంచి హర్షించి శౌరి రమఁ గౌఁగిలించి

చం. తెలిసి పొసఁగఁగా నిజసతిం గనుగొంచు పసింపు మిందు ని
శ్చలమతి వృక్షరూపమున సర్వజనస్తుత పావనాంగివై
తులసి యనాగ నెల్ల విబుధుల్ భజియింపఁగ నెందుఁదద్దళం
బుల ననుఁబూజ సేసి భువిఁబుణ్యము గాంతురు మర్త్యులెంతయున్.

కం. మత్ప్రియవగుటన్ నీవే
తత్ప్రకటార్చావతార ధన్యనివాసం
బత్ప్రభల ధరణిననురిన
మత్ప్రియుమార్యఁగ సంగవమున నలరుమీ !

సీ. లలితచిహ్నముల సాలగ్రామ రూపంబు
గైకొన్న నన్ను వికాసచిత్తు
లై యొక్కదళమున నర్చింప రెంటఁ ద
దత్రయంబునఁ జతుష్పత్రయుక్తి
నైదింట నర్చించునట్టివారికి హిర
ణ్యస్తేయ గురుతల్పగాఘ మద్య
పబ్రహ్మహత్యాకి సంపర్కాదిభృజిన సం
ఘకము దొలంగు నిచ్చలు ననేక

తే॥గీ॥ పత్రములఁ బూజసేయు సత్పాత్రులకును
ధర మహాపాతకోపపాతకములణఁగి
యిహపరసుఖంబులు పొసంగ రిపిఁదనర్చి
దివ్యపదము నొందుటలకు సందియము లేల.

మ. తులసీపర్ణయుగంబు మత్తనుశిలోత్తుంగ ప్రసంగంబు నా
జల మెవ్వారలు గ్రోలుచుండుదురు నిచ్చల్ వారిభాగ్యంబు శ్రీ
లలనా! లెక్కయిడంగ నే నెఱుఁగ లీలామత్స్వరూపైక్య ని
శ్చలభోగాన్వితు లౌదు రాజనులు భాస్వద్దివ్యదేహాఢ్యులై.

కం. ఆ జన్మకృత మహాఘ స
మాజములణఁగించు వ్యాధి మదములుబాపున్
శ్రీజయమగు తులసీయు
గ్మాబ్జజన్మార్చనాంబురతి మనుజులకున్.

వ. అని యానతిచ్చి లక్ష్మీసహితుండై నారాయణుండాదు వసియించె నంత జలంధరు మాయదలఁగులయు శివుండు వాని వధియించి సురల కభయంబొసంగి కైలాసంబున వసియించె నట్టి భస్మంబు వేదకగాఁ బ్రోఁది దనరు లక్ష్మీస్వరూపంబగు తులసీ మహిమ వినుండు —

సీ. దుర్వారభక్తి చాతుర్మాస్యలన్ ద్వాద
శుల నమృతాబ్ధిజ తులసి కెలమి
నర్చనల్ గావించి యత్యుత్సవములతోఁ
జూపట్టఁగా షోడశోపచార
పదవాక్యనతుల దేవంగొల్చురట్టివా
రచ్యుత సమరూపులగుదు రంచు
ధాత్రీతరుచ్ఛాయఁదగు తులసీ ప్రద
క్షిణముఁ జేయు ముక్తిరమ గల్గు

తే॥గీ॥ వేడ్క బృందావనమ్ము గావించితగ న
లంకరించిన స్వర్గపాలకత పొసఁగు
కర్ణమునఁ బత్రమొక్కఁటఁ ఘనుఁడు మెఱయు
నవ్యయానంద సంభాస్యమైనచోట.

కం. అలపడఁ జరమావస్థన్
దళమొక్కటి జిహ్వనునుచు ధన్యుఁడు పంతలోఁ
గలయుం గల్మషియైనం
గలదే తన్మహిమయితర కర్మములందున్.

తే॥గీ॥ ఇట్టి యద్భుత వృత్తికి నెన్నికలరఁ
గలదు మున్ గథయొక్కటి కలుషవృత్తిఁ
దిరుగు జీవాళిఁ గఱకుటంపఱఁదునుముచుఁ
బుట్టుమొదలుగ నొకబోయ దిట్టయగుచు.

ఉ. పుట్టిననాఁటఁగోలె చలపోరి మృగమ్ముల సంహరించుచున్
నెట్టగు జీవహింస లతినిందితవృత్తి నొనర్చి పాపముల్
గట్టుగ నొక్కనాఁడు మృగపంక్తి లభింపమి నాశ మీఱఁగా
నట్టడవిం జరింపుచు మనంబునఁ జింతలవంతనొందుచున్.

మ. ఆలుం బిడ్డలు పుత్రులాసపడి యాహారమ్ము వేఁదెచ్చునాఁ
జాలా నమ్మికగాంచియున్నయెడ మాంసంబేమియున్ లేనిచో
నేలీలన్ భరియించువారు క్షుధ చేనింకే యుపాయంబొకో
వాలాయంబని ప్రొద్దుగ్రుంకుటయు భావంబెంతయున్ గుందఁగన్.

కం. కట్టియ లొకమోపైనా
గట్టుక యది విక్రయించి పైకంబును చే
బట్టుకనేఁడిలు జేరెద
నిట్టుకు మఱి రేపుచూత మెల్లవిధంబుల్.

చం. అని మది నిశ్చయింపుచు రయంబునఁ గట్టెలమోపుగట్టి యొ
య్యనఁ దలనుంచి పోవునెడ నద్భుతలీల ఘనాభ్రమచ్చటన్
మునుకొని చిన్కుపిమ్మట నమోఘమహాకణ యుక్తమైన వాఁ
డనువగు త్రోవఁదప్పి భయమందుచుఁ గానన భూమిఁబోవఁగన్.

ఆ. వె. మిట్టపల్లమనెడి మేలయెర్పడక ప్ర
వాహముడర నడవ వైపుగామి
నొక్కమిట్ట పొదల చక్కటికై చేరి
మోపువైచి కంపమునవసించి.

కం తాఁదెచ్చిన మోపుపయిన్
బాదుగఁ దల యునిచి చాల బడలినకతనన్
హా! దైవమ యని వగచుచు
నాదురితాత్మకుఁడు నిదుర నల్లనసోలెన్.

ఉ. సోలినయంతఁ గట్టియలఁ జుట్టుకయుండిన ఘోరసర్పమా
పాలసునంటినన్ నిదురపాల్పడి యంతటఁ బెద్దనిద్దురన్
గూలినఁ గాలకింకరులు కొట్టుచుఁ దిట్టుచుఁ గట్టివైచి యా
భీలతఁ గొంచుపోవునెడఁ బేర్మిరమాధిపు దూతలత్తఱిన్.

శా. అడ్డంబోయ్యనవచ్చి యామ్యభటులాకై క్రుక్కి భర్జించి యీ
యొడ్డారంపు టధర్మమేమిటికి మాయొద్దన్ విడుండీతనిన్
ఎడ్డెల్గాన రహస్య ధర్మములు నెంతేబుద్ధి చింతింత కీ
దొడ్డాపుణ్యుని బాధపెట్టఁదగునా! దుర్మార్గులై పోరకున్.

కం. అనవుడు నిటలాంజలులై
యనఘాత్మకులార! పుట్టినప్పటి గోలెన్
దినదినము జీవహింసలు
పనిగా నిటు సర్వదక్ష పాపసహితుఁడై.

ఉ. దేహము వీడె వీని నతిదీర్ఘతమిస్రనిపాతుఁ జేయ సం
దేహమె! ధర్మమింతగలదే కలుషాత్ముని కన్న వారిలో
నా హరిదూత లిట్లనిరి యట్టిద వీని వికారమైన మీ
యూహ నెఱుంగలేరు సుకృతోచితకర్మ నిరూపణక్రియల్.

సీ. వంటకట్టియలలో నంటుగాఁ దులసి కా
ష్ఠంబొక్కటున్న సంస్పర్శగాత్రుఁ
డై పవ్వళించి యాయహి విమలవహ్నిఁ గేఁ
గ్రాఁగి యిట్టుగుటఁ దత్కాష్ఠ మంగ
మంటియుండుటఁ జేసి యధికుఁడు వీఁడు వై
కుంఠ నివాసయోగ్యుఁడు దలంప
సంధ్యాకాలమ్మున హరినెంచువారలు
తులసి దళంబైనఁ దులసికాష్ఠ

తే.గీ. మైనఁ దాల్తురువారలయ్యచ్యుతాను
లోకవాసార్హు లటుగాన శ్రీకరముగ

నితని భజియించి విడిచిపొండిప్పుడనిన.

కం. వనమాలి భృత్యులకు బో
య నెఱిమి నప్పనముజేసి యటఁ దులసీపా
వనమహిమ లెఱుఁగఁగాఁ దమ
మనములఁ దలపోసి శ్రీరమావిభు భటులన్.

చం॥ కనుగొని కాలకింకరులు గౌరవసన్మతి సంధ్యకాలమం
దనుపమపుణ్యదంబయినయా తులసీదళముల్ ధరించినన్
ఘనసుకృతంబుగల్గు నొడికంబుగ నజ్ఞతఁ గ్రూరకర్ముఁడీ
యనతనుఁ డంటినన్ సుకృతియౌటకుఁ గారణమేమి తెల్పరే!

తే.గీ. అనుడుహరి దూతలనిరి యాయాజ్యులకును
మున్న జామీళుఁ బట్టి మీరున్న యప్పు
డెఱుకలేమిడి హరినామమెన్న ఫలము
వింటిరే కద తత్కథ కంటిరిపుడు.

కం. ఆరీతి నతుల తులసీ
ధారణ సంస్పర్శనములు ధన్యశ్రేష్ఠా
ధారణముగఁ దన్మహిమ మ
పారంబగునైనఁ గొంతపలికెద మెలమిన్.

సీ. నదులచెంగటుల వనంబులఁ గొలఁకుల
దరుల హ్రదంబుల దాపునందుఁ
దులసిఁ బ్రతిష్ఠించి యలరించి దేవపూ
జల కొదవించిన సకలదాన
ఫలవైభవంబులు బహుయజ్ఞ సుకృతంబు
గాంచి లోకముల సౌఖ్యంబునొంది
దివ్యదేహముల సందీపిత విభవము
లన్నియు ననుభవమైన పిదప.

ఆ.వె. సత్యలోకమున బిసరుహ సంభవునిచేఁ
బూజలంది యవల భువనవంద్యు
నచ్యుతున్ భజింతురతని సన్నిధియందుఁ
దత్సరూపగరిమఁదనరి వరుస.

కం. మఱియు మరీచికి గరుడుం
డెఱిఁగించిన తెఱఁగు దేవఋషికిని విష్ణుం
డొరపుగ నానతియిచ్చిన
కరణి నదివినుండు తులసి గౌరవమహిమన్.

మ. చెవిఁ దత్కాష్ఠపు ప్రోఁగులిడ్డ దళముల్ చెల్వొందఁగాఁ దాల్చినన్
భువి బృందావనమే నొనర్తు ననుచుంబూనంగ వేనట్లు నే
య విలాసమ్ముగఁ జూచి మ్రొక్కులిడ జన్మాద్యైక సాంగత్యజా
వివిధాఘమ్ములుబాసి విష్ణుపదవిన్ వేడ్కన్ వసింపందగున్.

కం. తులసీదళమున హరిపద
జలములు దలఁజల్లుకొనెడి చతురుల కులకో
ట్ల లఘుపదవి వసియింతురు
తొలఁగున్ బ్రహ్మవధ ముఖ్య దురితములెల్లన్.

కం. ద్వాదశులఁ దద్దళమ్ములఁ
బాదుగ హరిపూజసల్పఁ బటుదీపముల
న్యాదరతన్ దులసికి నిడ
మోదముతో విష్ణులోకమున వసియించున్.

సీ. కార్తిక శుక్లపక్ష ద్వాదశిన్ విష్ణు
దళములఁ బూజింపఁ దత్ప్రదక్షి
ణము దదలంకరణములు గావించిన
బహుజన్మకృత ఘోరపాతకములఁ
బాసి దివ్య విమాన భాసురారోహిత
సకలలోకమ్ములు సంచరించుఁ
దన్మూలమృత్తికఁ దగ ఫాలమునఁ దాల్చు
వారి పుణ్యమ్ము లవ్వారి దలఁపఁ

తే.గీ. దులసి భక్షింపఁ బరువిడు దురితచయము
తులసిఁ బోషింప విష్ణు సంతుష్టియగును
దులసి వలనైన సుకృతముల్ గలుగు జాలఁ
దులసికిన్ మ్రొక్కు ఫలములు దెలియఁదరమె.

ఆ.వె. తులసి మొదలికసవు దొలఁగింపఁ దత్సంఖ్య
నైన జన్మచయము మహాఘమెల్ల
యముఁడె తొలఁగఁద్రోయు నంబువుల్ నించిన
యతని పితరులుందురతులగతుల.

కం. జపములలో గాయత్రియు
నుపవాసములన్ హరిప్రియోచితదినమున్
గృప సకల ధర్మముల ఫల
మపరిమితంబల్ల తులసినగు నర్చనలన్.

వ. అని చెప్పి సూతుండు వెండియు మునులకు నిట్లనియె—

ఆ.వె. అట్టి తులసి భక్తి నర్చనగావించి
దీపమిడిన ఫలము దేవుఁడెఱుఁగు
నైనఁ దన్మహత్త్వ మదివినఁదెలిఁగెదు
భానుకేతిహాస పటిమ నెరయ.

కం. కాశికుఁడు నిజసతితో
నా శశి యయ్యింద్రుఁ డెట్టులట్టులన భోగా
వేశ మహాసౌఖ్యానుభ
వాశయుఁడైయుండె లలితయను సతి దానన్.

శా. ఆ కాశీశు సతుల్ లసత్సుగుణలావణ్యారంపు టాకారముల్
రాకాచంద్ర నిభాననమ్ములు విహార ప్రక్రియల్ గల్గు దా
రేకాధిక్య సహస్ర సంఖ్యమదిఁ గ్రోధేర్ష్యాదులన్మాని తా
రా కంజాననఁ గొల్తురెప్పుడు మహోత్సాహైక సంసక్తతన్.

ఆ.వె. సవతి మత్సరంబు సాలించి నెనరున
నపుడు లలితఁజేరి యబ్జముఖులు
భక్తిదయయుఁ గల్గి పరిచర్యసేయుచు
నిట్టులనిరి మోద మెసఁగ మెసఁగ.

చం. జనపతి నిన్ను మన్ననలు సల్పఁగ వాఁకిటి పెద్దతల్లి నిన్
గనిమని కొల్వభృత్యు లతిగౌరవ లీలభజింప బాంధవుల్
మనవులు చెల్ప నైజముగ మానిని నోములనేమినోఁచితో
వినఁగడు వేడుకయ్యె ఫణివేణి! యెఱుంగఁగఁ జెల్పవే యనన్.

కం. ఏ మందఱమును నీపై
ప్రేమయ కానొందు దెలుఁగు బిమ్మిటి నీస్వా
సామగ్రిఁ బూన మెన్నఁడు
కామిని! నీనోముఫలముఁ గౌరవమేమో.

తే. ఎప్పుడిటువర్తులానరించుటెప్డు దీప
ములు రమానాథ గృహమున నిలుపఁబనుచు
టింతియేకాని మఱి కృత్యమేమి లేదు
నీకు నీభాగ్యమేమిట నెరయఁగల్గె.

చం. తెలుపుమటన్న యాలలిత తేఁట మిటారపు లేఁత నవ్వుతోఁ
బలికె నవంతిదేశమున భాసుర చారుమతీ తటమ్మునన్
గలదొక దేవతాగృహము క్రమువిశంకట సాల గోపురో
జ్జ్వల బహుచిత్ర శోభితము సారవనావృతమై తనర్చుచున్.

ఉ. వాద్య మృదంగ రావముల వారసఖీ నటనస్ఫుట క్రియా
హృద్యతర ప్రవర్తనల నెంతయు ధూపసుగంధ బంధుర
ప్రోద్యదనేక చిత్రముల భూరి వితాన సుమాభిరామమై
యాద్యుఁడనంతుఁ డుండుటకు నర్హమునై తగునై భవంబునన్.

సీ. అట్టి విష్ణునకు నిత్యంబొక వైశ్యుఁడ
త్యంత విభవతఁ బూజనాది విధులు
గావింపుచున్నచో కార్తికమాసము
వచ్చిన దీపముల్ వరుస నెరయ
సన్నిధినుంచు నిచ్చలు రేలు బవలును
వెలుగఁగ నొనరించి వేడ్క లాదవ
నఖిల వైభవములు ననువునఁ జేయుచుఁ
బౌర్ణమి కూడ నట్టి భంగిఁ జేసి

తే.గీ. వేఁకువను నిద్రఁ జెందిన వేళ శ్రీశు
నెదుట దీపములటుఁ గాంతిహీనమగుచు
వర్తి సమయాన వచ్చుచో వైపెఱింగి
యచట మూషికమై యున్నయట్టి నేను
నది గ్రహింపఁ దలంచి జాత్యానురూఢి.

కం. క్రమిదె నడినున్న వర్తినిఁ
గ్రమమున దంష్ట్రికలఁ దిగిచి కైకొనుచో నం
దమరిన మార్జాలము త
త్సమయము దఱివేచి నేర్పు సమకొనఁ గడఁకన్.

ఉ. ముంగలి కాళ్ల భూమిపయి మోపఁగ నీయక సాచి మిక్కిలిన్
వంగి క్రమక్రమమ్ముననువచ్చి మఱుంగున దాఁగి పొంచి వే
చంగున దాఁటి పట్టిన భృశంబగు వర్తినిఁ బాత్రనుంచినన్
బొంగి వెలుంగ శౌరి ముఖపూర్ణ రుచుల్ గనుపించె సొంపుగన్.

చం. వినుఁడటువంటి పుణ్యమున విస్మృత మూషిక దేహవర్తనన్
దనరఁగ వైభవ స్థితులు దార్కొన రాజకుమారినై కడున్
ఘనుఁడగు కాశికావిభుని కామినినై బహుభోగయుక్తిచే
దినమును దీపపంక్తులిటు దేవునికే నిడఁ జేయుదుం దగన్.

కం. ఎలుకనయియుండి వర్తిగ
నిలఁ జేసిన పుణ్యఫలము జెలువము ప్రాగ్జ
న్మ లలిత చర్యల తెలివిడి
యలవడు విభవము సురూప మమరగ గంటిన్

ఆ.వె. యిప్పుడిట్లు భక్తి యెసఁగిన రొంటుకచే
దినము లక్ష సంఖ్య దీప పంక్తి
యిందిరేశు నెదుట నిడుటకు సిద్ధించె
దీపదానమహిమఁ దెలియుఁడిట్లు.

కం. అని లలిత సవతులకుఁ దా
ననువుగ బోధించె ననుచు నా సూతుండ
మ్మునులఁ గనుంగొని మఱియు
న్వినుఁడని యిట్లనియె దీప విధి ఫలమెలమిన్.

శా. సింధుప్రస్ఫు రదంతరీపక చతుస్సీమావనీపాలనో
త్సంధానామిత శౌర్య ధైర్యకలనాచాతుర్యతన్ బద్మినీ
బంధూద్యత్కుల శేఖరుండగుచు శుంభల్లీలలన్ బొల్చు న
మ్మాంధాతృక్షితి పాలమౌళి శుభధామంబౌ నయోధ్యాపురిన్.

కం. కులగురుఁడు వసిష్ఠుఁడు ముద
మలరంగాఁ దెల్పినట్టియంచిత నీతిన్
వెలయఁగ భూప్రజ నేలుచుఁ
గుల ధర్మము పూర్ణ మహిమకున్నెక్కడఁగా.

ఆ.వె. రమణ నశ్వమేధ రాజసూయాదులు
పెక్కుఁజేసి యచటఁ బృథ్విసురుల
సకల వస్తుతతుల సంపూర్ణకాములఁ
జేసె విశద కీర్తి భాసురముగ.

ఉ. నీరదవేణి సాధ్వి శుభనిర్మల చారుశరాంగి భద్ర నా
వారిజగంధి యాత్మసతి వారక సేవయొనర్ప నాప్తులున్
గూరిమి పుత్రుఁడైన ముచికుందుఁడు నల్లుఁడు సౌభరి ప్రమే
ధారసికాగ్రగణ్యుఁడు సుదారతఁ గొల్వ సుఖాసన స్థితిన్.

కం. ఉన్నంత వసిష్ఠుఁడురా,
సన్నుతమతి నర్ఘ్యపాద్యసత్కృతులానరన్
మన్నించి భద్రపీఠమ
పెన్నతగతి నెఱయుచూనినొయ్యఁ గనుచున్.

కం. మతిలోన నలితానా
గతచర్యలు వర్తమానగతియున్ దెలియన్
జతురులగు వారి మిము నే
కృతి వొక సందేహముడుగఁ దిఫ్పుడదు నెపుడున్,

ఉ. ఏమితపంబొ స్వర్గ్వ్రతములేమి లసత్సుకృతంబు లెవ్వియో
యేమహిమంపు దానములో! యే నొనరించితి నింత ద్వీపయు
గ్భూమియు నెల్ల నేల బహుభోగములొందఁగ రూపయౌవన
శ్రీమహిమందలిర్ప గుణ సింధువుభద్ర భజింపనిట్లుఁడన్.

మ. తెలియంబల్కుచున్న భద్రయను పాతివ్రత్య చారిత్ర ని
శ్చల సాష్టాంగముసర్చి నాదుమది నీ సందేహమే వేఁడఁగాఁ
దలఁతున్ మత్పతి యిప్పుడిట్లనె యతీంద్రా! సంత సంబధ్యా సు
జ్జ్వలతేజోధన! యానతీవలయుఁ బ్రాగ్జన్మప్రకారమ్ములన్.

కం. అనవిని ముని మనమున నెన
రొనఁగ దంపతుల బంధులొనర గఁనిటులొ
ప్పనె తెప్పఁగ నడిగితిరది
వినుఁడని యిట్లనియెఁ బూర్వ వృత్తాంతమ్మున్.

సీ॥ సొలఁతి మీరిరువురు పూర్వజన్మంబున
శూద్రులయ్యెడ శోణభద్రతీర
భూమి దంపతులయ్యుఁ బేమనుండఁగ దు
ష్కృతుఁడైయుతఁడు నిశ్చలమహాఘ
కర్మంబులొనరింపఁగని బంధువులు వెళ్ల
నడిచిన నా యూరు వెడలివచ్చి
యడవిలోనొక్క దేవాలయంబున నిల్వ
నచ్చటియర్చకు లాదరించి

ఆ.వె. రొక్కపూట కన్న మిడవఁ గట్టడ సేయఁ
గడమపూట తిందునడిగి కొనుచుఁ
బాలతోఁటఁ బనులు పూని సేయుచు విష్ణు
సిద్ధబుద్ధిగలిగి చెలఁగుదనర॥

ఉ॥ అచ్చటనుండునట్టి యొడ పొలి నొకానొకనాఁటి పూఁవునన్
దెచ్చినయన్న మింపలర దేవుని సన్నిధి భక్తిసల్పఁగా
హెచ్చగు తైలహీనత రహిందకు కొత్తని దీపకష్టికై
పొచ్చెములేక భాసికొనఁబూనిన నూనియ చెంతనించినన్.

కం॥ ఛిద్రంబగు పద్యోదనో
భద్రా! నీవింత చించి పఖువత్తిగ ని
ర్ణిద్రస్ఫూర్తినొనర్చుచుఁ
భద్రిచిన నదివెలిఁగె హరిముఖాలోకగతిన్.

ఉ॥ తత్సుకృతంబునన్ భవదుదార సబోధన విష్ణుఁగొల్చియ
త్యుత్సుకతన్ మహావిభవ మూహఁబొసంగఁగఁగోరి యుల్లసం
వత్సరరాజ వైభవవిభన్ జెలు వొందితి రాముకుంద భా
స్వత్సుమదామదీపకుల చందములిట్టి వటించుఁబల్కినన్.

తే॥ గీ॥ దైవమనుకూలమైన చోఁదానొనర్చు
కర్మములొకింత ఫలమధికము బొసంగు
దైవమే ప్రతికూలమై దనరఁగర్మ
ఫలములల్పంబులని రాజు పడఁతిదాను.

వ॥ హరిఁభజియించి యతికృతార్థులైరిది దీపదాన ఫల ప్రభావంబు—

సీ॥ పుణ్యతీర్థమ్ములఁబుణ్య స్థలమ్ములఁ
బుణ్యకాలమ్ములఁబుణ్యసూర్య
శనిరోహిణీ బుధాశ్వినుల యోగములఁ బం
చామృతస్నాన ముఖ్యార్చనముల
హరిహరభేదమ్ము లాత్మనెంచక సుర
భిళ కుసుమమ్ముల వేయఁబూజ
సల్పిన నుభయ వంశములతో నెల్ల లో
కముల సౌఖ్యము లొంది కాంచుముక్తి.

తే.గీ. మానైనిష్టార్థములు గల్గు పూనినేఁత
దీపమిడఁ బాపహరమగు తెలివి కార్తి
కమున మాఘమ్మునన్ విప్రగణము లలర
భోజనంబిడు నతఁడొందుఁ బుణ్యపదవి॥

కం॥ హరిహర దేవాలయములు
ధరణింగట్టింతురేని ధాతృపురిన్ సు
స్థిరులగుచు విష్ణుదేవుని
చరణములొందుదురు సుకృత సామర్థ్యమునన్.

కం॥ కలవాఁడు తోఁటఁ గట్టఁగఁ
నిల మృత్తికచే దరిద్రుఁడేపునఁజేయన్
గలుగున్ సమమగు ఫలములుఁ
విలసితకీర్తులు వొసంగు విశ్రుతలీలన్.

తే॥గీ॥ ద్విజులవటువులు పెండ్లింప్లు వేడ్కసేయు
నతని సుకృతంబు మిక్కిలి యధిక మరయ
పూర్వజన్మ విశేష సత్పుణ్యగరిమఁ
గాక లభియించునే యట్టి కర్మమిలను.

సీ॥ కామకాంతుండను క్ష్మాతలాధీశ్వరుం
డశ్వమేధశతమ్ము లాచరించి
పుత్రులులేమినప్పుడు చింతనొంది యిం
ద్రునికడకేగి మన్ననలుగాంచి
సంతతి నడిగిన శక్రుండు దిక్పాలు
రట్లన యన్నృపుండజునికడకుఁ
జనివేఁడుదమటంచుఁజని దిక్పతులుదాను
నబ్జజుఁబ్రార్థింప నాతఁడపని

తే.గీ మునుల నువనీతులఁగఁజేసి గరిమతో వి
వాహములుజేసినన్ బుత్రవంతులగుదు
రనిన ధరణీశుఁడట్లన యాచరించి
కడఁక ధర్మప్రతాహ్వయుఁ గొడుకుఁగనియె॥

చం॥ పితరులు ముక్తిఁజెందఁ గడుఁబేర్మి గుణస్థితుఁ బుత్రుఁగాంచి త
ద్గతి నతిధర్మముల్ సలిపెఁగాంతల సన్నిధినొక్కయబ్ధి? మీ
యతులచరిత్రమెన్న సుగుణాన్వితులౌ తనయుల్ జనింతురా
శతధృతి విష్ణుచే వినిన చందముసుమ్మిది నిక్కమెన్నఁగన్.

సీ॥ ధరణిదివిజునికిఁ దలనూనెయంటినఁ
గలుగు గంగాస్నానఫలముపాద
మర్దనసేయ సమస్తతీర్థస్నాన
ఫలమగు వేణ్ణీళ్ల జలకమార్చ
భోజనంబిడిన నబ్బు నఖిలదానఫ
లంబులు శయన స్థలములొసంగ
నశ్వమేధఫలమ్ములగు రోగములుమాను
నచ్యుత పదమగు నాభునొసఁగ.

ఆ॥వె॥ నపరిమితఫలమ్ములనుభూగ నుభయతో
ముఖి నొసంగనేని ముక్తిగలుగు
నంత్యదశల రోగియగునాడ గోదాన
మజపదవికి నర్థ్యమమర నొసఁగు॥

తే॥గీ॥ పుణ్యవేళల ధేనువుఁ బొసఁగనొసఁగ
సకలదాన ఫలమ్ములు సంభవించు
పాదుకాచ్ఛత్ర వస్త్రముల్ పరగ దాన
మిడిన స్వర్లోక సౌఖ్యము లెల్లఁ గలుగు॥

తే॥గీ॥ చీనిచీనాంబరమ్ములు చిత్రవస్త్ర
చయము సంగిన హరిపదసంగతుఁడగు
మహిష మేష గజాశ్వ సద్విహిత దాన
తతుల నపమృత్యుభయము దుర్గతులు దొలఁగు.

కం॥ వనజజకులులకుఁ గృష్ణా
జినమిచ్చిన నాయువెచ్చుఁ జెడు రోగమ్ముల్
ఘనవృషభ దానమున న
య్యనిమిష లోకమ్ము లొందవచ్చు నధిక స్ఫూర్తిన్.

ఆ॥వె॥ దారు లోహ కాంస్య తామ్ర రజత హేమ
పాత్రపంక్తి స్వాదుపానయుక్తి
దానమిచ్చునతఁడు దగు నెల్లలోకమ్ము
లను బ్రమోదమెసఁగ ననుదినమ్ము.

కం॥ యతికిం గాషాయమ్ములు
నతివృద్ధుఁడు కృశుఁడైన యతనికి వస్త్ర
ప్రతతియు రోగికి మందును
ధృతి నిచ్చిన యతఁడు విష్ణుదేశముఁ జెందున్॥

సీ॥ వెండియు బంగరు వెస వరాయొత్తైనఁ
దక్కిన యువి పలత్రయము నైన
దానమిచ్చినవాఁడు తగు రుద్రు చెంగటఁ
బ్రీతి నాషాఢ కార్తికముల యెడఁ
బూర్ణిమాహముల నాఁ బోతుల విడిచినఁ
దల్పితరులు శివస్థానమున, వ
సింతురు బహువిధస్థిరత దున్నిన యెద్దుఁ
గరమర్థి నైన విడఁగనినఁ బుత్ర
తే.గీ. పౌత్రవృద్ధియు ననువగు పాడియొనుదు
నైన నమరంగ నీనిన యావు నైనను
నైన, పొసఁగిన స్వర్లోకమమరఁ గల్గు
వత్తసంబిడ్డ చేసియ వెలయు శుభము॥

కం. చూలాలికి శిశువులకుం
బాలాసఁగినయాతఁడుండు పాలకడలిపై
మేలుదధితక్రగుడములఁ
బాలికిఁ బథికులకు నొసఁగఁ బలుశుభమొసఁగున్.

సీ. చైత్రవైశాఖమాసములను గంథంబు
పరిమళోదకములు పానకములు
మేలిఫలమ్ములు నారికేళాంబువు
లొసఁగ [నా ?] క సుఖమ్ములొదవు వరుసఁ
బుష్యమాసమ్మున భూరివస్త్రమ్ములు
జ్యేష్ఠమాసమున మచ్చికల దక్క
కుద్దుకుఁదగ నీళ్ళనిడుట మహాపుణ్య
మన్నిటం గడుమేటి యవనిసురుఁడు

ఆ. వె. గాన వారిఁ దిట్టఁ గలుషమ్ములొదవు ద
త్ప్రమణమునఁగల్గు పుణ్యచయము
వారికి ద్విజాల యందు నపరిమితస్నేహ
మగుట విప్రసేవ యమితఫలము॥

ఆ. వె. ఫలసుగంధ ధాన్య పశు శాకలవణాది
దానసమితి సౌఖ్యదాయకంబు
నిన్నిదానములకు నెచ్చు సాలగ్రామ
దాన మదియొకింగ ధాత తరమె॥

కం. ఎచ్చటసాలగ్రామము
లచ్చుగ వసియించు నిధులు నత్యుత్తమ తీ
ర్థోచ్చయపుణ్యస్థలములు
వాచ్యగ నచ్చోటు నని హితమతి విబుధుల్॥

ఆ.వె. అఖిలలోకదానమైన శ్రీమూర్తి దా
నంబు సాటిగాదు నవ్యరత్న
దానచయము కలుషతతిఁబాపు నపవర్గ
దాయి విష్ణుమూర్తిదానమరయ॥

సీ.. మహి దేవతాగృహమార్జన మల్కుట
ముగ్గులుపెట్టుట ముఖ్యవస్త్ర
ములనలంకరణక్రియలు ధూపదీపోప
చారముల్ సుకృత [ సం ] తానరక్షకములగు

నందుఁ బ్రదక్షిణ మతివందనంబులు
నవ్యయపదకాంక్షులగుచుఁ బదియు
రెండు గావించుటు రీతి శంకరునొద్ద
సోమసూత్రము దాఁటరాదు నిజము.

తే.గీ. హరునికభిషేక మొనరించుటధికపదవి
వాద్యరవయుక్తి భుజియింప వాంఛలొదవు
వినుతికెక్కు ధ్వజస్తంభమునుపఁ బత్ర
వర్తియగు విష్ణుశంకరావాసములను॥

సీ. తనగృహంబున నిత్యమును దేవపూజాగ్ని
పూజాపరుండైన పుణ్యరతుఁడు
నిత్యసంతోషియు సత్యవాక్యౌదార్య
భోగనిరతుఁడు విరాగుఁడమలుఁ
డఖిలధర్మోపభోగాసక్తచిత్తుఁడు
విద్యచే బ్రతికెడి విప్రవరుఁడు
శౌర్యజీవనుఁడైన క్షత్రియుండును సత్య
వాణిజ్యజీవన వైశ్యవరుఁడు

తే.గీ. కృషులజీవించు శూద్రుండు కీర్తనీయ
వర్తనులు పుణ్యలోకనివాసులగుదు
రలమితో శ్రోత్రియాన్న భోక్తలకు మఱియు
శ్రోత్రియత్వభవమ్ము మెచ్చుగ లభించు॥

తే. గీ. జ్ఞాని పౌరాణికుఁడు ధర్మశాస్త్రవేది
ప్రాజ్ఞుఁడుఁ విష్ణుభక్తుఁడౌ బ్రాహ్మణుండు
శ్రోత్రియుండగు నతఁడు సత్పాత్రమగుట
నతని కొసఁగిన దాన మత్యధికఫలము॥

కం. విను నిగమార్థప్రతిపా
దనమైన పురాణతతి సతత మతినిష్ఠన్
వినినం జదివినపుణ్యుల
కనఘగతులు గల్గు సందియము లేదెందున్.

తే. గీ. అబ్జపత్రాక్షు నిలయంబునందు రాత్రి
వినినఁబగలిఁటి పాతకవితతి దొలఁగు
పవలు వినునేని రాత్రిఁటి పాప మణఁగు
గానురపురాణ పఠనంబు భద్రదంబు.

సీ. చంద్రమసుండు వస్త్రంబున రుద్రుండు
గోదానమున మేఁటి గుఱ్ఱమునఁగ
వరుణుండు పరమేష్ఠి పురుషదానంబున
మనుతల్పంబీయ ఘనుడు త్వష్ట
యజదానమున గోష్ఠి నర్కుండు ఖరముల
వేసడంబుల నీయ వెలయునిబులి
గజముచే హిమగిరి గంధదానంబున.
గంధర్వతతు లలంకారదాన
తే.గీ. మున సురాంగన లోదనమున విరించి
విద్యచే వాణి బండిచే వేడ్క నంగి
రసుఁడు జలధి యుదకముచే రథము నొసఁగ
నగ్ని దేవుఁడు సంప్రీతులగుదు రెపుడు ॥

వ. ధాన్యదానంబున విశ్వేదేవతలు తృప్తులగుదురు. ఇవి చిత్రదాన విధంబులు. ఇంక ధర్మజునకు శ్రీకృష్ణదేవుండానతిచ్చిన విధంబున మహాదానఫలంబు లెఱింగించెద—

ఉ. ధర్మజుతోడఁ గృష్ణుఁడను ధర్మపుబుద్ధి తిరంబుగాఁగ నీ
వర్మిలి శైల్ప శాస్త్రములు నారసిచేయుదు వందుదాన స
ద్ధర్మములన్ విశేషమగుధర్మము మానవనాథ! భూమి యా
పేర్మిని ధాత్రిదానమునఁ బృథ్వికిరాజగుచున్ బ్రవర్తిలున్.

తే.గీ. సస్యయుతభూమినిచ్చినఁ జంద్రసూర్య
తారలున్నంతకాలము ధన్యపుణ్య
గతుల వసియించు నాతండు క్రతుశతంబు
నేయు ఫలమొంది లోకులు చెలఁగి పొగడ.

చ. కృతముకవిప్రవర్యుఁడు ప్రకీర్తిత నైగమశాస్త్రవేది సం
గతశుచి నిత్యసన్మదనిదాన చరిత్రుఁడు కర్మఠుండునై
పతియనుతుల్ భజింప గృహసంగతధర్మమునన్ బ్రవర్తిలన్
మతికలఁగంగఁదత్పతి సమగ్రపు లేవడి పీడనందుచున్.

వ. తన పతిం జేరి యిట్లనియె.

మ. చతురామ్నాయ నియుక్తకర్మపరతన్ సంపూర్ణభావైక సం
గతిఁజెన్నొందినని న్వరించియును దాకష్టంబునొందంగఁ జూ
చితివేకా, పొరుగిండ్లకామినులు వాసిన్ వెండిబంగారు లం
చితలీలన్ భరియింప నిట్లునికి రెయుశ్చెంబింత చింతింపవా!

ఉ. అనఘుఁడు సూధవృత్తి నిటులాడఁగఁ జెల్లునె వారువారు నే
సిన సుకృతంబు లెంతయు వశీకృతమై ఫలమీక తక్కునే!
వనిత! భవత్పురాకృత మవశ్యముగా భుజియింపకేలఁ బా
యు! నళినానాభుఁగొల్చి సిరులొందెద పొందుగనింకమీఁదటన్.

సీ. అని పల్కి వ్రతము నేయఁగ దేవతాధీశుఁ
డది విఘాతము సేయ నప్సరసలఁ
బంపిన నాటలపాటలఁ జెంగటు
మెలఁగంగ నతఁడు నిశ్చలత నునికి
నమరేంద్రుఁడంతయు [నబ్జజానకుఁ] జెప్ప
నాతఁడు శ్రీధరు ననుమతమున
సకలసంపదలిచ్చి చనవున నింటికిఁ
జనుమన్న వచ్చి నిచ్చలు స్వకర్మ

తే.గీ. పరత నతిథుల నరయంగ భామ ననుచు
నదిమదంబున ముస్నెవ్వరైనమమ్ము
బ్రోవఁగలిగెర యని దుష్టబుద్ధి మంచి
తీర్థమును నీయ దడిగిన దీనులకును.

ఉ. అంతటఁగల్గు సంపద రయంబున దొంగలపాలుగాఁగఁ దా
చింతిలి ధర్మమేమటిరిసీ! నినుబాసెద నంచుఁబల్కు న
కాంతునిఁ జాలవేడికొని కామిని తా మును చెప్పినట్లుగా
నెంతయుఁజేయఁ దక్కు ధనమెల్ల వ్యయంబగుఁడుండ గృహస్థుఁడున్.

కం. అనుకూలభార్యయును స
జ్జనసంగతి మేటివిద్య సత్సంతియున్
గనని గృహస్థు వసింపఁగ
వనమే మేలింట నలఁగి వర్తలుకంటెన్.

కం. అనియిల్లుదక్కఁదక్కిన
ధన మతిథుల పాలుచేసి తగనుండఁగ మి
న్నున భూమి దానమున నీ
కనుపగు సిరులొందవుననిన యా వాక్యములన్.

ఆ. వె. దత్తుఁడాతఁడా గృహక్షేత్రముల దాన
మిచ్చి కల్మిఁగాంచి సచ్చరిత్ర
వర్తనముల మిగుల వైభవములఁగాంచి
యిహపరముల సౌఖ్యమెలమి నొందె.

కం. ననుగూర్చి పుణ్యకాలం
బున నన్నము వెట్టు ఘనులు భూదానము నే
సిన సుమతులెల్ల సుకృతము
లనువుగ గనియుంద్రు మత్పదావాసమునన్.

సీ. ధర్మములఁ దాఁ జేయ దగ నితరులచేతఁ
జేయింపఁ జేయఁ జూచి ముదమందఁ
గలవు నానావిధ విలసిత భోగమ్ము
లపవర్గమును విను యమతనూజ!
యుభయతారకమగు నుర్వీదానంబు స
త్పాత్రంబు నాఁదగు బ్రాహ్మణునకు
నిచ్చిన పుణ్యాత్ముఁ డిచ్చట వైకుంఠ
పురి విష్ణుసామీప్యగరిమ నమరు

తే.గీ. పరులొసంగినఁ బాలింపఁ బ్రబలు దానొ
సంగుకంటెను నినుమడౌ సత్ఫలంబు
దానిఁ బాలింపకుండినఁ దానొసంగు
టదియు నిష్ఫలమగు ధర్మవిదితసరణి ॥

తే.గీ. దానమున స్వర్గభోగములఁ దనరు పాల
నమున నచ్యుతపదవిని యమరు గానఁ
బాలనము సేయుపుణ్యంబు పాటియగునె
దానములు పెక్కు సేయఁ దద్ధర్మమరయ.

కం. భూసురుల కిడిన ధారుణి
శాసపడిన కుమతి నారకావాసి యగున్
భూసురభూమిరో తోఁబు
ట్టాసర్వనృపుల కనశుభవాస్పద మగుటన్.

కం. సుక్షేత్రదాతలకు నఖి
లక్షేమశుభంబులున్ విలాసము సుఖము
న్యక్షేత్రదాత పశువై
యిక్షితి జడజన్మమొంది హీనత పొందున్.

తే.గీ. జ్ఞానదంబు సరస్వతీదాన మరయ
నది మహోన్నతవైకుంఠ పదవి నిచ్చు
విద్యఁజెప్పుట పుస్తకవితతి నొసఁగు
టెలమి దానంబు నాఁదగు విలసితముగ.

క. మేలగుధాన్యము విద్యా
శాలియగు మహీసురునకు సన్మతినొసఁగన్
శ్రీ లలితధాన్య ధనపతి
యై లావణ్యమునుబొందు నంచితచర్యన్.

తే. గీ. పూవులు సుగంధచయము తాంబూలములును
వ్యజనములు దానమిచ్చినవాఁడు కలిమి
గలిగి బహుభోగయుక్తుఁడై వెలయఁబుట్టు
[ఛత్ర ?] దానమ్ముచే పరిష్కృతవహించు.

కం. తేరులు పరికరములు నిడ
నారూఢిన్ వన్నెగాంచి యాత్మజపాత్ర
శ్రీరమ్యుఁడగుచు మెఱయున్
వారక పాదుకలొసంగ వరవాహుఁడగున్.

సీ. చలికాలమింధనంబులు విప్రులకొసంగఁ
గాయ మయ్యగ్నిసత్కాంతి నెసఁగు
కన్యామణిస్వర్ణ ఘనదానముల మించి
సతి భూమ భూషణ వితతిఁ గాంచు
పన్నికోకలు రత్నవరభూషణము లీయ
రూపవైభవశుభారూఢుఁ డగును
సర్షప తిల పాయస కృపీటు దానాళి
నురువిభవైశ్వర్యయుక్తి నమరు.

తే.గీ. మఱియు సద్ధర్మ కైంకర్యమహిమ విప్ర
దేవ సంతుష్టిగావించు ధీరవరులు
చక్కదనమును దృఢమును సౌఖ్యమొంది
యాయురభివృద్ధిచే మింతు రవనియందు.

వ. హవ్యకవ్యకారణంబులును సకలజనాధారంబులును నగు సురభిగణంబుల దానంబత్యుత్తమఫలదంబు నిహపరసాధకంబు నగుటంగావునఁ దన్మాహాత్మ్యంబును వివరించెద.

చ. హరుఁడు సతీవియుక్తవికలాత్మతచే దపమాచరింపఁ ద
ద్వరతపవంత పుట్టియిడ వారిజసంభవనిర్మితంబు భూ
సురసుర వర్ధనీయ పరిశోభితమై తగుధేనువా జటా
ధరము తృణౌఘబుద్ధి బిగఁబట్టి తెమల్పఁగ నుగ్రుఁడుగ్రతన్.

ఉ. చిచ్చఱకంటఁ జూచుటయుఁ జెల్వగు మైకమలంగలేవ తే
కచ్చటఁ గూలఁ జూచి కమలాసనుఁ డామహిమానియుక్తుఁడై
వచ్చినమస్కరించి గిరివల్లభ ! యాజ్యము ద్రావి దేవతల్
హెచ్చగనిట్లు సేసిరిది యాల్గిన వారలతృప్తి కెట్లొకో.

మ. అను డెంతే దయతోడఁ జేత నిమురన్ హర్షంబుగా నాశుచ
య్యున భర్గాంబకవహ్ని ధూమపరిలిప్తాంకాలి గాత్రంబునన్
దనరంగాఁ గపిలాఖ్యధేనువర మాద్యంబయ్యె దేవేశుఁ డా
డిన ముఖ్యస్థితినొప్పె నాను లమరుల్ డెందమ్ములన్ మెచ్చఁగన్.

మ. అపరాధక్షమ చేసికోవలయు నంచా యాశ్రులంతంత నం
దపు నందిన్ మదనారికిచ్చుటయు నాధర్మ్యుండు సత్కార్యుఁడై
యపుడొప్పారఁగ వానిఁ గేతువును వాహంబున్ మహాప్రేమ న
చ్చపుసఖ్యుండును గాఁగఁ దాఁగయికొనెన్ శంభుండు సంరంభియై.

సీ. చ్యవనుండు ప్రోదినీజలములఁ గ్రుంకిడి
తపము సేయఁగ జాలధరుఁడొకఁడు
వలవేసి పట్టి భూవరుఁడగు మాంధాత
యొద్దకుఁ దెచ్చిన నుర్విభుఁడు
నొప్పటిచోటున నిడుకున్న నమ్ముని
వీనికిబదులిచ్చి విడువుము ! నను
నూరక చనఁగరాదో నృప ! యనుడు వ
స్తువులెన్ని యిడ నవి తులకురామి.

తే. గీ. నంతఁ గరజాతుఁడను ముని యావునిడఁగ
సవతు వచ్చును నా నట్లు సల్పె విభుఁడు
గాన నిల హవ్యకవ్య విధానములకు
నర్హమగు తత్ప్రభావ మనంత మరయ.

సీ. గోదానమహిమ లెక్కువ నుకర్షాఢ్యుఁడౌ
విప్రుఁడు గార్హస్థ్యవృత్తిమాని
ముదిమి చేఁ దపము సొంపొదవఁ జేయుచు సిద్ధి
నొంది యింద్రుని కడనుండ నవ్వ
మరేంద్రుదూతలయ్యమరేశుతో యమ
భటు లిందులకువచ్చుఁ బాపులకును
నడ్డమ్మువచ్చి తదావాసమునకుఁ గై
కొని చనిరనగను ననిమిషపతి.

ఆ. వె. యఘములఁ బాలఁజేసి యాప్రునిచ్చినవార
లర్కభవునిఁ జూచి యమరపురికి
వచ్చువారుగాని యచ్చటనుండరు
ధేనుదానఫలము దెలియఁడిట్లు.

క. అపమృత్యుహరణమను న
ల్పపుబల్కును ద్విజుఁడు విని నిజ్రభవుల కి
ట్లుపదేశమిత్తునని ది
వ్యపుయానము నెక్కివచ్చె యశరీరి క్రియన్.

ఆ. వె. స్వర్గమభిలషించు సాధుపుల్ గోదాన
పరులుగాఁగవలయు దొలకనిరూఢ
నారి సువర్ణమైన నిష్కద్వయంబిచ్చి
యట్టిఫలముగాంతు రనుచుఁజనిన.

కం॥ వారలు తద్బాంధవులున్
ధీరత గోదానవృత్తిఁ దెలిపొందిరి యి
ద్ధారుణి దేవ ప్రీతిద
మారయ నదిగాక యెుండులగునె యరయఁగన్.

తే. గీ. పుణ్యకాలమ్ములన్ గుణగణ్యమైన
సాధుధేనువు దానంబు సల్పెనేని
దాని రోమంబులెన్ని తత్సంఖ్య దివ్య
వర్షములు స్వర్గమున వైభవమున నమరు.

కం॰ చరమంబునఁ దద్దానము
చెరవునఁ గావించునేని విను యమపురమై
తరణీ తరణమ్ముగ సుర
పుర భోగము లొందు నధిక పుణ్యస్ఫురణన్.

కం. అనిమిషులకు హవ్యంబును
ఘనముని పితరులకు నెల్లఁ గవ్యము వరనం
దును దామరసభవుండిల
ననుపమముగ ధేనుగణము నమర సృజించెన్.

కం. ధేనువులున్ బ్రాహ్మణులున్
బూనిక నొక రూపు విశద పుణ్యస్ఫురణన్
ధీనుతగతి నవలోకన
దానార్చన విధుల నమల ధన్యులఁ జేయున్.

తే. గీ. సరవి గోబ్రాహ్మణులఁ దృప్తిసలుపు నతఁడు
సత్యవాదియు నిఖిలాత్మసముఁడు యోగ
నిరతుఁ డోదనదాతయుఁ బరమసుకృతులు
వంశ పావనుల పవర్గవల్లభులును.

కం. శ్రోత్రియుఁడు కుటుంబియునగు
ధాత్రీసురు వెదకి వేడ్కదానముసఁగు స
త్పాత్రుఁడు నుభయ కులంబులు
చిత్రగతిన్ సత్యలోక సీమ వసించున్.

చం. వలపునఁ బాలమేపులును వారియుఁ గల్గఁగ రక్షణక్రియా
పరత నొలంగినన్ ఖలులు బల్విడిఁ దోలుకుపోవుచో ధురం
ధరబల శౌర్యతం దతిమి తాలిమి గ్రమ్మఱదెంచినన్ మహా
మరపురభోగ సంపదలు మక్కువగాంచి చరించు నంతయున్.

కం. ధేనువులకు విప్రులకుం
గానెమ్మిఁ బోసంగు రణముఖంబునఁ దెగు న
మ్మానధనాఢ్యునిఁ గైకొని
పూనికతో నప్సరసలు భోగింతు రటన్.

చం. పతి హిత వృత్తికై పొలియు భంగికి నెక్కుడు విప్రరక్షణ
స్థితిఁ దెగటారుటల్, మిగులఁ జేకురు పుణ్యము గోహితార్థమై
ధృతి నన్ని నీల్గు నాతనికి దివ్యసుఖమ్ములవేమిదొడ్డ! గో
స్థిత భవనమ్మున న్మెలఁగు ధీరతఁ గల్పశతమ్ములున్నతిన్.

మ. పదియావుల్ గడు వేసవిన్ గడుపునింపన్ బావిఁ గల్పించు స
మ్మద చారిత్రుఁడు మేపువెట్టు ఘనసౌమ్యస్థైర్య హృత్పద్ముఁ డో
ప్పిదపున్ [గో?] భువనంబునన్ జలనిధుల్ పృథ్వీదిశాక్రాంత మౌ
టది గన్గొంచుఁ జరించుసంతతశుభాహ్లాద ప్రసాదాకృతిన్.

సీ. ఉపవాసములఁ దీసియున్నచో వానలఁ
బాడియఁబెట్టిన వ్యాధి దడవినప్పు
డరసి ప్రోవకయున్న నతితృష్ణ బడలింప
మడుకచో సముగఁబరగఁజేయ
మునికి యాఁ గుఱ్ఱల దినమును బాంచేఁ
దనుపకయున్నఁ దత్పాతకంబు
మిల నెన్నవశమె నిచ్చలు బహుపీడచే
నిరయంబున న్మాఁడు నిరతసార్తి

తే.గీ. కొరలఁగోవలుకు బాధలఁ బఱచు యముని
భటుల ప్రతిమాలు నతిదీన భాషణముల
ధేనుపోషణమున హెచ్చుదివ్యసుకృత
మరియఁ దప్పిడనముకంటె దురితమొద్ది !.

కం. దానము నేసినవానియ
నూనఫలంబులకు లెక్కయున్నది తద్రో
మానేక వర్షసంఖ్యను
ధేనుతి గోలోకవాసధృతిఁ జెలువలరున్.

ఉ. కొమ్ములయందమున్ సొబగుగుబ్బయు సద్గుణయుక్తమున్ సుధా
సమ్మదమాధురీ రసవిశాలత దీర్ఘతవాలమొప్పఁగా
నొమ్మగునావు పేదయు నిజోచిత క్షత్రియ శ్రోత్రియుండు నా
నమ్మహిదేవునర్చనలనారిని యిచ్చిన మేలు చేకురున్.

కం. పాత్రునకిచ్చిన సకల
క్షేత్రాంకుర రీతి వృద్ధిఁ జెలఁగు ఫలము దు
ష్పాత్రున కిచ్చిన నూషర
ధాత్రీ స్థితబీజగతి వృథయగున్ ఫలముల్.

ఉ. కపిలల నిచ్చునేని నధికంబగు పుణ్యము దేవతోపయో
గ్య పరిణతిం దనర్చ నగు నాసురభీఘృత దుగ్ధముల్ తదీ
య పరత లేక తానె కొనునట్టి దురాత్ముల శ్రాద్ధదేవుఁడ
త్యపరిమితైక బాధల మహోకద లొందఁగఁ జేయునెప్పుడున్.

తే. గీ. ఉభయతోముఖి విప్రుని కొసఁగ నుభయ
వంశ తారక మగును దుర్వార మహిమ
తండ్రి కడవారు పదియగు తరములట్లు
తల్లికడ వారు దివ్య పదస్థులుగను.

తే.గీ. శివపుగళవాఁడు యాగముల్ సేయువాఁడు
దేవ పూజా విధేయుండు తెరువులయొడ
వెలయఁ జలి పందిరులు వెట్టి ఫలము లొసఁగ
నాత్మనిచ్చినవాఁడు పుణ్యాత్ములరయ.

కం. కులహీనునికిన్ లోభికి
నలపడ మూర్ఖునికిఁ గపటియగువానికిఁ జం
చలున కనాచారికిడం
గలాఁ దతికష్టనిరయగతులక్కలఁగున్.

కం. ఎప్పుడైన నన్నదానం
బపరిమిత ఫలాస్పదంబు హర్షంబును సత్
కృపదకు కీర్తిఁ గలిగించున్
విపులయశః పుత్రపౌత్రవిభవములొదవున్.

సీ. ఉద్భిద సంజ్ఞచే నొప్పుగు దరుగుల్మ
లతలు స్వేదభవసంగతులఁ గ్రిములు
దంశాదు లండజతతి జలచర పక్షి
చయము, జరాయుజ సమితి మాన
వులు పశుసంతతి యిలఁ బుణ్యమహిమచే
దివిఁ బుట్టుదురు నరుల్ దేవతలనఁ
బ్రకటిత పాంచ భౌతికములన్నియునట్టు
లగుట దేహములు కర్మానుసరణి

తే. గీ. స్థావరములెల్ల నట్లగు స్థావరముల
నన్నములు పుట్టె జనమెల్లనవి మెసంగు
నుర్విజలములఁ దడిసి వాయుత్రయ నాప
రింపఁబడి విత్తుదానంకురింపఁ దొడరు.

ఉ. వెండియు నీటనాన నలవిత్తున నాళమునందుఁ బర్ణముల్
గాండము దానియందుఁ గడఁకన్ వెసమూలముఁ గల్గి పూవులుం
బంతులు వెన్నులున్ బొడమ వాటిలు సస్యములున్ ద్రుమంబులై
యుండఁగ జంతుసంతతి నిజోచితభుక్తిఁ దనర్చి వర్ధిలున్.

ఆ. వె. ప్రాగ్గములను దుషయుఁ బటుతుషక్షీరముల్
క్షీరయుక్తిఁ బొడమి చెలఁగు తండు
లములు ధాన సస్యములరు వోషధుల
ర్జనములిట్లు శాస్త్రధర్మగతుల.

సీ. యవలాదిశాలిపర్యంతమ్ము సప్తద
శకము ప్రఖ్యాతమై సరవి నోష
ధులునాఁగ మఱియు నవ్వలివెల్లత్ముద్రాక్షఁ
బొలుపు గాఁదండులములు పొసఁగిన
యన్నంబు దేహాననటఁ బక్వమై సప్త
ధాతుసంతతి వృద్ధిఁదనరఁ జేయు
నవి నాడి తతిఁజెంది యా ప్రాణవాయ్వాది
గతులచే వడి బహిర్గతములగుచు

తే.గీ. సారమంతయు శుక్లమై మీఱి జన్మ
హేతుకరమగునది సృష్టిహేతువగుట
నన్నమే బ్రహ్మమనుచు వేదార్థ విదులు
పలుకుదురుగాదె తద్దానపటిమ హెచ్చు.

కం. ప్రాణాధారముగా ని
ర్మాణముగావించె ధాతమహినన్నమునన్
ప్రాణము లిచ్చుట లెక్కన
ప్రాణతఁ దత్క్రియకు నెక్కుడానము గలదే.

కం. జపములు తపములు హోమము
లుపవాస క్రతు చయంబు లాదరించు ఫలం
బుపమింపఁదగునె యన్నద
విపుల మహాసుకృతమునకు విశ్రుతలీలన్.

చం. దినమున నన్నదానమున దేవతలందఱు తృప్తినొంది పా
వన శుభమిత్తు రార్యు లనవద్యులు నా నటిఁయింతు రెంతయున్
వినుతిఁ దదీయ వంశజులు విశ్రుత ధాతృ పదమ్ముఁ గాంతు రా
ఘనులకు సాటిలేరచటఁ గంజదళాక్షుని రూపమొందుటన్.

మ. విను మోధర్మజ యన్నదానము జగద్విఖ్యాతమున్ దృప్తిదం
బనఘం బాత్మహితంబు ముత్కరము విప్రాఢ్యుండు మున్ బ్రతుకుత్
మనుమల్ కాంతయు సర్వవస్తువులు సౌమ్యస్ఫూర్తి యుంగల్గి ధ
రనుతిన్ భక్తము బెట్టు నిత్యము సుపర్వ శ్రేణి వర్ణింపఁగన్.

సీ. అతని మనశ్శుద్ధియరయ శచీభర్త
జడివాన గురిసి బెగడు తలఁచియు
తానప్పుడొక వృద్ధ ధరణీసురుండై
చనుదెంచి భుక్తి వేడినఁ దెలంగి
రమ్మని యర్చించి రమణిఁ బాకము సేయ
వనిచి తద్గోష్ఠి గృహస్థుఁ డున్న
యత్తఱి దేవతలందఱు విప్రులై
యన్నంబు వలెనంచు నడుగుటయును

ఆ.వె. వీరలెడయ భుక్తి విధమెల్లనంచు శుక్
వృద్ధు పల్క బాస విడమి వంటు
కట్టియలకు లేమిఁ గాంత చించి చీర
లెల్లనూనె నద్ది యిచ్చి విభుఁడు.

శా. అంతంతాకము గాక దేవతల మాయన్ జిక్కినన్ గాంతయున్
గుందన్ బాధము లగ్నిలోన బడు మోకొమ్మ్యాయనన్ సాధ్వియ
ట్లుం దెళ్వొందుచు వంటసేయుటయు లీలన్ దద్గృహం బెల్లగా
రిం దెచ్చెన్ గొనఁ బంక్తికై నపుడు సంప్రీతాత్ముఁడైయ తఱిన్.

కం. తెంకోడలు గ్రాఁగి వెసధర
నిండారఁగిన సాధ్విఁ జూచి నారిశోకమున్
గుందుచు గృహపతి వద్దన
కుందొడరిన నింతియిడక కూడదటన్నన్

తే. గీ. అతఁడు వంటయింటికరిగి చిక్కిన సాధ్విఁ
జూచి మూర్ఛవోవ సుదతి లేచి
యింద్రుకరుణవలన నిడఁగ భోజనము గా
వించి సురలు విభునిఁ బిలువు మనుడు.

కం॥ అతిథులు భుక్తిం గొనిరో
చతురా ! రమ్మనుడు నతఁడు సంతసమున సం
స్తుతులమర వచ్చి యా దే
వతలకు సుఖచారరీతి వార్తలు నొడివెన్.

ఉ. దానికి సంతసింపుచు శతక్రతుఁడా మిథునంబునెంచి మీ
రానిక మత్పదంబున మహామహిమంబున నుండి యంత వా
క్యానను వెంతనుండఁ గల యద్భుత కర్ములటంచు వారి స
న్మానపుఁ గోర్కెలిచ్చి సురమండలితో దివికేగె వేడుకన్.

తే. గీ. పూని హీనుఁడు కోరిన యేనిఁ గరుణ
దనర నాతిథ్య మొనరింపఁ దగవు బడలి
యన్న మడుగఁ బరీక్షించు టర్హమగునె
శాస్త్రకోవిదులైనట్టి సజ్జనులకు.

కం. పెట్టమిని దరిద్రుండై
పుట్టుంబాపములె సేయు పూని యితరులన్
బట్టుగ వేదుస్ జులుకన
దొట్టఁగ భువినంతకంటె దోషము గలదే

ఉ. దానములందు మేటి శుభదాననిధానము దేవమోద సం
ధానము ముక్తికాంత పరిధానము సన్నుతధర్మ సంతతా
ధానము సర్వలోకగతిధాన మనూన రసాన్నదానమా
మానిత ధర్మవేదులగు మానవకోటుల కెన్నిచూడఁగన్.

ఆ. వె. అన్నదానమాది యఖిలదానములకుఁ
దృప్తిఁజేయుగానఁ దృష్ణ మఱియు
జారఁజేయు నుదకదానముల్ గాన న
న్నోదకముల సాటి యొకటిగలదె !

కం. దట్టపుఁ జలివందిరులన్
బట్టగు శీతలజలంబు పరిమళయుక్తిన్
బెట్టగు వేసవి నిచ్చిన
యట్టి మహానుభావుఁడు వరుణు నాకృతివెలయున్.

కం. ఏ జాతివానికైనా
రాజితమతి నన్నమిడ సురల్ మునులున్ ని
ర్వ్యాజోపకారకరుణో
ద్వేజిత మన్నింతు రతని విభవప్రదులై.

కం. ఇంపుగ "నన్నస్య క్షుధి
తంపాత్రమ్మ"నెడి మేటిధర్మోక్తిఁ దగన్
బెంపలరు నన్నదాతకు
సంపత్సౌభాగ్యభోగ సంతతులొదవున్.

వ. అని వాసుదేవుండు కౌంతేయాగ్రజున కెఱింగించెనని సూతుండు వెండియు శౌనకాదుల కిట్లనియె—

కం. పాదుగ నిందులకై కల
దావట నితిహాసమొకటి యమధర్మజ సం
వాదము, గజపురిరాజ్య
శ్రీదనరుచు భరతవంశ శేఖరుఁడేలమిన్.

మ. ఒకనాఁడాగమ కృత్యముల్ విదితధర్మోపాయ కర్మంబులన్
ప్రకటస్ఫూర్తినొనర్చి విప్రజనముల్ పంక్తిన్ వసింపన్ రుచి
ప్రకరంబుల్ దళుకొత్త హేమమయపంచాత్రంబులన్ భోజ్యభో
జ్యకరంభంబులునించినట్టియెడ నిచ్చన్ ధర్ముఁడువ్యగ్రతన్

కం. దండాలాకృతిఁ గైకొని
మెండుగఁ దాపటికి హాయ యేళన నిజగా
త్రుండగుచు వచ్చి వాకిటి
దండన్వసియించి యచటి ద్వారికులన్.

చం. కనుగొని ధర్మసూక్తి తెలుఁగన్వినిపింపుడు నాదురాక నా
విని యిది దేవతార్చనకు వేళ భుజించిన యంతఁగొల్వులో
నను బొడఁగందుగాక యనినన్ గడుకోపము దెచ్చుకోలుగాఁ
జనుగద రాచపుట్టుకకు చాలదె యింతటి నిష్ఠలందొగిన్.

కం. రాజ్య ప్రతిపాలన గుణ
పూజ్యము గావించి దినము భూసురకర్మ
ప్రాజ్యత మెలఁగిన ధర్మ
త్యాజ్యంబగు నంచునాత్మఁ దలఁచఁడొ వినఁడో.

సీ. అని పెక్కుమాటల నాతని సన్నిధి
గాంచి కష్టంబు తనకంటె నెవ్వ
రనిపాతకుల దెల్పవిని మెచ్చి మంచిదె
యాఁకలి గొనినాఁడ నన్నమిడఁగఁ
బంపవే యనరాజు బ్రాహ్మణుల్ భుజియించు
పిమ్మట ననవుడు పేర్మిధర్మ
శాస్త్రార్థములు దెల్పి సమకొల్పియిడరాగ
నవనీశ్వరులయన్న మధికకలుష

తే.గీ. మరయవైద్యుల పదుపురి యఘమునూన
రియు దదీయుల [దండతి] దియు ధ్వజియు ?
నట్లువేశ్యయు వేశ్యలదంతరైన
పాతకపురూప మెన్న నృపాలుఁడనుఁడు.

ఉ. కుంది వివర్ణుఁడైన నృపకుంజరుఁగన్గొని బోయవాఁడొకం
డందముగాఁగ విప్రవరు నాఁకలిఁ దేనియ చామబియ్యమిం
పొందఁగనిచ్చి తీర్చు ఫలముర్వికి నెల్ల విభుండుగాఁగఁ బు
ట్టం దగునాఁటి విప్రుఁడుకిడంగి పతివ్రత యోర్తుఁ బంపఁగన్.

ఆ.వె. అన్నదానమహిమ లడిగిన నారాజ
శిశువునాఁటి తెలుఁగు నెప్పియంత
యింతయన్యూనెంత యెంతగునో యది
తెలిసికొమ్మటంచుఁ బలికె ననఘ !

కం. కావున నీవున్ ధరణీ
దేవతలకు నన్నమిడుట ధృతసుకృత శుభ
శ్రీవెలయుదువని చనియెన్
పావనమగు నన్నదాన పద్ధతులిటులన్.

తే. గీ. పౌలమున ద్వాదశుల షోడశము నఁ గుడుచు
నతని పాతకమింతన నలవియగునె
పురుషుఁడే కాహంభుక్తి చేఁ దరుణియగుచు
బుట్టునే జంతువునకైనఁ బూనిపిదప.

కం. సుతుఁడు యతియైనచో నా
సతి పురుషుండగుచుఁ బుట్టు సతియగుఁ బురుషుం
డతి ఘోరైకాహాన్నా
ద్భుతభుక్ మహాఘమున విబుధనుతులా-రా!

సీ. బ్రాహ్మ్యంబలంకార భాసితయగు కన్య
ధారవోయుట త్రిసప్తకులజాలకు
మోక్షదంబగు యజ్ఞములకు బుత్విగ్దక్షి
ణ యొసంగ దైవ్యమనంగఁ దనరు
నది ద్విసప్తకులుల కవర్గ మొనఁగూర్చు.
గోమిథునక్రయ హోమమునకు
నొసఁగ నార్షంబది యొసఁగు నేడుదరాల
వారికి ముక్తి దుర్వారకరివి

తే.గీ. నొండొరులకు బదుల్కన్య నొసఁగుటదియా
పరగు సంతాన కారణ పదమనంగ
నదియుఁ త్రిపురుష మోక్షదమగుట ధరణి
సురులకివి నాల్గుయోగ్యమౌ పరిణయములు.

కం. మఱి గాంధర్వము రాక్షస
మరయఁగ రాజులకుఁ జెల్లు నవియుంగూడన్
గుఱి వైశ్యుల కాసురమగు
నెఱిఁ బైశాచికము శూద్ర నీవహమునకగున్.

కం. ఉభయకులపవిత్రం బతి
శుభఫలదము నైనకన్య శోభనరేఖా
విభవము కులశీలము స
త్ప్రభుతయుఁగల మునికొసంగ భాగ్యములమరున్.

కం. ఇనమండలపరిమిత మిల
ననుపుగఁ ద్రబివర్గ మొకటి యువల నిడంగా
జను కాలము కన్యాప్రదుఁ
డమృమభోగములనందు నంచితమహిమన్.

కం. కులమును రూపము శీలము
కలిమియు విద్యయును బ్రతిభగల వరునకు నేఁ
జెలువ నొసంగుట పుణ్యం
బిలఁ బుణ్యదినాళి నిచ్చఁ బెంతయు నొప్పున్.

ఆ.వె. పుణ్యతీర్థపుణ్య భూముల గ్రహణంబు
నయనవిషువులైన యట్టియెడల
ఘనతఁ జేయునట్టి కన్యకాదానంబు
సార ముభయవంశ తారకంబు.

సీ. కౌండిన్యకులుఁడొక్క పండితాగ్రేసరుం
డవనీసురుండు వేదాంతవేది
శిష్యులతో వనసీమకుఁ జని కంద
మూలఫలాలి కిమ్ములఁ దిరుగుచుఁ
ద్రోవఁగానక ఘోరమహావనంబునఁ బడి
యటనొక్క కూపమధ్యమునఁ బాహి
పాహియన్ బల్కులు పలుమఱు వినిచేరఁ
బోయి యెవ్వరులేమి బుద్ధికలఁగి

తే.గీ. మఱలి రా మొదలిటి మాడ్కి మాటలువిని
తిరిగి చూచుచునటుఁ గాంచి నెరయ భూమ
మతఁడు మీరెవ్వరనుడు మీ పితరులమిటు
ననుచుఁ బల్కినఁ గడువిస్మితాస్యుఁడగుచు.

కం. మీరిచట నిట్టులుండఁగఁ
గారణమేమనుడు మాకుఁ గల కులభవులె
వ్వారలు పుణ్యదమగు నా
చారమున మెలంగమిన్ గృశస్థితి వలసెన్.

శా. గంగాస్నానము సేతుసేవయును శ్రీకాంతార్చనల్ పుణ్యతీ
ర్థాంగాగాహన దానధర్మములు సేయన్ లేరు నీవైన స
త్సాంగత్యంబునఁ గన్యఁ బాత్రునక వశ్యంబిచ్చితేనిన్ మహో
త్తుంగఖ్యాతుల మాకు సద్గతులు జెందున్ వేగఁగావింపవే!

ఆ.వె. పితరుల కపవర్గ గతిగల్గఁ గన్యాప్ర
దానమొకటిదక్క మాననీయ
మితరకర్మచయము లెందులేవాత్మజ
లైన ద్రవ్యదాన లైనమేలు.

క౦. పేదలగు విప్రులకుఁ బెం
డ్లాదరమునఁ జేయుటెన్న యందున దోడై
నాదయఁ దోడ్పడ మేలగు
శ్రీదనరుఁ గళ్యాణ మది యశేషముగు దగన్.

చ౦. అనవుడు నట్లకాక యని యాయవనీసురుఁ డాత్మకన్యకన్
ఘనుఁడగు బ్రహ్మచారికి సుఖస్థితినిచ్చి సమస్తపుణ్యముల్
గని మనెఁ దత్పితృవ్రతతిగాంచె సముచిత దివ్యలోకముల్
మనుజవరేణ్య ! తచ్చరితమంజుల పుణ్యద మెంచినన్విన్

క౦. కలవారు దానధర్మా
కలనన్ బుణ్యమ్ముగంద్రు గడుదారిద్రుల్
గల రమిత పుణ్యలోకం
బుల నుండఁగ, నుదక మొసఁగి భూరిస్ఫురణన్.

క౦. అన్నమున కెచ్చు తృష్ణా
పన్నుల ప్రాణములు నిల్పు పానీయము లి
ట్లున్నన్ దానికిఁ దులయౌ
సన్నుత దానములులేవు సాధువిచారా !

సీ. భాసురంబైనట్టి బదరికాశ్రమమున
వెలయు సుశీలుఁడన్విప్రవరుఁడు
శీతలజలములు సేర్చియుంద ఊకిచ్చు
ప్రియపత్నియును దానుఁ బ్రీతితోడ
నతని శోధనకిం బ్రముఁడట వానలేమిఁ జే
సినద్విజుండు తపంబుచేత విష్ణు
కరుణవచ్చడి శావిగారించి యానీఁటు
నందటి బడలిక లణఁచునంత

తే.గీ. నరులును దాను సురపతియందు దినము
నీళ్ల మిగులకయుండ నన్నియుఁ గ్రోల
వేసరకనిచ్చు శాగుల వెలితిదీఱ
భార్యతోడ్పడ నెప్పుడా బ్రాహ్మణుండు.

క౦. అనలునిదోడ్కొని యొకనాఁ
డనిమిషపతివచ్చి జలము లన్నియు ద్రావన్
వనమాలి నెంచి విప్రుడు
తనియఁగ నయ్యగ్నినీళ్ల ద్రావించెఁ దగన్.

తే. గీ. అంతట నవగ్రహమ్ముల నటుకుఁబంచ
శారలా జలమానుచో దానగుతిసె
ఘనత హరిభక్త ధర్మవిఘ్నములు సేయ
నజ హర పురందరులకైన నలవియగునె.

కం. నెమ్మినుశీలుని దివికిన్
రమ్మనుటయుఁ దైర్థికులును రహిఁ నిచటిఘనుల్
ఇమ్మహిఁ గనుకారలు మా
తమ్మునఁ దనరంగ వరము చతురత వేఁడెన్.

ఆ. వె. అటులనిచ్చి విష్ణుఁడా విప్రమిథునంబు
నమర నునిచె నవ్యయపద సీమ
గాన సుదకదాన మాన మేదానంబు
గాన మనుచుధర్మసూనుతోడ.

వ. తెల్పి వెండియుఁ బుండరీకాక్షుం డిట్లనియె.

కం. భద్రకుఁడను విప్రుఁడు ని
క్షిద్రాహాచారకృత్య నిరతుఁడు మార్ఖ్యా
భద్రగుణాన్వితుఁడు సో
పద్రవ కర్మరుఁడు నగుచుఁ బరగెన్ ధరణిన్.

చం. పతితుఁడతండు యౌవనవిభాసితుఁడై సొగసుల్ ఘటించి వా
రతరుణులం బరాంగనల రట్టున గుట్టడలంగఁ గూడి సం
చిత ధనమెల్లఁ బెట్టి కల చేనులునమ్మిక పూసబొట్టు దు
ర్మతి వెసవెచ్చఁబెట్టి పలుమాయల నప్పులు దీసివేసటన్.

ఉ. ముచ్చదనానకుం దొడరి మూఢతఁ దద్ధనమెల్ల వేశ్యకై
యిచ్చుచు నంగ మచ్చములవెల్ల బయల్పడ నిల్వనోడి యి
య్యెవ్వెవ్వ [కాలం] తగాఁడు భయమొందుచు దూరపుభూమి కేగి వాఁ
డచ్చటుఁ బోఁతునొద్దు ముఖ్యుడై హరిఁయుంచి స్వకీయభూమికిన్.

కం. వచ్చినఁ గని బంధుజనుల్
దవ్వనలాడుటయుఁ దీర్ఘతతిఁ గనుగొనుచో
నచ్చోనిచ్చిరి వీఁటిని
నచ్చుగఁగృషి సేసి బ్రతుకుమని యని తొంటెన్.

సీ. హితులైన చుట్టములకైన గార్హస్థ్య
మున నుండుమని పల్కి ననుమతించి
దక్కినం బోకలెత్తుక నెద్దు నెనుఁబోతు
దోలుక యొక గుట్టచేల నడిమి
పీటకొట్టుగఁ గొట్టి పెట్టుగఁ బగలింటి
దనుక దున్నఁగ దున్న ధరణిఁబడిన
దండించెదవు దీని కొండుగ మీఁద న
నిత్య దేహమునకై నిష్ఠురాఘ
తే.గీ. శతులొనర్చెదవిట్లైన బ్రతుకు గలదె
యనుచు నయ్యెద్దు ధర్మశాస్త్రోక్తిఁ బలుక
మ్రొక్కి నిష్కృతి చెప్పవే నిక్కువముగ
నట్టులొనరింతు ననుడు నయ్యనడుహమ్ము.

తే. దానములు ధర్మములును సత్సంగతులును
బుణ్యకథవిన్కి గల్గినఁ బొలియు నఘము
లనుడు నట్లయొనర్తు మీ రరుగుఁడెచటి
కేని ననుభద్రకునిఁ జూచి యెద్దు పలికె.

కం. నీకున్మనుపటి పుట్టున
నీ కాని విక్రయమ్మునే మీవలె వేఁ
గైకొనుము విక్రయంబున
నీ కడనొక శూద్రుఁడనగు నిది యనునంతన్.

ఉ. శూద్రుఁడొకండు వచ్చి నుడి చొప్పున మాఁడు వరాలొసంగినన్
భద్రకుఁ డిచ్చె యెద్దు నొడిభంగి మెలంగి కృతార్థుఁ డయ్యె నా
శూద్రుఁడు వాని రెంటిఁ గొని సొంపమరన్ బెనబెట్టి యింటిలో
భద్రముగాఁగఁ గట్టినవి బాసె శరీరములుచ్చు బిగ్గిలన్.

తే.గీ. శూద్రుఁడది చూచి దుఃఖింప శుభవిమాన
మునఁ దనరి ఋణమొడలెనో యనఘ! యింక
రమ్ము సురపురి కనుచు సారగతి ముర్వ
రరిగి రా దివ్యయానస్థులగుచు నపుడు.

ఉ. పొంగుచు భద్రకుండు గడు పుణ్యములొందె మహాత్మసంగతిన్
భంగత నెద్దుఁ బోతు ఋణభారమునన్ విడి పాటుబొందె నే
యంగునకైన నప్పు కలుపాతకమట్టులఁ ద్రావు నేఁటికిం
కెంగడు మేలుగూర్చ దిన శ్రీధి దొరంగు ఋణంబు పెంపునన్.

కం. జనకుండు ఋణమొనర్పఁగఁ
తనయులకుఁ బాత్రుఁడగు ధనమొనఁగూర్పన్
వినుదైవోపహతుఁడగు నా,
స్త్రీ నిరాధికిన్ ఋణముదాస్యతన్ ఘటియించున్.

ఉ. కలఁడొక విప్రపుంగవుఁడు కౌశికనాముఁడు శాస్త్రవేది ని
శ్చల సుకృతాస్పదుండనఘచర్యుఁడు బేరము వడ్డికాని వి
ద్యల గృషిగూర్చఁజాలధనధాన్యము లార్జితవేళ వానికిన్
వెలియగు సత్యశీలుఁడటుఁ జిక్కె దరిద్రతఁ బీడితాత్ముఁడై.

కం. దీనత రా ధన మవసర
మైనప్పుడొసంగు మటంచు నడుగఁడు లోభం
బానక నెనరున నెయ్యెడ
నైనా లేదనక మోహము మరఁగఁ గరుణన్.

సీ. అంత నయ్యిద్దఱ యమభటుల్ గొనిపోవఁ
జని కౌశికుండందు సత్యశీలుఁ
గనుగొని యమునితో ననఘాత్మ! నాచేత
ధనమెంతయేనియుఁ గొనియితండు
మగుడనీయక బోంకెఁ దగవేది నమ్మిన
వారి వంచింపు టే పౌరుషంబు
పాలింపుఁడన సత్యశీలుఁ డామని దీర్తు
నను నెడఁ గలహమ్ములయ్యె, నంతఁ

ఆ.వె. గరళువచ్చె సుతుఁడు పరభూమికిం జనెఁ
జనఁగ నొకటి కొకటి సాగదయ్యె
నప్పుడీలుఁదనుడు యముఁడుగ్రకోపుఁడై
యతని సుతుఁడ వగుమటంచు నొడివె.

చం. ఇది కమలాసనుండు వచియించినధర్మమటంచుఁ జెక్కె సౌం
పొదవఁగ నప్పుడీని రయమొప్పఁగ నీయమి నందునిందు దుః
ఖదశలు కాని సౌఖ్యములుగల్గవు గాన ఋణంబు కష్టమౌ
మదిఁ దలపోసి శిష్టులవి మాని మెలంగుదు రింగితస్థితిన్.

వ. ఇట్టి పాతకులు సత్సంగతివలనం బ్రబలి కృతసుకృతులగుదురవ్విధం బెఱింగింతు.

తే.గీ. ధరణి సహస్రవర్మ నాఁదనరు రాజు
బలయుతుఁడు మూర్ఖుఁడదయుండు పాపకర్మి
యగుచు గ్రుచ్చులఁ గొండీల నాదరించి
పరధనస్త్రీల హరియించుఁ గరుణలేక.

కం. ఎక్కువ సాధుల నెల్లన్
దిక్కువముగ బాధపెట్టు నీతిరహితుఁడై
చక్కులకెక్కువయగు నా
తక్కరి పాతకము లెన్నఁదరమె ! ధరిత్రిన్.

సీ. ధృతినొకనాఁడు విదేహపురికివచ్చి
యంబుజాతుని మందిరంబుగాంచి
తానొక్కఁడటకేగి ధనభూషణాంబరం
బులు సూచి దొంగిలఁబూని యచటి
యోగి విఘాతి యానో యంచు వధియింపఁ
బడఁద్రోసి యసి పూఁచి పట్టుటయును
నిరపరాధిఁ దపస్వినిన్ దయపోకార్చి
తునుమఁగనేల ! శత్రువులనైన

తే.గీ. వేఁడికొనఁగ వధింపరుర్వీరమణులు
దార బిడ్డలు పట్టముల్ దానుగూర్చి
నట్టి యర్థమ్ము భుజియింతు రతికలుషము
దాననుభవించుఁ జూ ! భవాంతరమునందు.

ఉ. వానికి దుర్గతుల్గల వవశ్యముగా ననిపల్కు దైవమా !
పూని సమస్తముల్ విడిచి బుద్ధిరమాధిప పాదపద్మ సం
ధానతనుండు వారలకుఁ దాదృశదుష్కృత కర్మమొందఁగా
నానతి ! యందు విష్ణు మదినారయుచున్నెడ వాఁడు సత్తతిన్.

శా. సత్సాంగత్యము విష్ణుసంగతియు నెంచన్ గల్గుటన్ గ్రోధమున్
మాత్సర్యంబును మాని యోగివరు సన్మానించి ప్రార్థించుచున్
మత్సంపాదిత పాపముల్ దొలఁగఁగఁ బ్రేమన్నన్ను మన్నింపవే !
వాత్సల్యాంబుధివన్న యోగి దయఁ గ్రేవస్వేడు ధాత్రీపుతోన్.

కం. హరిసేవన్ సత్సంగతి
దురితము లెడఁబాయునసుడు దోడనె యఘ ఖం
ఖరితాంతకి కిరణోజ్జ్వల
తరణాపానలమువలన దగ్ధుండయ్యెన్.

తే.గీ. అట్లు గ్రాఁగిన యతనిపై నబ్జనాభ
దివ్యపాదోదకముఁ జల్లి దివ్యుఁడగుచు
యోగిఁ గొనియాడి పూర్ణానలాంతరఁ గుతిసి
మహితగతి నొప్పె సాంగత్య మహితగతిని.

సీ. చెఱువు గట్టించినఁ జేరు పుణ్యంబులు
పథికులు నీరానఁ బాపహరము
కులజాల కొదవు నిశ్చల లోక సౌఖ్యముల్
తట్టిపు మున్నైనఁ గట్టఁబెట్టు
తారఁదా చంద్రార్క మమరలోకముఁ జెందు
ప్రబలింప నిన్నుమడి ఫలముదీని

ఆ.వె. చెఱుఁక లోతుక కేటి యొన్న్మనిభము మంత్రి
రాజ నియ్యార్యురును దివి నోజ మనిరి
కొలన బావిని నూఁతిచేఁగల ఫలములు
పగము ధుగములు నగు నూఁతిసాటి కావ్య.

కం. చతురత వనమొనరించిన
యతని పితరులుందు రెల్లను నమరావతిలో
క్షితిఁ దత్ఫలగతిఁ బహుళ
క్షితతులఁ జీవనములగుట శ్రేయస్కరమై.

ఆ.వె. రావి వేము మఱ్ఱి రహి నొక్కటొక్కటి మా
రేడు వెలగలు నుసిరికలు మూఁటి
మూఁటిఁ జాతనవకముగా దశతింత్రిణుల్
ప్రబలఁజేయ బ్రహ్మపదముఁ జెందు.

కం. హరిభక్తులైన వారికిఁ
ఘోరయము దారిద్ర్యరోగ భంజనుమ్ములు న
య్యరవిందనయనునకై మది
తిరముగ నొనరించి నతఁడె ధీరుండరయన్.

సీ. తల్లిదండ్రుల సేవ దయఁజేసిన యతండు
హరిపూజ దినము నేమమని యతఁడు
సత్యవ్రతస్థుఁడా సజ్జన వినుతుండు
సర్వ భూతదయా విశారదుండు

నశయంబు హరికథల్ వినుచుండు నాతండు
జ్ఞానబోధన కళామాననీయుఁ
డతులితసద్గోష్ఠి చతురాత్ముఁడగువాఁడు
నావులింతలు తుమ్ము నడరదగ్గు
ఆ.వె. నపుడు విష్ణుఁదలఁచు ననఘ సద్గుణశాలి
సాధ్వివర్య యమరు జలజముఖియు
పేర్మి జలజనాభ ప్రియమగువారలు
వారిఁజూడ నఘముడీఁగు నిజము.

కం. జల మధిశాయువు నర్థము
నలవగు దేహమును గాలయాపన భక్తిన్
బొలఁకువ నిద్రను గడు చం
చలమగు నివి నాల్గనెన్న సత్యము గామిన్.

ఆ.వె. తనదు నీమములఁ దా పుత్రయంబుల
విషయయుక్తి మిగులవెతలఁబడెడి
యతఁడు విష్ణుఁగొల్వ నాత్మఁదలంచునె!
సంగరహితుఁడైన జనుఁడుగాక.

కం. ఏ దాన ధర్మములు హరి
పై దృఢమగు భక్తి నిల్పు పావనమతిదౌ
యా దానధర్మఫలములు
శ్రీ దయితప్రీతిఁజేయఁజేకుఱు శుభముల్.

సీ. తపము శౌచంబును దయయు సత్యంబును
ధర్మదేవతకుఁ బాదంబులగుటఁ
గృతయుగాదిగ నాల్గుగతులు ముఖ్యములగు
నందుఁ దపంబు మే లరయ నెపుడు
గలియుగమ్మున నందుకలవడ నోపమి
ననశనవ్రతము తద్దినతకెక్కు
నందు శ్రీహరివాసరాంచద్వ్రతంబు మ
హాసుకృతంబు పాతకానువృత్తి
తే.గీ. కదియు హరికీర్తనంబు గీతానువాద
మమరతటినీజల స్నానమర్హతమము
లగుటఁ గలికాలమునకు నిట్లలవడు జను
లట్టి యానంద మొందుదు రందునిందు.

కం. సత్ప్రాయశ్చిత్త మ
ఘౌఘజన్మత్రితికరము దురితహరము స
ర్వ క్షేమంకర ముత్తమ
మక్షయ పదదాయకమ్ము హరిదిన మెలమిన్.

కం. వ్రతములలో హరిదివస
వ్రతముత్తమమగుట భక్తవర్ధనముగాన్
గతిరహితము భజియించిన
మతిరహితులకెల్ల శాశ్వతముదలంపన్.

కం. హరిదినముల రాతిరి జా
గరణము ద్వాదశుల దశమిఁగడునిష్ఠల నే
గిర మొకపూటయు కుడుచుట
మురహరుకీర్తనము వలయు మోక్షార్థులకున్.

సీ. నదులలో నెల్ల జాహ్నవి శైలములలోన
మేరువు సుఖములలో రహి వగు
జ్ఞానంబు దేవతాగణములోపల విష్ణుఁ
డల గ్రహంబులలోన నబ్జహితుఁడు
చిలువకులమ్ములో శేషుఁడు పక్షుల
యందు సుపర్ణుండు నఖిలలోక
ముల సత్యలోకంబు మునులలో వ్యాసుండు
ఘనసిద్ధవరులలోఁ గపిలయోగి

తే.గీ. వర్షములలోన భారతవర్షము వధు
లందు క్షీరాబ్ధి పలుకులయందు సత్య
మధికమగు నట్లు వ్రతముల హరిదినంబు
శ్రేష్ఠమైయొప్పు శాస్త్రార్థ సిద్ధమగుచు ॥

కం. హరివాసరమునఁదులసీ
వరపత్రోదకము ద్రావ ద్వాదశి భక్తి
స్థిరతన్ దద్దశభక్తిన
నరుదగు కైవల్య పదమునందఁగఁ జేయున్ ॥

కం. ఉపవాసమునకు నోపని
యపుడొక పూటన్ భుజింప నట్టిఫలంబౌ
నెపుడేకాదశి విష్ణుని
విమల పురోభాగవసతి విపుల ఫలమగున్ ॥

తే॥గీ॥ అనశన వ్రతపరమైన యట్టిదొకటి
కలుగు నితిహాస మాశ్చర్య కరము క్షత్ర
బంధు చరితంబు శ్రేయోన బంధురంబు
వినుడు చెప్పెద నైంతయు విశదముగను ॥

సీ॥ అవనీసురవినింద్యుఁ డతిహేయ చరితుఁడు
విశ్వాస పాతకి విగతబుద్ధి
దబ్బఱ కాఁడు మాతా పితృద్రోహి హిం
సాపరుండాద్య హేమాపహారి
గురుతల్పగమనుండు పరపీడ నుండున
నేకదుష్కృత్యము లొనఁగునట్టి
క్షత్రబంధుఁడు జనాసహ్యుఁడై విడనాడఁ
బడి యడవులలోన విధువఁ బడుచు

తే॥గీ॥ కడుపుఁబోషుక తిరుగన కాకరడవికి
కొక్కముని త్రోవఁ దప్పిమహోగ్రతర ని
దాఘ పీడిత తృష్ణాకృతతనుఁడగుచు
సంచలంబున నడందఁ జనుచు నటకు ॥

ఉ॥ వచ్చుచు ముందటన్నెలఁగు వానిని బోయనిఁ బోని ప్రూరు న
త్యుచ్చయ పాతకుంగని, తనూష్మత నాలుక యొండియుండ నో
ర్విచ్చుచునీళ్లు నూపుమన, వీఁడిడి యయ్యెను క్షత్రబంధుఁడా
సచ్చరితుల్ గృపారుచిరసారసుదృక్కులఁ జూచి చెంగటల్ ॥

మ॥ కుముదాంభోరుహయుక్త చక్రబకరాట్కారండవప్రక్రియా
భ్రమ మందార మరందకందలిత శుంభచ్ఛైక సైక ప్రమో
దముదాధారము దృష్టిగోచర మహాదిద్భోరు విస్తారమున్
గమలాగారము జేరఁ దోడ్కొనిచనన్ గారాముస న్యాసియున్ ॥

కం॥ జలములలోఁబడి వడి ముసు
కల గండూషముల మఱియు తోశనముల ను
మ్మలికలెడఁ బాసి పొట్టకుఁ
గొలఁది మిగుల నీరు ద్రావి కుతుకాన్వితుఁడై॥

ఉ॥ అంతకుమున్న వాఁడు వినయంబున నైకతజాత జాతదూ
కాంతర పుంజ కుంజ కిసలాంచిత శుద్ధి రశయ్యఁ జేయఁ దా
నైంతయు వేడ్కనందు వసియించి తదీయ చరిత్రవింత వి
భ్రాంతునిఁ జేరఁ బిల్చి దయపట్టుగ నెట్టుగ జూచి యిట్లనున్ ॥

ఆ॥ వె॥ క్షత్రమిత్ర! ఘోరసంసారహరము సు
కృతము నైన విష్ణు కీర్తనంబు
మరువకున్న నీకు మహిత భద్రములగు
ననుచుఁ దెల్పి చనియె నతఁడు త్రోవ ॥

ఉ॥ వాఁడు తదుక్తి దప్ప కనివారితబుద్ధి హరిన్నుతింపుచున్
బోఁడిమి విష్ణువాసరము పూనికతో నుపవాస వృత్తిచే
కూడఁగ హింస మాని యటఁ గొన్ని దినమ్ముల నంతఁ గాలునిం
గూడి మఱొండు జన్మమునఁ గారిమి భూసురవర్యుఁ డై తగన్ ॥

కం॥ జనియించి సద్గుణంబుల
కనువై హరివాసర వ్రతారాధని మున్
జననము దెల్పెన్ వ్రతము
ట్లన సల్పి యతండు మోక్షలక్ష్మిం జెందెన్ ॥

చం॥ బహుళతర పాతకాస్పదు లపార జడాత్ములు శాంతి హీనులున్
వహి నతిహేయవర్తను లవారిత దౌష్ట్యులు మూఢ కర్ములున్
రహి హరివాసర వ్రతపరాయణు లౌ నెడఁ బావనాత్ములై
యహిపశయాఖ్యుఁడై మెఱయు నచ్యుతు చెంత వసింతు రెంతయున్ ॥

కం॥ ఆగామి సంచితంబులు
బాగగు ప్రారబ్ధమైనఁ బాయున్ సుగతుల్
భోగములున్ సమకూరున్
శ్రీగరిమన్ దద్వ్రతంబు స్థిరమతిఁ దలఁపన్

కం॥ వేదములకంటె శాస్త్రము
లాదటఁ దల్లికిని మేఁటియగు గురువున్ స
త్యాదితధర్మామితల
బాధరనిరశనము కంటెనగునె వ్రతంబుల్ ॥

మ॥ మునురుక్మాంగదుఁడన్ ధరావిభుఁడు సమ్మోదాత్ముఁడై యుండి సాం
పున మౌనీంద్రులు రాఁగ మ్రొక్కి విధివత్పూర్వార్చనల్ సల్పి యో
ఘనులారా! యిల నే వ్రతంబనఘవిఖ్యాతిం బ్రవర్తిల్లు ము
క్తి వానంగూర్చు నెఱుంగఁ బల్కుఁడన నెంతే మెచ్చి వారందఱున్ ॥

కం॥ హరివాసరవ్రతంబఘ
హరణము మోక్ష ప్రదంబు నని సన్మునులన్
బరిశీలిత శాస్త్రార్థా
పరములు వివరింప ధరణిధవుఁడా రీతిన్ ॥

చం॥ దశమిని నేకభుక్తమును ద్వాదశి నట్లన సల్పి కల్మషో
పశమన విష్ణువాసరము భాసుర నిష్ఠ్యుపవాస సత్క్రియా
వశత నొనర్పుచున్ బ్రజల వైభవగ నట్లొనరింపఁ బంపు నం
త శమనలోక మంతయు గతస్థితిఁ బొడ్పడె శూన్యయాతనన్ ॥

ఉ॥ అంతకుఁడంత ధాతకుఁ దదాగతి దెల్ప నతండు మోహినీ
కాంతను విఘ్నకారిగ వికాసతఁ బంపిన మందరాద్రియం
దింతి వసింప వేఁట తమి నేడ్తెఱ వచ్చి ధరాధిపుండు త
త్కాంతకు బాసయిచ్చి నిజధామముఁ జేర్చె మనోజబాధచేన్ ॥

చం॥ అదియును గొన్ని నాళ్లకు వ్రతాచరణమ్మున లేచి పోవు న
భ్యుదయ గుణాభిరాము నృప పూజిత మాన్య నతండు పుత్రసం
పదలును ధాత్రి యీవ్రతము భంగి ప్రియం బొనరింపవన్న న
మ్ముదిత కుమారు ద్రుంపుమనఁ బూనె విభుండు వ్రతాభిమానియై ॥

తే॥ అపుడు పక్షీంద్రవాహనుఁడై యజ్ఞనాభుఁ
డవనివిభుఁ దత్సుతునిఁ బ్రోచి యతివ మోహి
నికినిఁ ద్వాదశి పగలిఁటు నిద్రవోవు
వారి ఫలముల పాలిచ్చి వసుధ నుంచె

కం॥ ఇది రుక్మాంగదుఁ డెంతయు
మోదమునఁ దద్వ్రతము సల్పి ముక్త్యాగతి మహో
భ్యుదయము బొందిన చరితము
చదివిన వినఁ గల్గు సుఖయశౌఖ్యము లెలమిన్ ॥

తే॥ గీ॥ అట్టి హరివాసరంబున నన్నయుక్తి
నిలిచి యఖిలాఘములు భోక్తృకులము జెందు
పాతకుల కెందు నిష్కృతి పరగు నాఁటి
భోక్త కెందును బాపంబు పోదుగాని ॥

కం॥ వ్రతములలో నత్యుత్తమ
మతులిత మపవర్గదాయి యా మరునాఁ డం
చితమతి విప్రుల కన్నము
చతురత నిడు పుణ్య మెన్నఁ జాలరు విబుధుల్ ॥

సీ॥ మఱియు జయంతుల తెఱఁగు చైత్రసితప
క్ష చతుర్దశిన్ మాత్స్య జన్మ దినము
జ్యేష్ఠాసిత ద్వాదశిన్ గమఠ జయంతి
రాణింగఁ జైత్రశుద్ధ త్రయోదశిని వ

రామజయంతి నరమృగ జయంతి వై
శాఖసిత చతుర్దశ దినమున, న
భస్సిత ద్వాదశిని బటువామనజయంతి
ధృతి మార్గ కృష్ణ ద్వితీయఁ బరఁగు

తే॥ గీ॥ రామదేవ జయంతి చైత్రసిత నవమి
మాధవసిత తృతీయ రామబలరామ
జననముల్ శ్రావణ సితాష్టమిని నభశ్శు
రోద్వితీయఁ గృష్ణ కలికి రూపజములు ॥

కం॥ ఇవి దశ జయంతు లెన్నఁగ
వివిధిన్ గల్పోక్తరీతి మహి సల్పఁదగున్
భువి రామకృష్ణ వామన
మవిరళ నరహరి జయంతు లవిలంఘ్యమ్ముల్ ॥

ఆ॥ వె॥ ఆచరింపకున్న నఘములు దలుచగు
నాఁటి భక్తి నిరయవాటిఁ జేర్చు
ప్రత్యవాయమగుట పరికించి పెద్దలు
వత్తురీ వ్రతములు దవిలియుంద్రు

ఉ॥ ఉష్ణగభస్తితేజమున నుర్విజనస్తుతులొంది విష్ణుటన్
విష్ణు సమీపవర్తియగు వేదముఖామర వంద్యమాన రో
చిష్ణుత, భక్తితోనఁ గులశీలుఁడు పాపియునైన నొక్క శ్రీ
కృష్ణజయంతి సువ్రతము కీర్తిత సత్క్రియ సల్పెనేనియున్ ॥

కం॥ ఆదినమున భుజియించిన
యాదురితాత్మకుఁడు ఘోరమగునిరయములన్
బాదగునని నారదుఁడ
త్యాదరత సనత్కుమారుఁడడిన దెల్పెన్ ॥

తే॥ గీ॥ జపతపోదాన హోమాది చర్యలెల్లఁ
గోటిగుణితఫలప్రదపాటవమగు
నాజయంతులఁ జేయుట లనఘులకును
దన్మహిమ శక్యయిడఁగ వాగ్ధరుని వశమె ॥

సీ॥ చంద్రకాంతుఁడు నాఁగ జగదీశుఁ డొకఁడశ్వ
మేధముల్ నలుబది మేధఁ జేసి
పదివేల్ శరత్తులు పటుధర్మగతి రాజ్య
మొనరించి సుతకాంక్ష వనజభవునిఁ

గూర్చి తపంబు మక్కువఁ జేయ నలువయు
వరము గోరద వన్నవాఁడు సుతుఁడు
గావలెననుటయుఁ గమలజుండు జయంతు
లాచరింపుము పుత్రులమిత రాజ్య

ఆ॥వె॥ పదము గల్గననుచు, పార్థివుఁడట్లన
సల్పి రాజ్య పుత్రచయము సిరులు
గాంచియంత విష్ణుకడ మెలంగె మహా వి
భూతి నెరయ ఖ్యాతి నీతి నెరయ ॥

కం॥ జన్మాష్టమి కామితదము
సన్మహిమ జయంతి మోక్ష సంపత్ప్రదమౌ
సన్మునివాగీరిత మే
తన్మహిమ తెలియంగునే విధాత తలంచన్ ॥

ఆ॥ వె॥ మున్ను నృపులు సంయమును నాచరించి కృ
తార్థులైరి కృష్ణుఁడాదిదేవుఁ
డవతరించు దినములవి యెల్లఁ గల్పోక్త
గతుల నాచరింపఁ గల్గు శుభము ॥

సీ॥ జగతికై నాశ్వయుజబహుళ చతు
ర్దశినాడు సత్కర్మధర్మనిరతి
పురుషసూక్తమున నంబుజనాభునకు షోడ
శోపచారములఁ బూజోపయుక్తి
తైల దీపము లిడఁ దగ నశ్వమేధాది
సవనఫలంబులు సంభవించు
హరి నరకాసురుఁ బోరిఁగొని వరమిచ్చె
నీ చతుర్దశి, వెస నెవ్వరేని

తే.గీ. నరకుదంబున నభ్యంజనాది చర్య
నాత్తయుతులై యొనర్చిన నఘము లణఁగ
మహి సుకృతమొందు నటు గాన మంగళంబు
లాచరించిన మేలగు నధికకృపను ॥

క॥ కార్తికమున దీపము హరి
మూర్తులసన్నిధిని నిడిన మోక్షము గల్గున్
గీర్తింప బ్రాతస్స్నానము
వార్తకు నైక్యంగ సౌఖ్యవైభవ మొసఁగున్ ॥

వ. కార్తిక మాఘ వైశాఖ స్నానంబులత్యుత్తమంబులగు ఫలంబు, లందుఁ గార్తికసితద్వాదశి హరి తులసీపూజనోత్సవ క్రియలు మోక్షప్రదం బంతరిక్షదీపంబు లధిక తేజఃప్రదంబును ముక్తిప్రదంబునునగు దన్మాసశశివాసరోపవాస నక్తకాల భోజనంబులును హరిహరపూజనంబు లుభయసౌఖ్యకారణంబులునగు నేతత్ప్రకారాచారపరులగు వరమునిధరణీధవులనేకు లఖిలార్థంబులనుం గాంచి రట్టికార్తిక మార్గశిరముల నరుణోదయసమయస్నానదాన దేవతార్చనోత్సవమహిమలపారంబులు మార్గశిరంబున నుషఃకాల దీపదానముద్గాన్న నివేదన కీర్తనలవలనఁ బరమేశ్వరుండు దృప్తుం డగు వెండియు.

ఉ. దానము రానురాఁ గ్రమదంబునఁ గోరికలిచ్చుఁ బుష్యస
న్మానత మాఘమాసముల మానితఁ గ్రుంకిడి విష్ణుపూజన
ధ్యానములన్ ద్విజావళికుదారత భోజనమిడ్డ ముక్తుఁడౌ
భానుదినంబులా నెలఁ బ్రభాతములంచిత పుణ్యయుక్తమున్.

కం. మాఘస్నాన ఫలంబుల
మోఘము మున్ వసిష్ఠమునిని దిలీప
శ్రీఘనుఁడడిగిన వేఁడుక
నాగుణనిధి దెలిపినవిధ మదియెట్లనినన్.

సీ. వలలురుల్ శిఖురుగండెలు పోగుకట్టెలు
జాగిలమ్ములు పెక్కు డేగపదుపుఁ
బోపుడుకోలలు ప్రోగ నేజలు బలు
బల్లెముల్ తడికలు బల్లగోల
లరిదివిల్లమ్ములు నాయత్తపాటును
గలవేఁటకాండ్రు ముంగలను నడువ
ధృతిమై నయోధ్యాధిపతిదిలీపుఁడు వేఁట
వెడలి పర్వతగుహల విపినములను.

తే. గీ. మృగఖగంబులఁ దున్మచు మెలఁగియచట
లేఁటినొక్కటిఁ గాంచి యింకేటివేఁట !
బట్టెదను దీనిననుచు వెంబడిఁబరువిడ
మాయమై పోని యగుచు నమ్మహి విభునకు
తత కటాక్షంబుతోడ నయ్యతివరుండు.

చ. కనుగొని రాతిరిన్ నిదురగానక మేన్ శ్రమమొంద వేఁట వి
న్ననువగునే దిలీప! మకరాన్వితుఁడై రవియున్నమాస మిం
దనుపమనిష్ఠఁ గ్రుంకిడుట లక్ష్మమటన్నఁ దదీయ ధర్మముల్
వినిచెదనాఁగ స్నానవిధివేళ కథల్ రచియింపఁగూడునే!

కం. భూనాథ! నీవు గ్రుంకిడ
రా నదికిన్ మీఁద మౌనిరాజు వసిష్ఠున్
ధీనుత! వేఁడుము మాఘ
స్నానఫలంబతఁడు నీకు సకలము దెల్పున్.

చ. అనిముని తెల్పినంతన జనాధిపుఁడాత్మగృహంబుఁ జేరి తాఁ
జనిన తెఱంగు వేఁటనగు చందము నాప్తులతోడఁ దెల్పుచున్
గనకరథంబు నెక్కి మణికాంచనకేతుసితాతపత్ర శో
భనరుచిరాకృతిన్ ధరణిపాలుఁడు వెల్వడి ధీసమగ్రుఁడై.

తే. గీ. అలవసిష్ఠాశ్రమమునకు నరిగి వంద
నార్చనమ్ములొసంగి సంయమియొసంగు
నట్టియాతిథ్య సత్కారమనుభవించి
భక్తి మాఘావగాహన ఫలములడుగ.

సీ. మునిపల్కె జనవర! వినుము మాఘస్నాన
ఫలమజునకునైనఁ బలుకఁదరమె
తగు నన్నదానాదిదానముల్ వ్రతములు
సవనముల్ సేయక స్వర్గభోగ
మనుభవింపఁగఁగోరు ననఘు లఘోఘమౌ
మాఘావగాహన మహిమ గాంతు
రమర వైశాఖిఁ జాంద్రాయణ కృచ్ఛ్రభద్ర
కాదులు గార్తికమందు హోమ

ఆ. వె. ములను మార్గశీర్షమున జపవిధములు
మఱచు జనులు మాఘమాసమజ్జ
నమునఁ దత్ఫలంబు క్రమమునఁ గాంతురు
కోర్కెలాదభ్రముక్తి కుదురుకొనును.

కం. శచియు నరుంధతి [ప్రా]గ్జ
న్మచరిత్రల మాఘమజ్జనము నేసి కదా
ఘనులగుచు మహామహిమ
ప్రచురతఁదగి రమిత సుకృతఫల మది తలఁచన్.

సీ. శాఖశాసంబున మహితోత్సవములతో
హరిపూజయును నతు లతిథిపూజ
లామ్నాయపారాయణాది సత్కర్మము
లధికఫలస్థితి నమరు స్వర్గ
మున స్థిరముగనుండు విను మున్య ధర్మముల్,
భువిపునర్జన్మ హేతువులు తలఁప
ప్రతిహేమాబుజపదాన పరధర్మములకంటె
నది పునీతులఁ జేయు నఖిలజనుల.

తే.గీ. నదులఁబుణ్యస్థలంబుల నొడవుమజ్జ
నముల నుభయకులంబుల నమరు సప్త
సంఖ్యవారలఁ గూడి మోక్షంబుఁ జెందు
నని వసిష్ఠుండు మఱియు నిట్లనియెఁబలికె.

కం. భూమిని ద్వాదశవర్ష
క్షామమున సహ్యవింధ్యసంధుల దేశం
బోమమి మును జను లెడలిర
భూమీరుహ సస్యచయము బొలుపరుకతనన్.

కం. ఆ కరువున క్షుత్పీడా
వ్యాకులుఁడై భృగుఁడు శిష్యవర్గముతో నా
నాకానన స్థలములా
లోకింపుచు వచ్చియడవిలో నొకచోటన్.

ఉం. తరునుమ కుంజపుంజములఁ దానురలం గలమేల్ కొలంకులన్
గురుతటినీనియుక్తములకూటము నా గిరినొంటుగాంచి యం
దిరవానరించె ముక్ వడలి కెల్లను దీఱ మునీంద్రచంద్రుఁడా
దరమునఁ గందమూల ఘనఫలావళి నాఁకలి మాన్పివేడుకన్.

సీ. అచ్చటికొక్క విద్యాధరుండేతెంచి
వందనంబిడి మునివరునిఁబొగడి
తనకాంత సకలవిద్యా వరోదారుఁడ
గాంధర్వకళాప్ర, యు,నార్యవర్య !
వ్యాఘ్రాసనంబున వర్తింపుచున్నాఁడ
తలఁపు మర్త్యకృతులనమనుము
నాశి మాఘమునఁదైలాభ్యంగ మొనరింపు
కొనిన పాపమునవిట్లనుభవిదాను.

తే.గీ. నళుఁడు వేఁకువఁ గ్రుంకిడుటమరదేహ
మొనరియును శాప ముక్తులయ్యె విను మిచటను
మాఘమజ్జన మొనరింప మంచిముఖము
కలుగునన వాఁడటులఁ జేసి కాంచె సుఖము.

తే. గీ. విలుడను రాజు కడు నసహ్యమగు రూప
వంతుఁడై మాఘమున స్నాన మహిమవలన
నలరువిలుకాని చెలువున వెలసె ననుచు
నా దిలీపునితో మునియనియె మఱియు.

కం. కృతయుగమున మునివర్యుఁడు
చతురాననుమానసమున జనియించిన స
న్మతి మేధాధృతి మత్సం
డతులితతపమునఁ దలిర్చె నతితేజమునన్.

చం. అతనితనూభవుండు నిగమాంతవిదుండు మహాతపస్వి సం
తతమృదుభాషి కర్దమసుతావర గర్భసుధాకరుండు వి
శ్రుతుఁడగు వత్సమాని శ్రుతిసూక్తవిధిన్ బ్రహ్మచర్యనుండి యం
చితధృతి సహ్యభూధరముచెంగట పశ్చిమసీమ నేపునన్.

కం. పదవృత్తిఁ దనరు కావే
ర్యుదకంబునఁ గ్రుంకులిడుచు నురునిశ్చలతా
స్పదనిష్ఠారతిఁ దపమి
పాదవఁగఁ గావించె నతఁడు పూర్ణప్రౌఢిన్.

ఉ. ఆయెడఁ జిత్తశుద్ధిఁ గని యమ్మునిశేఖరుఁ డాసమీప నా
రాయణశైలభూమి సుకరంబగు భద్రవసరస్తటంబునన్
బాయక యోగమార్గమునఁ బద్మదళాక్షు భజింపుచుం దనన్
గాయతనిష్ఠఁ జేయుచు సమాధిరతిన్ వసియింప నత్తఱిన్.

కం. మృగములు శృంగాగ్రంబుల
సుగుణుండగు మౌని మేను సొంపున నొరయన్.
మృగశృంగుఁడగుచు హరిపైఁ
బగిలినచిత్తమున నతఁడు తప మొనరించెన్.

సీ. ప్రత్యక్షమై కృపాపరుఁ డంబుజాక్షుండు
తండ్రి ప్రణామ సంస్తవము లమరఁ
గావించి యపవర్గ కామియౌ వత్సుని
బహుమాన మొనరించి విహితవృత్తి

గార్హస్థ్యధర్మసంగతినుండి యటమీఁద
మఱుఁ జేరుదనుచుఁ బల్కి కమలనాభు
నానతి మృగశృంగుఁడను నామము వహించి
కల్యాణతీర్థావగాహుఁడగుచు

తే.గీ. భోజపురిఁ జేరియట జననీజనకుల
కచ్యుతోక్తు లెఱింగించి యధికభక్తి
సేయు దనయునితో మునిశ్రేష్ఠుఁడైన
వత్సుఁడిట్లని యిం న్మదిఁ గూర్మి దనర.

కం. సుమహితగతిమాఘస్నా
నముఁ జేసిన నీమకోర్కి నారాయణుఁడ
ర్యమతేజ! యొసఁగు టరుదే
క్రమమువనని సుతుని మెచ్చె గారవ మమరన్.

సీ. అంతన వత్సుని యాత్మజ సౌందర్య
ఖని సువృత్తా నాఁ యనుగుచెలులు
దానుమాఘమున సత్తటి సహ్యజాంధ్య
తీర్థావగాహన స్థిరత నుంచి
వరుని నర్థించి పావని యొకనాఁ డందుఁ
గ్రుంకిడి వచ్చుచోఁ గుంజరాఖ్య
హైకిరా కన్యకామఃఖునఁబడి సఖి
యాతతముగ మృతినొందె నురులపాప.

తే.గీ. కలితులై తల్లిదండ్రులు లక్కడికిఁ జేరి
తగవఁ గావేరిఁ గ్రుంకిడి వచ్చుచున్న
యట్టి మృగశృంగుఁ డవ్విధంబంత యెఱిఁగి
యాదరణ వారి నూరార్చి యనియె నిట్లు.

కం. ధృతి మీకుమారికను నే
బ్రతికించెద ననుచుఁ బల్కి వటువేదోక్త
స్థితి మృత్యుసూక్త పఠనా
రతిఁ గావేరీజల స్థిరతనుండు నెడన్.

ఉ. కన్నెల మున్ను కావిఁబడఁగా గమకించిన భద్రనాగము
సన్నుతచర్యుఁడై కని చంచల మొందక యున్న యమ్మునిన్
దిన్నఁగ మూర్ఛనుంచుకొని తెచ్చుచుఁ దత్తను సంగతిన్ శుభా
త్యున్నతిఁ జెల్వు చెంది సనరొప్పఁగ వత్సునితోడ నిట్లనున్.

సీ. కరహాటపురినిఁ దనగరి విశ్వగుప్తుని
తనయుఁడు వైశ్యుఁడు ధర్మగుప్తుఁ
డనువాఁడ ధర్మ హైనటుల బేరములాడి
కోటిధనముగూర్చి కొడుకుపాలు
సగమిచ్చి తక్కిన సగమున సకల ధ
ర్మములు సేయుచునుండు రహి నచటికిఁ
గాపాలికుఁడు వచ్చి కల్లరి రసవాద
మొనరించి ధనమెల్లఁ గొనిన లేమి

తే.గీ. నొందియును నటి ధర్మములాత్తి పెట్టి
కడుపుకోసుక నుండగ గొడుకు దూర
మరిగి బేరములాడఁ బరాన్న నిరతి
రోగమునఁ దనువెడయ నీ రూపమంది.

వ. భవత్తను సంస్పర్శంబున జ్ఞానంబుగల్గెనని కొనియాడుచున్నగ్గణంబునకు నమ్ముని దశదిన మాఘస్నానఫలంబు లొసంగిన నదియు దివ్యదేహంబున సురపురికరిగె. క్రమ్మఱ నమ్ముని యమ్మహనీయజలమధ్యంబున మృత్యుసూక్తయమ స్తోత్ర పఠనందనర నతనికి యముండు ప్రత్యక్షుండై మునికన్యకల బ్రతికించి చనియె. మృగశృంగుం డొనరించిన యమస్తుతి పఠించినఁ గృష్ణాంగారక చతుర్దశి తర్పణం బొనరించినను నపమృత్యుభయరహితులగుదురు తత్పితరులు పుణ్యలోకంబుల సుఖింతురని చెప్పి యాదత్తుండు మున్నె స్వర్గస్థులైన యమ్మానినులఁ బరిగ్రహింపుమని వత్సునిం బ్రార్థించె, నక్కన్యలు దము వేడిన బంధువులకు యమలోకపుణ్య పాపానుభవజన కథనంబు వివరించిరనిన, వసిష్ఠునకు యమలోకంబునకు నరిగిన తరుణులు మఱలివచ్చుటెట్టిది యరుదనిన ధరణీపతికి మునివరుం డిట్లనియె.

కం. నిష్కంటకుఁడును నిజహృ
త్పుష్కరకీలితరమా విభుఁడు బుధనుత స
త్పుష్కరచరిత్రుఁ డగుచున్
బుష్కరుఁడను నొక్క విప్రపుంగవుఁడమరున్.

సీ. మఱియొక్క ద్విజుఁడు పుష్కరనామునఁ దత్స
మీప దేశమ్మున మెలఁగుచున్న
నతఁడెమ్మని యముఁడానతియిచ్చిన
భటులు మోసమున నా పరమపుణ్యుఁ

గొనిపోయి వైవస్వతుని చెంతనిడలేచి
ప్రమొక్కి కింకరులకై మురియఁగనిని
కొనిపొందితనిఁ బుష్కరుని వానిఁదెమ్మన్న
నరకకూపంబులఁబొరలుపాప

తే.గీ. కర్మజనశోకముల్విని కరుణవారి
విడుభృమనివేఁడికొని తెల్పి విడువమనఁగ
బుష్కరుఁడు విష్ణు గేశవు భువనవంద్యు
వాసుదేవునిఁ గీర్తించె భాసురముగ.

కం. వారలునరకోత్తీర్ణమ
హోరుచిరశరీరులగుచు నమరులఁగలయన్
గ్రూరమతి యముఁడుభానురు
ధీరాగ్రణిఁ జూచిపల్కెఁ దెగువ దలిర్పన్.

చం. నిరతము శ్రద్ధ భక్తియును నిశ్చలచిత్తముగల్గనెవ్వరే
హరిఁగొనియాడ వారల మహాఘముఁవాయును భక్తిహీనతన్
బరులనునెంచు నజ్ఞులకు భ్రాంతులకున్ ఫలమల్పమంచు న
త్తరణితనూభవుండు విదితంబుగఁ బల్కుచు వెండియిట్లనున్.

కం. నారకులుదామచేసిన
ఘోరాఘముతొల్లనొందుదఁ గూరిమిమీఱన్
వారలహరినెన్నఁగఁబలు
మారుమ్మ్రేచీరవు మంజులఫణితిన్.

వ. తన్మహిమవలన ముక్తులైరటుగావున భక్తిహీనులు కీర్తనశ్రవణంబుల ననల్ప ఫలులగుదురని యతని బహూకరించి నిన్నుదలఁచువారలకు మృత్యుయంబు లేదని యనిచిన బుష్కరుండు భూమండలంబున సుఖంబుండెనని వెండియునిట్లనియె.

మ. మును శ్రీరాముఁడు రాజ్యమేలుతఱి సమ్యోదాత్తులై భూప్రజల్
మనుచో విప్రకుమారుఁ డీల్గుటయు రామస్వామి వేఁ బుష్కరం
బుననుండంతటఁజూచి [శూద్రుఁడు] తపంబుంజేయఁగా దర్శియల్
గని వానిందెగటార్చి వేడ్కబ్రతుకంగాఁ జేసెఁదబ్బాబకున్.

సీ. మకరమాసపుఁబౌర్ణిమను నాప్రభాస తీ
ర్థనిమజ్జన క్రియఁదవిలియున్న
సాందీపునుతుని గడింది నక్రముమ్రింగ
నంత శ్రీ కృష్ణుని నఖిలవిభ్య

తెలిసిఁగొంచి దక్షిణ యీశాలోలఁగా నిజ
సుతునిఁ దెమ్మనుడు నచ్యుతుఁడుకడఁగి
క్రమమున యముని ధిక్కారంబొనర్చి త
త్సుతునిఁ గ్రమ్మఱఁ దెచ్చెనతులితధృతి

ఆ.వె. నయిన యముని పురికినరిగిన వారలు
మహితవర్తనముల మహికివత్తు
రదియు నాఖు మజ్జనాంచిత ఫలములు
వినుమటంచు మౌనివిభుఁడుపలికెను.

వ. సువృత్తానుర సావిమలాకమలాఖ్యలంగల చెలులనలుగురి నేకముగా ముహూర్తంబున పరిణయింపుమను నుచథ్యవచనంబులకు ననుమానించు కుత్సవత్సులకు వ్యాసుం డిట్లనియె. మున్ను దక్షపుత్రికల సప్తవింశతిసంఖ్యగల చెలులఁ గలువలచెలి పరిణయించె మఱియును.

చం. ఆదియునుగాక సౌభరి మహామహుఁడాయమునాతటంబునన్
బదిలముగాఁగ గ్రుంకిడితపంబొనరించెను ద్వాదశాబ్దముల్
కుదురుగ నంతనందుఁ బఱుకుండఁగ బెక్కులమీను పుత్రపౌ
త్రదముతలన్ జెలుల్గడుముదంబున దేల మెలంగఁ జూచుచున్.

ఉ. తాను గృహస్థధర్మమున ధాత్రివసింపఁదలంచి లేచి వి
ద్యానిధి యయ్యయోధ్య యువనాశ్వకుమారునిఁ జేరి తత్తనూ
జానివహంబులో నొక విశాలసితాంబుజనేత్ర వేఁడినన్
మానవభర్త యీ ముసలిమౌనికి దక్కెడి యాసపుట్టఁగన్.

కం. ఇతనిఁ గనుంగొని చూడ్కి
హితమని వరియింప రెవ్వరేమిటి కిటు మ
త్సుతలధికరూపశీలా
న్వితలీకొనఁ జాతురితని నియమిఁ దలంచున్.

తే.గీ. ఇయ్యమనుడును శపియించునేమొ కన్య
కామణులునేబదుగురును గల్గ వారి
యందు నెవ్వతె వరెనను నట్టిదాని
నితనికిచ్చెదనని నిశ్చయించి విభుఁడు॥

కం. అంతఃపురమున కరుగుము
కాంతలు నినువలతురేనిఁ గడువడినిత్తున్
జింతింపకుమని యనిచిన
నా తాత్ముఁడు మౌనిమిగుల సౌందర్యముతోన్.

మ. తనిసెన్ మారుఁడో! యక్షరాజసుతుఁడో! శక్రాత్మజాతుండో! వీఁ
డనుచున్ రాజకుమారికామణులు మోహాన్వితలై చేర యా
తనికిన్ బల్మిని సీతఁదేవిభుఁడు నాత్మస్వామి యంచుం దయన్
మునిసర్థించిన రాజసంగ సుతలన్ మోదంబు సంధిల్లఁగన్.

వ॥ ఆశ్లోకములూర్ధ్వంబున నందఱవన్ని రూపంబులం బరిగ్రహించి యంచిత భోగ భాగ్య సౌధారామభూషణాంబరవస్తువులం దనర ననేక పుత్రపుత్రికాపౌత్రసంపత్సమృద్ధినతిశయిల్లె. వెల్లగుయమునాజలంబునఁ జలంబునఁ బంద్రెండులు మాఘస్నానం బొనరించిన సుకృతంబున నంతటి ప్రభావంబునమరె, తచ్చరిత్రఁ దలంచిన సంతాన సంపత్సమృద్ధులొదవునని వ్యాసుండు దెల్పెనఁగుత్సుండావత్సుని నలువురులలనలం బాణిగ్రహణంబున నర్పణఁజేసినఁ దత్సతీరత్నంబులు పరమపతివ్రతలగుటఁ బూర్ణగార్హస్థ్యధర్మంబులం దనరి నందనులంగాంచి రందు సువృత్తకు మృకండుండు జనియించి ముద్గలపుత్రియగు మరుద్వతిన్ వరించి పుత్రకాంక్షియై యగతికులకు గతి కాశియగుటఁ దల్లులు నిల్లాలునుం దాను నచటికింజని యందాత్మనామంబుల మూంతిగణవిభు వెంగట లింగప్రతిష్ఠలు గావించి యంచిత వ్రతస్థితిఁ బంచశరవైరిం గుఱించి వసించినంత—

ఆ.వె. అమ్మృకండుమునికి నచట మార్కండేయుఁ
డనఘమూర్తి పొడమె హరుని కరుణ
నచటి బుధులు శాస్త్రమరసి పదారేడు
లాయువనిరి యతనికాయతముగ.

కం. అదివిని మదివగపున సుతుఁ
బదిలముగా శివుఁడు భక్తపాలనుఁడని సం
పదలాయువొసఁగు నవ్విభు
పదములు భజియింపు మీవు పాపఁదలిర్పన్.

సీ. అష్టమాబ్దమున శిలాదపుత్రుఁడు మృతుఁ
డైనఁ బునర్జీవిగా నొనర్చెఁ
గాలపాశవిముక్తుఁగాఁ జేసి శ్వేతకే
తుని సుకృతాఢ్యుగా నొనరఁజేసె
అలిమీఁద హాలాహలము గంఠమున నిల్పి
సకలచరాచర చయము మనిచె
కమలాక్షు మెచ్చి చక్రంబిచ్చి యతని కా
లము గొని తునిమె జలంధరు వడి

ఆ.వె. మఱియుఁ గొల్చుజనుల మనిచె ననేకుల
నభవుఁడీశుఁడాద్యుఁడతని భజన
వలన నాయువొందు మిలనంచు దీవించి
తనయుఁబంచె దేవతలు నుతింప.

వ. అనిన జలంధరు కథ వినవలతుననిన దిలీపునకు వసిష్ఠుండిట్లనియె. హిరణ్యాండను దనుజునకు దళముండతనికి సూకరుండతనికి వనజభవ వరంబున జలంధరుండు పుట్టి యతండు నలువవరంబులొంది మిన్నందె. సురలందఱును హరిహరులంగూడి మేరుగిరిని మానససరస్సున వసింప నప్పుడప్పుండరీకాక్షుండు మానసంబున కాలంబు నిర్మించె. పంచవదనుండును కాదాంగుష్ఠరేఖాంగాలాత్మకంబును సహస్రారంబునగు చక్రంబు నిర్మించి హరినేత్రాబ్జపూజనకుఁగాఁజక్రంబొసంగి సూకరుండు వెదకుచు నారద ప్రేరితుండై తమపైకివచ్చు జలంధరునింగూల్చె నయ్యీశ్వరుండు త్రిపురంబులణంచె, నట్టి శంకరుం గొలువుమని తనయునకిచ్చిన జనకునానతి గోదావరీ దక్షిణతటంబున శివునర్చనా స్తోత్రంబులఁ దనుపుచు సమాధినిష్ఠనుండునంత.—

తే.గీ. బ్రహ్మయును మౌనులును శంభుఁ బ్రస్తుతించి
యతని మున్నేము చిరజీవివగుమటంచు
దీవెనలొసంగితిమి గాన! దేవదేవ
యది యథార్థము సేయవే యనుచు వేఁడ.

క. ఆ తఱిఁ బడయాకేడులు
హత్తిమృకండాత్మజునకు నగుటయుఁ గాలుం
డొత్తిగళసీమఁ బాశము
గ్రుత్తముగా వైచి తిగిచికొన మునిసుతుఁడున్.

తే.గీ. శివపదధ్యానమంతయు నేయదనుక
దాకకొమ్మని హరుని సదాశివుభవు
బహువిధంబుల నుతియించు భద్రగణము మృ
కండుసూనునిఁ జూచి యాకాలుఁడనియె.

ఉ. మీఁదటికైన కార్యములు మేకొని మున్నలుగంగ నేయ మ
ర్యాదలు మానఁగాఁదగునె యక్కట మర్త్యులకున్ స్వతంత్రసం
పాదితమాయువంచు నిక పాడియె! యిప్పటియత్నమప్పుడే
కాదిఁక నేల రత్నమనుచుఁ గంఠము రజ్జువుబట్టి యీడ్చినన్.

ఉం. హరుఁ బరమాత్మునిన్ బహువిధాగమసూక్తుల సన్నుతింప నా
తరుణ శశాంకమౌళియును దానును అంకెలఁగిల్చినక్క భూ
సురకృతలింగము న్వెడలి శూలము గేల సమర్చి కాలునిన్
జరణహతిన్ ధరం బడఁగ సాధ్వసముందగఁ జేసి హుంకృతిన్.

కం. అంతట సమాధిఁ దెలిసి పు
రాంతకు గిరిజాసహాయు నాద్యునభవుఁ గా
లాంతకు ననంతు నభవు ని
రంతర శివకరు నుతించె నమ్మునిసుతుండున్.

కం. యముఁ డేమి సేయు దుష్క
ర్మము లేమి యొనర్చు హరు నుమాధవునిన్ శ్రీ
రమణీసఖు సదాశివు భవు
నమరవినుతు భక్తిఁ గొల్చినట్టి జనములన్.

సీ. ఘనుఁడైన యట్టి మార్కండేయుఁ డొనరించు
శంకరస్తవ మది చదువ వినిన
యమబాధ లొందవు వైరైన భూజనుల క
ట్లా యము దండించి యమిసుతునకుఁ
జిరకాల జీవిత్వ మిరవొందఁ గా నిచ్చి
హరుఁడు తత్కృత [లింగ] మందు నిలిచెఁ
దల్లిదండ్రులకు ముదం బొదవ నిజాశ్ర
మముఁ జేరి యతఁ డుండె మహిమ మెఱయ

తే.గీ. జాహ్నవీ గౌతములయందు సరవి మాఘ
మజ్జనం బొనరించిన మహిమ లిట్టు
లామృకండు తనూజున కనుభవదిరాఁ
గానమాఘావగాహ మనూన ఫలము.

వ॥ అదియుఁ బుణ్యతీర్థతరంగిణులకంటె మహానదులయందత్యుత్తమంబు దానికంటె మానసతీర్థంబతిసుకృతప్రదంబది దానజపతపోయజ్ఞదమశమవిషయానాసక్తియుక్తంబును గురుమాతృపితృశుశ్రూషాంతశ్శుద్ధిసత్యభూతదయామనోవాక్కాయకైక్యత్వాది సద్గుణ భరితంబునగుట నదియ తీర్థోత్తమంబు నంతర్మలశోధనంబునని తెల్పి వసిష్ఠుండు వెండియునిట్లనియె—

సీ. ధర్మపాలుండెల్ల ధర్మంబులాచరించె
బహుతరైశ్వర్య సంపత్ప్రభలను
శ్రుతిపాలుఁడను విప్రుఁడతుల దారిద్ర్యంబు
ననుభవించి తీర్థాటనాసక్తుఁడయ్యె
మాఘమజ్జనత నామలకేశ్వ— — దా
దర శాక కూష్మాండతండులములు
లోహమరిజతపాత్రలు భూమి దానంబు
నత్యుత్తమఫలములగుచు నొదవు

తే.గీ. స్వర్గ సౌఖ్యములమరు నిశ్చలత ననుచు
నారదుడు దెల్పె సంగధారారమణుం
కతడు గేదారమున నిటులాచరించి
బ్రహ్మపదమొందెఁ బురుషార్థ భద్రదంబు
మాఘమజ్జనమందు నమ్మానిశలికె

కం. పంచమహాపాతకములు
సంచిత హాగామికలుష చయము లణంగున్
మించుఁగృతఘ్నాఘమునఁ
దెంచక ప్రారబ్ధమైన నొడయుందాన్.

సీ. అకలంకమగు గ్రామమందు సువృత్తుఁడన్
విప్రుఁడు పాతక విశదిఁదవిలి
కడువృద్ధుఁడై వివేకముగల్గి నర్మదఁ
బది దినములు మాఘ మొదవ గ్రుంకి
తన్మహిమం బుణ్యతరలోకముల నుండి
మనుజుఁడై క్రమ్మఱ మకరమాస
మునఁ బ్రయాగ స్నాన మొనరఁ జేయుచు బ్రహ్మ
కడఁద్రికల్పములుండి కాశిఁ బొడమి

ఆ.వె. యటుల మోక్షమందె నంతకంటెను భాగ్య
మెట్టి జనులకైన నొద్ది కాన
మాఘ మజ్జనంబు మఱదు వారలఁ జెందు
గ్రుంతులిదె డిజనుల కుంకె మెల్ల.

కం. వాపీ హ్రదప్రవాహము
లోపినచో ఫలములొసఁగు నుత్తమముగ నే
రూపమున నైన నింటన్
గూపజల స్నానమైనఁ గొదవ దలంపన్ ॥

వ. జలాభావంబగు నెడను ధృతఘటజల స్నానంబర్హంబు. అతిపన్న ధృత జలంబ యోగ్యంబగు, నశక్తుండగు నేనిఁ బ్రతినిధి ధౌత వస్త్రయుగ్మ యుక్తకుశా [ంకు?] రంబు విప్రునిచే స్నానమొనరింపఁజేసి యతని కుటుంబపోషణంబు నతనికి మధురాహారం బులుదన్మాసనంబెల్ల ననువుపఱిచి మాసాంతరంబున ధేనుదానంబతని కొసంగునేని నిను పడిసుకృతంబు వొందు మాఘశుద్ధైకాదశి నుపవసించునేని నేకాబ్ద హరివాసర వ్రతా చరిత సుకృతం బొదవు మున్న ముని కీ నయ్యేకాదశి మాత్రంబు ఫలహారివై యాచరిం చితి వేని సంవత్సర హరివాసరము లుపవసించిన ఫలమగునని ధౌమ్యుఁడానతిచ్చెగావున చాతుర్భక్త నర్జితంబును హరిదేవ సాహస్రారాత్ర జాగరణ ప్రతిమారాధనంబులును ద్వాదశి ప్రతి మాదాన విప్రభోజనంబు మోక్షప్రదంబులు శివరాత్రి నంతకంటె నెచ్చు. ఏ తద్దినవ్రయయుక్తి.

... వస్తువులు దొరకమి
నుపవసింపుచు నందె యొసంగ వాక్య
కాలనఁ దాపముదీఱఁ గ్రుంకిడి చెంగటు
బిల్వభూజ ముక్రిందఁ బేర్మినుండు

తే.గీ. నట్టి లింగము మీద నయ్యాకు వాటు
చేసి[కొని నిల్చి] నీరానఁ జేరువాని
దునుమ మేల్కని యేమియు దొరకకునికి
వేవ నిట్టుల నిజ పూర్వవృత్తి నుండి ॥

కం. అంతంబున శివకింకరు
లంతక భటవితతిఁదఱిమి హర్షమున శివా
కాంతుని చెంతకుఁ జేర్పఁగ
నంతయు శివరాత్రి మహిమ యగుటటనుండెన్ ॥

వ॥ అని శివరాత్రివ్రతవిధియుఁ దన్మహాత్మ్యంబును జెప్పి మున్ను భృగు పుత్రి యగు రుచిక బాల్యముననె విధవయై భూతదయాది నియమ వ్రతస్థయగుచు వింధ్యగిరి

నలుబది వత్సరములు మాఘ స్నానంబొనరించి తత్సుకృతమున నలువచేఁ దిలోత్తమయన నిర్మింపంబడి దేవలోక నివాసినియయ్యె నట్టి మాఘ మాహాత్మ్యం బడిగిన దత్తాత్రేయుండు కార్తవీర్యార్జునున కిట్లనియె.—

తే.గీ. హేమకుండలుం డను వైశ్యుఁ డెన్ని యేని
కోట్ల ధనమొనఁగూర్చి యొక్కఁడగు ధర్మ
మార్గమున వార్ధకమున నేమరక సకల
దానధర్మము లొనరించె ధర్మవృత్తి ॥

సీ. అంత నాతండు సురాలయంబున కేగ
తత్పుతులిర్వురు తద్ధనంబు
పోఁ గొట్టుకొని పుచ్చి బోయల చందానఁ
బలువిడి దొంగిలఁ బాముకరుఁడై
బులి యొక్కరుని బట్టి పొలియింప యముఁ జేరి
రందొక్కఁ డుండు మాఘావగాహి
గావున [హరి దూత పోవు] దోడ్కొని విను
మనఘ మాఘాపత్యమును మహాన్న

తే.గీ. భక్తి సతత పరాన్నైక భక్తి భద్ర
జనములకు వండి పెట్టుట సారతీర్థ
ముల దరిని దానమొందుట వెలయ ధర్మ
విక్రయము దుర్గతులఁ ద్రోయు విధము లనుచు ॥

వ. మఱియు ననేకధర్మంబు లెఱిఁగింపుచు గంగాస్నానంబును దులసీ గోపీ చందన ధారణంబులును బ్రాణాయమంబున కెనయగు నవి సకల పాతకముల భస్మీకరించు ద్వాదశ సాల గ్రామార్చన కోటిలింగముల జలములఁ బూజించు ఫల మగునని తెల్పి నీవెనిమిదవ జన్మంబున నలుత్తురు బ్రహ్మజ్ఞాననిష్ఠుల నతిథి పూజలఁ దృప్తులం జేసితివా ఫలం బొసంగిన నీతోఁ బుట్టువునకు సుగతి గలుగునన నతండటులనిచ్చిన నయ్యిరువురు హరిలోకంబున నుండిరని దత్తాత్రేయుండు గార్త వీర్యునకిట్లనియె.—

కం. క్షౌరము నభ్యంగంబును
నారీసంగమము పరోదనము దినుటయును
గాకాదుష్ణోదకపా
న్యారూఢ తటాక నదుల నధికము ఫలముల్ ॥

తే. గీ. మకరమునను బ్రయాగని మజ్జనంబు
నేయ సుకృతంబు లెక్కింపఁ జిత్రగుప్తుఁ
డైన నేరఁడు రాజసూయాశ్వమేధ
ఫలములింద్ర చతుర్ముఖ పదవు లొదవు ॥

సీ. కాంచనమాలి నాఁగల్గు నచ్చర కాంత
దినము ప్రయాగను దీర్ఘమాడి
చనునెడ మాఘమాసమున నట్లు యొనర్చి
శివదర్శనమునకై చెలఁగి వెండి
కొండకుఁ బోవుచోఁ జండాసురుఁ డొకండు
తద్వస్త్రజలకణస్పర్శ వలన
ద్రోవనుండు నతఁడు దుష్టభావము మాని,
కాశి మున్ ద్విజుడ, దుష్కర్మ నిరతి

తే.గీ. రాక్షసుడనయ్యు నీవల్ల రాజితమతి
నైతి నీ వెవ్వరవ, సుమేధాత్మజాత
నధిక సౌందర్య గర్వంబు లడర వార
కాంతనైతి గళింగభూమ్యంతరమున ॥

ఆ.వె. అటులనుండి ముదిసి యవనీసురుండొకఁ
డానతీయగా ప్రయాగ తీర్థ
మజ్జనంబొనర్చి మహిమ నచ్చరనయ్యు
నిపుడు నిత్యవిధిగ నిటు లొనర్తు

కం. అనియాతఁడైన వానికిఁ
దనదొక నెలఫలమొసంగఁ దన్మహిమన్ గాఁ
డనుపమవిమానమునదివిఁ
కనిఁజనియెన్ దానిఁ బొగడి కీర్తితతనుఁడై.

చ. ఓడికిటిలోని కాను గడు బెద్దపెఱుందును గెలుగంటునక్
బెడగగు పెన్నెఱుల్ పలుదలింకపుఁ జన్నులు చక్కి మిక్కిలిన్
దడిసినపైఁటు కొంగుఁ గలదాని వరాంతుకుక నిర్గతాంబువుల్
బడ నసురుండు వేల్పగుట భద్రము మాఘనిమజ్జనంబిలన్.

వ. అని దత్తాత్రేయుండు గార్తవీర్యున కెఱిఁగించుటయు దెల్పి వసిష్ఠముని జనవిభునికిట్లనియె: మున్ను ప్రమోహినీ సుశీలా, సుస్వరా సుదారా చంద్రికా నామంబులు గల యచ్చరలు సౌందర్య గర్వంబున నుర్విం దిరుగుచు వేకకాలని కెలన నిత్య కర్మాచరణ నిరతుండగు బ్రహ్మచారిం గని యంగజ శరపీడితలై యాలింగనం బొనర్చి యతనిశాపంబునఁ బిశాచంబులై యతనినట్లన శపియించి తదనుగ్రహంబున బహుకాలంబునకు రోమశుంగని తమ కెలంగెఱింగించి ప్రార్థించిన నతండు వారలకిట్లనియె.—

సీ. వినుఁడు దేవద్యుతియనెడు విప్రుఁడు సదా
చారసంపదలఁ బంచశిఖి మధ్య
మునఁ దపం బొనరించి వనమాలి పాదసేవ
వరమొందె మాయానివారణముగ
నచటువనమునఁ గొల్వ నత్తటి ద్రవిడేశుఁ
డగు చిత్రసేనుఁడు యజ్ఞచయము
గావించి సుకృతముల్ గాంచియుఁ బాషండ
బోధచే సాధుల బాధపఱుప

తే.గీ. నతని సీమ యనావృష్టి నణఁగ, నడవి
జడిసిదేహమ్ము విడిచి పిశాచమగుచు
వఱలిదేవద్యుతి వసించు వనముజేరి
యతని కృపనొంది ప్రార్థింప యమివరుండు ॥

కం. కేరళదేశమున దురా
చారి వసువునాఁగ ద్విజుఁడు తన్మండలి సం
చారమొనర్చుచు మృతుఁడై
కాటియఁ బడి ప్రేతమయ్యె కర్మను లేమిన్ ॥

వ. అటుకొక విప్రవర్యుఁడు ప్రయాగను గంగను గ్రుంకి వచ్చుచున్
దిటవగువంశ పాత్రములఁ దెచ్చుతదంబువులాను తృష్ణ చే
నటఁ బొడసూపి యాద్విజుని కడ్డము వచ్చి భవద్గృహీతమౌ
పటు వియదాపగాంబువులఁ బాపుము దాహము నీవలీలగన్ ॥

సీ. అనుచు విద్యాధిపుఁడను రాజు బ్రాహ్మణ
వన ఫల భక్షణవలనఁ బ్లవగ
మై పురోహితుఁడు మున్నతఁ డిచ్చుదానాళి
యందుఁ బంచద్రవ్య మపహరించి
పారస పక్షియై నారితోఁ బుట్టు గాం
స్యకుమ్ముచ్చిలించుట పారసియయి
యుండఁగ మర్కటుం డాడిసి పట్టి నఁదమ
పూర్వజన్మ క్రమంబులు దెలిపిన

ఆ.వె. సాహసంబు దెల్పె నీరీతి వినినాఁడ
దాహమణఁచినన్ను ధన్యుఁ జేయు
అవనిసురుఁ డనర్ఘ్య యాచనమునను బి
శాచమగుచు గంగజలము గ్రోఁక

వ. పునీతుఁడయ్యెఁ గావున ననఘ యాయుంగ వేఁడెద నగిన నవ్విప్రుండు గంగాతీర్థంబొసంగఁ బ్రేతత్వ విముక్తుండై యతని దీవించి త్రిదివమున కరిగెనని దేవద్యుతి రాజ పిశాచమును బ్రయాగకనిచిన నతండు నత్తీర్థస్నాతుండై కృతార్థుండయ్యెనని రోమశుం డచ్చరలను బ్రహ్మచారినిఁ గంగాస్నానం బొనర్ప ననుగ్రహించి వారలటులొనర్చి పూర్వశరీరులైనయెడ వారలం దోడ్కొని సకల తీర్థాచరణ సేయించి యక్కన్యకల నవ్వటునికి వివాహం బొనరించిన నమ్ముని కృపనుఖంబుండిరిట్టిది మాఘస్నాన మహిమయని వసిష్ఠుం డానతిచ్చిన దిలీపమహీపుండందువలన నమిత తేజస్వియయ్యెనని సూతుండు శౌనకాదుల కిట్లనియె.—

కం. ధీనుతి ఫాల్గుణ పౌర్ణమి
మానిత పూజల వసంత మాధవుఁడగు త
చ్ఛ్రీనాయకుఁ గొల్చిన శుభ
మానవులకుఁ గల్గుఁ గలుషమంతయుఁ బాయున్ ‖

తే. గీ. చైత్రవైశాఖ రాకల సారసాక్షు
పూజ బ్రాహ్మణ జనులకు భోజనములు
భవ్యశీతల కుండజల పాదుకావ్య
జనములున్ ఛత్రము లొసంగ సౌఖ్య మొదవు.

తే.గీ. జ్యేష్ఠ పౌర్ణమి నొనరించు గోష్ఠ పూజ
గోపకులి సంతసము నొంది కోర్కెలిచ్చు
నసురు నాషాఢమున ద్వాదశాహములను
శాకవర్జన మొనరింపఁ జాలమేలు.

కం. శ్రావణ భాద్రపదంబుల
శ్రీవిభు పూజయును వ్రతవిశేషము లనిశా
రావని విబుధాభ్యంజన
మీవిధములు సల్పవిష్ణుఁ డిచ్చున్ శుభముల్.

కం. పాతములం బర మాన్నపు
దాతై శ్రవణములనన్నదానము ద్విజసం
ప్రీతిగ జేసిన మేలగు
శాతిరి రవిజాసరముల రాదు భజింపన్ ‖

తే. గీ. కంజహితవారముల నోపకడల గ్రుంకు
టమరనదిఁ గ్రుంకులిడు పుణ్యమమరఁ గల్గు
పర్వముల భానువాసర పాతములను
రాత్రి భోజన మఘమగు ప్రజల కెందు.

సీ. సతులు భర్తలతోడ సల్పఁగాఁ దగు వ్రత
సమితి చాతుర్మాస్యకాలఁ గలదు
శ్రావణశుద్ధ దశమి మొదల్ కార్తిక
మునఁ బ్రథమద్వాదశి నెరయఁగాఁ
గలహరి వాసరంబుల నుపవాసంబు
హితమతి దశమి యందేక భుక్తి
ద్వాదశి హరిపూజ ధరణీసుపర్వ భో
జనమును గావించి వెనుక భర్త

తే.గీ. భోజనము నేయ పిమ్మటఁ గొలఁది భుక్తి
గొనుట దగు నిత్యమగు వ్రతంబనఘ మిష్ట
దాయకము కార్తికమున శ్రీధరుని పూజ
లిహపరసుఖంబులొసఁగూర్చు నెవరికైన.

కం. ఇది చాతుర్మాస్యవ్రత
మదనఁ గుళీరమున నర్కుఁ డధివసియింపన్
మొదటి భృగు వారమున ని
పొదవఁగ లక్ష్మికి పూజ లొసఁగుట శుభముల్.

వ. ఇదియు లక్ష్మీ నారాయణ వ్రతంబు కల్పోక్తాచరణ సకలాభీష్టప్రదంబు శ్రావణపూర్ణిమాపురో భృగువాసరంబు వరలక్ష్మీ వ్రతంబు నట్టిదియ యాశ్వయుజ శుద్ధ ప్రతిపదాది నవమీ పర్యంతంబు లక్ష్మీ సరస్వతీ దుర్గా పూజలు సిరుల కిరవగు మతియును.

ఆ.వె. చైత్ర పూర్ణిమయును శ్రావణామావాస్య
కార్తికాది పక్షకలితసప్త
మియును బద్ధ కల్పమితి శ్వేతవారాహ
ధాతృకల్పములనఁ దనరు వరుస.

కం. క్షితిఁ గార్తికసితనవమియు
ధృతి వైశాఖసిత తృతీయయు మాఘా
గతదర్శము భాద్రను సం
గతశుద్ధ ద్వాదశియు యుగంబుల కాదుల్.

వ. చైత్రశుద్ధపాడ్యమి సంవత్సరాది యుత్సవకాలంబు తత్తృతీయ సౌభాగ్యదశ నవమిగౌరీవ్రతంబు సప్తమి సంతానసప్తమి యాత్రయోదశి మదనత్రయోదశి వైశాఖంబునఁ బూర్ణిమ మహావైశాఖి జేష్ఠ శుద్ధతృతీయ కదళీగౌరీవ్రతంబు నాషష్ఠియారణ్యగౌరీవ్రతంబు తద్దశమి పాపహరదశమి ఆషాఢశుద్ధతృతీయ యమృత లక్ష్మీవ్రతము, ఆ పంచమి స్కంధపంచమి శమీగౌరీవ్రతంబును షష్ఠి కుమారషష్ఠి ఏకాదశి ప్రథమగోపద్మవ్రతంబు శ్రావణశుద్ధచతుర్థి నాగచతుర్థి తత్పూర్ణిమాపురో భృగు వాసరంబు వరలక్ష్మీ వ్రతంబు తత్పౌర్ణమి నుపాకర్మంబు తద్బహుళతృతీయ షోడశ గౌరీ వ్రతంబు భాద్రపదశుద్ధచతుర్థి వినాయకచతుర్థి యాపంచమి ఋషిపంచమి యాసప్తమియు ముక్తాభరణసప్తమి అష్టమి జ్యేష్ఠాష్టమి దూర్వాష్టమి లక్ష్మీవ్రతంబు ఏకాదశి పద్మైకాదశి యాచతుర్దశి యనంతచతుర్దశి తత్పూర్ణిమ మాహేశ్వర వ్రతంబు తద్బహుళ పక్షంబు మహాలయపక్షంబుఁదృతీయ బృహతీ గౌరీ వ్రతంబు ఆశ్వయుజ శుద్ధ దశమి విజయదశమి తన్మాసంబున రవిహస్తప్రవేశంబగు నాఁడు హస్తిగౌరీ వ్రతంబు శుక్లపక్షాష్టమి నేమాసంబున నైన బుధవాసరమగు నేని నది బుధాష్టమీ వ్రతంబు ఆశ్వయుజ శుద్ధద్వాదశి గోద్వాదశీవ్రతంబు తత్పూర్ణిమాపురోభానువాసరంబుపాదాన ఫలవ్రతంబు తద్బహుళద్వితీయ చంద్రోదయగౌరీవ్రతంబు చతుర్దశి యమావాస్యలు కేదార గౌరీ వ్రతంబులు కార్తిక శుద్ధ తృతీయ త్రిలోచన గౌరీవ్రతం బాచతుర్థి నాగచతుర్థివ్రతం బాయష్టమి గోష్ఠాష్టమి యాద్వాదశి యుత్థానద్వాదశియుఁ బూర్ణిమ కార్తిక గౌరీ వ్రతంబు మార్గశిర శుద్ధ ద్వితీయ తింత్రిణీ గౌరీ వ్రతంబు ఆతృతీయరంభాతృతీయ యాచతుర్థి వరచతుర్థీ వ్రతం బాపంచమి బదరీగౌరీ వ్రతం బామరునాఁడు సుబ్రహ్మణ్యప్రీతి కరంబగు చాంపేయ షష్ఠి పుష్య బహుళ చతుర్థి దూర్వాగౌరీ వ్రతంబు ఆదశమి త్రైలోక్య గౌరీవ్రతంబు ... ... ... ...
సావిత్రి గౌరీవ్రతంబు మాఘశుద్ధ ద్వితీయ కైలాసగౌరీవ్రతంబు ఆతృతీయ కుందగౌరీ వ్రతంబు ఆసప్తమి రథసప్తమి సూర్యచంద్రవ్రతంబు నయ్యష్టమి భీష్మాష్టమి యాయేకాదశి తిలపద్మవ్రతంబా బహుళ చతుర్దశి శివరాత్రియగు తత్ప్రభావం బెటిఁగించెద.

సీ. శివరాత్రి నుపవాసశీలుఁడై శివపూజ
జాగరణంబును సలుపు పుణ్యుఁ
డవిరళవిభవుఁడై శివరూపము వహించు
వనిఁబోక బోయ యాదివసమునందు

వనమృగ హింసకై చని దొరకమిఁ గుంట
వందురిరా నొక్క వ్యాఘ్రమొయిది
గమకించి తూఁటినఁ గడుభీతితో బిల్వ
తరువెక్కి పులి క్రింద నిరవుకొనుచు

ఆ.వె. నిద్రలేక రాత్రి నెగులునఁ దశాఖ
లందునందు విరుగ నాకు రాలి
శిలలమీఁదఁ బడిన శివపూజ ఫలమబ్బి
యంత్యమునను ముక్తి కరిగె నతఁడు.

ఉ. చోఁడొకండు శంకరుని సూరెలఁ దొంచి విభూషణోత్కరం
బారయ దీపమెత్తికని యన్నియు ముచ్చిలి పారిపోవఁగా
నారకు లేయ వాఁడు మృతుఁడై శివరాత్రి గిరీశసేవ చే
కూరిన యట్టి పుణ్యమున గొబ్బున శంకరుఁ జేర ధీరతన్.

కం. స్త్రీలైనఁ బురుషులైనన్
మేలిమి నుపచారసరణి మిహికాకరస
న్మాలిన్ బూజించిన శుభ
శీలుర సౌఖ్యములు నెందు శివదివసమునన్.

వ. మఱియుఁ జైత్రశుద్ధ తృతీయయు జ్యేష్ఠపూర్ణిమయు నాషాఢసితనవమియు జ్యేష్ఠ బహుళాష్టమియు ఫాల్గుణ పూర్ణిమయుఁ గ్రమంబున నుత్తమ శాచ్య, చాక్షుష, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి యింద్రసావర్ణి రైవత బ్రహ్మసావర్ణులనియెడు మన్వాదులు. మఱియు ననేకంబులగు పుణ్య కాలంబుల విమర్శించి తత్తద్విహిత కర్మంబులాచరింపవలయు.

సీ. సత్యంబుచే హరిశ్చంద్రాదిభూపతుల్
కీర్తులు గాంచిరి వార్తకెక్కి
కల్మిచెన్నొందు స్వర్గము గల్గు సంతాన
మభివృద్ధియగు దండ్రి యుంట తోడఁ
బుట్టువుల్ సఖులును జుట్టముల్ గురువులు
దైవంబునదియ సత్యమున కంటె
వ్రతములులేవు దేవత లెల్ల మెత్తురు
శుభములు జెలువొందు సుమతియైనడి

ఆ.వె. ద్విజుఁడు మున్ను శంఖలిఖితటోవరి
వనమహాశ్రమైకవాసుఁడగుచు
శిష్యులంత నింతఁ జేరిరాఁ గందరూ
లార్థ ముద్దలి కరిగి యచట నచట,

క. పూర్వులు గోయుచు నొక్కెడఁ
బోవఁగ నవ్విప్రుమీఁద బులి దుమికి మహీ
దేవుని కుడిచెయి పట్టిన
నా విప్రుఁడు కంప మొంది యంతటఁ దెలివిన్.

ఉ. కమలజ సన్నిభుఁ డతఁడు గౌరవతన్ బులిఁ జూచి పల్కె నో
సుమహితసత్త్వ! యుత్తముఁడు శుష్కము మాంసవిహీన మిందు నా
హమిణేక యేల నన్విడుము పంచన నాఁకలి బెట్టుగాఁగ ది
గ్భ్రమ రేయునగింపుచున్న యది పట్టితి నిన్విడ నేర నింకిటన్.

చ. అనవుడు నగ్నిహోత్రముల నాత్మ వసింపఁగఁ జేసి యింటికిన్
దనయుల కెల్ల శిష్యులకుఁ దాలిమి బుద్ధులు చెప్పి వత్తునో
యనఘ! మదీయ వాక్యగతులంతయు నమ్ముము నెమ్మి మీఱ నా
విని మునితోడ వ్యాఘ్రము మతివిస్తృత ధర్మతరోక్తి నిట్లనున్.

క. వత్తువొ రావో! యిది యొక
వత్తారిమొ నమ్మఁ జాల ధరణీసుర! నా
వత్తఱి పులికిన్ సుమతి మ
హాత్తర నిజసత్య మెఱుఁగ నపుడిట్లనియెన్.

ఆ.వె. ఇప్పుడేను బాపమేమియుఁ జేయ నుఱ
బాముపలననైన పాపమే మొ
యస్థిరంపు జన్మ మాసించి బొంకిన
బోరిది నిహపరముల సుఖము గలదె.

క. పాపంబని చింతింపక
యోపిక కృశతనులఁ దాపసోత్తములన్ స
ద్వ్యాపారుల నాసించిన
నీవట్లన్ బొంకులాడ నేర్తునె! యనుడున్.

ఆ.వె. పాపమైననేమి పరికింప నాత్మశ
రీరరక్షణంబు రీతి వలయు
ననెడి ధర్మశాస్త్ర మరయవో వినవొకో.
యనుడు సుమతి యిట్టులని యా పులికి.

సీ. యింటికిఁ జని వేగమే వత్తు రాకున్నఁ
బంచపాతకుఁడను భ్రాతృహంత
విశ్వాసఘాతకి వెతఁడి మిత్రఘ్నుఁ
డిలఁ గృతఘ్నుఁడు బంధుకుల విహారి

గురువంచకుఁడు పడు నిరయముల్ గనువాఁడ
ననియును భర్తృవంచనియుఁ బతికి
మాటాడు నదియును బోరాడి సతులతోఁ
గలహించునదియును గాంతు జెడయ

ఆ.వె. విధవయయ్యును తల వెండ్రుకల్ గలయది
తొడరి రేపు మాపు గుడుచునదియు
వ్యభిచరించునది యనుభవించు దుర్గతు
లొందు వాఁడ ననియు నుర్వీసురుఁడు.

ఉ. దానికి సమ్మతించి పురి ధాత్రిసురుం బనుపంగ నాతఁడున్
బూనికనేగి పుత్రులకు బుద్ధులు దెల్పఁగ నింతి భర్త్రై.
యానలినాక్షు వేడుకొన నప్పుడు వాసవుఁడున్ దిగీశులున్
మానివరేణ్యు నెంచుచు సమస్తసురల్ పతియింప వచ్చుచున్.

కం. సుమతి పురిఁ జేరనరుగఁగ
నమరగురుఁడు హరిహయుండు నప్పుడు పురికిన్
సురలోక మొసఁగి చనుడున్
ధరణీసురుఁడుండె నైజధర్మ స్థితులన్.

ఆ.వె. అస్థిరంపు తనువు శాసించి బొంకక
సత్యనిరతి దొరయు సజ్జనుండు
సత్యభవుని లోకమందె నా సుమతియు
ధర్మి సత్యరతులు ధన్యు లెందు.

కం. శరణాగతులం బ్రోచుట
పరమంబగు ధర్మమట్టి పారీణగుణ
స్థిరుఁడగు శిబిభూరమణుని
చరితము వినుఁడఖిలకలుష ఫల వోర్క్యులనన్.

సీ. ఆ ధరణీపతి యాగంబు సేయుచు
నడిగెడి వారికిష్టార్థ మొసఁగ
నమరేంద్రుఁడగ్నియు నతని గుణం బార
యఁగ డేగ గువ్వయై నగుచు నచటఁ
దఱుముచు పడి గువ్వ ధరణీశు శరణన్న
వెరవకుమనుచుఁ బృథ్వీ విభుండు
కాఁపాడఁబడి డేగ నే తప్పు చేసితి నా
కాగంబు దీని నీయఁగఁ దగు నకఁ

ఆ.వె. దనుజులైన నీకుఁ దఱిగిత్తు గాక నా
శరణు జొచ్చినట్టి జంతువులవిడ
పాపమగుటఁ జేసి పట్టియ ననుడు దా
నంతతూష్ణి మాంసమడిగె డేగ.

చం. అతఁడటుమూర్చి మేను దఱిగి యాసట గుజ్జుకు తూచి పెట్టగా
నతిశయమయ్యె గుజ్జు, తల యత్తఱి నుంచగ నెంచు ధారుణీ
పతి శిబిమెచ్చి యింద్రుఁడును పావకుఁడున్ దమరీతిఁ దెల్పియుం
చిత తనువిచ్చుచున్ దివికిఁ జేరి ధారుణినాథు డంతటన్.

కం. ఇహభోగాన్వితుఁడై ధర
నొకలు వర్షములుండి నలువ పజ్జకుఁ జనెనాన్
బహుమానాస్పదచరితా
వహ మాశ్రిత రక్షణంబు వరధర్మమిలన్.

కం. వచ్చుచుఁ దెచ్చినయదియున్
జచ్చుచుఁ గొనిపోవునదియు సరవిం గలదే!
యచ్చపుపుణ్యము పాపము
నిచ్చలు నీడవలె వెనట నిల్చిన తేనిన్.

కం. కీర్తిరా ఘనసుకృతం బవు
కీర్తిరాదుష్కృతము మేలుఁ గీఁడొనవించున్
వార్త గనికొంటి నడుమన్
గీర్తివహించును సత్సుకృతము లభించున్.

కం. దయయున్ సత్యము శౌచము
రయమునసంపదలు మాతృరమణనఁ గూర్చున్
నయమగు కీర్తులు స్వర్గా
వ్యయదాతికలోకభోగ మనువుగ నొసఁగున్.

ఉ. భూతదయా పరత్వమున బొందుట సూనృతమత్కి తద్దయా
నీతపు సత్యమయ్యనృతనీతియ యట్లనుటన్ సమస్తవి
ఖ్యాతశుభప్రదం బౌరులకై తగ బొంకుట యందు మేటి ప్రా
ణాతురదార సంగ్రహ విధాకృత బొందు మహాఫలంబగున్.

కం. అతివలతోడ నభిమాన
చ్యుతముల నాతురుల కొఱకు సూరిద్విజగో
ప్రతతిన్ బ్రోవఁగ బొంకుట

కం. క్షణభంగురమై బుద్బుద
గణనం బగు దేహమునకుఁ గాఁ బోకక ర
క్షణ మొనరింపవలె నొరుల
గణుతింప నసత్యనీచ కర్మములెనకా.

సీ. దేవతల కడుగ దధీచి వెన్నెముకిచ్చి
శాశ్వత కీర్తి ప్రసంగి గాఁడె
డేగ కోరిన మేను డీవిఁ గోయుచు నిచ్చి
శిబి చిరకీర్తి సుస్థిరుఁడు గాఁడె
పద్మనేత్రుఁడు వేఁడ బంచజనుండు గా
త్రంబిచ్చి కీర్తి తత్పరుఁడు గాఁడె
యింద్రుఁ డాసింప మే నెలమితో నొలిచిచ్చి
కర్ణుండు కీర్తి సంగతుఁడు గాఁడె

తే.గీ. యధ్రువమును ననిత్యంబు నల్పమైన
గాత్రముల మీఁది మమత పోకార్చి దివ్య
మతి ధ్రువంబగు కీర్తిదేహముఁ గాంచి
రొరుల కర్థము లిచ్చుటయును ఘనంబె.

కం. ఇంద్రద్యుమ్నుని కీర్తులు
సాంద్రస్థితి కమఠవిభుఁడు చర్చింపఁగ న
య్యింద్రుని పదవికిఁ గ్రమ్మఱ
నింద్రద్యుమ్నుండు చనుటెల్లను విన రే.

తే.గీ. కడు క్రియాజ్ఞాన పరమయోగముల వలన
హరి భజించిన నిరతనిత్యార్థవర్గ
మొనరు గావున భాగవతోపచార
గతులు భక్తికి నెంతయుఁ గారణములు.

సీ. నిర్మత్సరాన్వితుల్ నిర్జితేంద్రియరతుల్
పరహితనిరతులు భాగవతులు
సర్వభూతదయా విశారద మానసుల్
పావన చరితులు భాగవతులు
మదలోభకామ నిర్మథనస్వభావులు
భవ్యతేజోయుతుల్ భాగవతులు
విషయ విహీనత విష్ణుపాద సరోజ
భక్తి సంగతులు శ్రీ భాగవతులు

తే.గీ. భాను రామామ్నాయ సహితులు భాగవతులు
శుభశుభాస్పద వేదగుల్ భాగవతులు
పరమ కీర్తనరాశ్యతుల్ భాగవతులు
భాగధేయప్రశోభితుల్ భాగవతులు

ఉ. కోరికకోరఁ బోక తమకున్ లభియించిన వస్తు సంతతుల్
శ్రీరమణీధనార్పణము సేయుచుఁ దద్వరదాస్యయుక్తిఁ ద
త్కారని వేదితాన్నములు దారగతిన్ భుజియించు వారలున్
గౌరవతత్కథాశ్రవణకౌతుకచిత్తులు వైష్ణవాగ్రణుల్

కం. పరనిందాసూయాదులు
పరధారధనానురక్తి పర భాషణముల్
పరికింపరె పుడల పరా
త్పర భజనారూఢమతులు భాగవతులిలన్.

ఉ. ధర్మముకంటె లాభమును ధర్మముకంటె శుభంబు నిత్యస
ద్ధర్మముకంటె సద్గతియు ధర్మముకంటెఁ దనూజ బాంధవుల్
ధర్మముకంటెఁ దల్లియును దండ్రియు నెక్కుడు గాఁడటంచు దా
నర్మిలి ధర్మమే హరియటంచుఁ బ్రవర్తిలువారు వైష్ణవుల్

చం. సకలశుభంబులిచ్చు గల జాడ్యములెల్ల హరించు వేదవిత్
ప్రకరనుతుల్ లభింపఁగనుపాయ, మపాయము బాపుచున్ జయ
ప్రకటిత కీర్తిలిచ్చునని పట్టుగ ధర్మువె విష్ణువంచుఁ దా
రకుటిల వృత్తినుండు విబుధాగ్రణులారయ వైష్ణవోత్తముల్

కం. పరలోకమునకుఁ జుట్టము
పరభయనిర్హరణమమితపాపహరము జ్ఞా
నరుచిరతమమని ధర్మం
బరయఁగ నేమంబని నరుఁడు భాగవతుఁడిలన్.

ఆ.వె. పరమపదము నదియె బాంధవుండు సహాయుఁ
డఖిలసౌఖ్య హేతువగుట నాత్మ
వర్ణ ధర్మగరిమ నిర్ణయం బెడలని
పరమతత్త్వవిదుఁడు భాగవతుఁడు

చం. జగములనన్నిఁటిం గలుగు జంతువులన్ ధరణీరుహాగ భూ
గగన చరాచర ప్రతతిఁ గంజదళేక్షణుఁడుండి తత్త్రియా
భిగణనచే వెలుంగునని పేర్మి నెఱుంగుచు శక్తియుక్తి ని
త్తుగ నతిథిన్ భజించు శుభమూర్తులు భాగవతుల్ దలంపగన్

చం. అతిథియువిష్ణుఁ డంచుమది నారసి పాద్యముసంగి శాస్త్రియు
క్తత ముఖఁ దీర్చి సద్వినయ గౌరవ [వృత్తిఁ] బ్రియానురాగసం
గతనుత భక్తితో మతి జగత్పతిఁ గన్గొని నట్టులుండు భా
సితగుణశాలి భాగవతశేఖరుఁ డెన్న ధరాతలంబునన్

కం. కన సర్వభూతహితమతిఁ
దనరుచు నిర్దోషుఁడై స్వతంత్రతయు దనపై
నునుపక శ్రీహరిపద స
ద్వనరుహపరతంత్రుఁడగుచు వైష్ణవుఁడుధరన్

సీ. నడచుటెల్లను శ్రీనాథ ప్రదక్షిణ
మనుపఁ బల్కుటెల్ల హరికథనము
నాసఁ గ్రోలుటలు పన్నగ వ్యగంధాఘ్రాణ
మాలింపుటలు తత్కథానుసరణి
మూమకులచ్యుత సురుచిరాకారంబు
లంటుట చక్రియంగాంగకములు
సేయుకర్మము హరి సేవానుచారంబు
తలఁపు కృష్ణ ధ్యానవిలసితంబు

తే.గీ. లనుభవించుట తత్ప్రసాదాతిరుచులు
గాఁగ సకలము శ్రీవిష్ణుగాఁ దలంచు
ప్రబల సంతోషయుతులు శ్రీభాగవతులు

. . . . . . .

కం. శాంతియు శమదమరుచులున్
దాంతియు సత్యంబు భూతదయయును సుకృతం
బెంతయు వశ్యములుగ స
ద్భ్రాంతస్థుని హరిఁ దలంచు నతఁడనఘుఁడిలన్

చం. హరిగృహ మార్జనంబు కుసుమార్చనముల్ తగుఛత్ర [చామర]
స్ఫురదుపచారసత్కృతము పుణ్యఫలప్రద మిట్టి భక్తి శ్రీ
పరు నుపచార వృత్తుల నవారిత భక్తి భజించునట్టి సు
స్థిరగుణశాలి భాగవతశేఖరుఁ డెన్నఁగ సన్నుతోన్నతిన్

కం. పూవులతో [తె]లు సేయ
శ్రీవిభునర్చనకుఁ దులసి చెల్వగు సుమముల్
పావనత ననుదినంబిడు
నా విమలుం డెంచు సంతతానందుఁ డగున్.

కం. వ్రతదాన ధర్మ కర్మ
స్థితచర్యల హరికిఁ బ్రీతిసేయుచు భగవ
ద్వ్యతిరిక్త కర్మ వర్జిత
మతియగు భాగవతుఁ డతఁడమానుషశీలా,

కం. మతినిలుకడ చాలనిచోఁ
బ్రతిమారాధన మొనర్చి భక్తి సలుపుచున్
ధృతిఁ దద్ధారణ గరిమన్
ఇతరుఁడతఁడు భాగవతుఁడు సజ్జనవినుతా

తే.గీ. మఱియు నమితక్రియారూఢ మహితరీతి
భక్తియుతఁ గుదురొప్పఁగాఁ బ్రబలు ఘనులు
భాగవత శేఖరులు తద్విభవ వితతికి
సములు గారెన్న బ్రహ్మాదు లమితమహిమ

కం. కర్మములెల్లను శ్రీహరి
కర్పితలోనిచ్చ [నట్టియతఁ] డతి భగవ
ద్ధర్మ పరుండై క్రమగతి
నిర్మల సాలోక్యగరిమ నొరయన్వెలయున్.

సీ. అనవిని శౌనకాద్యఖిల సన్మునులు సూ
తునిఁ జూచి యేయేమి దుష్కృతముల
పాల్పడి జీవులు పడుదు రధోగతి
యందెట్టు లనుభవమగుట యనుడు
నతఁడిట్టులను నిరయముల భేదంబులు
కల్మష జనములక్కడ వసించు
టెల్ల సానందగణేశుఁడన్ముని భద్ర
దత్తుకు నల పూర్ణ విత్తునకును

ఆ.వె. తొడమినట్టి ఘనుఁడు పొడగని సుగతికి
నిరయగృహములఁ బనిచె నెమ్మి దనరఁ
దేఁటగాఁగనట్టి తెలుగు దేశోధను
లార వినుఁడటంచు నాతఁడనియె.

కం. భూమికిఁ జక్కటి క్రిందునఁ
దామస పాతక నివాస ధామములగుచున్
భీమారవయమభటు సా
నామిత బాధలకునెల్ల నాకరమగుచున్

సీ. గౌరవంబును మహారౌరవంబును జ్వల
జ్జ్వాలికా తాల విశసనములును
తప్తకుంభీ విపాత లవణ రుధిరోద
వైతరణ్యసి పత్రవనముఖములు
క్రిమిభోజ సందంశ కృష్ణ సూత్రంబులు
తృష్ణ లాలాభక్షణోష్ణ శిఖలు
పూయదాహానిలాంబు నిమగ్నములు వధ
శీర్షము దమము విచియ శ్వభక్తి

ఆ.వె. కుణపభక్షణంబు ఘోరతామిస్రంబు
కాలసూత్ర సూచికా ముఖములు
పలలభక్షరు క్షారపతనముల్ క్షారాంబు
సేచనంబు తైలపాచనమును

ఆ.వె. కాకగృధ్రఘూక కంకఘాతంబులు
తప్తలోహకము వితప్తసైక
తము పురీషగర్త తాడన లితుమయం
త్రాది నిరయ కోటులచటఁ గలవు

వ. అవి పాతకరోచితానుభవంబులు యాతనానివాసంబులునై యుండు.

ఉ. అచ్చటి త్రోవ రాలిసుము నన్నియుఁ గంటక మాతపంబు న
* త్యుచ్చయ వేదనాన్వితము సంబువిహీనము గాకగృధ్రదం
ష్ట్రోచ్చలితాతిభీకర మృగోజ్జ్వల ము [య్యము ?] కింకరాత్యసా
హ్యోచ్చలితోక్తులున్ గరహలోద్ధృత మర్దన లందు పాపులున్

కం. బహుభేదయాతనాస్థితి
బహుబాధలు పెక్కు నిరయ పంక్తుల బీసల్ ?
బహుగతులఁ జేయుచుందురు
బహుఘోరాకృతులు శమన భటులుద్ధతులై

కం. వేదోదిత కర్మపు మ
ర్యాదలు దిగవిడిచి యస్వయంగు దుష్క్రియలన్
కాదగు పాతక జనతతు
లాదటమందుదురు యమభటావళులేచన్.

---

* యతిభంగము.

సీ. విగత మర్యాదులు విషయసక్తులు క్షుద్ర
నికరనాస్తికులు దాంభికకృతఘ్న
విప్రధనాపహ విప్రనిందారతుల్
పుడమిదేవతలతో బొంకుఖలులు
పరుష భాషణులు దబ్బఱలాడు వారలు
పితను లఘూనుఁ జెక్కులగచు
నీచులు దేవితల్ సూచితేతరధను
లెపుడు నసూయచే నెసఁగు వారు

అ.వె. ప [రధనైకగ ?] తుఁ బ్రాణిహింసాపరుల్
దేవ నిగమ నింద [నా పహితులు]
నవి యథార్థమనినయట్టి కుత్సితమతుల్
సార నిరయగతులఁ జేరు ఖలులు

శా. కర్మభ్రంశకు లార్య విద్విషులు భోగప్రాభవుల్ పుష్కలా
క్రూరాత్మాలోలురు యోగులన్ యతుల నగ్ర్య బ్రహ్మచర్యవ్రతా ?
వర్మవ్యక్తుల నింద నేయు ఖలులున్ వాగ్దోషకుల్ విష్ణుస
ద్ధర్మాద్యర్చన హీనులుండుదురు బాధల్ సెంద నాతావునన్

తే.గీ. సర్వభూత విశ్వాస విచార రహిత
నిర్దయాన్విత వర్తనుల్ నీతివిగతు
లతిథి విడిచి భుజించిన యధమ గుణులఁ
దాఁ విఘ్నకరుల్ నిరయానురతులఁ

కం. అన్నంబడిగిన విప్రుని
నెన్ని పరీక్షించువాఁడు హితధరణీసురున్
సన్నుత తటాకముల వి
చ్ఛిన్నము గావించు నతఁడు నెందు[నిరయమున్]

సీ. విష కేశ రసములు విక్రయించునతండు
ప్రజల నెందవమానపఱచు నతఁడు
యజ్ఞ విక్రయుఁడు దత్తాపహారియు మాతృ
పితృ విరోధియు నగు ప్రీతి రహితుఁ
డన్యయోని నయోని నల పశుయోనుల
శుక్లంబు విడుచు నిస్తుల మహోఘు
పర్వంబులను నీళ్లఁ బగట నింతులఁ బొందు
నతఁడు రజస్వల నంటునతఁడు

తే.గీ. తోఁపులన్ బావి జలములఁ ద్రోవదేవ
నిలయ గోష్ఠంబులను జేరి జలము మలము
విడుచు వాఁడును భామిని విడయు ధనము
జీవనము జేసికొనువాఁడు జేరువటలు

కం. సభిరక్షింపనివాఁడున్
సభులన్ హింసించునట్టి జనుఁడలిదీనుల్
వికలాంగ వృద్ధ రోగుల
నకుటిలతను బ్రోవ నగఁడు నందు వసించున్

కం. శస్త్రములు నేయువాఁడున్
శస్త్రము లమ్మెడు నతండు శ్వసన హితార్చిన్
శాస్త్రప్రతి పాద్యార్థా
విశ్రుతచర్యుండు తారలు వెసఁ నిరయములన్

ఆ.వె. మద్యపానగీత వాద్య మాంసప్రాత
నిత్యరతులు యువతిసిన్ మహీశు
రాగ్ని పెబ్రాతకన్య తావలి నాళుల
వరయలేని ఖలులు నిరయ గతులు

కం. ప్రత్యాశ స్తుత్రగ్ర వహా
ద్ధత్య కులాచార రహితులాత్మకళత్ర
స్థిత్యర్ధమిత్ర ధనహరు
లత్యార్జిత నిరయభాగులగుదురు తెలుపన్

కం. గురుదేవ బ్రహ్మాపహ
పరసంపద్వికల హృదయ పాషాణ తరు
స్థిరశంకు మాతమార్గా
వరోధులు నిరయనివహవాసులు కవఁకన్

మ. జపహోమాంచిత దేవతాయజన శాస్త్రార్ధానధర్మోపకా
సపరిత్యాగులు గ్రామయాచకులు నక్షత్రానుయాశ్యాంతులా
త్రిపవల్ విద్రవహించువారు శరణార్థిన్ దుర్బలున్ దుఃఖితున్
గృహతోఁ గావని వారు దుర్గతికి సంకేతస్థు లెల్లప్పుడున్

కం. పరిగృహరస ధాన్యధనా
వరవిచ్ఛేదకుఁడు వాదకరణుండు సమ
త్స్వరుఁడున్ లోభియు వసములు
నలకి నరఁకు గాఁచు ఘోరనరకంబునకున్

తే.గీ. స్వామికిన్ ద్రోహి మిత్రవంచకుఁడు శఠుఁడు
పరగ గర్వియు విశ్వాస పాతకుండు
[గరదు డున్] గొంతెకాఁడటుఁ గాణయాచి
యుత్తరింతురు నిరయాగ్ని హుత్తిరుపుడు

కం. మఱియుం గల పాతకముల
కరయిక నిరయములు పెక్కులగు నందందున్
బొరలుదురు పాపకర్ములు
దురితములకు బాధపడక తొలఁగునె! వరుసన్

ఉ. పాతక సంఘ మెన్నఁగ నపారముల్లట్టిది నేసి రోగుల
త్యాతత దుష్టవర్తనులు నల్పశరీరులు క్షీణజీవనుల్
గాతరులంగహీనులునుగా జనియింతు రవెల్ల నెన్నఁగా
ధాతయు నోపఁడేము విదితంబుగఁ గొన్నిఁటి నేర్పరింతెదన్

తే.గీ. బ్రహ్మహంతి క్షయవ్యాధి బాధనొందు
నల సురాపాని దంతరోగాన్వితుఁడగు
స్వర్ణహరణుఁడు నఖరోగ సంగతుఁడగు
నవని గురుతల్పగుఁడు కుష్ఠ మనుభవించు

కం. గురుతల్పగు గానెఱుఁగుడు
గురువకురగ ? గ్రుడ్డిఁ బిచ్చుకుంటును ధరణిన్
గురునిందించిన వానిగ
నెఱుగుడు మూఁగయగువాని నెంతయు బుద్ధిన్

కం. వినినదొరి [గురుజనులను]
బాలను లైన నింద సేయు పాపాత్ములఁగా
నాలోకింపుడు — కా
రా లక్షిత మెలఁ గునట్టి యధముల నెందున్

తే.గీ. గురుఁ నపేక్షింపకాతని గుటి గడచిన
ఖలుఁడు దుర్గంధ కుష్ఠ భగందరముల
పాలబడి మిక్కిలిత్వ మేర్పడఁ జరింతు
గురుని నెదురాడి పంచదు ధరణి మెలఁగు॥

కం. గురువందనంబు సేయమి
శిరమున రోగములు గల్గి శిథిలతఁ బొరలున్
మరితన్ జండాలిన్ బతి
త రజస్వలఁ గలసి మాలతనమునఁ బొడమున్

సీ. అగ్నిదాహకుఁడు వస్త్రాదిసంగ్రహణుండు
కుష్ఠ రోగంబులఁ గుందుచుండు
పండిదొంగిలి జాడ్యవృత్తిఁ దామసుఁడగు
కూటసాక్షికిని గిల్క్రానవతండు
నైన ముఖరోగియౌ నిర్దయాత్మకుఁడును
నిష్ఠుర వాక్యుఁడై నొగులు వసుధ
గరదుండు పాండు రోగము నొందు శస్త్ర జీ
వికుఁడు నిర్ధనవృత్తి వేదనఁ బొగును

తే.గీ. పితరులన్ వృద్ధులను రోగ పీడితులను
తపసులన్ శరణాగతార్త జనతతుల
సతి సుతావళి విడిచిన జాడ్యగుణుఁడు
నేత్ర రోగంబులన్ బడి నిరయ మొందు.

ఉ. భూమిసురాగ్రగణ్యునకుఁ బూనిక నిచ్చెద నంచునీనియా
తాముసుఁడల్పజీవియగు దద్దయువారల వృత్తు లెత్తినన్
బాముగ నేర్లు గుంటలును బాదపముల్ సుమ భూసురాలయ
శ్రీమహిమల్ వినాశముగఁ జేసినవాఁడనపత్యుఁడౌ వగన్.

చం. శిశుపశుగర్భహన్యములు జేసిన మూర్ఖుఁడు సంతతిన్ లస
ద్విశదతఁ గాంచియుం బొలియఁ దీనతనొంది చరించిముప్పునన్
కృశతనుఁడున్ దరిద్రుఁడును గీర్తివిహీనుఁడు నాధరాస్థలిన్
ఖగమిథునక్రియన్ గెడయఁ జాపినవాఁడ నపత్యుఁడౌ వగన్.

ఆ.వె. బాలధనము గల్గి సత్తసంతానముల్
ధరణి నొగయఁ జేయుదాల్మి లేని
పామరుండు హేయభర్తుఁడును గొడ్డుబో
తనగఁ బుత్రహీనుఁడై చెలంగు.

తే.గీ. నైష్ఠిక వ్రతసంత్యాగి వలతుల నిలఁ
బడి సదారోగియగు పెక్కు బడతుఁ బొంది
వరుస బుత్రవేశఁ గలయకుండఁ జెలంగి
రొంత తె గవయంగ షండత్వమొందనుండు.

చం. తగుమధురాది భక్ష్యములు తాభువనుండెడివారి కీక తా
నె గెడసి తిన్నయట్టి యవినీతుఁడు గుల్మరుజార్తినొందు వా
ష్పగు సుమగంధ వస్తువులు నచ్చట నెవ్వరికిని వాఁడు నె
న్నఁగనిడు గంధమూషికమునన్ జనియించు [ధరిత్రి] వంచనన్.

కం. ఏలిక పనివంచినచో
నాలస్యతఁ దనదుపనికి నధిపతి కార్యం
బోలి చెడఁజేయు మనుజుఁడు
నా లీల నపుంసకుండు నధముండు నగున్.

సీ. కైతవ వ్యవహారి కడు ఖలోద్ధురుఁడగు
నగ్నిచోరకుఁడు మందాగ్నికుఁడగు
దుర్బల జంతులఁ దొడరి బాధించు వీ
క్షించు నతండంగ కుంచితుఁడగు
తగవునఁ బద్ధపాతకు పల్కునాతఁడు
మిగుల జిహ్వారోగి యగుచు నగచు
నమరుస్వదత్తాపహారి స్థానభ్రష్టుఁ
డగు కుత్సితోదన మవనిసురుల

తే.గీ. కిడుచుఁ దామున్నగా భుజియించు నాతఁ
డగును గళరోగి గంధమాల్యాది యుక్తి
పంచయజ్ఞ పరిత్యాగి యందియగుచు
శ్వానయోనిభవుండునై జాడ్యుఁడగును.

కం. వినుఁడు మధురాది భోజ్యము
లనుపుగ నిజభార్యకిడక యతినిర్దయుఁడై
తినువాఁడుగళారోగితఁ
దనరున్ బోకాలి బల్లితనము వహించున్.

తే.గీ. పరుల ధనములు సూచించు పాతకుండు
యాచకుఁడు హీనవృత్తియు నగుచు మెలఁగు
క్రోధి చండాలుఁడగు లోభి కూళ పూతి
గంధయుత నాసికుఁడునగు ఘనత దొరఁగి.

కం. శ్రోతలు తప్పఁగఁ జెప్పిన
యాపీతిఁడి నేత్రరోగియగు పుస్తకముల్
దాఁచెస దొంగిల మూఁగగు
నావిధమునఁ గంచుదొంగ యంబూపరుఁడౌ.

కం. ఘనుఁ జొత్తి విరూపకుఁడగు
వనరుక్ వాద్యంపు దొంగ వడికంతూరిన్
విను పుణ్యాత్మ్యకుణమున
కను వెడలఁగ వక్రనాసుఁడై జనియించున్.

సీ. రూఢి నాచార విరోధి వ్రతాన్యుఁడౌ
దాన విరోధి యదత్తుఁడునగు
దేవతాద్విజగురు ధేను ధనాపహా
రకుఁడతి స్థూలగాత్రమున వలయు
నైలమి ధర్మద్వేషి యశాంతుఁడగు నీర్ష్య
నతి వికృతాననుఁడగుచుఁ బరగు
నొగి లోహ విక్రయుఁడూర్ధ్వజానుండగు
దాసిఁ బొందిన వక్రతనువు దాల్చు

తే.గీ. దుర్భగాసక్తుఁ గృశుఁడగు దొడరు సఖుఁ
బొంద, లేవటీవాఁడునై చెందుఁ గీడు
మఱియుఁ గాఖంబులకుఁ దగుమ్మార్గ రోగ
ములు ప్రవేశించునవి లేమిఁ గలుగు శుభము.

తే.గీ. ప్రజ్వలింపని యగ్నిలోపల హవమిడ
వృద్ధ గురువుల నతిథుల విడిచి భుక్తిఁ
గొనఁగ గుల్మంబుచే నలఁకువలఁ బొందు
కృశతనుండగు దుర్బలతకశత నలఁగి.

కం. ధరణీ విభుఁడై యూపర
ధర విప్రుల కొసఁగు పశుత్రాంత్రికుఁడుంగన్
శరణాగతుఁ బ్రోవని వాఁ
డరయఁగ శార్దూలమగు భయంకరవృత్తిన్.

కం. హూరలు దొంగిలి ప్లవగా
కారుండగు సజ్జనులఁ గైతవవిద్యా
చారము నెసపుచ్చిన
క్రూరుండు సృగాలమగుచుఁ గుటిలత మెలఁగున్.

తే.గీ. వేదశాస్త్రమ్ము లెఱిఁగి తద్విధుల మెలఁగు
వరుస లెఱుఁగక దుర్వాద నిరతుఁడైన
యతఁడు సుగంధవస్తుభారానుకారి
యైన గార్దభమై పుట్టి యవనిఁ దిరుగు

ఆ. వె. అత్మసాధ్వియూని యన్యాంగనాసంగ
మానురతుఁడు లేమి నలమటపడు
నతిథి విడిచి [కుడిచి] నతఁడు కపాలసీ
లత నసహ్యవదనగతి నెలంగు.

ఆ. వె. [తనదు?] మిత్ర సుకృత జనులకుఁ బరువంపు
వగలఁ గీడు సేయువాఁడు నీచ
వర్ణునందు కొడ్డివాఁడునై యందఱు
రోయఁ జెందు [నట్టి] రోఁత బ్రతుకు.

సీ. సంధ్యల విరహితుఁడై సతిపొందు నాతఁడు
ధర్మనల్? గురుబంధుజనుల తోడఁ
గావించు నాతఁడు గడు భ్రంశబుద్ధియై
వంటలవాఁడయ్యు వసుధఁ దిరుగు
తనయందులేని పెద్దతనంబు ప్రకటించు
పాయంపు బాంధవహీనతఁ దగు
నచ్చినదెల్ల రోయక తినువాఁడు మ
హా వ్యాధియుతుఁడు హీనాంగుఁడగును

తే.గీ. పశువు వీఁపునఁ బవళించు పంద [తొంటి ?]
నొప్పివాఁడగు మృతవత్సను క్రియ లమరఁ
విదుక జాత్యంధుఁడగు నెందుఁ బేర్మి కెక్కు
గొల్లవారింట బంటగు గుణనుఁడగుచు.

తే. గీ. గ్రామ నక్షత్ర యాచకులోకము దేవ
లుండు శ్రుతి విక్రయుండు ధ్వజుండు సెన్న
గ్రామచండాల పంచకగణను, లంటఁ
గనిన భాషింపఁ బుణ్యముల్ గడకు దొలఁగు.

కం. తూలనిఁ బాతకిఁ బీనుఁగు
నొరిగా స్పృశియించెనేని నొనర సచేలో
ద్వేలస్నానము ననల
జ్వాలా స్పర్శనము ఘృతముచవిగొనుటుదగుగా.

తే. గీ. అటులనేయమి నిరయ విహారియగును
శూద్రుఁ డంటినఁ గ్రుంకెడి చొప్పుచొప్పు
సంకమలదారి [కఁటు?]నేయ శౌరజపము
భవ్యసత్కర్మ నిరతు లౌ బ్రాహ్మణులకు.

కం. పుని కుక్కుట పంజరమో
వనితా పవితాళి? బేడి వ్యథకారిని యా
రను దిరుగు బంధినంటుక
మునుఁగకయున్నతఁడు నరకమునఁ బడుఁ జెలువన్.

సీ. పరధనసుత సతీహరణులు గాఢాంధ
పతితులౌదురు యమభటులు పొడువ
నేలికకున్ గీఁడు దెలమిఁ జేసినఁబడు
మితిలేనియంధతామిస్రవితతి
సుతసతులన్వీడి ధృతిఁ దనపొట్టకై
వఁదరు నాతఁడు రౌరవమునఁ బొరలు
పశుపక్షితతికంబుఁ బానంబు దొలఁగించు
ముఱుచ కుంభీపాకమునను దప్తు

తే.గీ. శిలలపైఁ ద్రాఁగు దల్లిదండ్రులను నిగ్ర
హించినన్ గాలసూత్ర మందిరముఁ గొనును
పలుదెఱంగుల జీవుల బాధపఱచు
నరుఁడు శాల్మలి ముండ్లలోఁ దరలఁ జెపుడు.

కం. ధర్మగతిఁ దప్పు దుష్కృత
కర్ములు వైతరణిఁ గూలి ద్రాఁగుదురు గడున్
నిర్మల నిగమార్థగతా
కర్మగు లని శ్రుతవనులఁ గడఁబడుదురోగిన్.

తే.గీ. దండ్యునినదండ్యునిగ నదండ్యు దండ్యు
గాఁగ నొనరించుపతి యంత్రకమున నవయుఁ
బమరు నపకృతిలేని జీవములఁ దునుము
ఖలులు తామిస్రమహాదుర్గతుల నుంద్రు.

చం. దినమును బంచయజ్ఞములు దేవనమస్కృతి లేక భుక్తికిన్
జనియెడు వాఁడు పాకముల శాకములన్ దగపంక్తిభేదమున్
వెనఁచినవాఁడు కీటములు పేర్మితో నుండిన దుర్గతింబడున్
గొనకొని కొండెగాఁడు నటుఁ గూపక నంబడి దొర్లువేదనన్.

కం. ఇలఁ జెలులు పురుషులైనన్
వెలఁగి యగమ్యాగమంబుఁ జేసిన కాకన్
గల యుక్కు తదాకారము
లలవడఁ గాఁగింతురనుదినా లింగనముల్.

ఉ. వేదము శాంతి శౌచములు వీడియు వేదనియుక్తిశారలున్
ప్రోఁదిగ దుష్టవృత్తిఁ బొందిన వారలు పూయమూత్రదు
ర్వేదనలొంది త్రావుచును వేఁడిదు లౌదురు కైతవంబునన్
వాదముసేకంబులన్ మనుచు పాపారులన్ శితబాణసంగతిన్.

తే.గీ. దంభమున కథ్వరంబు నిష్ఠాక్రమంబు
తప్పఁగావింప వీచిలోఁ దవిలియుడలు (?)
కులసతిని యౌవనంబునఁ గలియనతఁడు
యమభటులు గొట్టి శుక్లకుండమునఁ బొరలు.

కం. గరదుండు ద్రోహదోషరి
గురువంచనరతుఁడు వైశ్యకులములను ధనా
పహరణుఁడు గృహదాహకుఁడున్
బరువడిగ వజ్రదంష్ట్రిఁబడుదురు వెలుచన్.

కం. ప్రతిపురుషైణేయములుభ
యతోముఖ [గవిని] భాగమనువగు శాలా
న్వితచక్రదానములుగొను
నతఁడవనిన్ బుంస్త్వమొందఁడతి జన్మములన్.

వ. మఱియు ననేకవిధ దురితంబుల కొలఁది నిరయంబులం బొరలుదురందు.—

సీ. కాకగృధ్రములు సూకర సారమేయ శా
ర్దూలముల్ గలఁచుచు నెత్తురులు దొరుగ
నెరచుట్టినుము నూనియయుక్కుగంబంబు
కాఁకలవేల్తురు గడుమొఱయిడ
నసిపత్రగహ్వరో గ్రావనిరుహముల
కడవైతురింతింత కండ లురుల
సీసమ్ముచౌడు మూత్రాసవములు పూయ
శుక్లముల్ బోతురచ్చోన బొనల

తే.గీ. నెత్తుటంగానఁగ సంధుల నిడి కమత్తు
రరి (ది ?) లోతగు బావుల నదిమివిడుతు
రిట్టి బాధలఁబడక రమేశు విష్ణుఁ
గొలిచి సుఖమొందఁదగు మానవులకు నెల్ల.

కం॥ వేదోపనిషత్స్మృతి సం
పాదితధర్మములు కర్మ పద్ధతులన్ మ
ర్యాదలు దెల్పితి నింకను
గోదితశాస్త్రార్థ వృత్తు లురుమతి వినుడీ!

కం. పూర్వోత్తర మీమాంసలు
సర్వోత్తములఁ దర్కదండ శాస్త్రంబులు సం
తర్విధ సాంఖ్యము యోగముఁ
వేర్వేరుగ శాస్త్రషట్క విశ్రుతి నమరున్.

వ. శిక్షావ్యాకరణ ఛందోనిరుక్త జ్యోతిష కల్పనామంబుల వేదపురుషునికి నాసనకర చరణశ్రోత్ర రసనాను రూపంబులగు వేదాంగక్రమం బెఱింగించెద నందు శిక్షా ప్రకరణంబ ధిలోక మధిజ్యోతిష మధివిద్యమునధిప్రజంబధ్యాత్మమునన నైదు దెఱంగుల నధికరణంబు లవి భూమ్యగ్ని గురుమాత్రాగ [ణం ?] బులఁ దెలియందగు నదియెట్లనిన.

సీ. ధర పూర్వ రూప మంబర ముత్తరము బయల్
సంధి సంధానంబు శ్వసనుఁడటకు
నగ్ని పూర్వాకృతి యాదిత్యుఁ డుత్తర
ముదకంబు సంధి వైద్యుత మవలిది
యాచార్యుఁ డొగి పూర్వమాశిష్యుఁ డుత్తర
మటవిద్య యేసంధి యవలవచము
తల్లి పూర్వాకృతి తండ్రియుత్తర ప్రజల్
సంధి ప్రజననంబు సరవినవల

ఆ.వె. క్రింది హనువు పూర్వమందు మీఁదటిదుత్త
రంబువాక్కు సంధిరహిని జిహ్వ
సరసరీతి నొప్పు సంధానమై యధి
లోక మాదిగాఁగ జోఁకవిట్లు.

వ. మఱియు వకారాది షోడశవర్ణమ్ములు నచ్చులు స్వరంబులును కకారాది వర్గపంచకంబు వ్యంజనంబులు హల్లులు స్పర్శలునగు వర్గాంతంబులగు ఙఞణనమలు అనునాసికలనందగు స్పర్శ లిరువదియు ననునాసికలుంగలయవి. యమలచిహ్నములంతోలుపగు య ర ల వ లు నంతస్థలు శ ష స హ లు నూష్మలనందగు ః కఃపయను రెండు క్రమంబున జిహ్వమూలీయా పధ్మానీయంబులన నొసంగునదియునుంగాక.

తే.గీ. ఈనరుదీర్ఘము రెండు మాత్రలను ప్లుతము
ధృతిం ద్రిమాత్రలు హ్రస్వార్థ గలియు వ్యంజ
నమగు సంకేత మీక్రియ నమరు లౌకి
కమునకును వైదికమున కై క్యతవహించి.

చం. స్వరములు వ్యంజనంబులను సంజ్ఞల నేర్పడి తానకంబులన్
బరగెడు వర్ణముల్ నిగమ పంక్తికి నేర్పడి యొండు గాఁగ నే
ర్పులఁగ సూక్ష్మయుక్తముగఁ బాటిలుచున్ యమునైదు నంగముల్
గరిమ ననుస్వరంబును హకారమునున్ స్వరభక్తి నాదమున్.

కం. సరవిని బదియనుగూడఁగ
నరువదియొకటగుచు సూక్ష్మలందొక రెండున్
దొరకొను కాలవిశేషత
బెరయఁగ నరువదియు మూఁడు పేర్కొందనకున్.

కం. స్వరములు వర్గాద్యక్షర
సరణియు ద్విజకులమువర్తు ఇత తక్కువి భా
వరు లంతస్థోత్కరము
త్వరు విట్కుల మాభ్యబిందులాగి శూద్రియముల్.

సీ. వెలయవర్ణ క్రమవృత్తి స్వరాత్పర
వ్యంజనమ్ము ద్విత్వమందకగును
నైఱఁడ కారపుఁ బొల్లు పరమా నకారల
కారంబులును నట్లు గ్గయుండు
నొనరఁగ స్వరములకును బరంబగు వ్యంజ
నములకు ద్విత్వంబులమరియుండు
బౌరివకాగము పూర్వమునసున్న వ్యంజనం
బులు పరంబులుగాఁగ గల లకార

తే.గీ. మదియుద్విత్వంబునందు నిట్లమరు లక్ష
ణములు పెక్కునిరూపించుఁ గ్రమముతోడ
శిక్ష వ్యాకరణానుగస్థితిఁ దనర్చు
నిగమ పదవర్ణ వాక్యముల్ నెగడనిట్లు.

తే.గీ. అట్టి వర్ణంబులుదయించునట్టి యెడలఁ
బలుకుబడి గోచరంబగు నెలమి మీఱ
నైనఁ గొన్నిటి వివరింతుఁ బూనికలర
వాని రీతులు తెలిసికోవలయు బుద్ధి.

కం. రదనోష్ఠజము వకారం
బదనఁ బవర్గుఖులను నచ్చులనఁదగుదీర్ఘా
స్పదములు కారంబును
విదళుల మొదలంజనించుఁ బేర్కొనఁ దనరన్.

౨. తాలుజిహ్వామధ్యమౌలి నికార సౌ
కారంబు బుట్టునోకార మొప్ప
సామీప్యమున హనుసంధి జిహ్వామూల
మునఁ గవర్గుబు తాలుమూల జిహ్వ
నడుమఁ జవర్గు దంతములఁ దవర్గుబు
జనియించు ... ... ...
తాలుజిహ్వామధ్య [తలి ?] యకారము దంత
మూలంబునను రేఫ యూలకార

తే.గీ. మును వకార విసర్జన మొనరు గంఠ
తాళమున ననుసాసికల్ నాసికాము
ఖముల సంధిని జనియించు నమరవర్ణ
జన్మవిధ మిట్టి తెలుఁగగు శాస్త్రి సరణి.

తే.గీ. ధృతి నుదాత్తాను దాత్త స్వరితములు ప్ర
చయములుగల్గఁగ స్వరముల సంజ్ఞ నచ్చు
అలవడియు నుచ్చమైన నుదాత్తమయ్యె
నిచయ మనుదాత్తమట్ల స్వరనియతిఁ దనరు.

కం. వరగ సమాహారంబది
స్వరితము స్వరితంబువలన సముప్రచయం
బరయఁగ వేదపదక్రమ
నిరతింబెలు పొందునిది యనిందిత వృత్తిన్.

వ. ఇది శిక్షా ప్రకరణంబింక వ్యాకరణ మార్గం బెఱింగించెద.

సీ. అయిదుణ్ణ నరులుక్కనంగ నే ఓఙ్ఞై
కొచ్చన హయవరడనఁగ లణ్ణు
ఞమఙణనము ఝభఞ్ ఘడధష్ణ జబగడ
దశుకపయ్ ఖఫచఠథ చటతవన
కపసరుహల్లన సరి నొప్పు వదునాల్గు
సూత్రము లా వ్యాకళ త్రుపూస్త
వనజసంభృతథక్క వలన నుద్భవమొంది
నలువదిరెయొక్కటై వెలసెమెఱసె
తలపొప్పనీ సూత్రముల నాదివర్ణంబు
అంత్య వర్ణములతో నలరిమధ్య

ఆ.వె. మధ్యములకు [గ్రహణ?] మలరుఁ బ్రత్యాహార
కలన వృద్ధి గుణముగల్గి సుప్తు
లిఙ్కృత్తులనెడి దీపిత శబ్దధా
త్వాదులఖిల సూరు లలర తెలియ.

తే. గీ. ధాతుసూత్ర గణంబులు దగనుణాదు
లాగమ ప్రత్యయములు లింగాను శాస
నములు నాదేశములును వాక్యములును గూడ
సరవిశోధుత నుపదేశసంజ్ఞఁ దనరు.

సీ. ధాతువుల్ ప్రకృతియా దానిపై ప్రాప్తసూ
త్రాదేశములు ప్రత్యయములనఁదగు
మిత్రునిగతిఁ గూడి మెలయు నాగమ [మది?]
లీరున నడచు నాదేశ మరయఁ
దగుసుబంతము దిఙంతము గూడఁ బదమగు
పరగఁ గృత్తద్ధితల్ ప్రత్యయమగు
సప్తవిభక్తు లెంచఁ గఁ గారకంబులు
ప్రపరాపముఖసర్గ లపరిమితప

తే.గీ. దంబు లౌకమైనచో సమాసంబనఁ దగు
నహి విభక్తులులేని వవ్యయము పదములు
దశల కారాత్మకంబులు ధాతుచయము
లరయ నిదియాది గాఁగ వ్యాకరణమయ్యె

కం. ఛందము లిరువదియాఱగుఁ
నందుల వృత్తములు పుట్టెనపరిమితములై
ముందాదిమ కవిబృందము
లందొక కొన్నింటి నొడివి రంచిత ఫణితిన్.

ఆ.వె. గద్య పద్య కావ్యగతుల యందాగద్య
పాదరహితమగుచుఁ బ్రబలునాల్గు
పాదములును వృత్త భేదంబులగు వృత్త
ములను జాతులనఁగ నవఘగతుల

ఉ॥ అనుభగ వృత్తముల్ లయసమన్వితముల్ లయనిల్చుచోట ని
య్యనయతి నాఁదర్చు యతులాజగతిన్ బదియమ్యో భేదముల్
దనరఁగనిర్వచిన్మదనఁ దద్దయుఁ జెన్నగు వార్ధికాదిహ్యు
రొనరు గణస్వరూపము రసోచిత జాతులెల్లఁగాఁ దగున్

కం. మొదల నడుమఁ దుది నన్నిఁటు
నొదవిన గురువులను భజసములు మగణమునా
నదన నటులైన లఘువులు
నొదవినయరతలును నగణ మొప్పగువరుసన్

కం. ఒత్తువెన్కనున్న సూఁది పల్కిన దీర్ఘ
యుక్తమైన గురువులున్న వెల్ల
లఘువులరయ నొక్కలఘు వేక మాత్రయౌ
గురువు రెండు మాత్ర లిరవుగాఁగ

కం. జాతులు మాత్రాబద్ధము
లాతత వృత్తములు గణసమాయత్తము లీ
రీతిగ మభజసయ తవలు
ఖ్యాతిగ ఫల నిర్ణయములు గల గణములిలన్

కం. మభయనతలు కృతిమొదలన్
శుభసుఖధనకనక విభవ సుస్థితుల నొసం
గు భువి రజసలవి రుగ్ జయ
దభయప్రద లాది నిడు నతనికిం బతికిన్

కం. నగసగతగయగరగలన్ఁ
దగుగురు వెచ్చినను నలము తలము లఘువుచే
గగలలములు గురులఘువులు
[సగురులఘులు] తుదిమొదళ్ల సగణ తగణముల్

సీ. యతనలు జగణంబు నట భగణంబును
మగణంబు రసలు క్రమమున భూమి
సురభూపక కిరాటు శూద్రాంత్య కులజముల్
పటుసిత రక్తముల్ పచ్చశ్యామ
నీల వర్ణంబులు నైతి వరుణేంద్రులం
బరమును రవి శశిధరణి పవన
వహ్ని దైవతములు వాసవాఖ్యను సల
భరతనగ నలంబు లిరవు కొనును

ఆ.వె. సమములిసుని గుణితు సహితకెక్కఁ గఁ బ్రయోగ
సరణి మీఁది వృత్త సముదయమున
మాత్రతతులచే సమస్థితిఁ దగుపాటి
యితరగణము లెల్ల నిందుఁ దొగును

ఆ.వె. సహజయతియు వర్గ స్వర మఖండము బిందు
సంయుత ప్లుతములు సరసయతియు
నటవికల్పమనఁగ నమరుఁ దొమ్మిది విధే
దాను సరణి నిరుప దాఖునయ్యొ

కం. యతి మొదటి యక్షరంబది
చతురత యతి పిమ్మఁద సుసుప సహజవిరతియౌ
ధృతికచటతపలు వర్గలు
చతురక్షరములను వర్గ జతయతు లిట్లు

కం. స్వరమిత్వ మేత్వమునకున్
ధర సైత్వము నొత్వములును దల కట్లకగున్
గరమిత్వ మొత్వమునకున్
బరగున్ ఋత్వంబు నిత్వ భావంబగుచున్

ఆ.వె. ప్రాద్యఖండమనఁగఁ బ్రభునామ తాఖండ
మయ్యభిధమనంగ నగునఖండ
మనఁగ నాల్గు రీతులగు ప్ర [ప(ఉ)] రాదులు
ప్రాది దక్క వాటి పథము లిట్లు

కం. అనునాసికలగు వర్గవు
లనువగు వర్ణమును బిందువైన ననుస్వా
రనియతి బిందువగున్ జం
దన భూజము వెలయు నందనంబుననన్‌గన్

కం. ధృతి దనరఁగ సంయుక్తవి
రతి యగు వేంకట విభుండు ప్రభువిలకనుచో
మతిఁదలఁప నిదియె రిపడియు
క్షితి నా దేశంబు స్వరము చెలువున నమరున్

కం. పిలుచు నెడ సందియంబగు
పలుకున గీతమున శోక భావార్థమునన్
గలయది ప్లుతము త్రి మాత్రలుఁ
దెలియఁగ వృద్ధియును గాకు దీనయమరున్

కం. నిత్య సమాస పదంబుల
నిత్య విరతియమ్మ దాదినిరతా భేదా
ద్ధత్యయతు లాయఖండము
యత్యను మోదమున వెలయు నార్యులు మెచ్చన్

తే.గీ. అయహ ఛఝజఝశషస లందు యతి సరిసత
చక్కపెక్కటి పోలిక సరవి నున్న
మావడులు నావి భాగంబు మఱి వికల్ప
యతులు భేదములగు గావ్యచతురయుక్తి

సీ. ప్రాసవిధంబు లేర్పడు సుకరంబు దు
ష్కర మనుప్రాస వికల్పములును
సమలఘు వెన్నైత్రి మఱియు ఋుప్రాస
యర్ధబిందువు త్రికారాంత్యములును
ధృతిఁ జెలువొందఁగ ద్వ్యత్రిచతు ప్రాస
ముఖపత్రిత్రయము నిమ్ముగఁ బొసంగు
లక్షణంబు లివి విలాసమా నాద్యస
త్క విరచిత ప్రథ గరిమ నమరి

తే.గీ. సులభదుష్కరవర్ణముల్ జొనుపనట్టి
ప్రాసములగున నుప్రాసపటిమ యతుల
పద్మవికసన మాశ్రీ పుఞ్జ సన్ముఖంబు
ననుటు యవికల్ప మనునాసికాంక సరణి

తే.గీ. విద్రిచె దనుజాల హరి ధర యద్రువనఁగ
సమలఘువు నణాళల ప్రాసంబునై త్రి
యమృత కమలోక్తి ఋుప్రాసమునఁగఁ జెల్లు
వీఁటికివి సాటి యన నర్ధ బిందువర్ణ్యా

తే.గీ. సంఖ్య గల్త్రికారశబ్దంబది ఋుకార
సదృశమై త్రికార సంజ్ఞనమరు
పదము తుదను వర్ణపటిమ నాల్గకగతి
నేక వర్ణ మంత్య మెంచిచూడ

కం. రెండును మూఁడును నాలుగు
నుండు వరుస వర్ణ పంక్తులుండు పదమ్ముల్
దండిగ ద్వ్యత్రి ప్రాసము
లుండుఁ జతుప్రాసమతుల నందురు కృతులన్

కం. పదివిధముల పొంతువులున్
బదిలమ్ముగ గణము తార పతి తారకుపాం
దముగ గతుభద ముగాఁ గవి
చదురుగఁ గృతినేయ నఖిల శ్లాఘ్యములౌ దగున్

జయ విజయ శంఖములు మహాశంఖ మహాభు
జాములగు గాత్రి రామరమారామ ? సుప్త
ములు ప్రసుప్తియు వరుసన కలుగు మభజ
సనయ [ర?] తముల కెనిమిది జాములపుడు

కం. ఆయా కాలము కావ్యము
లాయాగణములను దోషహరణముగ నిడఁగ
శ్రీయగు నొలఁగక చెప్పిన
నాయకునకుఁ గీఁడులగు వినాశము నొదవున్

శా. శ్రీకారంబమృతప్రధానమగుటన్ శ్రీమంత్రిమూర్త్యాత్మకం
బై కామార్థములిచ్చుటన్ మగణ మాద్యార్థస్థితిన్ గోవిదా
నీకప్రాభవ రోక్తిఁ బొల్చు కవులెంతే వేడ్క నిర్దోషభ
ద్రాకల్పంబుగఁ గూర్చి చెప్పుదురు పద్యాం [కంబు?] తుంభత్కృతిన్

కం. ఆది మొదటి జామునన్ భ
ద్రదముగఁ గృతిఁజాని సెప్పఁదగు సుకవివరా
స్పదమగుట మగణ మొక్కఁడ
గదియింతురు పొంతు వెతిఁగి ఘనులగు సుకవుల్

శా. ఆర్యాదై యరులేను దీర్ఘముల నాయావర్ణ పంక్త్యుల్లరే
కారాదుల్ సుకవర్గ పంచకము జోకన్ యాది షాద్యాదిదు
ర్వారాంచద్దశవర్గ మైదు వరుసన్ వాతానలోర్వ్యంబుతే
జోరూర్ధిన్ దగు దుఃఖమృత్యు సుఖభాగ్య శ్రీలుదారిద్ర్యముల్

వ. ఇచ్చుగావున క్షితిజలబీజంబులేర్చి పద్యాదుల నిడవలయు మఱియు ననేకవిధభేద వృత్త కావ్యదండకోదాహరణ నాటకాది ప్రకరణంబులందగు నింకనిరుక్తక్రమంబు

సీ. అర్థాంతి కమ్మున నమరు పూర్వోత్తర
ఋక్కుల సంధులు పెక్కువగలఁ
గలుగు కాలంబులగతి నిరుక్తము దెల్పు
మహిమదీర్ఘము రెండు మాత్రలు నగు
హ్రస్వంబు నొకమాత్రయట్ల ప్లుతంబు త్రి
మాత్రాన్వితంబుగా మఱియుఁ బొల్లు
లతిలఘువులుదగు నర్ధమాత్రస్థితి
నివి పదక్రమముల నెసఁగువలను

తే.గీ. తెలిసి వర్ణ క్రమంబులు తేటగాఁగఁ
బాడి పదవర్ణ జటలు నేర్పడఁగ నేర్పు
నతఁడు నియమాధ్యయనశీలుఁ డనఁగఁదనరు
శ్రోత్రియోత్తముఁ డధిక పవిత్రవృత్తి

మ. ఘృతజృంభాశ్రుతులందు చోట సరసుల్ శూద్రుల్ వసింపన్ నిశా
గతులన్ రాత్రిఁ బ్రదోష కాలములఁ జోరన్ వాక్యనం బల్కఁగం
చిత పుణ్యావని సాధుదేశిక ముఖశ్రీసూత సమ్యగ్గతిన్
దతభక్తిన్ బఠియింప శోభనములుద్యద్భావుర శ్రేణికిన్

తే.గీ. త్రివిధమై జ్యోతిషము కడుఁ దేజరిల్లు
ప్రబలు గణితము జాతక భాగము ఫల
భాగమును నాఁగ సిద్ధాంతపటిమ గణిత
భాగ మలవడు జాతకప్రథ వినుండు

కం. ఆధానమునకు లగ్నం
బాదటను శుభగ్రహంబులత్యుచ్చయ వీ
క్షాధృతి నుండఁగ మేలగు
పాదుగఁ బుంగ్రహ నిరీక్ష పట్టి జనించున్

ఆ.వె. స్త్రీగ్రహమ్ములున్న స్త్రీ పుట్టు నట్లన
పుంసకంబులున్నఁ బోడమినట్టి
శిశువు లప్రకాశదశ నుంద్రు పాప శు
భగ్రహమ్ములట్టి పగదిఁ జేయు

కం. గురురవి భూ పుత్రులు తగ
బురుషులు శుక్రుండు శశియు బొలతుక లెన్నన్
ధరణిజ బుధులు నపుంసకు
లరయఁగ రాహువును గేతు వరి ఛాయలగున్

సీ. గురుడును శుక్రుఁ డెక్కుడు శుభగ్రహములు
కమలారి పూర్వ పక్షమున నట్ల
బుధుఁడు శుభగ్రహంబులఁ గూడియున్నఁ బ్ర
త్యేకమున్న నశుభం బెన్ని చూడ
రవిశని కుజులు క్రూరగ్రహంబులు గురు
శుక్రులు కుజరవుల్ సోమ బుధులు
శనియుఁ జతుర్వర్ణ సంగతుల్ మేషవృ
షభ నక్ర కన్యలు సరవిఁ గర్క

తే.గీ. టమును మీనంబు తులయును గమలమిత్రుఁ
డాదిగ గ్రహంబులకును స్వోచ్చాను రాశు
లచ్చ కేడింట నీచలై యొదవు గాన
ముఖ్యలగ్నము ల్లాధానములకు నెన్న

సీ. తరణికి శశిశుక్రు లరులు బుధుఁడు సముఁ
డితరులు మిత్రులు హిమకరునకు
రవిబుధుల్ మిత్రులు రహి నితరులు సముల్
కుజునకు శన్యర్కగురులు హితులు
బుధుఁడరి శనికవుల్ సారి సముల్ బుధునికి
శుక్రార్కు లాప్తులు సోముఁడరి స
ములు తక్కువారు సమున్నతి గురునకుఁ
గవిబుధు లరుల హస్కరజుఁడు సముఁ

తే.గీ. డాప్తు లితరులు శుక్రున కర్కబుధులు
హితులు గురుభూసుతులు సము లితరులరులు
శనికిఁ గవిబుధులాప్తులు సముఁడు గురుఁడు
కుజుఁడు నరులితరులు [చూడ] గుణుతు నిట్టుల

ఆ.వె. మృగము కర్కటకము మేషవృశ్చికములు
మిథున కన్యలమరు మీనచాప
ములును వృషభతతుల నలకుంభ మకరంబు
లాలయంబుల య్యినాదులకును

కం. స్వక్షేత్రములను శుభమగు
వీక్షణ స్వోచ్చస్థులగుచు వెలయ గ్రహమ్ముల్
వీక్షింపఁగ నాధానము
దక్షతఁ జేయంగవలయు దనయులు గల్గన్

సీ. పుంసవనంబునన్ బుత్రుంపు జనియించు
కాలకు నేయఁగఁ దగు గరము వేడ్క
మూఁడవ నెలయందుఁ బోఁగిమిఁ జంద్రుండు
శ్రవణపు వ్యర్థుల సంచరింపఁ
దెలిసిరిక్తలుగాని తిథులను శశిశుక్ర
... ... గురువారములఁ గూడ
కన్యాది శుభలగ్న కాలంబులను బాపు
లగు గ్రహంబులు త్రిషడాయుతులను

ఆ.వె. దగ శుభగ్రహమ్ము లగణితధృతి నుంచి
రాశులను మెలంగ శీవి మెఱయ
నాగమోక్తరీతి నాచరింపుట శస్త
పుట్టు శిశువు వృద్ధిఁ బొందుటకును

కం. నాలుగు నాఱును నెనిమిది
మేలిమి మాసములు పుష్యమియును హస్తయుఁ జి
త్రాలిలితోత్తర ముఖుల
శిలత సీమంతవిధి విశేషముదలఁపన్

కం. ధనధాన్య సమృద్ధిన్ ద
త్తనయుఁడు వర్ధిలఁగఁ జేయ దగు సీమంతం
బెనిమిదవ నెలను గొనకొని
వినుతాక్షీష్మాణ కర్మమగుటు విష్ణుప్రీతిన్

సీ. సమమాస మాద్య పక్షమునఁ జంద్రాష్టమ
జన్మతిథా రాతి వర్జ్యగాక
కేంద్రాష్ట మాధిపుల్ సాంద్ర వీక్షణముచేఁ
గనుగొన మూఢ శుక్ర గురులైన
నధిక మాసములైన నవి దోషములుగాఁగ
నెన్నంగఁ గాలబోన్నతమగు
కర్మంబుగాశ్వినఁ గావింప మేల్ షష్ఠిఁ
బౌర్ణమి నష్టమిఁ బరగు చవితి

తే.గీ. నల చతుర్దశి శుక్ర సౌమ్య ——జీవ
వారముల సింహవృశ్చిక వర్జముగను
గడమ లగ్నంబులను సేయఁ గలుగు శుభము
పేర్మి సీమంత మధిక సత్కర్మ సరణి

తే.గీ. శ్రవణ రోహిణి......తిష్యలను జాంద్రి
చిత్ర నశ్వినిఁ గావింపఁ జెందు మేలు
మఱియు మతములఁ గొన్నిఁట మంచితార
లనుచుఁదత్కర్మములకు బుధావళి నొడివె

వ. ఇది తృతీయంబగు సంస్కారంబు నాలవకర్మంబగు జాతకర్మక్రమంబు.

శా. మృగధర చిత్ర విష్ణు ముని మిత్ర సువర్ణ సువాజిసారి ఫలా
శుగముఖ నుత్తరా త్రయము సొంపగు రోహిణి ముఖ్యతారలున్
భృగుశని సౌమ్య వాగ్గురుల చేరటి వారములుక్ శుభాస్పదం
బగుసతి సూతి కాగృహ మునందుఁ జొరంగ ఘటావలీయుతన్?

ఆ. వె. తిత్తి శిఘల మాని రీతిమై లగ్న బ
లంబులరసి మంచిలగ్నమునను
సూతికాగృహంబు సొచ్చిన నీశ్రాడు
సంకటంబులేక సతి ముదమున

కం. భావింపఁగఁదగు నదకి
ప్రావక ముత్తమము మాధిజము మధ్యమమా
నావల భూపతనము ల
గ్నావధికిని నధమవృత్తియగు ఫలమొలుఁగన్ •

కం. అధానలగ్న మెఱిఁగి క
నేదియుఁ గనిలేదు తెలియ మిటులైనను ల
గ్నోదయ శుభాశుభాక్తో
త్పాదన ఫలద గ్రహానువర్తనమొలుఁగన్

సీ. పుట్టిన శిశువునప్పుడ తండ్రికనుగొన
వలయుఁ బితృూణంబు తొలఁగుకొఱకు
నశ్వినీ దేవతలాద్యంతముల మఘా
శ్లేష విట్లలరినలీల మూల
వల జ్యేష్ఠ రెండేసి యాద్యంత ఘటికల
భుక్తమూలల నంగఁ బొలుచు నఁజ్ఞ
నవి విషమములు శాంత్యర్హమ్ములగుటను
జొఁకతోఁడుత దూషణాకరమ్ము

తే.గీ లట్టి గడియలఁ బుట్టినపట్టి ముఖము
తండ్రికానిమిది యేండ్లకుఁ దగదు చూడ
నితరులకు నిచ్చునది ప్రియ మొసఁగుచేని
శాంతి నేయించునది శాస్త్ర సరణి మెరయ.

శా. ఇనశశి భౌమ సౌమ్యగురు లచ్చిదియా నెల వందు నుండుచో
ననఁ జల ప్రపాతరుజలయ్యు భమృత్యువు నొందు సౌరి యు
న్నను గరళమ్ము చేఁ బొలియు నాతఁడు యేనళచోటునుండినన్
ఘనమగు గండముల్ శిశువుఁ గమ్ము క్రమమ్మున నిట్లు లెన్నఁగన్

మ. ఇనముఖ్య గ్రహషట్కముల్ వరుసఁగా నొంకొంటియున్ బంచము
బున నున్నన్ దలి తండ్రి యన్నలకుఁ బెంపున్ మామ తన్మాతులుం
డును దన్మాతృ తదీయ లాందుదురు పొందున్ గండముల్ గాన న
య్యినచంద్ర గ్రహణంబులున్ బరిధియందేనిన్ దగున్ శాంతికిన్

కం. జననపులగ్నము మొదలుగఁ
జను పండ్రెంటికిని శాస్త్రసంజ్ఞను బేర్లై
యను వెలిఁగి శుభాశుభ ఫల
మునకున్ హేతువులు దెలియ మునుకొను బుద్ధిన్

సీ. తనుకల్య దేహమ్ములును హోర లగ్నవి
లగ్నముల్ కేంద్రముల్ లలినిజన్మ
లగ్నంబుదగు సంజ్ఞలన్ ద్వితీయ ద్రవి
ణములు జాతియు నననమరు రెండ
వది విక్రమము తృతీయము సహజము హిబు
కము......వృశ్చికములున్ ర
సాతలాఖ్యయుఁ జతుర్థాతిశయ స్థాన
మగుసుత బుద్ధి వాహన సుసంజ్ఞ

ఆ.వె. షైదవదది మంత్రియనఁగ షట్కము కళ
త్రంబనంగ సప్తమంబు నష్ట
మనిధనల్ దరిద్రమనఁ త్రికోణస్థల
ధర్మ గురునవములఁ బేర్కొనిరి

కం. వివరింపఁ గేంద్ర కర్మము
లవిరళ దశమంబు లాభమగు పదునొంటై
యవలన్ వ్యయమగు ద్వాదశ
మిది భావము లెఱిఁగి ఫలము లిట్లనఁగఁదగున్

తే. జ్యేష్ఠపదినాల్గ [జమునితోఁ] జేర్చు వరుస
తల్లి జననియుఁ దర్వాతి తల్లి తోడు
దల్లి శిశువును గోత్రజుల్ ద్వైధ కులము
శిశువు తోడను మామయు స్నేఁగి బాంధు

సీ. అశ్లేష పండ్రెంటనగు వాళ్లు నట్టులఁ
జెందుదోషము శాంతి నేయఁ దొలఁగు
వినుఁ డున్న కారకు మునుపటి దోకరెండు
నవియు మూర్ధము నాస్యముతుంబ కముల

నను నైదువలచేత నాలుగు నన్నియు
వామకరమ్మున వానిసంఖ్య
కుడిచూడమగు కాళ్ల దొడరి యిల్లెన్నదు
భావింపరాజాను బండితుండు

తే.గీ. ధనసిధనవేళ విభ్రమత్తత్త్వ సత్య
యుక్తుఁడగు జన్మఋక్షంబునందు చోటు
లలితవారాహచక్ర ఫలంబు లిట్టు
లమరు జ్యోతిష శాస్త్రజ్ఞ సౌనసంగ

తే.గీ. జన్మలగ్నాష్టమంబులఁ జంద్రుఁడున్న
యతనిఁ బట్రెంటు గురుఁడున్న నన్య బీజ
జాతమగు దర్శఁ బౌర్ణమి జన్మమాది
నట్టి శాఖకు తండ్రికి హాని చెందు

తే.గీ అయిదు ఘడియలనొక్క పాలగుట మూల
కటుల నాశ్లేషకును ద్వాదశాంశములకు
గండముల నొక్క విధములగాన మూల
తుదను నాశ్లేష మొదలున నొదవు శుభము

చం సమతఁ జతుర్దశింబెరసి షడ్విధ భాగను లాదిభాగమే
యమరఁగ దోషవర్జితము నైతగు తండ్రియుఁ దల్లి మామ య
ర్థను శిశువైదు భాగముల దారగ గండము లొందు శుక్లప
క్షమునను పల్లికిం బవాంళజంబునఁ దండ్రికిఁ గీఁడు చూడగ

సీ. మొనసి పూర్వాషాఢ మూఁడవ పాదంబు
చిత్ర పూర్వార్థంబు చెలఁగు పుష్య
మునను రెండవపాదమున నుత్తరాదియుఁ
బిత్ర్య గండములు సంశయతకుఁ దొలఁగి
యుత్తరరణ్ణల్లు నొక నెల పుష్యమి
కెసఁగఁ బూర్వాషాఢ కెనిమిది నెల
లటు చిత్ర కార్తెల లాశ్లేషకును నవ
మాసముల్ జ్యేష్ఠకు మాసపంచ

తే.గీ. కంబుమూలకు వర్షాష్టకంబు సుతునిఁ
జూడ కుండుట మేలు నచ్చుపడనిట్టి
గండములఁ బాపు కేంద్రగురుండు పెక్కు
మత్త గజములఁ దరుము సింహంబు కరణి

కం. గురుశుక్రులైన లగ్నము
పరులైనను గేంద్రములను బ్రబలినచో వి
స్ఫురదాయుర్వర భూషా
పరణాఢ్యుండగుచు శిశువు వర్ధిలు నెలమిన్

తే.గీ. జననలగ్నంబు నాల్గునేడును బదియును
నైన రాసులు కేంద్రంబులనఁగఁ బరగు
నశుభములు నందుఁ బాప గ్రహంబులున్న
బ్రబలు శుభములు నచట శుభ గ్రహముల

కం. ఇందుని సమస్థలంబుల
మందాంగారకులు రవియు మహిసమ బుధుల్
స్పందితులైయున్నను మృతిఁ
జెందున్ దచ్ఛిశువు జనని నేఁగింతోరలన్

ఆ.వె అర్క చంద్ర సౌరు లవని కుమారుండు
పంచమముననున్న బుట్టి తల్లి
తండ్రితోడఁగూడి తగ మృత్యుదశనొందు
సందియంబు లేదు శాస్త్రి సరణి

కం. రవి రవి పుత్రుఁడు భూసుతుఁ
డవిరళ కేంద్రములనున్న నమరగురుండున్
నవమమువనుండిరేని శి
శువు స్వల్పాయువున నడఁగు నాంపెడలి వడిన్

ఆ.వె. మూలమొదటి పాదమున మామ నశియించు
జ్యేష్ఠ మొదల బావ జీవ మెడలు
నవ్విశాఖ సర్వమంత్య పాదంబున
నత్తమఱఁదిలేని దగును వెలఁది

ఉ. మంచిదినమ్మునందున సమస్థితిఁ బుట్టిన కన్యనెంతయున్
సంచిత వేదశాస్త్రచయ సద్గుణ వత్సల శీల రూపరే
ఖాంచిత యౌవనస్థితుడనందగు వానికినిచ్చు వాఁడు వై
రించపదంబున న్నెలఁగు శ్రీలిగ వైభవ సుప్రసన్నతన్

కం. ప్రతిపజ్జనితుఁడు మూసా
ల్లతిరయమున మూఁడు నెలల నా శిశువణఁగున్
కృతితోఁ జెప్పిన తొంబదిఁ
బ్రతివర్షము లేఁబదైన బ్రతుకున్ సుఖియై

కం. గ్రహదుష్టుల మిత్రత్వము
లహిత బలాబలనిరూపణాత్యున్నతులన్
మహి క్షేత్ర నిర్ణయమ్ములు
రహిఁ దెలియుచు ఫలము లెఱుఁగు ప్రౌఢిమ యలరన్

సీ. పదియును మూఁడింటఁ బాద భాగము దృష్టి
ఐదిఁట నవమ మందర్ధదృష్టి
యును నాల్గు నెనిమిదింటను ద్రిపాద్దృష్టియు
సంపూర్ణమగు సమసప్తమములఁ
బాదదృష్టిని శని బలియుఁ డర్ధమ్మున
గురుఁడు ద్రిపాద్దృష్టి ధరణిసుతుఁడు
సంపూర్ణ దృష్టిని సకల గ్రహమ్ములు
బలవంతులగుట నేర్పడ నెఱింగి

తే. భావములు నంశములు లగ్న బలము దెలిసి
శత్రు మిత్ర బలాబలోజ్జ్వలత లెఱిఁగి
యుచ్చనీచ సమత్వమ్ములొనర నెన్ని
ఫలము లెఱిఁగిరేఁ దగు బుధ ప్రకర మెలమి

కం. ధారుణి నశ్విన్యాదిగఁ
దారాత్రితయంబు గూర్పఁ దగు ద్వాదశ పా
దారూఢిన్ మేషాదిమ
హోరాశ్యంశమ్ము లెఱుఁగ నగు ఘన బుద్ధిన్

చం. ఇనశశి భౌమరాహుగురు లేవున సూర్యజ సౌమ్య కేతులన్
దనుజ గురుండు కృత్తిక మొదల్ నవ ఋక్షము లీగ్రహమ్ములే
పునదశ లౌటయర్ వరుస బుట్టిన తారకు సంఖ్య బద్ధతిన్
దనరు గ్రహంబెకాదశ విధంబెఱుఁగందగు భక్త నాడులన్

కం. ఆఱును బదియును నేడునుఁ
నాఱును బదునెనిమిదియు బదాఱును వరుసన్
వారక పందొమ్మిది పది
యాఱ్తాక పేడిర్వదియును హాయన సంఖ్యల్

అర్కుఁ డాదిగఁ బదినెలలైన నేఁడు
లగుదశ లెఱింగి ఫలభాగమరయవలయు
నలరు సమ మిత్ర శత్రుల వలను లగ్న
విభుల బలములు నెఱిఁగి ప్రవీణ మహిమ

కం. పాపగ్రహముల దశలవి
యాపదల శుభగ్రహంబులైనను శుభముల్
జూపట్టు నుచ్చదశలను
నే పున క్షేత్రాంశ భావహితగతులందగన్

చం. గురుబలమొప్పు బ్రాహ్మణులకున్ గుజుఁడౌ నృపకోటికిన్ వణి
గ్వరులకు సౌమ్యుఁ డర్కజుఁడవశ్యత శూద్రుల కబ్జమిత్రుఁడు
ర్వరఁ బశుపాలజాతికిని వారక శుక్రుఁడు స్త్రీలకెల్లఁద
స్కరులకు జారపంక్తికిని గావలె రాహుతమోబలస్థితుల్

సీ. ఒగి లగ్నములకు మూఁడొక పాలు ద్రేక్కాణ
మటఁ బాదగతి హోరయనఁగఁదనరు
మఱి నవాంశయునౌని మహి రాశి పతులక్ర
మంబున ఫలము లేమరమి దగును
శిశువు పుట్టినయంతఁ జేరి కన్గొని స్నాన
మొనరించి దక్షిణలను మహీసు
రావలిఁ దృప్తులఁ గావించుటొప్పగు
నైదవనాఁటి షంఛాయుధంబు

తే.గీ. మంచిలగ్నంబునను గట్టి మంచిదగును
పదిఁటఁ బండ్రెండట శుచివృత్తిఁ బ్రబలి నామ
కరణమొనరింపఁ దగునట్లు గాఁగ లేని
నమర మూఁడవనెల నాలుగైన నెలను

ఉ. విడులనైన నీరహిని నే శుగు నిండుబలంబు తిక్కలా
పోడిమి నొప్పునాఁడు దగ భూసుర భోజనముల్ ఘటింపుచున్
వేడుక సల్పఁ గావలయు విశ్రుతలీలల నామకర్మమా
యేడు న నట్టిమాసముల నిర్వెడలించుట యుక్తమెన్నఁగన్

కం. పొరుగింట నొక్కరాతిరిఁ
గరమొప్పఁగ నునిచి మఱలఁగా శిశువున్ భా
నుర నిజగృహమున్ జేర్చుటఁ
నైరి దగు నిష్క్రమణ కర్మనిరతిం బొసఁగన్

గీ. చంద్రుఁడును శుక్రుఁడును మఱి కేంద్రమునను
దొడరి పాపగ్రహమ్ములతోడఁ గూడి
యా విలోకనమొసఁగి క్రూరాంశములన
నుంతఁ బుట్టిన గురు తల్పగుండతండు

కం. భాగేశ లగ్నవిభులును
రాగంబున షట్చతుర్థ రాశ్యధిపతులన్
బాగుగఁ గలసినచో జ
న్మాగత శిశువన్న బీజమున వలయుఁ జూమీ

సీ. పదియాఱవగునాఁడు పరగ నాఱవనెల
సప్తమాష్టమమాస సరణినైన
చంద్రతారాబల సంపదలనుభగఁ
పూర్వాహ్ణమధ్యాహ్నముల నయినను
దినబుధములు పూర్ణతను బొసంగిననాఁడు
కడు పర్వ రిక్తలుగాని పట్ల
చిత్రోత్తరలు హస్తసిద్ధుల నిగమోక్తిఁ
గర్ణవేధయొనర్పఁ గలుగు శుభము

తే.గీ. హరికథాశ్రవణాలబ్ధ నిరతయోగ
గరిమచే వర్ధిలఁగ జేయు కర్మమగుట
శాస్త్రవిధిఁ జేయ శుభములు సౌఖ్య మొసఁగు
నెలమి నిలువేలుపులఁ గొల్వ వలయు మిగుల

తే.గీ. ఆఱునెనిమిది పండ్రెండునైన నెలల
వృద్ధి దినమున సితపక్ష విశదగతిని
శుభముహూర్తమునందు శిశువుల కరయ
నన్నమిడు టొప్పు నిష్ట సమాగమమున

తే.గీ. భవ్యశాస్త్రార్థ సరణిఁ ద్రిపంచ వర్ష
ములను శుభవేళఁ జౌలంబు సలుపవలయు
మఱియుఁ బంచాబ్ద పంచమ మాస పంచ
మదినమున విద్యనేర్ప సమ్మదము లొదవు

కం. గర్భాష్టకముననైనను
నిర్భర జన్మాష్టకమున నైననుపనీతం
బర్భకునకు నమిత శుభా
విర్భూతిం జేయవలయు విధ్యుక్తముగన్

కం. గురుబలము గలుగునెడలం
గురుశుక్రులు పూఁడు దెసలఁ గుందనియెడలన్
స్థిర లగ్నములన్ శీతల
కరతారా బలము లమరఁగా వడుగమరున్

సీ. పాడ్యమి మొదలుగాఁ బంచమి దశమియుఁ
బౌర్ణమియును శుక్లపక్షముకవు
మఱి శుక్లపక్ష మమావాస్య గూడఁగ
నైదైదు దినములు నమర నంద
భద్రయు జయ రిక్త పరగు పూర్ణిమ యనఁ
దగు రిక్తతిథు లెట్టి వగకుఁగాదు
పలనగునే వేథ వైవాహికోపన
యన దేవతాదర్శ నాదులకును

తే.గీ. నెందుఁదుది పక్షమున నెలనెసఁగఁ ద్రిదిన
ములును గ్రహకాంత సప్తాహములను జేయఁ
దగదు శుభ కర్మములు సేయఁదనరనేని
గడుసనర్థమ్ము నశుభమ్ముగలుగు కతన.

కం. వైవాహిక కర్మమునకు
గావలె దశ విధములగుచుఁ గలయా పొంతుల్
శ్రీవెలయును సంతాన శు
భావహమగుఁ బదియు లెస్సయైయున్న యెడన్

కం. దినగణ మాహేంద్రమ్ములు
ననుభగ స్త్రీ దీర్ఘయోనులటు రాశియు నా
య్యన రాశ్యధీశ సంజ్ఞల
వినువేధయు నాడిపదియు వెస నెలుఁగఁదగున్

ఆ.వె. సకల పొంతనలును సతి తార మొదలుగ
పురుషు లెక్కఁదనుక పొసఁగు నెన్న
వినుము పురుష ఋక్షమును నెంచవలె నందు
సకల శాస్త్ర విదులు సదివి రందు

తే.గీ. ఆది మధ్యాంత్యనవక తారాళి చేసి
యధమమును మధ్యమము మేలు ననఁగ వరుని
తార మొదలుగ సతిచుక్క దనుక నెన్న
నదియె దినమను పొంతువ విదితమయ్యె

సీ. అశ్వినిమృగశిర హస్తలు స్వాతి పు
ష్యపునర్వసు ఋక్షముల్ శ్రవణరేవ
తులు ననూరాధయు నిలసురగణములు
పూర్వోత్తరాత్రయంబులును మఱియు

భరణి ధనిష్ఠయుఁ బేరయ రోహిణియును
వ్య గణంబులు మఖ విశాఖ కృత్తి
కార్ద్రశతభిషము లాశ్లేష జ్యేష్ఠ మూ
లము చిత్ర రాక్షసములు సటంద్రుడు

ఆ.వె. స్వగణమైనఁ దుల్యమగు దేవమానవ
మధమ మమరదైత్యమైన మనుజ
రాక్షసములు గావు రతి వివాహములకు
గణమునాఁగఁబొందు గణన మిట్లు.

ఉ. కన్నియ చుక్కనుండి యొడికంబుగఁ జూడఁగ భర్తతార నా
ల్గెన్నిక నేడునుంబదియునిట్లు త్రయోదశ షోడశాంశమ
య్యున్ననునై [దు] మూఁటను సమున్నతి నిర్వది రెండు నిర్వదే
నున్న శుభంబటంచును బుధోత్తము లెన్న మహేంద్రమైతగున్.

కం. కన్నియతార మొదలొక్కని
యొన్నఁగ నక్షత్రయమున హితవరు నక్ష
త్రోన్నతి నమునను మొదలను
బన్నెఁ గొంటగాదు తుదను బరగ శుభమగున్

వ. ఇది స్త్రీదీర్ఘంబింక యోని పొంతు విధంబు.

సీ. అశ్వినిశతభిషలశ్వములు భరణిరే
వతియు గజమ్ములు వరుసఁ గృత్తి
కయుఁ బుష్యతారమేకలు మృగశిర రోహి
ణులు పాములార్ద్ర మూలలు శునులగు
నలరు పునర్వసువాశ్లేష పిల్లులు
మఖపుబ్బ మూషికల్ మహిషములును
స్వాతియు హస్త, విశాఖ చిత్తయుఁ బులుల్
జ్యేష్ఠానురాధలు చెలఁగు లేళ్ళు

తే. శ్రవణమును జల ముఖ్య మెంచంగఁ గపులు
తగ ధనిష్ఠ యుద్రేక పాత్తార హరులు
నుత్తరయు నుత్తరా భాద్రయొప్ప వృషము
లెసఁగు నభిజిత్తు ద్విపదములింగిసలు దలఁచ.

కం. మొదలిటి బుధుఁడు పోతగుఁ
పదపడి రెండవది పెంటి పరగు సమమునన్
బొదలన్ గలహం బటులటు
లాదవిన సామాన్యమగు గుణోచిత వృత్తిన్

చం. పులియును ధేను వేన్గు హరిపొల్పగు నశ్వము నెన్ను లేడు లే
ర్కల శుని ముంగి పాము ప్లవంగంబును మేషము పిల్లియెల్కయున్
జలమున నొక్కటొక్కటికి శాత్రవ వృత్తి మెలంగు గావునన్
వలనగు భర్తకున్ బగ జనన్ దగఁగూర్పఁగ యోని పొంతగున్

సీ. ఇంటికిఁ బతికిని నేకరాశి శుభంబు
నేకతార సుఖంబు నేకనొదవు
పడఁతి రాశికి రెంటఁ బన్నెండిటఁ గొఱగాదు
పన్నెండు రెంటు శుభంబు మూఁటఁ
బదునొంటు దుఃఖంబు పదునొంటు మూఁట సు
ఖంబు నాల్గిటఁ బదిగాదు పదియు
నాల్గింటఁ బ్రియమైదు నవకమై యోగ్యంబు
తొమ్మిదేదిటు మేలు కొడదు నాఱు

ఆ.వె. నేనిమిదింటఁ గాదు నెన్మిది నాఱింట
వంశవృద్ధి సమత వైభవమగు
రాశిపొంతు విదియ రాశ్యధీశుల మైత్రిఁ
గనుట రాశ్యధిపమనఁగఁ బరగు

వ. తరణ్యాది గ్రహ శత్రు మిత్ర సమత్వంబులు మున్నె తెలింగించితి మఱియును.

సీ. హరి వృశ్చికములు వశ్యములు మేషమునకుఁ
గర్కటు ధటులు నుతుమునకు మిథు
నమున కంగన కర్కటమునకళి శరాస
నమ్ములు పంచాననమునకుఁ దుల
మిథునంబు గన్యకు మీనంబు తౌళికి
మకర కన్యకలు వృశ్చికమునకుఁ గు
శిరంబు మీనంబు దార చాపమునకు
మత్స్య కుంభంబులు మకరమునకు

తే.గీ. ఘటమును కటకము మేషము మృగము మీన
మునకు వశ్యంబు లివ్విధంబున నెలంత
రాశి మొదలుగ గణుతింప రహిఁ బొసంగు
దీనిఁ గోవిదవినుతి వధూవరులకు.

శా. లింగాకారము మూఁడురేఖలుగ వాలిన్ గీతలడ్డంబు నా
ల్గుంగా వ్రాసిన మూఁడు తొమ్మిదులు పొల్చున్ ముఖమూల్ మూర్ధక
ర్ణాంగోర్వంఘ్రుల నైన రజ్జువుల కైక్యంబైనచోఁ గాదు నెం
చంగా నొక్కడె రజ్జువున్ విషము మిచ్చున్ మేలు రజ్జుస్థితిన్.

సీ. అల చతుష్పాద తారలకెల్ల నశ్విని
త్రిపదలకెల్లఁ గృత్తికయు ద్విపద
ములకెల్ల మృగమస్త మున్నుగాఁ గ్రమమున
మూఁడు నాలుగు నైదు మొనయ నెన్న
టదిదేశ విషయమా నన్నిదేశంబుల
నశ్విని మొదలు మూఁడమర నెన్నఁ
బార్శ్వక నాడైనఁ బడఁతికి మేల్గాదు
మధ్యనాడిని నిల్వ మగనికౌర

తే.గీ. యిద్దఱికి మధ్య నాడైన నెనయు నిదియు
నాడి పొంతువు మిక్కిలి నాణ్యమైన
బుద్ధి నిటువంటి పొంతుల పొలుపు దెలిసి
పెండ్లిఁ జేసిన మిథునంబు పేర్మిఁదనరు.

ఆ.వె. అశ్విని మఖ మూల లాది క్రమంబున
నాలుగేసి భములఁ దోలి వేధ
పర్వ రాజమాను విభావసుసంజ్ఞల
సోమచిత్రవసులు సూటిగాళ్ళు

వ. వెండియుం గ్రంథాంతరంబున—

ఆ.వె. ఇదియ వేధయనఁగ నెసఁగిన పొంతువు
నిట్టి పది తెలుంగు రాతిఁగ వ్రాసఁగఁ
పెండ్లి సేయుటొప్పు పేర్మి లగ్నబలంబు
లరసి గ్రహబలంబు నమరునపుడు.

కం. మృగధరచిత్రి ధనిష్ఠయుఁ
దగ రోహిణి యొకటి కొకటి తాఁకును వేధల్
మిగులఁ గొఱగాదు దీనం
దగులమి దంపతులకున్ ముదంబులు పొసఁగున్.

ఆ.వె. ఇదియ వేధ యనఁగ నెసఁగిన పొంతువు
నిట్టి పదితెఱంగు రీతిఁ గని పొసఁగఁ
బెండ్లి సేయుటొప్పు పేర్మి లగ్నబలంబు
నరసి గ్రహబలంబు నమరు నపుడు

కం. స్త్రీలకుఁ బ్రథమ రజస్స్థిర
కాలము దెలియంగ మేలుగానఁగవచ్చున్
మేలిమి శశి బుధ సురగురు
లీలాహములైనఁ దగు లలిన్ శుభదములై

సీ. ఉత్తరాయణమున నురు సంపదలు దక్షి
ణాయనంబున లేమియగు వసంత
ఋతువున సుఖి గ్రీష్మఋతువున భోగియౌ
వర్షఋతువున నాడువారిఁ గనుట
హిమవేళ వ్యభిచారమిల శరదృతువునఁ
బగలకు సౌఖ్యంబు పరఁగు శిశిర
ఋతువునఁ బెక్కుండ్రు సుతులు గల్గుట ఫల
మగు శుక్లపక్షమం దమరు సుఖము

ఆ.వె. కృష్ణపక్షమైనఁ గెరలి దుశ్చరితయౌ
రిక్త తిథుల నట్టి రీతి మెలఁగు
ఘనత నచరలగ్నమున శుభగ్రహ వీక్ష
ణములు గల్గ నార్తవము శుభంబు

తే.గీ. తదియఁ బంచమియందు సప్తమిని దశమిఁ
దనరు నేకాదశిన్ ద్రయోదశినిఁ బ్రథమ
ఋతువు సుఖదము శ్రీయుక్తి నెలమి భోగ
శుచుల సుఖముల వర్ధిల్లు సుదతి వరుస.

కం. హస్తాది పంచకమునఁ బ్ర
శస్తత విష్ణుత్రయంబు శశిరోహిణి మూ
ల స్తుతపుష్యములన్ సతి
విమల ధనధాన్యవృతనిరతిన్ వెలయున్.

తే.గీ. మిథునకన్యాధనుస్సింహమీనకుంభ
తులలఁ గర్కాటకంబునఁ జెలువ ప్రథమ
పుష్పవతియైన సౌభాగ్య భోగశీల
కలన వర్ధిల్లు శుభలగ్నగణనఁ దగుట.

కం. గురు బుధ శుక్రులు లగ్న
స్థిరులగునెడ మేలుగలుగు ధృతి నితరగ్రహ
స్థిరత నశుభములు నెందును
దరుణికిఁ బ్రథమార్తవమునఁ దతదురితగతిన్

ఆ.వె. లగ్న సప్తమమున రవి బుధ గురు శుక్రు
లున్న నటుల శుభము లౌదవు, కృత్తి
కార్ద్రముఖుల మఱియు నర్కర్క్షమున నాది
పాదములను మేలు ప్రబలు సతికి.

సీ. వేఁకువ రేపటివేళ మధ్యాహ్నంబు
నంతైన భోగసుతాప్తిఁ దనరు
నపరాహ్ణమున జారయగును సాయంకాల
మున భోగి సంధ్యారాత్రిని తదుపరి
కొఱగాదు నగముఱాతిరియైన గర్భిణి
యొకటి రెండగు బిందులౌదవు శుభము
మూఁడు నాలుగు పెక్కు పోడిమి మలినంబు
రక్తవర్ణము దరిద్రత వహించుఁ

తే.గీ. జాలవెలుపైన శుభమగు శ్వేతవహ్ని
సఖుతిదిశలైన వెల్పును నీలిశోక
యముని దెస పడమటు మలినమును ధనద
వాయు భర్గాశలను రక్త వస్త్రియగును.

ఆ.వె. వీధ్య ముసఁగి కాల విషయంబుతో నైదు
తలు బుధోత్తములును దెలుప గలిచి
నట్టి దిక్కు తిరిగి యుట్టి కోకలుగట్టి
యునికి దెలియవలయు సుచితమతిని.

తే.గీ. సంహితల రీతులిట్టింతు సరవిఁ గొన్ని
చంద్ర తారాబలస్థితిఁ జంద్రుఁ డష్ట
మమున సామాన్య మాటింటు మఱియు రెంటు
మూఁటు నేడిఁటు శుభము లిమ్ముగఁ బొసంగు.

సీ. జన్మర్క్ష మాదిగా నెంచంగఁ దొమ్మిదిని గా
భాగింపనిత్యర్క్ష పరిమితముగ
నైన వెన్నిక క్రమంబమరంగ జన్మర్క్ష
మనునిదియది శుభ మిక తక్క
సంపత్తు గురునాట సంపదలొసఁగూర్చు
దముఁడు విపత్తు బాధల నొనర్చు
క్షేమంబు బుధుఁ డంత క్షేమంబుగావించు
ప్రత్యక్కు కేతువు మృత్యువొసఁగు

తే.గీ. సాధనము చంద్రుఁడగు కీర్తి చాలనిచ్చు
నైధనం బర్కసుతుఁడు ప్రాణములఁ బాపు
మిత్రమసురగురుండు సన్మైత్రిఁ జేయుఁ
బరమ మిత్రుండు కుజుఁడు శోభనములొసఁగు.

ఆ.వె. నిత్యతారదనుక నైరి జన్మభము నుంచి
దొన్ని నాలుగింట నెంచి కూర్చి
తిథుల వారములను ధృతిఁ గూర్చి నవభాగ
పారణమున దినగ్రహంబు దెలియు.

కం. దశ లేండ్లయందు సగమగు
విశదపు గడియలుగఁ బంచివెస దత్ఫలముల్
దశ లట్లు షష్టిఘటికా
భృశతన్ దివసముల ఫలము పేర్మిం దెలియన్

కం. రవి బుధ శుక్రులు నెల నెల
నవనిసుతుండొక్క నెలయు నర యబ్దంబా
దివిజగురుఁడట్టి యర్ధం
బవు వత్సర ముక్కరాశి యందుండ్రదు తగన్.

కం. నడుతురు పదునెనిమిది నెల
లడరఁగ మీనాది మేషమంతము గాఁగన్
దొడరుచు రాహువు కేతువు
పడుగక గ్రహచర్య లిట్టు లొనరన్ నియతిన్

వ. రవి చంద్రులు ఋజుగతులు నితర గ్రహంబులు శీఘ్రాతిశీఘ్ర వక్రానువక్ర మంద వికల గతుల నొందుదురు రాహుకేతువులు సదావక్రగతులు మఱియును—

సీ. శని రాహు కేతువులును ధరాతనయుండు
 మూఁడింట నాల్గింటఁ బొడిమమరు
నమరార్యుఁ డేడింట నాఱింటఁ బదింటను
 గురుఁడద్రిదినిధి కాణకర నిరతిని
భానుఁడాఱింట మూఁటఁ బదింట బుధుండు ద్వి
 షష్ఠాష్టమ దశమ స్థానమునను
శుభదులు ధారుణీసుతుఁ డేడింటను రాహు
 వమరఁ దొమ్మిదింటను జన్మమున గురుఁడు

తే.గీ. మూఁట రవి పంచమ స్థానమునను భృగుఁడు
నాఱిఁట బుధుండు రెంట నొప్పారి కేతు
వాదిరాశిని మేలుగాదంద్రు జాత
కమున గోచార పద్ధతి నమర నెపుడు.

తే.గీ. ద్వాదశాష్టమ జన్మ నివాసులగుచు
శని మహీసుత జీవ భాస్కరు లొకపుడు
నిలుప ధనహాని ప్రాణహానియును స్థాన
హానియును గల్గునంద్రు నిదానమతులు

వ. మఱియు దశలకుఁ గాలచక్రాది బహువిధంబుల ఫలాఫలంబులు గల వింక యాత్రార్హ దినవారనక్షత్రంబు లెఱిఁగించెద—

ఆ.వె. ఇనుని తారనుంచి జననర్క్షము నెంచి యే
డింటఁ బాలుకొనఁగ నైలమి నొకటి
నాలుగైదు మిగుల మేలు ద్విస షట్ద్వి
షట్క మదర భ్రమణపర్యలగును

కం. చరలగ్నమునఁ బ్రయాణము
స్థిరలగ్నమునన్ బ్రవేశ చిరకార్యారం
భరుచిర సత్క్రియలకుఁ దగఁ
దొరకొన నగు శాస్త్రవిదులు మేలనఁగన్.

కం. రవి మొదలు పేదు గ్రహముల
నవిరళతం దారవిభుకు నారొసిమిదింటన్
భువి రెండున్నర ఘడియలుఁ
వపులున్ మొరయను సంజ్ఞఁ దర్భల మొన్నన్.

కం. శని సూర్య భూజవారలు
ఘనులకు గొలగాళ్ళ వితరవటువారలు మేల్
విను(c)డెల్ల కార్యములకున్
జనుయాత్రకు గురునివార వారఫలమగున్.

ఆ.వె. రాజుగాంచుటకును రవివార యుద్ధక
ర్మములు భౌమవార రహి నిలుకడ
కర్మములకు సౌరి ఘనవార విద్యకు
గురునివార శుభము గూర్చునెపుడు.

సీ. ధర శుద్ధపాడ్యమి తదియ పంచమి సప్త
మియు దశ మేకాదశియు(c) ద్రయోద
శియు శుభఫలదముల్ శితకర బుధ గురు
భృగువారములు మంచివగుచు నమరు.
నశ్విని మృగధర హస్త పుష్య పునర్వ
సులు నమూరాధమూలలు శ్రవణము
రేవతియు ధనిష్ఠ శ్రీ విభవ ప్రదల్
కన్యవృశ్చికము మకరము మేష

తే.గీ. లగ్నమును దక్క తక్కిన లగ్నములను
వ్య్రప చిన్నార్గములు చౌతి యల నవమియు
నాచతుర్దశి గానిచో నగును శుభము
గమనమున కెన్న శాస్త్రసంఘటన మిట్లు

ఆ.వె. ఏకగుణము తిథిని రెండిమిదచ్చగు వార
మలర నూరు గుణములగును తార
లగ్నమెంచ వాటి లక్ష గుణాధిక్య
ఫలము గాన లగ్నబలము వలయు.

సీ. శని సోమవారంబులును గురువారంబు
భృగు భానువారముల్ జగతిపుత్ర
బుధవారములను దూర్పు మొదలు వారశూ
లలు దద్దిశాయాత్రలలరుగాదు
అంగారకునివార మర్కేందువారముల్
గురు బుధవారముల్ తరణి శుక్ర
వారముల్ ప్రాగాది వరుస యాత్రకు మేలు
మృత్యు రోగములు నశ్యించి బుధుడ

తే.గీ. కాలములను రాహుకాలనంబు కాలలగ్న
దోషములులేని కొండ శుభసౌమ్య విభవ
గతులు గలుగును యాత్రలు గలిగెనేని
బుద్ధి మంతులు శోభనంబొసంగవలయు

కం. వార తిథి లగ్న దోషము
లారయ గోధూళి లగ్న మైనను బని లే
దూరకె యాత్రకు వెడలిన
సారసుఖమ్ములును సిరులు చాలఁగ గల్గున్

తే.గీ. కేంద్ర గురు శుక్రులును షష్ఠ గృహముల కడ
పాపులును నుండు నెడ మేలు పయనములకు
పదిఁటి నాల్గింటఁ జంద్రుఁ డేర్పడఁగ రోహి
ణీనియుక్తమనుండుచో నెరయు శుభము

కం. ఉదయమున నుత్తరముమాఁ
పాదవ గ దక్షిణము పవల నొగిఁ దూర్పునురే
యదనఁ బడుమటికిఁ బోవఁగఁ
నొదుగగు సంపదలు ప్రజయోగంబగుచున్

కం. ఓపటి వేళల శకునము
చూపట్టిన కొండల మదిని సొంపు మరినచో
నేపట్లు దినము వెదుకక
వే పయనము నడుప మేలు విజయంబొదవున్

ఉ. అశ్వులు గన్యలున్ దధిఫలావళి వాద్యనుమాశ్వయానముల్
పావక దీప్తి దంతివృషభద్వయ భాసుర పూర్ణకుంభము
ద్యావహభాండ వేశ్యలు శుభాన్విత వాక్కులు మీన గానసం
భావనమన్న ముల్ శవము పాలును గంగను గన్న మేల గున్

సీ. కేంద్ర త్రికోణాళి నింద్ర గురుండున్న
నలవాయసము వలపలికి నరుగ
నబ్జారియున్న బ్రాహ్మణయుగం బెదురుగ
నసుర గురుండున్న నప్పుడేటి
రింత వామాశకుఁ బొంతనే చను బుధుం
డున్నచో సారపక్షాదళ కుడికి
ధరణిజుండున్నఁ గేంద్ర త్రి కోణంబుల
నలఘామములు బోఁకు నర్కి యున్న

ఉ. శనిరవి భౌమవారములు సంధ్యలు పర్వములట్లు పాతలున్
బనువడి షష్ఠియున్నిశలు పాడ్యమి యుత్తర కృత్తికామఖల్
గానకాని బ్రాహ్మమైత్రములు పూర్వ ప్రవాహములున్ గుళీరముల్
ధనువలకన్య కుంభ మదితంబుగ క్షౌరవిధాన బాహ్యముల్

ఆ.వె. ఉచ్చమైన తారనుండెంచ నైనిమిదై
దుదయ ఋక్ష మదియ మొదలుగాఁగ
నిమేఁడుమెలఁగు తార లెంచి తద్ద్వి గుణిత
ఘటిక లవియె యుదయ కాలమునకు

సీ. ఎన్నఁ బాదచ్ఛాయ లైన్నైన నందులో
నేఁడు పాదచ్ఛాయ లెంచియుంచి
మేషాదిగాఁగఁ గన్యాషట్కమున కెల్ల
నొక్కటొక్కటఁ బెంచి మక్కువలర
సరవితో మిగిలిన సంక్రాంతులాఱింటి
కిని మూఁడు నాలుగు నొనర నైదు
మఱియునైదును మూఁడు మఱియొక మూఁడును
దివియుచు నానాఁటి దినదళంబు

లేడిఁటను బెంచి యాలెక్క నెలమితోడఁ
బదము నీడలను లెక్కచేఁ బాలుగొన్న
పచ్చు లబ్ధమ్ము ఘటికలై యచ్చముగను
ధరణి నిర్వ్యథ మొందునఁ దప్పదరయ

మ. దినవారాదుల లగ్నముల్ గలయ నర్థిన్ గూడి లోకేశ సం
ఖ్యను భాగింపఁగ నొండు రెండు నట నాల్గైదెన్మిదైయున్ననై
ధనవైశ్వానర రాజచోర రుజలేతత్పంచకాఖ్యానమై
తనరున్ దత్క్రమవృత్తి దక్కునది తద్రాహిత్యముల్ చూడఁగన్

ఆ.వె. వాస్తవులకు వహ్ని వసుధేశు గన రాజ
పంచకంబు వడుగు పరిణయమునఁ
గదియ యాత్ర చోరకలియు నెందును మృత్యు
పంచకమ్ము కీడు లెంచిచూడ

సీ. అశ్విని దస్రాహ్వయాశ్వాఖ్యలనుదగు
భరణి ధర్మునిపేరఁ బరిఢవిల్లు
నగ్న్యాఖ్య కృత్తికకగు రోహిణికి బ్రహ్మ
మఱి ప్రజాపతి [illegible] నిరూఢ

శర్వుం డార్ద్రకును బునర్వసువున కదితి
వెసఁ బుష్యమి బృహస్పతిసమనామ
మాశ్లేష ఫణి శర్మమగు మఖ పితృనామ
మును పుబ్బ పూర్వఫల్గుని భగాఖ్య

తే.గీ. దేవతా కాభిధానంబు ధృతిఁ దలిర్చు
ధరణి ఫల్గునియనఁగ నుత్తర పొసంగు
హస్త యర్కాఖ్య చిత్రత్వష్ట్రాఖ్య నమరు
స్వాతి వాయువు పేరఁట రీతి నమరు

తే.గీ. తలఁపఁగ విశాఖ పూర్వద్విదైవ నామ
మగు ననూరాధ మిత్రమైత్రాఖ్యలఁ దగు
జ్యేష్ఠ కింద్రాఖ్య మూలకుఁ జెలఁగు నిఋతి
నామములు చెల్లు నవ్వలి నాల్గు వరుస

కం. జీవన మాఖ్యయు విశ్వే
దేవాఖ్యయు బుద్ధి విష్ణు ద్రిపాహ్వయముల్
ఠీవి వసు నామకంబుల
చే విలసితమగుచు నుండు సిద్ధాంతోక్తిన్

కం. శతభిష పూర్వాభాద్రలు
మఱి వరుణాజైకపాద్ద్వి మహికాఖ్యలగున్
ధృతి ద్విపదయుత్తరాభా
ద్రతగున్ దుది పూష పౌష రత్యాఖ్య లచేన్

వ. ఇట్లు వలుభేదంబుల ననేక మునిరచిత మతాంతరంబుల నమరు జ్యోతిషశాస్త్రం బేత దనుగుణంబకా నమరు స్వరక్రమంబు వివరించెద—బ్రహ్మ విష్ణు రుద్రాది మస్కంద కూర్మ దివ్యామలసప్తసంఖ్యయు, యుద్ధ జయార్ణవ సిద్ధాంత పట్ట ధూళగామడ స్వర భైరవ, చయుపద్ధతి, స్వర సింహ బడబానల స్వరార్ణవ కూటయుద్ధ తంత్ర గ్రహణ హృత్రితముండికా జ్యోతిష మస్తకేంద్ర మంత్ర గ్రంథ యంత్రశాస్త్ర శ్రీదర్శనవతీ త్రిముండి యోగి నీలాజ శంబర కుమారి కాళలాది శాస్త్రసారంబును నాత్మజ్ఞానాధారంబును నాయుష్ప్రదంబును శ్రేయస్కరంబునునగు స్వరశాస్త్రంబు కృతాది చతుర్యుగంబుల జయార్ణవ బ్రహ్మయామళ విజయార్ణవ స్వరోదయాఖ్యలం గ్రమంబునఁ దనరునట్టి స్వరశాస్త్రం బెఱుంగ నేరికి నలవిగాదైన నెంతయుంత యెఱింగిన ననంతఫలప్రదంబగు గావునఁ దద్విధంబు వినుండు.

సీ. చతురంగ బలయుత జనపతి హీనస్వ
రోదయుండగు నేని వోలి నల్ప
బలయుతుచే దిక్కృతులు గాంచు స్వరశాస్త్ర
మెఱుఁగక నని సేయు ధరణిపు జయ
మరయ ఘుణాక్షర న్యాయమా స్వరచక్ర
గౌర్వాప్తిఁ బడక రణాబ్ధి నీఁదు
సత్యశౌచ వివేక చతురత నదినేర్చు
నతఁడు జయంబవశ్యముగఁ బొందు

తే.గీ. స్వరముదయమైన నతిబల సహితు గెలుచు
నది పొసంగమిఁ బుత్వులనైన వేఁటు
లాడఁ దగదు నృపాలున కటులగుటను
దైవమును మోతు శమనమంత్ర స్వరముల
నెఱుఁగు పెద్దరుదైవము లిలఁదలంప

ఆ.వె. హీర పద్మరాగ గారుత్మతేంద్ర నీ
లములు మౌక్తికంబు నమరఁ బంచ
రత్నములు శుభంబు రహినిచ్చుగతి పతి
కిత్తు రెవ్వరు శుభ మొప్పుదరయ

వ. వర్ణ మాత్రర్క్ష సేంద్ర జీవ గ్రహ రాశి యోగస్వరంబులును నాడి ఘస్ర పక్ష మాస ఋత్వయన వత్సర ద్వాదశాబ్దాధ్వరంబులునుంగూడ స్వరచక్ర భూబలాంగబల జ్యోతిష శకునబల ప్రకరణంబుల నప్పదియాఱు స్వరంబుల ఫలాఫల నిరూపణ కారణము లగు, నందు వర్ణంబు లకారాదులను ఋక్షస్వర మశ్విన్యాదులను బిండస్వర మూర్పు లను జీవస్వరంబు తత్కాలిక ప్రచారమునను గ్రహ రాశి యోగనాడీ దినపక్ష మాసస్వ రాదులు తదాత్వప్రచారంబులవలనను శుభాశుభంబు లెఱుఁగందగి యమరు నందుపిండ స్వరంబు.

కం. ఇడ యెడమ ముక్కు పింగళ
కుడి దెసను సుషుమ్న రెంటి గుఱుతుగ నెపుడున్
నడుమత ప్రాణాత్మక
మెడపక ప్రాణుం డపానుఁ డీమార్గమునన్

కం. ఆదిచంద్ర సూర్య సంక్రమ
పద సంజ్ఞలనైను గతులు పరిమితముగ భూ
మ్యుదకాగ్ని పవనగగనా
స్పదములు గా వరుస నడుచు జననాసికలన్

సీ. రవి భౌమగురుశని దినపాదులర్కస్వ
రంబును దక్క వారముల మొదల
నిందుస్వరంబును నెనగు గడియల
నల సుషుమ్నయుఁ బృథివ్యాదిపంచ
భూతముల్ నడుమన పొసఁగఁ గ్రింద (టఃపై) పైని
నడ్డంబుగా రెంట నడరు పిదప
నాద్యంత పక్షములవ్వార్కులనఁ దగు
పిదపఁ బక్ష మాసర్తు వత్సరాయ

నాదులదిన త్రయంబు నయ్యై స్వరమ్ము
నడుపఁ దత్పక్ష మాసాయనర్తు వత్స
రములనెల్లను శుభమగు క్రమము నెరయ

... ... ...

ఆ.వె. ఇందుఁ దడరు వేళ నిను స్వరంబైనను
నినుఁడు నడచు నెడల నిందుఁడైన
నట్టి పక్షమాస హాయన దినములఁ
గీడు లాదవు జనుల కేడనైన

కం. పవలింటినాడిని నిశి నిం
దువిభుని నాడి దినమందుఁదొడరఁగ మనునా
సువివేకిమై యోగీశ్వరుఁ
డవనిఁ బొందియము వలవదాక్రియఁ దగినన్

వ. గమనంబులకు వామ స్వరంబులును ప్రవేశంబులకు దక్షిణస్వరంబులు సుఖప్రదంబగు మఱియు నిందుచారంబున విషహరంబును రవిచారంబున నంగనాజనవశీకరణంబును సుషుమ్నను మోక్షంబును నగుచు నేకంబయ్యును త్రివిధంబగు వామస్వరంబు ఖగరూపంబగు నాత్మమెలంగు చంద్రనాడిని జ్వరమూర్ఛితుల కడిగెడు ప్రశ్న సుఖకరంబగు శాంతిశోక విపార్తజనులకు నృపతోషణ భూషణాలంకార దూరయాత్రాదానసంగ్రహ శాంతి పౌష్టిక దీక్షా సంధికార్య వివాహ బీజావాపన వ్రతౌషధ కర్మ నృపదర్శన స్వజన సమాగమ యోగవిద్యాభ్యాస తటాకాంబు కుల్యాసిద్ధ క్రియలును సస్య దేవతాప్రతిష్ఠాది కర్మంబు లుత్తమఫలదములగు. విద్యారంభ వాణిజ్య, దీక్షా, సేవా, శాస్త్రాభ్యాస, ద్యూత వివాద, ఖేటక, చౌర్యక్రియా, గజాశ్వాదివాహనారోహణ యజ్ఞ శిల్పకర్మ, లిపిలేఖన గీత, మంత్రయంత్ర యుద్ధ, భేషజ, శస్త్ర, విషఘాతనిగ్రహ, వ్యవహార భయకార్యాభ్యంగ పణ్యాకర్మ స్నానభోజన మైథున మోహన, స్తంభన, విద్వేషణ, ప్రహర్షణాకర్షణ క్షోభణ శయనాది కృత్యంబులు సూర్య స్వరంబులం జేయుటలధిక ఫలదంబులగు నిందియు—

సీ. ఉభయనాసులయందు శ్వాసక్రక్ర నిమిత్తంబు
నడుచు నర్యోడ( బ్రశ్నలడుగుట యొనం
కార్యంబులును ఫలగతులానగూడఁగ
మిశ్రాఖ్య గలయది మేలుగాఁగ
నిరుత దేహంబైన శిరఘృగ జీవనా
డినిఁ బ్రశ్న వేఁడిన ఘనశుభదము
చంద్రునాడిని జేసి సవితృ నాడిని సమా
హిరములుగా శూన్యగతిని నిల్చి

ఆ.వె. యడుగు ప్రశ్నములకు నగువిపరీతంబు
శ్వాస మొదవుఁ బార్శ్వ సంగతముగ
మాతలడుగు ప్రశ్న దొడరును శుభములై
సిద్ధ ఫలదముగ బ్రసిద్ధమగుచు

తే. గర్భిణికి వేఁడు ప్రశ్న యర్క స్వరమున
సుతుఁడు, చంద్ర స్వరంబైన సుతయు శూన్య
మునను విపరీతమును గల్గు విషువులందు
పైనఁ బతన నపుంసక భావమగును

వ. శూన్యమున నిల్చి పూర్ణనడిగిన మృతుండును జీవితుండగు ప్రశ్నలు సుఖకరం బగు తద్విపర్యయంబైన స్వస్థుండును మృతుండగు నిరుదెస స్వరంబునడుచున పుడైన రోగి దార్ఘ్యుండగు నితర కాలంబులనైన విఫలమగు వామనాడిఁ బూర్వోత్తర దిశలకు దక్షిణనాడి యామ్య పశ్చిమ దిశలకు యాత్రలు దగు విషువన యాత్రయనందగదు నితరగతుల యాత్రలు శుభదమగు స్వరభాగంబు జీవంబు. ఇతర భాగంబు శూన్యంబనందగు సత్త శలాకా ప్రకరణంబున భూబలంబెత్తింగి అఇఉ ఎఓ అను స్వరముల ప్రశ్నలకు ఫలాఫలం బలిత క్రమంబున కెఱుంగందగు నిట్టిశిక్షా వ్యాకరణ ఛందో నిరుక్త జ్యోతిష శేఖరంబగు కల్ప క్రమంబు—

కం. కల్పము శ్రౌతము శ్రేష్ఠిక
నల్పమహాత్త్వమన స్మార్త యాధారతఁడ
త్కల్ప ప్రకారయాగము
లల్పేతర సుకృత వితతులవడఁగఁ దగుఁ

సీ. ఏకరాత్రము మొదలెన్నఁగ దశరాత్ర
సంఖ్యఁ జేయఁగఁ దగు సవనవితతి
యందు నేకాదశంబది పౌండరీకంబు
ద్వాదశాహస్సనఁ దగును బిదప

నైన నక్షత్రేష్టు లనఁబడి యదియున
గ్నిష్టోమ మత్యగ్నిక్రతువు శుద్ధి
జ్యోతిరప్తోర్యామ షోడశ మతిరాత్ర
సర్వతో ముఖములు సర్వకృష్ణ

ఆ.వె. సవన వాజపేయ సౌత్రామణులు మహా
వ్రతబృహస్పతులు సవనములశ్వ
మేధ విశ్వజితుల మేయ చయనములు
రాజసూయ యజ్ఞరాజి మఱియు

కం. గోమేధ కాదియజ్ఞము
హోమహిత క్రమము తత్తదర్హ విధంబుల్
ధీమానసీయ కర్మము
లామిః నెఱిఁగింతు శ్రౌత మాద్యంతమ్మున్

వ. స్వర్గకాములగ్నిష్టోమంబులాచరింపవలయు ననెడి శ్రుతివాక్యంబును సవనసహస్రనియమంబులును తత్తదుచితవారంబులు దదుపపాత్రోపకరణ ద్రవ్యమంత్ర తంత్ర శాలానిర్ణయ వేదివిశేషంబులు దెల్పఁ గల్పనామంబయ్యె నట్టి క్రతు ప్రకరణంబులయందు.

సీ. బ్రహ్మయధ్వర్యుండు ప్రస్తోత హోత సు
బ్రహ్మణ్య నేష్టృమైత్రావరుణులు
నుద్గాత యాగ్నీధ్రుఁడున్నేత హోత య
చ్ఛావాక బ్రాహ్మణాచ్ఛంసులు ప్రతి
హర్త గ్రావస్తోతయును ప్రతిప్రస్థాత
తగ నుపద్రష్ట సదస్యులనఁగ
నను మఱియుఁగఁ దెల్ప నందియ నొనఁగూర్ప
వేల్పుగములఁ బిల్వఁబిలిచి హోత్రుఁ

ఆ.వె. ప్రబలఁ జేయు వస్తుపంక్తి పాత్రల నిల్ప
నమరదింపఁ జూడ నమరియుంత్రు
కర్మితో ద్విషట్క ఋత్విక్కులఖిల యా
గములయందుఁ గల్పగతిఁ బొసంగి

వ. మఱియు దర్వీ ప్రమాణ మథ్యాజ్య హోమద్రవ్య భేదంబు లెఱింగించు కల్పంబని వేదాంగంబు లెఱింగించిన సూత్రం గనుంగొని యజుర్వేదశాస్త్రంబు లెఱింగింపుమని శౌనకాదులడిగిరని—

శా. శృంగారాకర వత్స భాగవిలసచ్ఛ్రీవత్స! వత్సార్భకో
త్తుంగైకాకృతి నందితామిత లసద్గోపాంగనానీకలసా
భంగస్వాంతన వాబ్జ! యబ్జరవి భాస్వన్నేత్ర! నేత్రస్ఫుర
ద్గాంగేయాలయ! పాదపుష్కర! కరాగ్రస్థారి శంఖోజ్జ్వలా!

కం. అరిదరకర! సురగణారా
డరిదర! కరిభక్తయుత మహర్షి నికరము
త్యరి వికసన కరుణాశ్రీ
శర! కలికంఠనుత! శుభముఖ స్థిరసుకరా!

తరలము॥ కలశ సంభవ సత్తపోఫల కారణార్తినివారణా
విలసితానన పద్మ! పద్మనివేశినీప్సిత పూరణా!
బలరిపుస్తుత నిత్యసేవిత పన్నగామర చారణా!
జలజలోచన! వేంకటాచలసద్మ సంస్థిర ధారణా!

గద్య. ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదాసాదితకవితావిచిత్ర మహంకాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్రపాత్ర వినయగుణాదృతి వేంకటపతి సహాయ తేకుమళ్లాన్వయ పాథోనిధి పూర్ణసుధాకర తిమ్మమాంబాక్రయామాత్యకుమార సకల విద్వజ్జనాధార శ్రీవత్స గోత్ర ఆపస్తంబసూత్ర సత్కవిప్రమోదసంధాయి రంగశాయి రచితంబైన వాణీ విలాస వనమాలికయను ప్రబంధంబునందు సాలగ్రామ లక్షణ ప్రభావ గ్రాహ్య గ్రాహ్య క్షేత్రమూర్తి నిర్ణయ వరమేధ మత్స్య కేశవశివనాభాదిబహుభేదరూపప్రమాణనిర్ణయంబులును తద్దానపూజాఫలనిరూపణంబులును తులసీ మహిమయు బృందావన నిరూపణంబును జలంధరోపాఖ్యానంబును దన్మహిమకుగా మృగయుచరిత్రంబును విష్ణుయమభట సంవాదంబును తులసీప్రతిష్ఠార్చనాఫలంబులును దీపదానమహిమకుంగా లలితా మాంధాతృపూర్వ జన్మ వృత్తాంతంబులును దేవబ్రాహ్మణ ప్రతిష్ఠాఫల నిరూపణంబులును బ్రహ్మప్రశంసయు దానఫలంబులును మాసదాన నిర్ణయంబులును చతుర్వర్గధర్మవిశేషంబులును దానపాత్ర నిరూపణంబులును నానావిధ దేవతా ప్రీతికర దానభేదంబులును భూదాన మాహాత్మ్యేతిహాసంబులును చిత్రదానఫల నిరూపణంబులును అపాత్ర నిర్ణయంబులును అన్నదాన ప్రభావంబు నోషధివ్రీహి భేదంబులును తదీయప్రభావేతిహాసంబులును యమధర్మరాజకిరాత సంవాదచరిత్రములును దురన్నదోషనిరూపణంబును వివాహోక్తవిధ వర్ణార్హ జాతి ధర్మ ప్రమాణంబులును కన్యాదాన ఫలప్రశంసయు పితౄణమోక్ష కారణ కౌండిన్యోపాఖ్యానంబును నుదకదానమహిమకుంగా సుశీలచరిత్రయు ఋణానుభవ నిమిత్తక భద్రక కౌశిక సత్యశీలుర వృత్తాంతంబులును శిక్షావ్యాకరణ ప్రశంసయు ఛందోలక్షణంబును నిరుక్త విధానంబును జ్యోతిష నిర్ణయంబును కల్పవివరణంబును నను కథలంగల తృతీయాశ్వాసము సంపూర్ణము.

# చతుర్థాశ్వాసము

శ్రీవనితేశా ! భూసౌ
ఖ్యావేశన ! నీలనీరదాంబద్దేహా !
సేవిత పుష్కరజ ! శ్రీ
మానవహకల్యాణ వేంకటాచలనాథా !

వ. దేవా! అవధరింపు మక్కథికుం డాయుర్వేద గాంధర్వవేద ధనుర్వేదంబులను మనువేదంబు లిట్లని వివరింపందొడంగె.

సీ. నలువ మానస మిథునద్వైధ సృష్టిచే
జగమెల్ల జన పూర్ణమగుచు నెరయ
భారమోర్వక భూమి పద్మజుఁ బ్రార్థింప
సరసిజాసనుఁ డొక తరుణిఁ బొడమ
నొనరింపుచును మృత్యువను పేరువెట్టి లో
కులఁ జంపుమనుడు నప్పులుకు చెవుల
కలుగులై కన్నీరుదొలఁక నేడ్చుచు నిట్టి
క్రూరకర్మమున కేఁ జేరననిన

ఆ. వె. నేత్రవారి బిందునివహంబు నన్నూఁటు
యరువదియు మహారుగాకృతులను
జనులఁ దునుము నీకు నడిలేదు పొమ్మని
జలజభవుఁడు రోగములకు ననియె.

ఉ. మీరలు లోక [ధ ?] ర్మముల మేరలకుం దగినట్టి [కష్ట] దు
ర్వారుల పూత నేయుచు నవశ్యము నాయువు దీయుఁ దుస్సుఁదా
చార విహార సౌకృత విశారద కేశవభక్త వర్జనా
ఘోరత రాఘదౌష్ట్య ఘన కుత్సితమానవకోటిఁ జెందుచున్

వ. దురితయుతుల దాంభికుల నసత్యవాదుల సజ్జనద్వేషుల హరిహరదూషకుల బాధించుచు ధరణిఁ దిరుగుఁడు—

కం. అని నియమించిన నవి య
ట్లన దుష్టాచారజనములన్ బాధల నెం
దునఁ గూర్చినఁ బోనీయక
ఘనపీడలొనర్చి దేహగతు లెడ సేయున్

సీ. ఒగి వాయువులు నెన్బదొకటి త్రయోదశ
సన్నిపాతమ్ములు సరవి నిరువ
దొకటి మేహములు నాల్గు కుటిలాజీర్ణంబు
లెనిమిది గుల్మంబు లిరువదైన
మూత్రరోగమ్ము లిమ్ముగ నరువదినాల్గు
జ్వరములు శ్వాసపంచకము శ్లేష్మ
మన్నూరు పదునొకండగు క్షయంబులు నాల్గు
రక్తపైత్యముల స్వరసదములును

తే.గీ. శ్వాస లరుచులు ఛర్దు లెంచంగ నైదు
నైదు హృద్రోగములు నటు లాఱు తృష్ణ
లర్శలాఱును సన్న్యాస మనెడి దొకటి
మదము లేడును మూర్ఛలిమ్మహిని నాల్గు

సీ. అతిసార షట్కంబు నావర్త మొకటి శో
థులు తొమ్మిదియు గ్రహణులవి నాల్గు
నొకటి హలీమకు మొనరఁ గుష్ఠవులు ప
ద్దెనిమిది పాండువు లెన్నఁ నటులఁ
ఛర్ది పద్దెనిమిది పీనస లరువది
[యాముక వ్రణ ? ]ములు నమర సన్ని
పరగ నిర్వదినాల్గు పైత్య రోగమ్ములు
శ్లేష్మమ్ము లిరువది వెనకు నేత్ర

తే.గీ. రోగములు షణ్ణవతి కర్ణ రోగవితతి
పంచవింశతి ముఖరోగ పంక్తులటుల
శిరమునం బదితొమ్మిది యమరలోక
విఖ్యాతులైనట్టి యాయాయి విధములిట్లు

కం. నొచ్చుచుఁ బీల్చుచుఁ గాఁకల
హెచ్చుచు జఠరానలమ్ము నైడల్చుంచుచు నో
ర్విచ్చఁగ నేఘుభు బిక్కు రో
గోచ్చయ మురుబాధ పల్చు నొగినరు లోరల్

వ. అంతట—

మ. సురలున్ మౌనులు విష్ణు విశ్వవిభునిన్ స్తోత్రంబు గావింప శ్రీ
హరి తద్భావమెఱింగి మీకు దృఢమై యత్నం జేయుదున్ రోగహృ
ద్యరుచి ప్రక్రియ నంచు దానమృత హస్తాబ్జుండు ధన్వంతరి
స్థిర నామంబున క్షీరవార్ధిఁ బొడమెన్ జీవాతన ప్రక్రియన్.

ఆ.వె. పొడమి రోగనాశమును శుభకరము నా
యుశ్శ్రుతమ్ము వేద మొనరఁ జేసి
జనులకుక్షయంబు శాంతిఁ బొందించె మౌ
నీంద్రు లమరవరులు నెల్ల పొగడ.

కం. సత్యముగ నక్యముఖగుణ
కృత్యత కఫవాత పైత్యకృతముల చేనా
ధత్యము నాడీత్రయమున
నిత్యము దేహ ప్రచార నియతులఁ దెల్పున్

ఆ.వె. శ్లేష్మనాడి తలఁప శివుఁడు పైత్యము బ్రహ్మ
వాతనాడి విష్ణుఁ డాతతముగ
నఁత్య ప్రళలశ్లేష్మ మధికమౌ లయ కార
ణుండు పార్వతీధవుండు గాన.

కం. హృదయమునఁ బ్రాణవాయువు
హృదయేంద్రియ చిత్తముల భరింపుచు నిశ్వా
సహైతగు నొగిఁ దెంపులు
నొదవింపుచు భోగ్యవస్తువులురువుగఁ బొన్పున్

తే.గీ. వస్తి మేఢ్రోరు గోచరవసతి గుదము
నందపానుఁడు పానఁడు డగుచు గర్భ
మూత్ర శుక్లార్తవములనిమ్ముగ వెలార్చుఁ
బరగ నుఛ్వాసకారణస్థిరతఁ దనరి

తే.గీ. వ్యానుఁడు హృదిస్థుఁడయ్యు సర్వతనుయాత్ర
ప్రజలు నాక్షేపణోత్క్షేపటము, నా ని
మేషణోన్మేషణక్రియా మేళనమున
నన్ని పనులకున్ దానయి యతిజవమున.

చం. గుదమున నయ్యపానుఁడున తుంతితుఁడై వసియింపుచుండు నాఁ
ప్రమదుఁడును నాభికంఠబిలవర్తియ ప్రాణవరుండునున్ బిలా
స్పదుఁడునునై మెలంగు సవికంబులకుంగ్ కలిన్ సమానుఁ డౌ
న్నౌ దగఁ జఠరాగ్నులను పేర్చి మెలంగుచుఁ దేజమొప్పఁగన్

చం. కటి హృదయాస్థి నేత్రములఁ గర్ణములన్ స్పృశిశన్ మెలంగుచున్
పటుసత భుక్తపాన వచనక్రియఁ జేయుచు వాయువుల్ తమం
తటఁ దను జేర రక్తముదితంబుగ నూర్ధ్వగతంబుగా రస
స్ఫుటు మొదలింప శ్లేష్మగతి పొల్పుగఁ బైత్యము పెంపఁ దానయై.

తే.గీ. స్పర్శ దృఙ్నాభులన్ బైత్య చర్య నించు
ఘ్రాణమేప న్నులన్ జిహ్వ కఫము జేర్చు
నాసమానుంపు నస్లి ప్రాణానిలములు
నైదగు ధనంజయాదుల్లు నైదుగలవు.

కం. అవి యుపరప్రాణమ్ములు
నవిరళముగఁ బ్రాణదశకమగునవి యవియున్.
వివిధములగు నాడులుతముఁ
గవియును ద్రిగుణమ్ములు బుక్కఁగాఁజేయుఁదగన్

సీ. వారుణి పూషగాంధార పయస్విని
శంఖినీ హస్త సరస్వతియు నరణి
జడహస్తి జిహ్వ యశస్విని విశ్వోద
రియు నలంబుస పద్మినియును నిడయుఁ
బింగళయు సుషుమ్న పెనచుక పదియాఱు
దలఁపఁ బ్రధాన నాడులుగఁ దనరు
రావాకు నడియా నె భావమ్ము కుండలి
పార్శ్వపుటీ గెల పగిది కత్తి ?

ఆ.వె. నమరఁ పేఁచుచంద మగుచు డెబ్బది రెండు
వేలనరములంటి వెలయుదాన
నందు రక్తమాంస మూ నాడులను గూడ
ధాతువనఁగ రుజ్నివాసమయ్యె.

కం. వాతము వక్రము పైత్యం
బాతత చాపలము శ్లేష్మమరయంగ స్థిరం
బీతెఱఁగులు గలసినయది
ధాతుగి ద్వంద్వమ్ములగుటఁ జను దెలియంగన్.

ఆ.వె. జలగ పాముఁ బోలి మెలఁగు వాతము తొంత
కప్పభంగి మెలఁగఁగలదు పైత్య
మమరఁ గ్రోలి గమనమైన శ్లేష్మపునాడి
జతలు సర్వ కృముగతులు దెలియ.

తే.గీ. పరగుచుఁ జిల్కగతి సన్నిపాతనాడి
మాంద్యచాపల్య కుటిల సమ్మర్ద మగుచు
మెఱసి శీతోష్ణ సంగతి నైరయునాడి
సాధ్యముఖుగాని యెడల నసాధ్యమగును.

కం. చేతి బొటన వ్రేలి క్రిందట
వాతం బావెనుక పిత్తపర్వము శ్లేష్మం
బాతరువాతఁ సమగతు
లీతెఱఁగున కుబుక రోగ మెచ్చుటు నరయన్.

కం. పురుషులకున్ గుడిభాగము
తరుణులకున్ వామ హస్తతండము నాడీ
స్థిరతోల్బణము ను దెలియఁగ
బరికింపన్వలయు శాస్త్రపారీణులకున్.

తే.గీ. పాదకర మూలధాతువుల్ పలుకు నేత్ర
మూత్రమలములఁ బలు రోగముల నిదాన
మెంతెఁగి దూడంగఁ దగు నొచ్చు పెల్లవాత
మడరి మంటుట పిఁటు పైత్యంబు కఫము.

కం. వాతమ్ము లేని శూలయు
భాతిగఁ బిత్తమ్ము లేని భ్రమయున్ శ్లేష్మ
ద్భూతంబుగాని తీఁట భ్ర
జాతతికి నజీర్తి లేని జ్వరమును గలదే!

తే.గీ. నలి నపస్మార మృత భాషణములు చిత్త
విభ్రమం బూర్ధ్వ నిశ్వాస వీక్షణములు
జ్వర విదాహక వదన సంస్పర్శ యార్తి
తనుత మృతి చిహ్నలగు నవస్థాదశకము.

సీ. అట్టి యవస్థల నలయించు రోగముల్
పాపకర్ములను దత్రాప్తి గొలఁది
గోఘ్నుల వాతంబు గోరి ప్రజా పీడ
నాసక్తజనుల జ్వరావళియును
హాహార ద్రోహుల నధిక వ్రణమ్ములు
బ్రహ్మఘ్నులకు గుష్ఠపంక్తి స్త్రీవ
ధాన్వితులకు రాజయక్ష్మలు గురుతల్ప
గుల మహారోగముల్ పొంగు సర్ప

తే.గీ. హరకులన్ జైత్యముల్ పితృ హంతలైన
వారి శ్లేష్మామయము పితృవ్యనిహననుల
గుల్మములు మాతృహంతలఁ గుక్షిరుజలు
యతినిహంతలఁ గాశరోగాళి చెందు.

తే.గీ. భ్రాతృ వధకులఁ గాశముల్ బాధపఱుచు
తల్లి సవతులఁ గవయ వంధ్యత్వ మొదవు
తత్సుతులఁ జంపఁ బాండువుల్ దవులు మామ
దునుము వారల శోఫలు దొడఁగి పొందు.

కం. హాలమగు సోదరీ వధ
నాలస్యతఁ బుత్రిఁ గవయ నక్షిపటలము
ద్వేలమగు గండుఁడగుఁగదు
పోఁగ నిజజనని తోడఁ బుట్టువుఁ గవయన్.

ఆ.వె. కన్న పుత్రిఁ దునుమ గజ చర్మ రోగియౌ
భూపపుత్రిఁ గవయ మూత్రరోగి
వెలయు శిశువుఁ జంప విషచర్మరోగియౌ
బ్రియసుగంధహారి పీనసియగు

కం. గురుతల్పగు మూత్రామయ
మరయంగాఁ గనకహరణు నటు శోఫయు భూ
సుర ధనహారిని లేమియు
గురుశాపల గోని రుంధకునిఁ బీడించన్.

కం. దుహితృ వధావ్రతు మూర్ఛయు
మహి మాతుల వధవహిన్న మాతులపత్నీ
నిహను దపోహను మాతృస
మహనున్ ఓట్లహయు ? జెందు మద కొడయంగన్.

ఆ.వె. శిల్పిహత్యవలనఁ జిత్రరోగము చెందు
నశ్వహత్యవలన నడరు దులుము
మిత్రఘాతు నొందు మేని స్థూలత్వంబు
దాసిఁ జంపనొదవు దర్మరంబు

సీ. వేశ్యను దునుమఁ బ్రవేశించుఁ గ్రమరుజ
వదనరోగ మబద్ధవాది నొందుఁ
శిశువులు పోకార్చఁ జెందును గ్రహణి య
శ్వత్థహానికి రోఁత వగ నతిథును

క్షితి కావి చెఱిచిన నతిపార ముసఁగూడఁ
గూటసాక్షికి నోటి గొదవలొదవు
సరవి ఘ్రాణకుల విషమ రోగములు చెందుఁ
బటుమూర్తివాలి సన్నిపాత మొదవు

తే.గీ. సుమవన తటాక దేవాలయముల నదుల
రలియు నుచ్ఛిష్ట మలమూత్ర గతులఁ దవుల
యతి నతివ్రతి నిందలు మతినొనర్ప
విషరసజ్ఞ రుజల్ చెందు విశ్రుతముగ.

౪౦. పాపములు నిరయకూప
వ్యాపారితననుభవించి యనుమతి మనుజుం
డైపుట్టి నప్పుడిట్టిమ
హాపాతక రోగతతుల నలమకు పొందున్

ఉ. అందులకున్ బ్రతిక్రియ మహామహులౌ తొలివైజ్ఞసత్కృతుల్
మందులనేక మూలికలు నప్పుమతిన్ గలిగింప మానిరా
ద్భుతదము హోమదాన జపవిష్ణ శివార్చనలు న్విధించె నా
ఛందము సేయువారి కనిశంబును రోగము లొంద వెన్నడున్

సీ. అభ్యంగమున్ నస్య మంజనమ్మును వస్తి
రహి ధూమకర్ణపూరణము లేప
నము తైలతనుమర్దనమ్ము గండూషంబు
నౌషధమును టీక లగ్నితప్త
లంఘనతప్త తైలకషాయ కల్కచూ
ర్ణవిరేచవమనముల్ రక్తమోక్ష
రక్ష విధుల్ లేహ్య రసరసాయనములు
దండన పాన ఘృతవ్రతతియుఁ

తే.గీ. గల్పసేవ శిరోవేష్టకము మితాశ
నము మహాశన హోమ దాన జప దేవ
తార్చనావని సురభోజనాభిమతులు
శాంతి కారణము లివి సత్సౌఖ్య మొసఁగు

తరలము. తొలుతఁ జేసిన పాపపుంజములోన నారక బాధలున్
బెలుచఁ దీఱఁగ శేష మియ్యలఁ బీడలౌ తుద కాయమున్
దొలఁగు నౌషధ దానమంత్ర విధుల్ సదాద్విజ దేవపూ
జలు నొనర్పఁగ సజ్జనాలికి శాస్త్రి వైఖరి దీఱఁగన్.

ఆ.వె. ఔషధములలోన నగు రసౌషధములు
మేటియగుట వాటి మిశ్రగతుల
గంధకము రసంబు కలిత పాషాణముల్
శుద్ధిరేయుఁగవలెఁ బ్రసిద్ధిగాఁగ.

ఆ.వె. పిల్లకోడియైనఁ బెట్ట పావురమైనఁ
దినఁగఁ జేసి పెడలఁ దీసినట్టి
రసముశుద్ధియగుచుఁ బొసఁగు నౌషధములఁ
గలసి యౌషధముల మెలపు మీఱు

కం. పాలపయిఁ బిట్టుఁ బెట్టిన
పోలిక పాలిడిన శుద్ధి పొడమి గుణమగున్ .
మేలిమి గంధక మౌషధ
జాలమ్ముల గలుపు నపుడు చర్చింపంగన్

ఆ.వె. శాకరాకు వేఱు కాయ బీఁగల పస
రుల విశుద్ధియగుచుఁ దలఁప నౌష
ధములఁ గలసి గుణము సమకొను పాషాణ
వర్గమదియు సకల వైద్య మతము.

ఆ.వె. నిమ్మపంటి పులుసు నైరజెండ కరుణైన
నొక్కదినము నాన నుండ నీయ
నిర్మలమగు శుద్ధి నేపాళమునకగు
నౌషధములఁ గలుప నర్హమగుచు

సీ. అభ్రమాక్షిక విమలాద్రిజ వైక్రాంత
సస్యక చపల రసోచ్చయములు
గంధోష్ణ కాసీస గైరిక శ్రీకాళ
కంకోష్ట మణిశిలా ఘనశిలాంజ
నములు పాదక హారి నవసారక కపర్ది
గౌరిపాషాణ గోదార శృంగి
కంపిల్ల చపలముల్ కరిరాద్రి సింహార
హింగుళంబులు క్రమంబెసఁగఁ దెలుకి

ఆ.వె. సముల సరసములును సాధారణ రసమ్ము
లివియిరువదినాల్గు నెలమిఁ బొదలి
రుజల నడఁగఁ జేసి ప్రజలకు నెల్లను
నెమ్మియొసఁగు శాస్త్ర సమ్మతముగ

వ. ఇట్టి క్రియావిశేషము లెఱిఁగి దేశకాల గుణస్వప్న దూత లక్షణముల వలన సాధ్యాసాధ్య నిశ్చయం బొనర్పందగునందు.

చం. వెరపును దైన్యపాటు తలవీడుట మేనువడంకుటల్ భ్రమల్
బోరయుట చేత దండమటఁ బూనుట చేతులు గట్టి గొంటయున్
బరువిడి వైద్యుఁజేరి యశుభ ప్రకటోక్తులు పల్కి సంధ్యలన్
దిరముఁగ నగ్ని నైరుతి విదిక్కుల నిల్చిన దూత కీడగున్

వ. స్వప్నఫలాఫలమ్ములు వినుఁడు

సీ. పంచీకృతంబైన పాంచభౌతిక మగు
స్థూలగాత్రంబున లీల సాక్షి
కంబు జాగ్రదవస్థఁ గలుగు షోడశవికా
రముల లింగశరీర మమర రాజ
సాకృతిమై స్వప్నమగు కారణాఖ్యను
దమముచే స్వాపమా క్రమముతోడ
విశ్వతైజసులన వెలయుఁ బ్రాజ్ఞుండన
నాత్మయొప్పగు నిట్టి దగు నవస్థ

తే.గీ. అను ప్రమాణంబులను సూక్ష్మ తనువు ప్రాయ
జనఘ ! పరమాత్మనెడఁ జెందు నతదనుక
కారణ శరీర మెడయదు కలయఁ బోలయుఁ
గానఁ జిత్సుఖ మాస్వాదగతిఁ బొసంగు

తే.గీ. స్వప్నమింద్రియదశ సుహృత్సంయుతంబు
ప్రాణ పంచక చర్య ప్రపంచక మగు
కంఠ హృన్నాభి గుదములఁ గదల వయ్యు
దానముఖ్య చతుష్కమౌ ప్రాణ గతులు

కం. వ్యానుఁడు సర్వశరీర
స్థాన వ్యాపకుడు గాన సకలేంద్రియముల్
వాని వెనుదవ్వులు నెందున్
గానఁ దలంచినవి విన్న కన్నవి యెల్లన్

చం. కనఁ బడినట్లు సూక్ష్మతను కారణమై పొడకట్టి నట్టివిన్
వినుఁడవి రాజస ప్రకృతి వింతగు దైత్యగుణోల్బణంబునన్
గనునది పుష్యమాసమునఁ గల్గి నచేక విధంబులై తగున్
దినములుగాఁ గలల్ జనులు దీన నెయుంగవలెన్ ఫలస్థితుల్

ఆ.వె. కొంకు చల్కువతఁడు పోసఁగఁ గన్గొనుకల
రోగజన్య మదియు రూఢి కెక్కు
దందు పరుస నాలుఁగగు జాల నేఁడష్ట
......కూస......చర్య నమరు

కం. పతుల విడుచునెడఁ గనుకల
పొసఁగుఁ గన్నాన్హ్రదు నాళ్లఁ బూనిక ఫలద
వ్యసనతి సర్పము కుడిభుజ
మెసఁగఁ గఱపఁ గనిన శుభము లెంతయుఁ గల్గున్

సీ. హస్త్యశ్వడోలిక లాందోలికలు వెన్క
నడవఁగఁ బ్రభువులు నడచు తేరు
రక్తధారలమేయఁ గత్నముల్ పతుగణ
బ్రాహ్మణులఁ గన్నఁ బరగు శుభము
జెలగ పామును దేలుచేరియుంటఁగఁ గన్న
[భార్య కప్రియమగు ?] బావివడఁగ
కన్నెలఁ జూడఁగ ఘనసౌధగిరులపై
జనులతో నుండంగ జలధి దరిని

తే.గీ. నుండఁగాఁ గలఁ గన్న వేతొకరి దాస్య
కుమరు నట్లుగ బ్రవణగాత్రు నధిక కార్శ్య
ధనకనకపుష్పవనములు గనుట లెస్స
శయ్య నుండఁగఁ గలఁగన్న సౌఖ్యమొదవు

చం. లకుముకి కోడి క్రౌంచమొకలావుకఁ గన్గొన నగ్నినిల్వఁగాఁ
ప్రకటిత వాహనస్థితులఁ బాడుగృహమ్ములలో సుఖాసన
ప్రకరములన్ వసింప స్ఫుటపంకజ పాంసురవస్త్రముల్ గనన్
సుకరవి భూతి యన్ శుభము శోభనమున్ గలుగున్ గ్రమంబునన్

కం. నీలాంబరసుమ భూషణ
జాలాన్వితపతులఁ గనిన సరవి ధరింపన్
లీలన్ సూర్యునిఁ జందురుఁ
బోలఁగఁ గలఁగనిన రోగపుంజము లౌదవున్

ఆ.వె. కొమ్ములున్న బలుమెకమ్ములఁ బలుకోతి
నట సివంగి నొగయు నట్టి పక్షి
సంత్యదుష్ట జనుల నంబు వర్షము జల
మింకఁ గనెడు కలల నొసఁగుఁ గీఁడు

ఆ.వె. నలుగు బెట్టఁ గసిన నలుపుతై తెల్లని
వస్త్రచయము లుండు వదువుగనిన
రక్తపుష్ప గంధరాజిఁ గన్గొనఁ గీఁడు
కనని వినని కాంతఁ గవయ గ్రహము

సీ. మొండి ముక్కిడులను దండహస్తులఁ బాశ
ఖడ్గ సంభృతుల వికారతనులఁ
బెట్టుకొట్టఁగ నుండ? వెన్నయు నేయియుఁ
బెరుగు తైలాంగుల ఖరము మేక
కాక గృధ్రంబులఁ గాష్ఠము సంతంబు
దుర్లక్షణమ్ములతోన మెలఁగఁ
దానంబు నేయంగఁ దైలాంగుఁడగుటయు
హోమకుండము తేరు భూమి మిట్టు

తే.గీ. పుట్టి సౌధంబు నొకటిరై పాసఁగ నెక్క
క్రొత్త కోకధరింపఁగఁ గోరియొకరు
పల్మఱును బిల్వఁ దానడ్వఁ గలఁ గనిన
శోకభయపీడ చింతనానీక మొదవు

కం. పచ్చని కోకలు సొమ్ములు
నచ్చఁగఁ గల చెలులఁ గనిననది సంపద తా
నెచ్చుగమృతిగనఁ గుణపము
నెచ్చఁగఁ గన్గొనుటఁ గల్గు నెంతయు వేడ్కల్.

తే.గీ. అన్నముల్ భక్ష్యముల్ తినినట్టు వారలు
తినినఁ గనినట్లు సైరిభోష్ట్రనవ గార్ద
భయుతరథ మెక్కినట్లుగాఁ బాత్ర నీళ్ల
పుంపఁ జేరంగఁ గలగన్న మొనయుఁ గీడు

కం. వననిధి పొంగుచునింకఁగ
గనుకల యాప్తజన బంధుగణ నాశముగన్
ఘననృత్త గీతవాద్యము
విన నూతన బాంధవజన వీక్షణ మొదవున్

తే.గీ. తొండలన్ గూరమల్లను బండుటాకు
పాలపక్షియుఁ గాకి కన్పట్టు చెట్టు
ఘృతము పరమాన్న భోజనోద్వృత్తి పొగయు
పాడుకొలను గలంగనఁ గీఁడు లొదవు

సీ. సంకెళ్ల బంధంబు సంతాన మొనఁగూర్చు
బెడఁగు ముత్తెముఁగన్నఁ గొడుకు గలుగు
మశక మక్షికముల మచ్చెల హంసమ్ము
గలఁ గన్న సంపదల్ గలిగి వెలయు
మంచివారలఁ జూడ మంచివి చేకూఱు
మంటఁ గన్గొన శుభ మహిమ దనరు
నమిత పాదముఖావయవ దేవతలఁ గన్న
దేవతార్చనలు తత్సేవఁ గనుట

తే.గీ. బాలసుఖములు నారోగ్య ఖేలలొందవు
నిట్టి స్వప్న ఫలమ్ముల నింగితమతి
వైద్య జనులు శుభాశుభావాద్య గతులు
దెలిసి సేయుఁ బ్రతిక్రియ ఫలము లొసఁగు

వ. దేశకాల ప్రకృతి విశేమ్ము లెఱింగి సాధ్యాసాధ్యనిర్ణయస్థితిం బ్రతిక్రియ సేయందగు నింక గాంధర్వవేదక్రమంబు వివరించెద—

సీ. మానితంబగుచు బ్రహ్మ గ్రంథి వాయువు
దనరినమందర స్థానకమున
నేమింప ఛందోవతీముఖ్య శ్రుతులకు
నలువైన హృదయోర్ధ్వ నాడులయెడ
నెనసి తిర్యగ్జ్నాడులను బుట్టి సొబగొందు
శ్వసనంబు శ్రుతులకు స్థానమగుచు
రమణీయమగు దత్స్వరము వినువారల
చెవులకుఁ బండువుచేసి చెలఁగు

తే.గీ. వెండి బ్రహ్మహృదయ గ్రంథి నుండి యూర్ధ్వ
గతిని నడచుచుఁ గ్రమముగ వితత నాభి
హృదయ కంఠ శిరో వక్త్ర వృత్తి తాన
కముల ధ్వని గూడినది నాదమమర నందు

కం. పరగు నకారము ప్రాణం
బరయఁ దకారంబులోహితాన్యుండగుచున్
దిరముగఁ బ్రాణాగ్నులలో
నిరవొందఁగ నాదనామ మొలమి వహించెన్

తే.గీ. సురుచిరమ్ముగ నతిసూక్ష్మ సూక్ష్మ పుష్ట
గురుతరాపుష్ట కృత్రిమ స్ఫురణ నామ
ములఁ గ్రమంబగు తానకంబులఁ జెలంగి
నాదగతి యొప్పు సంగీత వేదు లెఱుఁగ

చం. హృదయ గళోత్తమాంగకములెన్నఁగ మంద్రముఖత్రయస్వరా
స్పదములఁ గొక్కటొక్కటికిఁ జన్ద్వ్యగుణమ్ములుగాఁ బొసంగు ద
త్పదమల నాద సంభవలసత్ప్రవిభేదములేవు మీఱుని
ర్వదియును రెండు నాడులఁ దిరమ్ముగఁ బుట్టె శ్రుతుల్ మరుద్గతిన్

సీ. మొదలిఁటి శ్రుతికి హెచ్చొదవు రెండవ శ్రుతి
తన్మధ్యమమున నాదంబు పొడమి
క్రమ్మఁక యవిరళగతి నొప్పు శ్రుతి మట్టు
దగఁ బుట్టె దాన సప్త స్వరములు
నాలింట షడ్జ మెన్నంగ నేడిఁట ఋష
భంబు గాంధారంబు బరగు తొమ్మి
దిఁటఁ బదుమూఁటఁ బిస్ఫుటు మధ్యమము పది
యేనిఁటఁ బంచమ మెలమి నిరఁ

తే.గీ. దింట దైవత మిర్వది రెంటఁ దగ ని
షాద ముద్భవ మయ్యె వినోదలీలఁ
బాలు విలసిల్లఁ బెరుగు పగిది శ్రుతుల
కలయికల చేత స్వరములు వెలసె నిటుల

కం. గీత ప్రబంధముల నీ
రీతిన్ బేర్కొడఁగ గమి సరిగమపదనిస
ఖ్యాతిన్ సంజ్ఞలఁదాహై
శ్రోతవ్యంబగుటు స్వరసుశోభనత దగున్

సీ. ఆయత కరణ మధ్యామృదు దీప్తము
లనఁగ నైదగు జాతు లా శ్రుతులను
గలవవి స్వరములఁ గలసి నాలుగు మూఁడు
రెండూ నాలుగు నాల్గు రెండు నొకటి
రెండు షడ్జాదుల నుండు నలంకార
ములు నాఁగ స్వరములు వెలయు నాల్గు
స్వరములు గూడిన సరవిఖండములు మూఁ
డిరవైన కళయన మెరవడినగు

ఆ.వె. సప్తశుద్ధ జాతి సంగతిఁ దగు నలం
కారములకుఁ బేర్పగాఁ దదీయ
మగుచు షడ్జముఖ్యమై యిట్టు లొప్పగుఁ
గంబళాన్యతరనిగదిత మగుచు

కం. స్వరభాగలు ఋషభస్వర
విరహితమై కైశికీయ విఖ్యాతిఁ దగుఁ
దర గాంధార నిషాదో
త్తరణములగు జాతులచటఁ దగు స్వరయుక్తిన్

సీ. గ్రహ మంశమనఁగ రాగములకు మొదలగు
వహి నవి తారవ్యవస్థ మంద్ర
మట్టిద న్యాస విన్యాస లుపన్యాస
సన్న్యాసలు బహుత్వ సరణి నల్ప
మంతర మార్గంబు నట షాడ నౌడవ
సంగీత వస్తు ప్రసంగతిఁ బడు
మూఁడో పు సంపూర్ణమునకు నంగము లై
స్వరముల గల జాతిసంక్రమణము

తే.గీ. తారకంబగు లక్షణోత్తరిణఁ గామ
చారిగుణఁ బొల్చు గీతమ్ము చాలు తరిటి ?
న్యాస మంతరగోచనమగు స్వరప్ర
చార మాంతర మార్గిక సంజ్ఞ నమరు

తే.గీ. షడ్జ మధ్యమ ఋషభ పంచమము లెన్న
దైవతంబు నిషాద గాంధారములును
దైవ్యపైత్రిక మౌని నిత్యమ్ములందు
బ్రాహ్మమగు షడ్జమధ్యమ పంచమములు

కం. దైవత ఋషభములవనిప
పావనకులజులు నిషాదపశుగాంధార
శ్రీ విట్కులభవమన్యము
లీ వసుమతి శూద్రజాతి యొన్నఁగ వరుసన్

సీ. తమ్మి రెంజాయయు నౌమ్మి కంఠము బొ
వర్ణంబు బంగరు వరువు, మొల్ల
పూరుచి పచ్చని పొలుపు పసపు మిన్న
ధూసరచ్ఛవి క్రమధూర్వహమున

షడ్జాదులగుస్వరచ్ఛాయలు జంత్రాంత
రీహాదులు ధ్రువరీతి కటుల
రసములద్భుత వీరరౌద్రముల్ ఋషభ ష
డ్జములకొన్నఁగ ధైవతమున కుభయ

తే.గీ. వికృతములు కరుణారసవృత్తిఁ దగు ని
షాదగాంధారములకు హాస్యరుచి రసము
లలరు పంచమ మధ్యమంబులకు జనులు
గూడ గ్రామములని స్వరకూటమయ్యె

మ. శ్రుతిజాతి క్రమసంగతిన్ స్వరములచ్చో నిల్చుటన్ మూర్ఛనా
స్థితినొప్పున్ బ్రథమంబు షడ్జ మటు సద్ధిన్ మధ్యమంబా ద్వితీ
యత, శుద్ధంబగు పంచమంబులఁ దృతీయంబయ్యె స్వరాంగని రూ
గ్యతనందున్ భువి నల్ప శాస్త్యల తదీయచ్ఛాయలం జేయఁగన్

వ. షడ్జ మధ్యమ గ్రామంబులకు లక్షణంబు ఛాయాకల్పనార్థంబుగా నొడివెదనని
వెండియు—

తే.గీ. షడ్జ మధ్యమ గాంధార సంజ్ఞ గ్రామ
ములకు నధిపులు విధిహరీశులును దేవ
తలు తదీయంబులగు రాగములకుఁ బలఁప
సరవి హేమంతఘర్మ వర్షర్తు లునికి

సీ. పూర్వాహ్ణ గేయార్హములగు షడ్జగ్రామ
రాగముల్ మధ్యాహ్న రాగములగు
మధ్యమగ్రామ సంభవములు సంధ్యల
గాంధార జన్యరాగమ్ములమరు
షడ్జ మూర్ఛ నలునెంచఁగ మంద్ర రజనులు
పరిశుద్ధ షడ్జమత్సరులు మఱియు
నమరు నశ్వాక్రాంత మరయ నిట్లన తక్క
గ్రామమూర్ఛనలిటుగాకనైన

తే.గీ. విరువదియు రెండుమూర్ఛన లిందువలన
నైదు వేలును నన్నూరు రైన తాన
ములకుఁ బన్నాంతరమ్మునఁ గలుగు నేఁబ
దాఱు మూర్ఛనలందుల సారగతిని

వ. రెండులక్షలున్నెనుబదిరెండు వేలు నిన్నూటనలుబది పూర్ణతానంబులయ్యెనింక
నసంపూర్ణతానక్రమంబెఱింగించెద.—

తే. గీ. అమరు షాడవ షాడవ మార్చికమును
గాధికము సామికము ననఁ గలుగు షడ్వి
ధములు విరహిత స్వరము లాఱమరు షాడ
వంబు స్వరములు నైదౌడవంబు దెలియ

సీ. అవనిధ్రైన స్వరాంతరంబనఁదగు
ససరిగలు సమీక సంజ్ఞనొప్పు
సరి గాధికంబగు షడ్జ మార్చికమగు
లాలిత ప్రస్తార మూలమిదియె
స్థిత షాడవౌడ వార్చిక గాధికములు సా
మికము స్వరాంతర మిశ్రితంబు
నిల నేఁడు నూఱులు నిరువది నూఁటిరు
వది యిరువది నాల్గు వరుసనాఱు

ఆ. వె. రెండు నొకటి తానరీతులు జనియించు
కైశికంబనంగఁ గలదు జాతి
స్వరములొక్క కొన్ని జనక సాధారణం
బుదితమగును దాని తుది స్వరమ్ము

తే. గీ. అమరు స్వరములు నూలాదులనఁగఁ దాళ
యుక్తి నొకకళ చిత్రమార్గోక్తి మాగ
ధియు ననెడిగీతి వార్తికద్వికళ సంభ
వితమనఁగ గీతి యొప్పగు చతురలీల

వ. మఱియుఁ జతుష్కళ లైన దక్షిణ మార్గంబునఁ బృథుల యనుగీతియు నిట్టి త్రివిధగీతులకు జట్పితా పుత్రకమనెడి తాళంబెసంగు నట్టితాళంబునకు వినియోగం బెట్టిదనిన

తే. గీ. తనరు నాక్షిప్తికి ప్రసాదకులు సంత
రైయు నైష్క్రామికియు నాల్గు రహిని నాట్య
గతినిఁ బ్రథమాంకమునఁ దుదఁ గలది తెల్పఁ
దగియె నాక్షిప్తికంబు షాడ్జతర్జొసంగి

సీ. అదియు ద్వాదశకళ యాకళ లఘ్వష్ట
కంబు ద్విత్రి స్వరగతి లఘువగు
నాదిమధ్యాంతంబులవి మంద్ర మధ్యమ
తారక సంజ్ఞలఁ దనరియుండుఁ

తెలియ స్వస్తికము వృత్తిద్వయంబనఁగ నం
ద్యావర్త మబ్జ షట్తంబు భ్రమర
మబ్జ గర్భాబ్జమేడి తాఖ్యలరాగ
కదంబముల్ గలవు భేదంబులమర

తే.గీ. రంజన యొనర్చు కళమున రాగమయ్యె
నింకఁ దల్లక్షణ క్రియ లెల్లఁ దెలియ
వినఁగను మాళవ షడ్జ సంజనిత మగుచు
షాడవ ప్రాప్తి శ్రీరాగ సంగతికగు.

సీ. రమణీయ గౌళమేకము మాళవము తాళ
మమరు షట్టను పూర్ణమగుచు కొప్ప
లలితరుపుష్పట్ట తాళము షాడవము పూర్వ
యామమ్మునకు నది యన్యమగును
నలువైన సారంగ నాటతాళము డెంకి
పూర్ణమ్మునై యొప్పుఁ బొల్పుమీఱి
వరుస గుజ్జరి షాడవమట తాళంబు కాం
భోజి పూర్ణంబట్టి పొల్పు దక్క

తే.గీ. లలితహిందోళ ధన్యాసులమరు గుజ్జ
రియును దేశాక్షి గుండక్రియయు వసంత
మలహరులు దేవగాంధారి వెలయ [రేప]
[క డవా] ల కర్షంబు భూపాల కలిత మగుచు

తే.గీ. కనడ బంగాళ కేదారగౌళ శంక
రాభరణ నాదనామక్రియలు మనోజ్ఞ
రచిత ఘంటారవమ్ము సారంగనాట
లిర్వదియు రెండు పగటఁ రేయింటఁ దగును

వ. ఇట్టి ద్వాత్రింశద్రాగంబులయందు భూపాలాదిపురుషరాగాష్టకంబునకుఁ బత్నులగు చతుర్వింశతి శ్రీరాగంబుల నరువదినాల్గు మిశ్రంబులు జనించె నందు పాలి, సారంగ, హంవీర, రేవగుప్తి, మేఘరంజి, కురంజి, పదమంజరి, పూరి, సావేరి, హుసావేరి, మంగళ కౌశిక, నారాయణ గౌళ, పంతుగౌళ, కన్నడగౌళ, మాళవ గౌళ. ఉశవరాళి పున్నాగవరాళి, పంతుకరాళి, తొండవరాళి, హిజజు, ఖాది, యెరుకల కాంభోది, యెసకల కాంభోది, నీలాంబరి, బిలాహరి, మధ్యమావతి, ఉశాని, ఛాయాగౌళ, రవిగౌళ, పూర్వగౌళ, కుంతలవరాళి, ముఖ్య రాగంబుల ప్రస్తార క్రమంబుల ననంతరాగంబులయ్యె నిట్టిరాగ మార్గ స్వరబద్ధంబులగు గీత ప్రబంధంబుల భేదంబు లెఱుంగవలయు మఱియు ఏతావిధంబు.

సీ. ఆరోహణావరోహణములు స్థాయి సం
చారచతుర్విధ చారములును
మేళకోద్గ్రాహ లాలితాభోగధ్రు
వములంగములు గీతసమితి కెల్ల
స్వరపాట వచనముల్ బిరుదు గద్దెములు ప్ర
బంధషడంగముల్ పరగనవియు
చౌపష్టి భేదముల్ సరవి శ్రీవర్ధక
కలహంస శ్రీరంగకైవశాదు

ఆ.వె. లిట్టిగీతవేద మెంచి నాదబ్రహ్మ
మరయ మేటి యోగ గరిమ కెన్న
పరమశబ్ద పరవిభాగ తత్త్వబ్రహ్మ
విదుల నడిగి తెలియు విధము మేలు

కం. వేదోక్తంబు క్షత్రియ
వేదితముగ సాధుజన వివేక విహిత మ
ర్యాదాస్పదమైన ధను
ర్వేదము వివరింతుఁ దెలియ వినుఁడని యందున్

కం. దక్షతఁ బదియును రెండగు
లక్షణములు త్రివిధమైన లక్ష్యంబులు శాం
తిక్షమ యుక్తిని విల్కాఁ
డక్షయమతి నెఱుఁగ వలయు నభ్యాసమునన్

సీ. వేళ్ళ తెలియంగుచు విల్లుఁ బూనుటయు దృఢ
ముష్టి మట్టుగఁ బట్టు మురువు పెద్ద
వ్రేల నుంగర మిడు విధము నాసిక నేయ
నేర్పు నిశ్చలదృష్టి నిల్పు తెఱఁగు
నిలుచు పాదన్యాసముల విభేదమ్ములు
నాకర్ణముగ గుణమును దివియుట
యాతపవాత ఘాతాదుల కెడయుట
యేయునప్పుడ నిల్పు నైసకములును

తే.గీ. సమతఁ బరిపోయు నెడ తనువిముడు కొనుట
శరము విడుచుక తనసీక చాయ నేయు
టుంగరము నారి సమత పొసంగఁ జూచు
టిట్టి పదిరెండు విధముల నెట్టుకొనిన
లక్షణమ్ములు వేర్వేఱ లలితమగును

కం. చల్లని వేళలఁ జేరకన్
విల్లుధరించుటలు లెస్స విసరెడు గాలిన్
బెల్లగు నెండన్ వ్రేళ్లలు ?
నల్లన నల్లనగుగాన నభ్యాసదశన్

కం. తలము ధనువంట నీ కం
గుళముల నణఁకువగ మధ్యమాంగుళి వెనుకన్
దళముగఁ దర్జనియుండఁగ
బంటుముష్టిన్ విల్లు బిగ్గఁ బట్టఁగ వలయున్

తే.గీ. నారిఁ దివియుచు భుజమునఁ జేర నీక
నంగరము వామదిశయందు నుండఁ దర్జ
ని నఖమటుఁ గప్పుకొని వ్రేలు దనర వాటి
సంధి శర ముష్పఁ దివియుట శాస్త్ర సరణి

సీ. వామాంఘ్రి భుజములు వలనొప్ప సగముగ
నమరించి యాకాలి కడ్డమగుచు
నుండఁ గుడిపదము నొదవించి యారెండు
మడిమల నడుమొక యడిగెడుండు
నటుల నిల్పుటలు ప్రత్యాలీఢ మది విప
ర్యయమైన నాలీఢమనఁగఁ దనరు
వడిలత్య్య మేయుచు వామాంగుళము నేల
బలుపుగ నూనియాపట్ల మడిమె

తే.గీ. యెత్తుటలు లెస్స గుఱియేయ నెడల శరము
కరముచాయఁగ నిరుచెయ్యి సరిగనుటలు
పూర్వ పాదాంగుళము చాయ బూను టొకటి
యంబుతుదఁ జూడ్కి గురి గనుటదియు నొకటి

తే.గీ. సప్త షట్పంచశత చతుశ్శత శతత్ర
యాంఘ్రుల కొలంది మఱియేయునపుడు వరుస
నయ్యనామిక మొదలుగ నైదు వ్రేళ్ల
తుదలక్రైయంప మొనసరి తొడరఁ గనుట

కం. పిక్కటెడ నేసిదేహము
చక్కఁగ నిడివింటి వంపుచాటున నిడి యే
చక్కటి కదలక బెబ్బులి
యెక్కువఁ బొంచుటలు లెస్స కొంతయుఁ గదకన్

తే.గీ. గుహ వెడలివచ్చి దిశలుగన్గొనుచు వాల
మవనిఁ దాటించి గమకించునట్టి పెద్ద
పులి విధంబున నేయుచోఁ బొసఁగవలయు
పింజ పింజంబు నేయుట పేర్మిఁ దగును

కం. పారవోయిన పేఁ బెత్తిన
నెరబిరికిన విల్లుమాని నిడివి దృఢంబున్
గురిచక్కని దగువింటన్
దురుసగుతానకములమరఁ దొడరుట లొప్పున్

వ. ఆలీఢ ప్రత్యాలీఢ సమవిషమ చిత్రప్రకారాది స్థానక కుశల బుద్ధుల నమరి, దృఢముష్టి దూరాపాత లాఘవ చిత్రగతుల నతుల చాతుర్యత సకలాయుధ శ్రేష్ఠంబగు ధనుః ప్రవీణుండైన ఘనుఁడిహపరసుఖంబులం బొదలునని సూతుండు షట్ఛాస్త్రము తెలింగించెద వినుఁడని మునుల కిట్లనియె.

తే.గీ. తర్కములు రెండు నొక్కటి దండనీతి
సాంఖ్య శాస్త్రంబు మఱియును సారలీల
పూర్వ మీమాంసముత్తర పూర్వమైన
యట్టి మీమాంస శాస్త్రంబు లాఱునయ్యె

సీ. తర్కద్వయమునందుఁ దనరు గౌతమకణా
దములు షోడశ పదార్థముల గౌత
మము, కణాదము పదార్థములాఱిఁటుందగు
నల ప్రమాణప్రమేయము. సంశ
యము ప్రయోజనము దృష్టాంత సిద్ధాంతావ
యవతర్కములు నిర్ణయమును వాద
జల్ప వితండముల్ సరవి హేత్వాభాస
ఛల జాతినిగ్రహ స్థానములన

ఆ.వె. గౌతమంబు ద్రవ్యఘన గుణకర్మ సా
మాన్యగురు విశేష మహిమల సమ
వాయమనఁ గణాద వరతర్క షట్ప
దార్థతత్త్వ సంవిదతుల ముక్తి

సీ. జ్ఞాన నిరతులకు సమకూరు నెప్పుడు
నాహేతుసంసిద్ధియనఁగ వేద్య
వినుఁడు తత్త్వాద్యేకవింశతి దుఃఖాంత
మర్థ స్వరూప సమ్మతము దలఁప

పరుస శబ్దస్పర్శ వర రూప రస గంధ
హృదయములఁ షడ్విధ మింద్రియములు
నాలు సౌఖ్యము దుఃఖ మది యిర్వది యు నొక్క
పై రొప్పు విజ్ఞానులైన జనులు
దలతురివ్విధములు తొలుమతంబునఁ బల్కె
నపురు షోడశపదార్థముల యందు

తే.గీ. నవవిఁ గన్గొను టెల్లఁ బ్రత్యక్ష మయ్యె
మహిఁ బొగచూపి హుతాశుఁ గలిమను మానమయ్యె
దానివంటిదె యన నుపమానమయ్యె
మఱియు వినుటెల్ల శబ్దప్రమాణమయ్యె

వ. ఇవి ప్రమాణ చతుష్కంబగు. ద్రవ్యగుణ కర్మసామాన్య విశేష సమవాయముల నఁ షట్పదార్థములయందు

కం. ఈ విధిఁ బెక్కులయిన నం
దావలనన్ మొదలిదైన యాత్మ ద్వివిధమౌ
జీవాత్మయుఁ బరమాత్మయు
నా వ్వేఱొక్కటగుచు నానాతనులన్

తే.గీ. తనువులెన్నఁగ భోగసాధనము లింద్రి
యములనఁగ జ్ఞానపంచక మతుల మఱియు
ద్రవ్యగుణకర్మ సామాన్య తద్విశేష
మనఁగ సమవాయ మీయాఱు నర్థములయ్యె

సీ. తొడి ద్రవ్య భేదములఁ తొమ్మిది పంచభూ
తములు కాలదిగాత్మలు మనసు నన
గుణ మిరువది నాల్గు గుణుతులఁ దగు రూప
రసగంధములను స్పర్శమున సంఖ్య
పరిమాణతను బృథక్త్వతను సంయోగ వి
భాగ పరత్వ తాపరత గురుత
ద్రవత స్నేహతను శబ్దమున బుద్ధిని సుఖ
తను దుఃఖమున స్పృహతఁ బ్రయత్న

తే. గీ. ధర్మ విద్వేష సంస్కారతతి నధర్మ
తను వితర్కింపఁ గల్గు భేదములఁ దనరి
కర్మము మనశ్చలన మెన్నఁ బేర్మి జాతి
యగుట మాత్రమె సామాన్యమనఁ దలిర్చు

ఆ.వె. ధర విశేషమనఁగఁ బరగు నిత్యద్రవ్య
వృత్తి యది విశేష విధ పదార్థ
మాయతఁగలిని సమవాయ మన్నదియు సం
బంధమనెడిదిదియు భావమరయ

కం. ఇదియర్థ భేదగతి న
య్యదనన్ బుద్ధియన జ్ఞాన మన నది రెండౌ
నది యను భవమున్ స్మరణము
విదితంబింద్రియములు లంచు విధమున నరయన్

సీ.గీ. యత్నము ప్రవృత్తియనఁదగు నదియు పుణ్య
పాపకలితంబు మోహ కోపములు రాగ
మొసఁగుటయు దోషమనఁదగు వసుధ మఱలఁ
బుట్టుటయు ప్రేత్య భావమ్ము నెట్టు కొనగ

కం. ఫలమనఁగన్ సుఖదుఃఖం
బుల యనుభవమగుట పీడబొందుట దుఃఖం
బుల మోక్షంబపవర్గం
బలరఁ బ్రమేయంబు తెలుగు లగు నిది యెల్లన్

సీ. ఒక్కటిఁ గాంచి వేఱొకటిగా నెంచుట
సంశయంబనఁ దగు జనుఁ డొనర్చు
యత్నమ్ము సఫలమౌటది ప్రయోజన మెన్న
వాదియుఁ బ్రతివాది వాదసరణి
కనుగుణంబగు నిదర్శనము చెప్పుటలు దృ
ష్టాంతమౌ శంక లేదరయ దీని
కనుట సిద్ధాంతమౌ ననుమానవాక్యాంశ
మవయవంబగు నప్రియ ప్రసంగ

తే.గీ. మదియుతర్కంబు నిర్ణయంబగుట తిరము
నేయుటయు జ్ఞానమగు తత్వ చింత దొలఁగి
పలుకునది వాదమగు, జయ ప్రార్థి నాడుఖ
కతలు జల్పంబు తర్కోక్తి గణుతి నిల్లు

సీ.గీ. ఆత్మ పక్షము స్థాపించు నలవు లేక
పరమతము దూషణము చాలు పట్టునది వి
తండ, మనుమాన దూషణతం దలిర్చు
వాదమన్న హేత్వాభాసనాఁ దనర్చు.

సీ. రహి నభిప్రాయాంతరముతోఁ బ్రయోగించు
శబ్దార్థమున దూష్యసరణి నాడు
నది ఛల మనఁదగు నమర నుత్తర మీమి
జాతియో నటఁ బరాజయము దోఁప
నైరమీఱ నాడుటఁ నిగ్రహ స్థానమా
నొగి షోడశ పదార్థయుక్తు లిట్లు
దెలిసి వాదార్థము దీనంద నేరక
వాది భంజన ధరావర్య రంజ

తే. నముల కుపయోగకముగ నంధతమసమూఢ
సమగ్రహస్థితి బుద్ధి జాడ్యమున జనులు
కొందఱిందమ సుఖములు జెందరందు
హరిపరాయణులధిక సౌఖ్యాఢ్యులరయ

మ. ఇది తర్కస్థితి దండనీతి యనఁగా నింపారు నెందర్థశా
స్త్రదశన్ ధాత్రి శ్రుతిస్మృతి ప్రకర సిద్ధంబై ధరాధీశపు
ణ్యదమై పాతకదండ నార్హమును సత్య స్థైర్య వర్ణాశ్రమా
స్పద ధర్మ ప్రతిపాద్యమై వినుఁడు తచ్ఛాస్త్రింబు వాదంబునన్

కం. దురితాత్ముల దండింపుచు
వర సజ్జనతతులఁ గరుణవర్ధిల్లఁగ భూ
వరుఁడరసి మనుపవలయున్
దలఁచగు వ్యవహార దశలఁదజ్ఞులు పొగడన్

వ. ధర్మాధర్మము లెఱింగి దండింపఁ దగుటఁజేసి తన్నిర్ణయ పరులవలన నృపతి తెలియఁగవలయుంగావున.

సీ. పటుమత్సర క్రోధపక్షపాతాధర్మ
దుశ్శీల నిరతులఁ దొడరనీక
శాస్త్రధర్మ వివేక సత్యదమశమ సం
యుతుల విప్రుల సభాస్వితులఁ జేయ
దగు, వారు లేనిచో సుగుణులెవ్వరో వారి
శూద్రుఁ దక్కఁగ సభఁ జొనుపవలయు
వేగుర ముగ్వుర నేడ్గురగా ద్విజ
వర్యుల సభ నున్పవలయు నీతి

తే.గీ. ప్రాడ్వివాకుఁడు సభకు వచ్చునతనిఁ బ్ర
యత్నముగఁ జేరనీక ధర్మార్థవేదు
లైన వారలచే వాదు లణఁచు మేలు
శిష్ట పాలనులగు నృప శేఖరులకు

కం. కులశీల వయోరూపము
లలవడు ధర్మజ్ఞులైన యనఘాత్ములవై
శ్యులసభఁ గూర్పఁగ దగుని
శ్చలమధ్యస్థ ప్రచార సత్యులయినచోన్

తే.గీ. బ్రాహ్మణులు సర్వదేవతా ప్రతిములగుట
నధ్యయన శీలములు గల్గునట్టి వారి
లున్న సభ దేవసాన్నిధ్య మొనరు కతనఁ
బలుకుబడి వల్ల ధర్మమ్ము బయలు పడును

కం. కనిచెప్పమి కనకనె చె
ప్పినదోషము లొందుగానఁ బెద్దలు సభలన్
విను వినకుల కనుగల్గిన
ఘనుల సముల సభలఁ గూర్పఁ గాఁదగు పతికిన్

చం. తగుజనులెల్లఁ గూడి యిది ధర్మమటంచు విధింప నట్ల నా
జగతివిభుండు తత్త్వజలఁ జాతురితో నియమించుఁ బుణ్యమా
నగడున నేయకున్న సచివాప్తపురోహితులెల్ల భూవిభున్
మిగులఁగ నీకధర్మగతి మేకొనఁ జేయుట యొప్పు నెంతయున్

ఉ. వారిని కోర్కె నయ్యుభయవాదుల ప్రార్థన సేయ ధర్మవి
స్తారకుఁడాలకించి పెరసభ్యులు మెచ్చఁగ ధర్మయుక్తిమిం
కూరమిఁ దెల్ప తెన్న వినఁగూడమి భూవిభుఁ జెందుఁ బాపముల్
ధారుణి సభ్యలక్షణ బుధ ప్రకరంబటు లేక యుండినన్

ఆ. వె. ఎవ్వఁడేని సభ్యహితలక్షణుఁడు వానిఁ
బ్రాడ్వివాకుఁ జేయఁ బతికిధర్మ
మతఁడు ముందువెన్కనగు ధర్మములు పట్టి
యరసి నిర్ణయింప నర్హుఁడగుట

కం. మోహభయలోభమత్సర
సాహసములఁ దప్పి బలుకశాస్త్రోక్తముగా
నూహించి వారిదండన
కోహటిల నొనర్పవలయు నుర్విపుఁడలరన్

కం. అమరంగ స్మృత్యాచారము
సమయాచారంబు నిఖిల శాస్త్రార్థ లస
త్క్రమ మెఱుఁగు ననఘరాధుం
డమలుఁ డవధ్యుం డబాధ్యుఁ డాతం డెచటన్.

సీ. క్రమత నష్టధియు నెనిమిది సంస్కారముల్
కలిగి కర్మత్రయ కలితుఁ డగుచు
వసుధఁ బ్రసిద్ధుఁ డౌవాఁడు మోసము లక్క
దండింపఁగారాద ధరణి పతికి
సమయ శాస్త్రాచారవిముఖుల గతులిత
రులు లక్క విధియది గలుగఁ దెలియ
నీ వ్యవహార మానెసఁగు నాతనికి శం
కాభిశంగమ్ము తత్త్వాభియోగ

తే.గీ. మనఁగ వస్తు దర్శనాదులు ప్రత్యక్ష
దర్శనంబు నగుచుఁ దనరఁ గనుట
తెలుఁగ ననుట యిదియౌ యిదిగాదనుట రెండు
గలిగి మత్త వృత్తి గడగి యొకఁడు

కం. పాపమెఱుంగమి నన్యా
యాపరతన్ బైఁడి భూమి హరియించున్ ద
ద్వ్యాపారమ్ము విధములఁ
జూపట్టున్ నిజము బొంకు చాపాపనరంగన్

ఉ. అప్పదిగాదు కూలిడిలివంచును దానము నేసి తంచు నీ
వప్పుడు నింపుమించుగఁ గ్రయంబొనరించితి వంచెతెంగియున్
జొప్పకయింతయున్ గనని మూటగ వాటికిఁ గూడియిచ్చి తం
తెప్పుడు నుద్ధరించుమని కిచ్చితి నౌనని లేదు నాఁడనన్

తే.గీ. స్వామి పేరను టామాత్యసరణి, బెదరు
నేయుటయుఁ బ్రుచ్ఛిలించుట స్త్రీ ధనంబ
నుటయు వాదంబునం బిలుపుటియు వాదు
లివి యసాధ్యగతుల నూఁటయానిమిదయ్యె

వ. మఱియుఁ బెక్కుదెఱంగులగు వ్యవహారంబులై ధరంబరగి బలవంతులోనఁ
యును దేశంబేకంబుగాఁ బూనినవియు రాజావలంబంబునసైనయవి వ్యవహారంబు
మత్త మద్యపాయి నీచ స్త్రీజలవల్లోభుల వ్యవహారంబునకుగా నొక్కరుండు వచ్చి

వారలఁ బిలువంబంపక తత్కార్యంబు లరసి దండించునది. బాలవృద్ధ గర్భిణీ శిశుజనానాథులకేదిరోయి క్రమ పరామర్శం దెలిసి ధర్మంబు నిలుపునది. సమర్థుండైన వారలితరులచేఁ బలిమియుంగువట్లొనరించి తదాపాయమాసునై వ్యవహారంబులు దీర్చికోవలయు నిట్లెఱింగి ధర్మంబు దప్పనియతండు ధర్మాసనస్థితుండనఁ బరగు వెండియు.—

సీ. దాయాద్యమన ద్వేషత నబద్ధతం దెల్పు
టుదివేగమున నరయంగ వలయు
సభ నొక్కగలినుండుచంద మంతకుమున్న
చెప్పు నాతండ యసిద్ధుఁడంద్రు
కాలకర్మస్థానక ప్రవాసా సిద్ధు
లన నాల్గు దెఱఁగు లౌనట్టివారి
దండించుచుఁ యథార్థము దెల్పు మనఁదగు
ననువుగ నిజమాడు నర్థి బొంకు

తే.గీ. వాఁడు ప్రత్యర్థియన్ బూర్వవాదియర్థ్య
ప్రాయఁగాఁదగు వాఁడును వాక్యసరణి
నొరసి పల్కునడిగి తదుక్తి తెఱఁగి
పురుష భేదము సభ్యు లేర్పఱుపవలయు

ఆ.వె. స్థానతత్త్వ వస్తు సంఖ్యలవియు లక్ష్య
మావిధంబు లరసి భావమరసి
యది పరిగ్రహ క్రియములకు బలవత్త
రంబు పూర్వ విరచితంబునగుచు

తే.గీ అన్యవాది క్రియాద్వేషి యస్థిరుండు
యటు నిరుత్తరుఁడును నిల్వ నంపరాని ?
వాఁడు నేగురు హీనపు వాదులరయ
నందుల సమర్థ నసమర్థ నరయఁ దగును

గర్మసాధన జాతి సంజ్ఞాధివా
సములు దేశము నొక్క సమయముగాఁగ
నుభయవాదులు దెల్ప నొగిఁ బ్రమాణము గాఁగఁ
దెలిసి పక్షాడలు శోధింపవలయు

పైతృ పైతామహ ప్రభు రాజకీయమ్ము
లగు నైడఁ దన్మూల మరయవలయు
నప్రసిద్ధ ద్రవ్యతా విధేయ విహీన
ములు నసాధకములు దెలియవలయు

తే.గీ. సిద్ధిప్రయత సిద్ధప్రయోజనాన్వితము లెఱిఁగి
బహుళతరోక్తి యసంగతభాషణములు
పరగు ద్రవ్యనిరూపణ భావయుక్తి
క్రమ విశోధనచే నెఱుఁగంగవలయు

ఉ. సాక్షియు భుక్తియున్ లిఖితసంజ్ఞ యనేక వివాదముల్ సభా
ధ్యక్షులు పెక్కుచందముల ధర్మఁపుద్రోవ విమర్శచేసి శాం
తిక్షమ నొప్ప నుత్తరము దెల్పక మున్నె యెఱుంగఁగాఁ దగున్
గక్షలుగాక యుత్తరముఁ గైకొన నిర్ణయయుక్తి దక్కఁగన్

సీ. విధిపూర్వ పక్షశోధనముచే సంగత
మవలంబనము చేసి యట నసంగ
తుని దండ్యుఁ గావించి మును లిఖియింపుచోఁ
బలుకులు వెఱుకులు దెలియవలయు
నిజమరి యర్థియు నైమ్మి నుత్తరవాఁ
యనఁదగు ప్రత్యర్థి యనఁగఁ బూర్వ
వాదినా, బోంకర వర్తిల్లఁ బరపక్ష
ఖండన నిల్కడ గరిమ సార

తే.గీ. మరయ సందేహరహితమా నర్థి పలుకు
లిందులకు నన్యమై విరోధిహ పాడముఁ
గలఁక నొందుచుఁ బ్రత్యర్థి పలుకులడరుఁ
దెలియఁదగు కల్లనిజఃబులు పలుకుబడిన

శా. అంగీకారము పట్టువీడమియు సత్యంబైనచో వానికా
సాంగత్యం బెడలంగఁ బల్కుటయునున్ సభ్యాళిగర్హించు నా
నంగా సత్యము నాల్గురీతుల నసత్యం బట్లయా లేదెఱుం
గం గూడుండుట లేదు పుట్టైననుట ల్గా నాల్గుచందములన్

కం. ఉత్తర వచనమురీతిన్
హత్తియుఁ బెరన్యాయ భేదమగుచు విరోధం
బెత్తనది పూర్వపక్షం
బత్తతి నది దెలిసిపలుకనగు ధర్మోక్తిన్

తే.గీ. హేమములు మారొసంగితి నేనటన్న
నది పదాలైనచో యాకలనుట పూర్వ
సభ్య రప్పింపవలయు వాగ్జాలి పొసఁగఁ
బలికెనేనియు బొంకుగాఁ దెలియవలయు

కం. వ్యవహారమ్ములు చెప్పుట
యవి వ్రాయుట యర్థి సత్యమాడుట వ్రాతల్
భువి సాధ్య కార్యసిద్ధిక్
వ్యవహారము నాల్గుగతుల బర్తించుదగున్

తే.గీ. తగమిఁ బ్రత్యర్థియెడ విరోధంబు గనియు
ఖండితము సేయకనె యర్థిఁ గాదనుచుట
వారి మనసులుగనుగనుగొనవలయు నన్య
వాది మద సంగ్రహుండనఁ బాటుపడును

కం. కడు వాక్యఫలనమ్మునఁ
జెడు వ్యవహారమ్ము భూమి స్త్రీ ఋణముల యం
దడరు ప్రమాదంబనియున్
వడిసెఱుఁగునటన్న సత్యవాది జయించున్

వ. ఎల్లయర్థ వాదంబులకు నిదియ ప్రమాణంబు వాదకాలంబున దివ్యప్రమాణరీతిఁ గాఁబల్కునతండు దండ్యుడు సాక్ష్యాదులచే నిరూపితధనంబర్థి కిప్పించి రాజానకట్ల నయాయ ఋణంబుల యందిట్లు నిర్ణయింపవలయు వెండియు.

సీ. సాహసంబున విషశస్త్రాస్త్రములఁ బ్రాణి
హింసలు సేసిన నెసఁగ దొంగి
లించినఁ దిట్టిన నొంచిన సంచిత
ద్రూహా పరాధులఁ గులతరుణుల
దాసీ జనంబుల తగవులు దీర్చుచో
నిల దుష్ట గుణములు దెలియ డెగ్గు
లాడిన నోడమి యానన స్వేదంబు
గద్గదికయు........ తొత్రు

తే. పాటు నాల్కఁ గుఁ దడిలేమి పరుల పలుకు
నమ్మి మెచ్చుట ముఖ వివర్ణమ్ము దైన్య
మాత్మ వికృతియు గుఱుతుగా నరసియపుడె
దండనము సేయ ధర్మమ్ము ధరణిపతికి

కం. మఱియుంజన్నెలదుష్టుల
తెలఁగెఱుఁగుచు నేర్పుమెఱయ దీరాఘులనే
ర్పఱుపుచుదండింపనియా
ధరణిపతికిఁ బాపమెసఁగు ధర్మము పొలియున్

సీ. కనుగొన్న యాతఁడు వినిన వాఁడట సాక్షి
యందుఁ గృతాఖ్యుండు నకృతుఁడనఁగ
ద్వివిధుల లిఖితుండు తెలియఁ బత్రపుసాక్షి
యాదృచ్ఛి కాగతుండరయ సూచుఁ

డుత్తరసాక్షి నా నొదవు నేవురు కృతుల్
ప్రాడ్వివాకుఁడు పెక్కు శ్రుతులవాఁడు
నర్థి శత్రుఁడు గ్రామ్యుఁ డాలేఖకుఁడు సభ్యుఁ
డార్గురు నకృతు లిట్లైన సాక్షి

తే.గీ. మహితకులశీల సత్య ధర్మములు తపము
దానమును బ్రతిభన శాస్త్ర తత్త్వదమము
లమరు సద్గుణవంతుఁ డౌనతఁడు వలయు
స్త్రీ వివాదమ్ములకు సాక్షి స్త్రీలు వలయు

కం. వ్రతులున్ వృద్ధులుచోర
ప్రతతియు సాహసుఁడు నంబి బాల కితవదు
ర్మతులున్ వికలేంద్రియులున్
బతితులు రోగులు సాక్షిభావ విరహితుల్

తే.గీ. అర్థ సంబంధి పాషండు నతిప ధూర్తు
నట్టివ్రునిఁ గూటసాక్షి నెక్పట్టు నడుగ
రనఘుఁ డగుసాక్షి ప్రాఙ్ముఖుండధికశుచియు
నగుచు ద్విజదేవసన్నిధి నాడవలయు

కం. కులధర్మముపై నొట్టిడి
పలుకులఁ దప్పైన నాల్క పడునని యడుగన్
వలయున్ బొంకినచో ఘన
కలుషగతులఁ జెందు సాక్షి ఘనపాతకియై

సీ. బందుకట్టున వచ్చి పల్కువాఁడగు కూట
సాక్షి వాఁడనుచితసరణి నఘము
లనెసంగి పల్కు సాక్షిని జాతి కొలఁదుల
దండించివారిచే ధనము గొనుట
పతికి నీతియు శుభాస్పదమగు ధర్మంబు
కూట సాక్షులనాల్క కోయవలయు
జానపదంబన శాసనంబన నిరు
దెఱఁగుల లిఖితంబులరయ స్వకృత

ఆ.వె. మైన సాక్షి వలవ దన్యకృతంబైన
సాక్షి వలయు దేశచర్య నుభయ
సమ్మతంబు సాక్షి సకలంబు లిఖిత ప్ర
మాణమగుచు సంజ్ఞ రాఁగ దనరు

మ. ప్రతులైనన్ లిఖితమ్ములున్న యెడల న్వారింపఁగా నొప్పగున్
ధృతిఁ దత్పుత్రులు పౌత్రులున్న ఋణముల్ దీర్పందగున్ వేఱఁ ద
ద్గతిఁ దీర్పంబని లేదు బల్మినగు లేఖ్యంబత్య సిద్ధంబగున్
చ్యుతమైనన్ మఱలంగ వ్రాయఁదగు నచ్చో బొంక దండ్యుండగున్

కం. చను జయపత్రిక లిట్లన
యనువొందక రాజకీయమట సందేహం
బొనరిన నిర్ణయ విధములు
దనరు లిఖితములను నెల్లఁ దగు దద్విధముల్

వ. యుక్తి ప్రాప్తి క్రియా చిహ్న సంబంధాగమ హేతుశుద్ధాశుద్ధి స్వహస్తపరహస్తాది క్రియల వలన లిఖితంబును ధర్మవచనానురూఢి సభ్యులు నిర్ణయింపవలయు లిఖితభుక్తి సాక్షి వ్యతిరేకంబైన దివ్యప్రమాణం బావశ్యకంబగు నదియు, జలాగ్ని భుజగ విషకోశప్రమాణంబులను నైదు తెఱంగులం బరగెనవి యధిక వ్యవహారంబులకుఁ దగి శారీరదండ నార్థంబులగు మఱియు విప్ర శిరస్పర్శన ఘటాది ప్రమాణంబు లనేకంబులు గలవిట్టివి సభానాయకానుమతి భానువాసరాది పుణ్యదినంబులం దోలునాఁడుపవసించి యార్ద్ర వస్త్ర ధరులు ప్రాఙ్ముఖులగుచు నొనరింపవలయు.

సీ. అగ్ని దివ్యంబు పూర్వాహ్ణకాలంబున
నంబువులందు మధ్యాహ్నమునను
కోశదివ్యము మాపు కోరి వేఁకువ విష
మహిపహ్ని తప్త మాషాది విధులు
పూర్వాహ్ణమునఁ జేయఁ బూనుట తగు దులా
దివ్యంబు నేయ నత్తెఱఁగు వినుఁడు
యజ్ఞార్థ తరువుల నట హోమకృత్యంబు
లమరంగ వటము క్రిందైనచోట

తే.గీ. వెలయఁ గలోక్తపూజ గావించి ప్రార్థ
నం బొనర్చుచు నెక్కిన నరుని ధరణి
ద్రోయకుండిన శుద్ధుడౌ త్రోనె నేనిఁ
గపటిగా నెంచి దండింపఁగాఁ బొసంగు

కం. అది వృద్ధ స్త్రీ బాలుర
కదనన్ రోగులకు ద్విజులకలవడదు ద్విజా
న్వదము జలదివ్యమగ్నియు
నదియున్ శూద్రులకు నివ్యమగు సర్పంబుల్

తే.గీ. తప్తమాషములమరు పత్రకులభవుల,
కంబుదివ్యంబు విషము వైశ్యాన్వయులకు
యోగ్యమన్నియు శూద్రున కుచితమనిరి
పూని స్మృతివిదులైన విబుధచయములు

కం. కొంచెపుc బనులకుc దనుభుల
కెంచ విరోధమగు నెడల నిట్టివి తగదం
దంచిత విషదివ్యము వి
ప్రాంచజ్ఞాతికి ననర్హమనిరి మునీంద్రుల్

సీ. ఈ ప్రమాణముల యందెల్ల దిక్పాలుర
గణదేవతా పూజ ప్రణుతి వలయుc
దలను బత్రిక పూన్పcదగు ప్రార్థ నాయుక్తి
యిట్లు ధర్మా ధర్మ మెఱిcగి నృపతి
శాసించి పుణ్యంబు భాసుర కీర్తియుc
గల్గి సౌఖ్యమ్ములు గాంచు నెపట
తుల ధటానామమూ నిలధకారము ధర్మ
మా టకార మధర్మమగుటవీcటి

తే.గీ. రెంటి విపరింప నేర్చిన రీతిపగుట
పాపలకు నెల్ల నటశిరః పత్రికదగు
పంచభూతాది దేవతా ప్రార్థనోక్తి
మంత్రమొక్కటి దగునది మఱవc దగదు

శ్లో. ఆదిత్య చంద్రావనలో నిలశ్చ
ద్యౌర్భూమి రాపో హృదయంయమశ్చ
అహశ్చరాత్రిశ్చ ఉభేచసంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తం

వ. ఇది వ్రాసిన పత్రిక శిరంబున నిడి ధటనెక్కి-తూందుండిరియైన వారు వికలంబున నైనc బడిన నశుద్ధుండు పడమి శుద్ధుండు, ననల్పప్రమాణంబునకు నర్హుగ గావించి.

కం. రాకాకుపైన నర్కుడ
శాపలి నాల్గొకటి చేలికడ్డంబిడుచో
నావిన్నాణ ప్రార్థింపుచుc
బావకనిభమైన మద్దు పట్టింపcదగుణ

ఆ. వె. నీళ్లనద్ది త్రాఁచి నాలిసేతు చేనల
పాదవు ముద్దునెత్తి నడచి యంతఁ
చేతవడ్లు నలుపఁ జెయ్యి కందిన నోట,
మొదవు కందుకున్న యదన జయము

చం. జలములు నాభిదాఁకఁ గలుషం బొనరింపుచు నందులోపలన్
నిలిచి తదీయ పూజనము నెమ్మి నొనర్చుచు యజ్ఞవృతిపుల్
బలువగు మొద్దు బట్టుకొని యజ్ఞశరాసనమూని మూన్నిబెటి క
మ్ములు ?డి మూఁటినేయ నటమున్న వసించినవాఁడు వేగతన్

ఆ.వె. వెనుకనేయునమ్ము గొనివచ్చు నంతలోఁ
గలఁకదేలి వాఁడు గానబడిన
శుద్ధుఁడగును జూడఁ జొప్పడకున్న న
శుద్ధుఁడగును ధర్మ శోధనమున

కం. హిమవజ్జాతము శృంగజ
మమరఁగనభిమంత్రితపూర్వకార్చితవిషముల్
క్రమమున జీర్ణించినచో
నమలుండని తెలియఁదగు సభాధిపుఁ డతనిన్

తే.గీ. కాలకూటకులంబది కాదుగాని
కడమ విషముల శోధింప నిడఁగ నర్హ
మటుల బాసలు నేసిన యనఘు నరసి
ప్రీతితోఁ బ్రోవ నృపతికి నీతి సుమ్ము

వ. విషమిచ్చునతఁడుదఙ్ముఖుండును గొనునతండు దక్షిణముఖుండుగా నుండ వలయునింకఁ గోశప్రమాణం బెఱింగించెద—

సీ. పశుభృత్యగణన మొప్పఁగఁ జేసి కడువడి
నియమస్థుఁ గావించి నిత్యవిధిగ
నార్ద్ర వస్త్రములు దివ్యాధి ముఖమ్మున
నిల్పి దోయిఁటనుంచి నీళ్లు త్రావ
ముమ్మాఱు గావించి యిమ్మడ్డిఁ గడవఁగఁ
దనకు సుఖంబుంటఁ దగ విశుద్ధుఁ
గానెఱుంగుడు కీఁడు గల్గ నశుద్ధుఁగాఁ
దెలిసి దండింపఁ గావలయుఁ బతికి

తే.గీ. బియ్యమొక క్రొత్త ఘటములోఁ బేర్మినునిచి
సూర్య సన్నిధి నిడి తినఁ జొనుపవలయు
పగుల దవడలు రక్తము ప్రబల నతనిఁ
గపటవర్తను గానెఱుంగ న్వలయును.

వ. పతితమద్య పానులక నాచారులకుఁ బ్రమాణంబులు పనిలేదు వారలు దండనార్హులు మఱియుఁ దప్త మాషాజ్య దైవంబులనునవి తామ్రమృణ్మయాది పాత్రంబుల నిరువది పలంబుల తైలంబులు గాంచి యందు మాషంబులు మాడ్చియవి యొక్కటొక్కటిగా నెత్తించుటయును, ఆజ్యంబు గాంచి యందు జెయ్యిడు మనుటయు నాగ్నేయంబనఁ దగుదైవంబువెండియు.—

కం. ధర్మంబు వెండివంటిద
ధర్మము సీసంబు రీతిఁదగు భూర్జమునన్
బేర్మి లిఖియించి పూజకు
నగ్మిలి తద్వర్ణగంధ మహితలు దగన్

కం. ధీయుక్తి గోమయంబు మృ
దాయత పిండంబు ప్రార్థనావృతి బాఱం
డాయెడ నదియొత్తియ్యఁగ
నేయది యెటువచ్చు దాన నెఱుఁగఁగవలయున్

వ. ధర్మపత్రిక వచ్చినన శుభంతునుంగానెఱుంగందగు నింక దాయాద్యంబెఱింగించెద.—

సీ. పైతృకంబగు ధన ప్రతిబంధకము గాయ
మన్నటుఁ గల్గుదాయాద్య మరయ
ద్రవ్య భేదంబుల ధనికనేరంబుల
స్వత్తు విభాగ ప్రశస్త మగును
స్వామి రిక్థక్రియ సంచి నాగ పరిగ్ర
హాదికముల్ స్వత్తులవనిసురుల
కలభూపులకును జాయానులబ్ధంబులు
వైశ్య శూద్రులకు నుర్వర శరీర

తే.గీ. కృతములంగల్గు స్వత్తు కీర్తితముగఁ
బూని కనినది యెత్తినవాని సొమ్ము
శాస్త్రసిద్ధమె నిజసత్తు సరవిలోకి
కంబగు ధనంబు పనిగొనఁ గాదు సుమ్ము

వ. వైశ్యునకుఁ గృషియు శూద్రునకు శుశ్రూషయు రిక్థాదులు స్వష్టంబులై పరిల్లు గావున.

సీ. అప్రతిబంధి దాయాద్యంబు రిక్థంబు
    క్రయమది ప్రతిబంధకమగు దాయ
మిలఁ బ్రతిగ్రహము మున్నలుగ నొక్కఁడు దీసి
    కొనిన నిక్షేపంబు గొనుటలధిక
మంబు ప్రతిగ్రహమింబగు ద్విజుల క
    ర్థము నాటికంటె భాగానుగతికి
నదియుఁ బైతామహమై పితాపుత్ర సా
    ధారణమయ్యె నా తండ్రిదగును

తే.గీ. స్వామినాశ విభాగాను చర్యలమెడ
    సుతుల సొమ్మగు జనకు నార్జితము నవి క్ర
    మంబునైన ధనంబును మఱి సుతుల
    యనుమతిఁ దానమును విక్రయంబు నీతి॥

కం. అపదలకు శ్రాద్ధక్రియ
    నోపికఁ దద్ధనమునమ్మ యోగ్యుఁ డొకండే
    యాపటు సుతుల యనుమతి
    చూపట్టఁగ వలయునని చొప్పొప్పదిలన్॥

తే.గీ. గ్రామ సామంత దాయాదిగణము జ్ఞాతు
    లెఱుఁగ భూవిక్రయం బర్థమిరవుగాఁగ
    భాగ మగ్రజుకిరు పాలు వరగ మధ్య
    మునకు నొకపాలు హెచ్చియ జనకు తగవు॥

వ. నిజార్జితంబైన నగ్రసుతునకు విభాగంబునందొక యంశం బీవలయు భార్యలకుసమాంశంబేకాని యధికాంశం బిచ్చుట యనర్హంబగు జనకుండు న్యూనాతిరిక్తంబుగా విభాగించిన నశాస్త్రీయంబగునేని పునర్విభాగంబు కర్తవ్యంబు.—

కం. జననీ జనకుల యంశం
    బనువొందఁగ జ్యేష్ఠునిం దదంతమ్మునఁ జెం
    దును సంతతిలేనిచో దా
    యను జెందుఁ దద్ధనంబులవి శాస్త్రగతిఁ॥

ఆ.వె. సుతుఁడు లేమి పుత్రి కలివయు లేమి దా
    యాదితతికిఁ బ్రాప్త మాధనమ్ము
    జ్ఞాతులకు విభాగకర్త్వార్హమగు పైతృ
    కార్జితము స్వతంత్రమైన ధనము॥

కం. పిత్రార్జితా విరోధత
మిత్రుల వలనన్ స్వవిద్య శౌర్యగల ధన
క్షేత్రములు సోదరులకును
ధాత్రిన్ దాయాదిపాళ్లు దగదీయంగన్.

వ. పిత్రార్జిత జీర్ణ క్షేత్రంబు ఉద్ధరించెనేనియుఁ దదంశంబును స్వాంశంబును దాన కైకొని సోదరులకు యథాంశంబులీయందగుగాని స్వార్జిత విభాగంబశాస్త్రీయంబు పైతృకంబగు కృష్యాదు లుద్ధరించెనేని సమాంశ విభాగంబర్హంబు తటాకారామాది సుకృతంబులు పంచుట నిషిద్ధంబు వస్త్రశయ్యాలంకారాదులు శ్రాద్ధకాల వినియోగార్హంబులు దాసదాసీజనంబులు యథాంశ క్రమంబుల పనులు సేయించి కొనునది. ఇది పితృధన విభాగ పద్ధతి, పైతామహ్యంబునకు విశేషంబుగలదు వినుండు,—

సీ. తండ్రిగడించిన ధనము లాతని కొన్న
రెండుపాళ్లిచ్చుట రీతి తాత
యార్ధంబు వచ్చుచోటది గూర్చుటతనిదె
తాత గణించిన ద్రవ్యమున్నఁ
బౌత్రుల పాళ్ల వెంబడిఁ బంచుకోదగు
వేస విభాగంబైన వెన్కఁ బుట్టు
నతనికిఁ బాలు లేదా తల్లి దండ్రుల
యదియొ తదంత మందతనిఁ జెందు

ఆ.వె. జనకుఁడీల్గు వెన్క జనియించిన తదంశ
ధనము లేమి భ్రాతృ జనులు భాగ
గతుల ధనము గూర్చి యతనికిఁ బాలిచ్చు
టర్హమగుటఁ బుత్రి కదియు తగవు॥

చం. జనకుఁడు లేమి భాగములు సల్పఁగఁ దల్లికి భాగమీఁ దగున్
దనరఁగ స్త్రీ ధనంబుగల తల్లికి నంశము సాము యోగ్య మా
జనని చనంగఁ బుత్రికల పాల్పడఁ జెందల విత్త మెల్ల ని
ట్లనువుగఁ దల్లి దండ్రు లెడయైన విభాగమునందు పొందుగన్॥

కం. కడగొట్టువాఁడు రైనన్
గొడుకైనఁ బెండ్లిలేమిఁ గూడు ధనము నం
దెడ కల్గఁ దద్వ్యయంబున
కిడి మిగిలిన ధనము పాళ్లకిరవగు జగతిన్॥

మ. భగినీ భాగములీయఁ గావలయు నే పట్టందుఁ బిత్రర్థ మి
ష్టగ నింతేనియుఁ గల్గఁ గొంచెమగుచోఁ బూర్ణిన్ బ్రశస్తంబుగాఁ
దగవా విప్రుఁడు క్షత్రియాముఖజ సంతానంబు లెందంగఁ దా
దగు భాగంబుల పాలు తక్కువగు శాస్త్రాద్యాధి జాత్యానతన్ ॥

వ. క్షత్రియా వైశ్యా శూద్రా స్త్రీ ధవులకుఁ ద్రిపాదార్ధపాదభాగంబులిచ్చుట హితంబు దానప్రతిబంధక క్షేత్రంబులు దక్కతక్కినధనంబులీవిభాగంబునకనర్హంబులు—

తే. గీ. పాళ్ళు పంచుచు నెవ్వఁడే భ్రాతృ జనుల
వంచనము సేయు వాని భూవల్లభుండు
పాలికెడఁ బాపి దండింపఁ బాడి వాని
పాలు తత్సోదరుల కిడ మేలినీతి ॥

చం. తనయులులేనిచో గురుబుధ ద్విజముఖ్యులవల్లఁ బుట్టఁజే
సిన తనయుండు క్షేత్రక విశేష పితృవ్యయికెన్న శ్రాద్ధముల్
ధన ఋణముల్ ఘటింప విహితంబుగఁ బూనఁగఁ గర్త వానికిన్
దనయులు గల్గిరేని విను తద్విధి కించుక తక్కువౌతగన్ ॥

కం. కులనాశన మగుచోఁ ద
త్కులమున్ నిలుపుటకు నొక్క కొడుకు విధవకున్
గలిగించవచ్చు బ్రాహ్మణ
కులమునకుం దక్క నితరకులముల కెల్లన్

ఉ. వేనుని భూమి సంకరము విస్తరమైన యెడన్ ఋషీశ్వరుల్
పూనిక విప్రజాతికిది పోలదటంచు విధించిరట్టి తీ
హైన ధవుండు లేమి నియమాన్వితయై చరియించు కాంత స్వ
ర్గాను గతిస్థైలంగుఁ బ్రథమాశ్రమ వైఖరి భద్ర వృత్తులన్ ॥

ఆ. వె. పుత్రబాంధవుల్లుపోయి సూర్యుఁ గన్న
విధవ యిరయగతుల విడువకుండు
గాని బ్రహ్మచర్యగతి నుండుకామిని
పగిది స్వర్గ సుఖము బడయలేదు ॥

సీ. స్త్రీ ధనమ్ములు పుత్త్రిఁ జేరు పుత్త్రికలేమి
పుత్రజదుహితృజల్ పాత్రలరయ
వారులేకున్న సవతి సూఁతులకుఁ దగ
సుతులకిఁ బాడి తత్సుతులులేమి

క్షేత్రవివాదంబు చేసూఱఁ దన్న్యాయ
మరయంగఁ దగు సాక్షి నడిగి మఱియు
స్వామి విక్రయ ఋణ చర్య లన్యాయంబు
నపలాప మాక్రమ్య మాదినయ్యె
తే.గీ. పదియు నెనిమిది తెఱఁగులఁ బరగు వీని
గతులెఱుంగుచు వ్యవహార కర్మ విమల
వలనఁ దెలియుచు భూపతి కులుచలైన
వారి దండించుటలు ధర్మవర్తనంబు ॥
కం. కాలువలకుఁ బొలిమేఱకు
మేలిమి వనములకు గొడవ మేకొన్నయెడన్
వాలాయము దమ పొరుగుల
గ్రాలు వయోవృద్ధ వాక్యగతిఁ దెలియఁదగున్
సీ. స్వామి హీన క్రయాస్పదభూమి స్వామిదే
యితరుల భూమి గ్రహించు వాఁడు
దండనార్హుఁడు చేని పండ చే నుండఁగ
జరపినవాఁడట్టి చర్యకుఁదగు
చేనునఁగల పూరిచెట్టులఁ దప్పభర్త
నడుగక పట్టినయట్టివాని
కరము ఖండించుట ధరణీ పతికి నీతి
క్రయము నష్టమ్ము నొక్కరుఁడు క్రుచ్చి
తే.గీ. లించినది రాజుతోఁ జెప్పనెంచి యతఁడు
క్రయము మూల్యంబు నిప్పింపఁ గార్య మితర
జనుల శాస్త్రోక్తదండన సల్పి స్వామి
కనుభవార్హమ్ము గా క్షేత్ర మరయ వలయు ॥
కం. ధరణిపతికిట్టి చందము
తెలిఁగింపక తమకుఁ దామయిచ్చఁగొనెలఁగన్
నరవరుఁడు దండనంబిడి
గుఱిగా నపరాధధనము గొనుట్వర్హమగున్ ॥
చం. క్రయధన మీయఁ గావలయుఁ గ్రక్కున నాఁటనె యేడులోనుగా
నయగతిఁ గాలదేశముల నాటికి నేటికి మించెనేనియున్
రయమున భూమిపాలునకు ద్రవ్య మొసంగుట నీతి యిట్టి వృ
త్తియు మడిదాఁటు దండ్యుఁడు మతిందల పోయఁగఁలాడు రాజుచేన్ ॥

సీ. పల్లిగా నట్టి యావస్తువు లప్పుడ
తిరుగ వేయుటనీతి మఱచినాఁడు
క్రయమొసర్చినవాఁడు గావలెనన్నచోఁ
బూనిపాలిక పాలు మానుటొప్పు
వచ్చి వస్తువులైనఁ బదిఁటి కొక్కటి గా [ర్చి]
యిచ్చి తిరుగవేయు టింగితము
రత్నాంబరాదిస్ఫురద్ద్రవ్య వితతికిఁ
బదినాళ్ల మేర యేర్పాటు శాస్త్ర
తే.గీ. మంత కెక్కుడు దివసము లయ్యెనేని
సమ్మతము కాని శాస్త్రము సరవి గాదు
నార్ద్ర వస్తువులకు నెల్ల నపుడు నాఁడు
నీరసములకు గణియింప మేర యిట్లు ॥

సీ. పసిపాటు లోనరించు జనులు శిష్యులు దాసు,
లాపనులగు శుభ మశుభములన
శాష్ప గృద్ధము మొదల్గా నశుభంబులు
సల్పుఁ బనులు పాకాది విధులు
శుభములఁ గూలి దీసుక వేదములు చెల్ప
నెన్నఁగ భృతకుడౌ, నెంగిలెత్తి
కసువూడ్చువాఁడవస్కరుఁడందు సత్తముఁ
డరయంగ భృతకుఁడు హలికుఁ డధముఁ
ఆ.వె. డగును బల్మినైన యట్టిబంటు నవత్తు
చోరునమ్ము నానిధారుణీశుఁ
డరసి విడఁగఁ జేయు టర్హ మానకఱఁ
బ్రోచు బంటు పుత్రు పోల్కిఁ దన్ను ॥

కం. ఎక్కువ జాతులవారికిఁ
దక్కువ జాతులగు జనులు దాసులగుటమే
లెక్కువ జాతుల జనములు
తక్కువ జాతులకుఁగాదు దాస్యము సేయన్ ॥

కం. గురునొద్ద విద్య నేర్చుక
తరమిడి మును నాడువు గురువు దప్పినవాఁడా
వఱకిడిన బత్తెమునుగా
విరవుగ గురునకు నొసంగు టింగిత మందున్ ॥

కం. అరయిక యీవగతగళులు
ధరణిసురులు శాస్త్రసరణి దప్పఁగఁ బలుకన్
నరవరుఁడు వారిఁ దనదగు
ధరణి న్వసియింప నీక తఱుమఁ గవలయున్

కం. గ్రామగణద్రవ్యమ్ముల
నేమానవుఁడపహరించు నేనియతని భూ
మ్మామనుజ విభుఁడు గొని తన
సీమవెడల నడచుటరయ సిద్ధం బెందున్ ॥

ఆ.వె. జనుల సమ్మతముతఁ గొని రాజు వాఁకిటి
వారికీక బలిమివలనఁ దెచ్చి
యిచ్చునేని వాని కెచ్చుగఁ బదిపాళ్లు
ధనముగొనఁగ వలయు మనుజవిభుఁడు

సీ. పని నేయుటకుఁ గూలిగొని నేయకనె పోవు
నతఁడిన్మడిగ స్వామి కరవవలయు,
వచ్చెదనని కూలి బుచ్చుక గమన వి
ఘ్నము నేయ నిన్మడిగైకొనఁదగు
నడిత్రోవ లోవలవిడిచి వచ్చిన మితి
పాతికపాలియఁ బాడియగును
మఱియును జనుల నేమరక సాక్షులె సభ్య
అధికార శాస్త్రజ్ఞులగుట నుచిత

ఆ.వె. గతులఁ జనులకొలఁది భృతు లియ్యనగు రాజు
నది మొఱంగి నీతి నరయవలయు
నయముతోడ శ్రేణినైగమపాషండ
భేదములను గలసి బెరయనీక

కం. కపటమున గెల్చు జూదరి
చపలునిఁ గుక్కచ్చు లిడుచు సడలింపఁ దగున్
నిపుణత నైన బ్రాహ్మణవే
షపు శూద్రుని నట్లనేయ శాస్త్రము పలికెన్

సీ. అతిపాపి నిందలకాస్పదమగువాని
నాచార రహితు నన్యాయనిరతు
నపరాధయుతుఁ బలి యరసి తద్భేదమున్
జాత్యంతరమ్ముల సరణి కలిమి

తరమున శారీర ధనదండనమ్ములఁ
గావింపుటుచితమ్ము గడగి విప్రుఁ
డత్యపరాధయుతాతుఁ డగునేని
శత నిష్కముల కెచ్చు జనదు గొనఁగ

తే.గీ. క్షత్రియాది త్రివర్ణుల జాతిపరుష
నాల్గు పాళ్లెచ్చు ధనము గొనంగవలయు
నధికవర్ణాపరాధి విద్యా నిరూఢు
డైనకి దుర్జను మిక్కిలి గొనఁగవలయు

వ. ఫలమూలోపకరణక్షేత్రోదకాదులకు భంగంబు విఘ్నంబు నాపాదించునతండును విషశస్త్రనిపాతపరదార విమర్శనులు ప్రథమసాహసులు పశుగృహోపకరణాన్నపాన భంగ సాహసులు మధ్యములు. నితరసాహస దుష్టాచారులధముంగుట మర్యాదాతిక్రమ ణుల సద్యోఘాతదండనములు నేయందగు పితృమాతృగురుజనాత్మభార్యలయందు దోషం బులేమిఁ ద్యజించునతనిఁ, జౌర్య క్రియలవలన వెడలనడిపించుకొనియును లోకయాన్న వానిని విప్రునంటుకొనిన చండాలాదులను శూద్రసమాగమజటాధరులకు భోజనంబిడు నతనిని దాసీ గర్భపాతునిఁ బది మాడలపరాధంబు గొనుటర్హంబు.

కం. జనకుఁడు పుత్రుఁడు వాదం
బొనరింపఁగ[ జూచి ]తీర్పకుండు నతఁడు నో
డిన పందెమునకుఁ బూటు
యయ్యును వాదము బెట్టునతఁడు నురుదండార్హుల్ ॥

సీ. తోరణ దండాదులాఅడిపో మొత్తు
పాతకు, ధనము మార్పుచు నతని
శాస్త్రహీనత చికిత్సల వివాదముల ప్రా
యశ్చిత్త యఘనిరతునిఁ
జోరుఁడౌ వెతిఁగియు గారవించిన వాని
స్ఫటిక పయో వ్యాఘ్ర చర్మ సురభి
గంధరుద్రాక్షముల్ కడఁగి దొంగిలువానిఁ
దను ధనదండనం బొనరు. నీతి

ఆ.వె. గదిసి పొడిచి రాత్రికన్న వెట్టినవానిఁ
బురుషగతులఁ జంపు పుణ్య రహితు
ముల్లె విడుచువాని మునుకొని శాస్త్రోక్తి
చిత్రవిధముగాఁగ నేయుటొప్పు ॥

కం. ధనమిడి దేశాంతరగతి
జనఁగ దశాబ్దముల స్వామి జనులడిగిన నీ
యనివాని పిదప ధర్మం
బున కొసఁగనివాని దండముల్ సేయఁదగున్

చం. అవిహిత దుష్టచర్యయగు సంగతి గర్భనిపాత కామినిం
బ్రవిమల శాస్త్రమార్గ పరిభావ విచారిణి బావిఁ ద్రోయఁగా
నవు నిటువంటి పాపపు లతాంగులరీతి నెఱింగి ధారుణీ
ధవుఁడిటు న్యాయముల్ దెలుపు ధర్మము నిర్మల కీర్తి చేకురున్

వ. గురు పుత్రఘాతకునిఁ గోడెలఁ గట్టిన బండినిడి తఱిమి చంపఁదగు రాజపత్నీ గమన గృహదాహక గరదారామ చ్ఛేదనులఁ గటాహాగ్ని తుషాదుల భస్మంబు సేయందగును.

సీ. పరిహాసకముల సాదర దృష్టులను నంటు
టలు సరసాలాపములను గొంటి
[యనికి?] యు గ్రామోపరిని వసించుటఁ జూపు
లాసక్తి నవ్వుల యందములును
గలుగు పరసతీకాముకుగాఁ దెల్పి
శతనిష్కములు దీయఁజను విభునకు
జాతుల కాలము గాంచక పొంద నెక్కువ
తక్కువలన్ దగు దండనములు

తే.గీ. సంకరులు వేశ్యఁ బొందిన సరవి దండ
నార్హులగుదురు సద్గుణులందు కేని
ధవుని దేవునిగాఁ జూడఁ దగవు బ్రాహ్మ
ణాది వర్ణాంగనల కన్య నంటఁ జనదు

కం. పశు వేశ్యాసంయోగుల
కశనం బరువది దినమ్ములరికట్టఁ దగున్
వశపోనిదానిఁ గవసిన
యశుచిన్ గొనవలయు నృపతి యటు దశపణముల్

సీ. సతి యల పతియు నాచారమ్ము మానుట
కాముకును దండ్రియు నడిచి పడుట
రొరుల దూషించుటయును గులధర్మముల్
విడుచుట సంకీర్ణ వృత్తిగాన

భూవిభుఁడారసి పాసఁగఁ జేయుట నీతి
తగినట్టి దండనోద్ధతు లానర్చి
యగసాలి కపటాత్ముఁడై సర్వ కంటకుఁ
డగునేనిఁ గండలు నొగులఁ జించు

తే.గీ. టర్థ మరయంగ సిద్ధాయ మపహరించు
వారి ద్రవ్యంబు కొలఁది నద్ధారుణీశుఁ
డరసి దండింపఁ దగు త్రోవ నపటి కొదవు
వస్తు వెత్తిన శిక్షింపవలదు సుమ్ము

కం. కర్తకు సాక్షికి ధరణీ
భర్తకు సభ్యునకు సమము పాతకచయముల్
కర్తవ్యము తెలిగి ధర్మపు
వర్తనదండింపకున్కి వడిఁ బాతకులౌ

మ. ప్రతిపాదింపఁగ నైజమాట సుజనుల్ భాషాక్రియా వృత్తులౌ
జతురస్థైర్యత సాధు వాక్యముల నిచ్చన్ బూర్వ తద్గ్రాహి స
మ్మతితోఁ దద్ధన మిచ్చి చేకొనఁగ నందర్థమ్మునం జేయుచే
గతియౌ ధర్మమె విక్రయంబునకు జోకౌ హెచ్చువెందెనియౌ

సీ. ఉన్నదియున్నట్లు నురుశోధనస్థితి
సభ్యులు పలుక దోషంబులేదు
పలుదెఱంగులఁ జెల్లు ప్రత్యర్థి వాదుల
యందొక్కటియె పట్టి యరయవలయు
ప్రతి లిఖితముసాక్షి పరగుచో మును లిఖి
తంబునకును సిద్ధి దనరియుండు
క్రియల మధ్యస్థ నిర్ణయపరుఁడగువాఁడు
ప్రాతి భావ్యుఁడట్టి పగిది త్రివిధ

తే.గీ. మరయ దర్శన విధి ప్రత్యయంబు నిత్తు
ననుటలిట్లగుపూట కాపగ్గమైన
ధన మొసంగిన యతని కాతనికె కాని
ఋణికి బనిలేదుబంధక క్రియఁ దగుచుట

ఆ.వె. ప్రాతి భావ్యనికి సబంధక భోగ్యముల్
లిఖిత భుక్తి సాక్షి సుఖిత యక్షర
యప్పుదీసినట్టి యతని సుతుల్ పాత్రు
లాఋణమ్ము దీర్పనమరు శుభము

ఆ.వె. లైన ధనికిఁ గలుగదా ధనం బెంతయుఁ
గపటమైనయదియుఁ గలదటన్న
నఖిల ధనములందు నగు రాజకీయాప
హృతము మరలనిచ్చుటింగితంబు

కం. అడిగినపుడీయకుండినఁ
గుడిచిన మఱికొంత ధనముకూడీయఁ దగున్
బుడమిపతి యపుడు దండన
మిడఁదగుఁ బ్రయత్నవృద్ధిశేష మీయఁగ దగున్

కం. స్మృతుల కన్యోన్య విరోధ
స్థితిఁ దోఁచిన న్యాయశాస్త్రసిద్ధక్రియలన్
ధృతి ధర్మనిర్ణయము నగుఁ
స్మృతులు సమంబైనయట్టులఁ జేయఁగ వలయున్

కం. గురుబాలవృద్ధులైనన్
బరికింప బహుశ్రుతైక బాడబులైనన్
ధర నాతతాయులగుచో
సరవిం జంపుమని యర్థశాస్త్రము దెల్పున్

తే.గీ. ధర్మగతి " బ్రాహ్మణోనహంతవ్య " యనెడి
వాక్య మమరుట హితసంప్రవర్తనముల
నదియ బలవంతమగుట నట్లగు నొనర్ప
క్రతు సతీ దేవతాత్మ రక్షలను దక్క

వ. ఏతత్కార్య విఘాతముల వట్ల వధ యుచితమగు గోబ్రాహ్మణ బాలవృద్ధోద్ధస్వత్త స్త్రీ గురుజను లాతతాయులైనను సహింపరాదు. అని మను వచనంబు ప్రతిష్ఠితంబు.

ఆ.వె. కొంపగాల్చువాఁడు నగ్నిమంతును గరదుండు
శస్త్రపాణి యన్యసతి వధించు
నతఁడు క్షేత్రధనము లపహరించినవాఁడు
సతివ విడుచువాఁడు నాతతాయి

కం. ద్విజుఁడిట్టిఁడైన భూమి
ప్రజదండము లేమివలయుఁ బ్రాయశ్చిత్తం
బు జగతిపతియిది దెలియుచు
బ్రజ మతిఁ బాలింప ధర్మపద్ధతి వెలయున్

తే.గీ. ఇల లిఖిత భుక్త సాక్షులవెల్లవలయు
నడకలకుఁ జీరకను శాసనమ్ము నాఁగ
నిరువదెలంగుల లిఖితముల్ పరగు వరుసఁ
గడఁగి చెప్పుటయును యథాక్రమమునగుచు

సీ. అదియు సాక్ష్యస్వదమైయుండు ద్వారనుం
ర్గ క్రియావహము భోగ్యక్రమంబు
లనుభవ సిద్ధంబులమ్ముట లెంచుట
లరయఁ దూనిక యెన్నికైన పాటు
పాటుచో లిఖితంబు బలవంతమై యుండు
నిచ్చినందుకు జూద మేమి యనికి
నైనఁ గూడుండుట కలిసాధనము సాక్షి
పూర్వంబునకు బాధ వారయునేని

తే.గీ. యుత్తరంబు ఫలంబగు నుర్విభుక్తి
కిర్వదేండ్లు మితంబగు నెల్లద్రివ్య
తతికిఁ బదియేండ్లు వాహనంతతికి నట్లు
వైశ్య శూద్రుల నొనరుప వర్ష మితము

కం. స్త్రీధన పశువాదములన్
బాధకమగు నమితభుక్తి పరగ భుజింపన్
సాధకుఁ డొదవిన నీయమి
బాధకు నర్హుండు చోరుభంగి నతఁడిలన్

కం. అడుగకయుండిన ఫలముల
నిడుమనగా దగదు సొమ్ములిప్పింపఁ దగున్
జడబాల కర్తృరుల కొం
డెడ కేగినవారికైన నిలవిభుఁడెలమిన్

వ. బంధనంబునకు నిట్టుల ధర్మ ప్రకారం బెతింగింపవలయును ననధికారానుభవం బొనర్చినయతండు దండనంబునంబడి రాజునకపరాధంబిడందగు దరిద్రుఁడైన ధిక్కార దండనంబుల కర్హుండు.

ఆ. వె. కర్ణపాదనేత్ర కరనాసికోపస్థ
ముదర గాత్రజిహ్వాలోదవు ధనము
గొనుట దండనములు దనరారు బదియును
దుడుకు సేయ నంగముడుపవలయు

క. చెఱఁబెట్టుట పురివెడలం
దఱుముట ధనమెల్లఁ గొనుట తలగొఱుగుటయున్
ధరణీసురులకు దండను
గురుతల్పగు తనువు దునియఁ గోయుట లొప్పున్

క. పరికింపఁగ బ్రహ్మఘ్నుని
శిరమున్ ఖండింపవలయు స్తేయుని పదమున్
నఱుకదగు మద్యపాయిన్
గరములు గోయంగవలయుఁ గడు ఘోరముగన్

సీ. ధనిలేనిపనికైన యనుభవించినయది
శతవర్షములకైన స్వామిసొమ్ము
దానముల్ త్రివిధముల్ మానసవాచిక
లిఖితములనుభవలీల బలము
నిది బలాబలచింత తెలిసి చెప్పుటలెస్స
యుత్తరసభ మెచ్చ నుచితలీల
జాతివివాద మాజాతివారలఁ గూర్చి
తీర్చుట మేలగు దెలియ దేని

తే.గీ. స్త్రీవివాదమునకు రహస్యమెలెస్స
గురుని శిష్యుఁడు పతిసతి దొరనుబంటు
జనకుసుతుఁడు వివాదంబు సల్పెనేని
యణఁచి తెలియంగఁ బల్కుట లక్ష్య మెచట

క. వారల కర్తల వలనన్
నారి వివాహముల దీర్పవలయున్ బతికిన్
మీఱి గణ ద్రవ్యముదిను
క్రూరుని ధనమంత రాజు గొనుటర్హముగన్

ఉ. చోరులుగొన్న నోలియిడుచో నెడ పడ్డ ధనంబు స్వామికిన్
భూరమణీశుఁ డట్లు బడి పొల్పుగనిచ్చుచు పాటు నొద్దిగా
వారక తాను పుచ్చుకొని వారికిఁ దక్కిన వీయఁగాఁ దగున్
ధీరత స్వామి లేమియు దదీయకులోద్భవుఁ జెప్ప టొప్పగున్

ఆ.వె. నెమ్మి నవధినైన నిక్షేపమునునైన
ద్విజుడుగన్న పాలు దీయఁదగదు
ధనము కొలఁది పాళ్ల ధరణిపుఁ డీదగు
దనకుఁ దెల్పు నితర జనములకును

కం. ధన నిక్షేపము గొనుపతి
వినవొడువకయున్నవాని వెసదండ్యునిఁగా
నొనరించి యాతఁడెత్తిన
ధనమెల్లన్ గొనుట నీతి ధర్మము దలఁపన్

కం. పదపడి వ్యవహారంబులు
పదునైనిమిది యింటి ఋణముభఁగికి ధర్మం
ఇదనఁ బదింటికిఁ బరకరా
విదితంబుగ వడ్డి ధర్మ విధమూహింపన్

ఆ.వె. ఏడునెన్నియైన నిలవడ్డి తరచైన
ధనము లినుమడిగను గొనుట నీతి
కుదువ వలయు నమ్మికొదవని యెడల ప
త్రాదులైన వడ్డి యధికముగను

తే.గీ. మొనయ నారణ్యకులకు సాముద్రికులకు
నొనరఁబడియుంటు నెదిఁటు నొక్క పాలు
గొనుట ధర్మంబు వడ్డి హెచ్చిన సమయము
నైదుపది పాళ్ల హెచ్చు గొంటెదియే నీతి

సీ. ధనము లిన్మడియును ధాన్యంబు ముమ్మడి
మఱి వస్త్రములు నాల్గు మణులు నుపల
ఘృతతైల తూలముల్ గీర్తింప నైదుపా
ళ్లెక్కువ గొనఁదగు నేకదేశ
విషయంబునన్ గాలవిస్తృతియైనచో
దూరదేశములైనఁ దొడరు మిగుల
నెనిమిదంతల కంటె హెచ్చైనఁ గొలగాదు
సామజాశ్వములను జామరముల

తే.గీ గములు నట్లు కాని కలుగ దంతకు హెచ్చు
ఋణి దరిద్రుఁడైన వృత్తి కొలఁది
శక్తియరసి ఋణము సరిదీర్చుకోఁదగు
భోగ్య బంధ కాంత పురుషు లందు

వ. దేశకాలనిర్ణయ శక్తాశక్త పరివర్తనములరసి ఋణ పరిచ్ఛేదంబు సేయించుట ధరణిపతికి ధర్మంబు తీర్చువఱకుం జెల్లిన వడ్డి యూగుణాధిక్యముల కొలఁది గూర్చుట యుక్తంబగు నిట్టితెఱంగుల నధిపతియు శమదమ భాగమున కర్హుండు—

ఉ. అప్పులు దీసికొన్న జనులాదట జీవన హాని నందుచో
నప్పులొసంగినట్టి జనులారసి జీవనముల్ ఘటించి యే
చొప్పన నేనియున్ ఋణ విశుద్ధల జేయుట నెన్న విప్రుఁడీ
యొప్పమి దాన మీవలయు నూర్జిత ధర్మ విచక్షణ క్రియన్

కం. ధనమిడిన వాని కొడుకైన
దినుసునఁ జరియింపవలయుఁ దీసికొనిన వాఁ
డొనరఁ గలయపుడు ఋణి ధని
కుని గానమి యడర నిల్వగొను వడ్డిడలన్

వ. ఎడగరి గట్టిన దారభ్యము వడ్డి పనిలేదు. అవిభక్తులగు సహోదరులు ఋణంబు కుటుంబరక్షణార్థంబునకైనచో నందఱు గూడ దిద్దవలయు పితాపుత్రులకును పతిసుతుల యవి సతికిసి స్త్రీఋణంబు భర్తకునునట్లే విహితంబగు నీయర్థంబులకై యెవ్వరికింబనిలేదు. ఇతర వ్యయంబనునది ధూర్తవంది కుత్సిత మత్త వైద్య కితవచాటు జారచోరుల కిచ్చుటనిష్ఫలంబులుగావునట్టి వ్యయంబులు చేసినయతనికే కాని తదీయులకుఁ దీర్పఁగర్తవ్యంబులేదు.

తే.గీ. దండశుల్కావశేషముల్ దాసియటుల
శిష్టకాయమ్ము గహణ స్థితులకైన
నప్పుదిద్దఁగ వారల కర్హమరయ
క్షుద్రజాతుల గృహకర్త సుదతిగాన

కం. తదధీనుఁడగుచుఁ బురుషుం
డదనన్ దదృణంబు దీర్ప నర్హుఁడు సుతుఁడున్
సుదతులు దాసులు ధనఋణ
సదనాఖ్యులు సకల శాస్త్ర సమ్మత వృత్తిన్

చం. సతిపతులొండొరుల్ దెలియ సల్పినయప్పులు దీయవారి స
మ్మతముగ దిద్దఁగా వలయు మానిని భర్తృ ఋణంబు దీర్పనా
నతఁడతిదూరగామి మృతుఁడాత్మజహీనుఁడునైన సాక్షియు
క్తత దగునప్పు దానెయుఁగఁగా నదియైనను శాస్త్ర సమ్మతిన్

కం. జనకుఁడు నన్నయుఁ జేసిన
ఘన ఋణము సమద్విదశక కాలం బెల్లన్
జనిన ధనికిఁ బనిలేదను
మనువచనం బట్టిదగుట మహనీయగతిన్

కం. తనయుఁడు పదియాఱేడులు
దనుకా జనకుని ఋణంబు దాలిమి దీర్పన్
బనిలేదుగాన నెఱిగన
వెనుకన్ దదృణమ్ము దీర్ప విహితం బెందున్

వ. బాలుండైనను శ్రాద్ధ కర్తయగుగాని ఋణకర్తగానేరఁడు విభక్తులైన సోదరులు యథాంశంబుల జనకుని ఋణవిముక్తుం జేయందగు నవిభక్తులైన జ్యేష్ఠునికిఁ గర్తవ్యంబు మృతుల ఋణంబు దీర్చునెడ వృద్ధికినిమిత్తంబులేదు. మూలధనంబు దీర్పవలయు నపుత్రకుండైనఁ దద్ధనంబెవ్వరికవారె దిద్దవలయు పుత్రులేనియెడ దాయాదులు కర్తలు తదభావంబగునెడ భార్య. అదియును లేనిచోఁ దదీయుండగు దత్త పుత్రుండు కర్తయగు.

కం. పృథివిఁ గుమారులు గలిగియుఁ
బధిరాంధ క్లీబులైన పట్లన్ దాయల్
కథితముగఁ గర్తలగుదురు
బుధవర హృత్తోషణాను పూర్వక వృత్తిన్

సీ. ఇలఁ బునర్భూస్వైరిణులు మూఁడు నాలుగు
దెఱఁగులు వరుసగాఁ దెలియవలయు
క్షత యోనియగు కన్యకయు నన్యు గూడిన
యది యాత్మ పతిగల్గ నన్యపురుషుఁ
గలయు నింతియును దాయల నాశ్రయించిన
యదియుఁ బునర్భు వు, లాశభర్తఁ
గాదని యొరుఁ బొందు గాంత యౌవనమునఁ
బెఱభూమిఁ దిరిగి క్రమ్మఱఁగ ధవునిఁ

తే.గీ. జేరినది భర్త మృతుఁడైన మీఁది మఱఁదిఁ
బొందునది మారమునఁ గ్రయంబునకుఁ దెచ్చి
కలయ నిల్లాలిపై నుండుగలికి స్వైరి
ణులు చతుర్విధ లీగతిఁ దెలియవలందు

వ. పునర్భూ ప్రథమయును స్వైరిణులును దీసిన యట్టియప్పులు తదీయ భర్త తీర్చుట తగుఁగు పరవిధానలైన పెఱయేవ్వరి బుణమ్ములాముగువారు దత్పరి గ్రహజనులు దిద్దుట లర్హంబులు ఇట్టి ధర్మాధర్మ నిర్ణయంబులు పెద్దలవలనఁ దెలిసి దండనీతి దప్పక న్యాయ శాస్త్రక్రమంబునకుం బరిపాలనంబు సేయు నృపతి యిహపరసుఖంబులు గనునని మునులు శాకథికుండు సాంఖ్య శాస్త్రంబు వినుండని యిట్లనియె.

సీ. ప్రకృతిచేఁ బుట్టిన రాజస సాత్త్విక
తామస గుణములు ధర జనులకు
నొగిఁ బైత్యవాయు కఫోజ్జ్వల లీలలఁ
జెంది సంతతము నింపొందు నుదయ
మారభ్యమవి వరుసై ప్రబలుచునుండు
రాజస ముద్యోగరాజి సాత్త్వి
కమునందు గృహకృత్యగతులఁ దత్కార్య స
మాచరణము తామసాను వృత్తి

తే.గీ. జాడ్యము సుషుప్తి నొనఁగూర్చు సరవి తోడ
నిట్టివై సంతతంబును నెసఁగి యుండుఁ
బ్రాణి కోటుల తనువులఁ బ్రబలి మిగులఁ
బోషణంబును లయమును బూని చేయు

కం. అమరులు సాత్త్విక సాత్త్వికు
లమరఁగ రాజసముగూడు నవనీసురులక్
క్రమమునఁ దామసయుతస
త్త్వములితరజనంబు గుణవిధంబులఁ దెలియన్

కం. వెలయు రజస్సత్త్వము య
క్షులు రాజసరాజసమ్ము చూడఁగ రక్షః
కులు రాజసతమము పిశా
చుల తద్గుణ గౌరవాతిసూచితచర్యన్

కం. తామస సత్త్వము పశువులు
తామస రాజసము వృక్షతతి ధరనెన్నన్
దామస తామ మద్రులు
తామరసప్రభవు సృష్టి తతనిపుణతలన్

ఆ.వె. ఘనతస్థూల సూక్ష్మకారణాఖ్యలఁ బాంచ
భౌతికము మనస్సు పదియు నింద్రి
యములు ప్రాణులైదునటు పరమాత్మైక్య
గతుల మూఁడు తనువు లతిశయిల్లు

తే.గీ. ఇవి యవస్థాత్రితయముల కెందు నేని
నాస్పదంబుగ వరుసతో నాత్మయైన
విశ్వతై జస ప్రాజ్ఞులన్ విశ్రుతముగ
మెలఁగు పురుషునివలన నుజ్జ్వలత దనరి

తే.గీ. జ్ఞాన కర్మేంద్రియములు పాసంగు పదియు
నందులకు మేటి మది నాలుగై తనర్చు
మనసు బుద్ధియహంకార మొనరఁ జిత్త
మనఁగ ధర్మప్రశక్తి నియామకముగను

సీ. అస్థిమాంసత్వక్కు లటునాడులును రోమ
ములు పృథ్వి భాగములలవడంగ
శుక్ల మేదోమూత్ర శోణిత లాలలు
నుదకాంశములు గడునొప్పు మీఱ
సంగమాలస్యతృష్ణాక్షుత్తులును నిద్ర
యగ్నిదేవుని పాళ్లనమరు నెలమిఁ
జలన ధావనకంపములును గుంచాకుంచ
నములు వాయ్వంశము లతిశయముగ

తే.గీ. భయము క్రోధంబు కామ లోభములు మోహ
మంబరాంశము లిర్వదియైదు గూడ
స్థూలదేహంబు తన్మాత్ర లీలనైదు
నైదునగు నింద్రియమ్ముల కాకరముగ

సీ. ఎంతకాలము ముక్తి కేగకయుండిన
జనన మరణముల ననుభవించు
నాముక్తికిని దపోధ్యయన సత్యాచార
శమదమధ్యానాదుల మరియుండ
ద్వంద్వంబులను స్థిరత్వము శరీరంబున
యశుచి సమస్త పదార్థములును
నశ్వరంబగును పుణ్యమును పాపంబును
కర్మద్వయము జాడ్య గరిమ యనుచు

తే.గీ. యోగివర్యంబు పలపోయు నుల్లమునను
గాన నమ్ముక్తికిని సాధకంబులయిన
గుణములను మెలగవలయు దుర్గుణము లేక
మహిమ మీఱ నజస్రంబు మానవుండు

కం. ప్రాణాపాన సమాన
వ్యానోదానులు ధనంజయము కృకరము వి
ట్లానాగదేవదత్తము
లానికఁ గూర్మంబు పదియుఁ బ్రాణానిలముల్

వ. ఇట్టి ప్రాణాది పంచకోశమయ దేహస్థులగు నింద్రియధాతు వర్ణరూప దేవగణం
బులు.

సీ. పరగ సితాసిత పాటీరవను పాట
కశ్యామ ధూమ్రాభకలిత రక్త
రుచులష్టని క్పతుల్ రూఢి ధర ధువ
సోమపరానిలుల్ సొరిది ననలు
లరయఁ బ్రత్యూషభానురు లష్టవసువులు
నంశుపర్జన్య మిత్రార్య మేంద్ర
వరుణ ధాతలు భగవత్త్వష్టృ మరుద్విష్ణు
పూషులాదిత్యులు బుద్ధినెంచ

తే.గీ. స్థాణు భువనాధిప కపాలిశంభులును గి
రిశభవ పినాక్యహిర్బుధ్న్య పశుపతులును
ప్రౌఢతా జైకపాద్వీరభద్ర ముఖ్యు
లరయఁగా రుద్రు లేకాదశాహ్వయులును

కం. అనిలస్పర్శన వాయువు
లనుపుగ మారుతము శ్వాసనాఖ్య ప్రాణం
బును ప్రాణేశుఁడు ననఁగాఁ
దనరెడి ధాతుమయ మారుతములున్ మఱియున్

తే.గీ. గరుడ గంధర్వ కిన్నరాప్సరస లమర
సాధ్యచారణ యక్ష రాక్షసులు కింపు
రుషులు విద్యాధరుల్ సిద్ధ ఋషిగణంబు
లుందు రెప్పుడు పిండాండయుక్తి రూఢి

వ. ఇట్టి దేవమయంబైన చతుర్వింశతి తత్త్వంబులకు నవ్వల మెలంగు పరమేశ్వరాంశ భూతుండైన శివునికి సాక్షియై యుండును షడ్వింశుండనందగు భగవంతు డనంతు డంతర్ముఖంబున ధారణావశంబునం గనుంగొన వలయునని ఋషభకపిల సిద్ధమత సిద్ధంబగు నిట్టి సాంఖ్యంబుననైన యోగంబుననైన నాత్మ దర్శనంబు మోక్షంబగు నట్టి యోగంబు కాలంబెఱింగి సాధింపందగు.

కం. దినమొకటెంతయుఁ బింగళ
ననువుగఁ బవనంబునడచి యర్కుని నాడిన్
బోనియమి మూఁడేడుల న
య్యినసుతుఁ గనుగొనునటంచు నెఱుఁగఁగవలయున్

కం. ఇనునాడి సూర్వరెన్నా
ళ్లనువైనఁ ద్రివర్షమాయువది మూఁడును నా
ల్గును దినములైన నేడా
ని యమునింగాంచునతఁడు దెలియఁగ నెందున్

కం. వనజహితాహిత నాడుల
నెనయుచు సుషువృత్తి వాయు వేళ దినము చ
య్యావనడిచిన నార్క్ల్లికు
జను నాతఁడు రవితనూజు సదనమ్మునకున్

కం. ప్రాణాపాన మరుత్తులు
ఘ్రాణన్ బరిపాటి వెడలి గొనకొని తగన
క్షీణగతి నడచునాతని
ప్రాణము త్రిదినములఁ దనువు బాయున్ బెలుచన్

సీ. కదిసిన యా పొసఁగాల ఘస్రంబున
నదరిపాటున నెవ్వఁడభ్రవీథి
ఘనకృష్ణ పింగళాకారు గన్గొనినరెం
డేండ్లకుఁ గడతేఱు నినునిఁ జంద్రు
మున్నుగఁ జూచి తానున్న నీడను వెన్కఁ
గనుఁగొని మఱియు నాకాశ పదము
దెలియఁ జూచిన ఛాయ తెల్పైన దీర్ఘాయు
వగు నల్పమైన శీఘ్రగతిఁ బోలియు

తే.గీ. మిగులరక్తమైన మెఱ్పుగఁ బొఁగవన్నె
మైన దుఃఖ మొదవు హస్తచరణ
హీనమైన నొక్క యేడాయువగు పల
తొలఁగ గనిన నాఱు నెలలఁ దెగును

తే.గీ. జఘన హీనమైన సకియల నెడఁ బాయు
నైల్యవారణముల నభమునందుఁ
గనిన మింటి కుమియఁగాఁ బుక్కిటుదకంబు
చాల వన్నె లేని సమయు వేగ

ఉ. కానఁడరుంధతిన్ ధ్రువునిఁ గానఁడు మూఁడు తెఱంగులన్ దివిన్
గానఁడు మాతృకావసతిఁ గానఁడు వాఁడొకయేట సోలుటొ
మానక జిహ్వముక్కు బొమ మధ్యము కన్నులివెల్లనున్ గ్రమం
బానఁ గడంగ శుక్కముల నంతకుఁ జేరును నాఱు నెల్లలో

సీ. కర వక్త్ర తాల్వోష్ఠకంఠదంతమ్ములు
నెండెనేనియు నల్పు నైఱుపు మొదలు
వర్ణమ్ము లామ్లాది వర్జితరసములు
నొగి నన్య భావంబులొదవె నేని
పవలు నక్షత్రముల్ పను బట్టెనేనిఁ జీఁ
కటి నింద్రచాపంబు గాంచెనేని
చాపంబు శీతకరచయము నీక్షింప నూ
సరవెల్లి యొడవెల్ల సరవిఁ బ్రాక

ఆ.వె. నాలుగైలలకు నంతకునూరు జేరు
దర్పణంబుల వీక్షింపఁ దల గనమిని
కొక్కనైెలోన నీల్గుట నిక్కమరయ.
... ... ... ...

కం. ఆ నీడయు నశిపైనన్
మూనక మూణ్ణెల్ల కెంపు మాడ్కి నొదవినన్
బూనిక నాల్నెల్లను రవి
సూనునిపురి గృహచయంబు చూచుం బెలుచన్.

కం. పున్నమయందు నపూవా
స్యన్నలిన... సేకచక్షువునఁ గనన్.
గ్రన్ననఁ బెన్నువేలికి మిగి
లున్నన్ షణ్మాసములకు నూర్ధ్వగతుఁడగున్.

కం. ఘృతమున జలమున నీడలు
ధృతిఁ బూర్ణత మాని మొరప తేటఁబడినచో
నతఁడాఱునెలలఁబోలియున్
క్షితి వక్త్రచ్ఛిద్రము దవఁ జేకుఱు నయులన్.

సీ. ఒకనిమిత్తములేక యొడలెుత్తిమిన గఁడు
వలమైన బడుగైన వాడెనేని
నాదటు సురతాంతమపుడు ఘంటానాద
మాలకించినయట్టులైన నడును
నందురజంబున నడుగిడునెడ తెగి
కనుపింపఁజందురుగతి నిసుండు
దోఁచిన గుండె తెంతో పగిలినయట్టు
లైన గ్రా............ యదిరిపడినఁ

తే.గీ. దృప్తినొందియు నాఁకలిదీఱకున్న
శ్రుతిపుటంబుల నంగుళుల్ జొనుప నబ్ధి
ఘోషగతి లేమిఁ గ్రుంకిడఁ జేత నంఘ్రిఁ
దొడల రొమ్మున జలమింక నుడుగువేగ.

తే.గీ, కనఁగ, సంకర్షణజ్యోతి కనకరుచిని,
గానరాకున్న వలపటికంటి నీరు
నెపుడు గారిన మోమున నెఱుపుగదుర
రొమ్మురులకన్నాపఁ బ్రతి గానకున్నఁబోలియు.

చం. శిరమొగిజాఱ బొడ్డుబుకఁ జెన్నలరన్ జలమజ్జనంబుచో
సరసిజపత్రవృత్తికణసంతతి యంటుకయున్న దంతపం
క్తి రుచి దొఱంగి కందొరయ తేకువ లేకెదలో శ్రమంబు వేఁ
బొరసిన, మేనిపై తెలివి పోయినవారికిఁ గేఁడుశీఘ్రతన్.

కం. మానసము నెగులుపుట్టిన
వీనుల నేశబ్దములును వినరామిన్ జూ
పానక వికృతంబైనన్
బూనిక పైనీడ కదలఁ బొలియున్నేగన్.

కం. నెరయ భ్రమన్ గంధర్వన
గరము గనినఁగల నులూకశరసూకరకా
సరగృధ్రోష్ట్రిసృగాలక
హరిదర్శన మైనఁ బొలియు నాతఁడు వేగన్.

తే.గీ. నుదుటఁ జెయిచేర్చి కరదండమదనఁ జూడ
సన్నమైనను వర్ధిష్ణు చాల స్థూల
మగుచుఁ గనుపింపఁ దలలేమి యగుచు నీడ
కానసైనను మూర్ణల్లఁ గాలుఁ జేరు.

తే.గీ. దండపాణులఁ గలఁ గన్నఁ దైలపిహిత
గాత్రులను జూడఁ దానట్లు కానుపింప
తేరుపై కొండలను మేడ [తెగువ?] పాడవు
చోట నుండంగఁ గలగనఁ జేటులౌదవు.

కం. మఱియును బెక్కునిమిత్తము
లరయఁగఁ గేఁడులకు గల్గు నదికలఁ గనినన్
గరమిట్టి విలక్షణముల
గుఱుతెఱుఁగుచు మేనిమమత గూడకబుద్ధిన్.

కం. ధీకలితవృత్తిఁ గర్మరి
పాకంబొనరించికొనుచుఁ బ్రాకటతత్త్వ
శ్రీకల్మి నాత్మసౌగవి
భాకమనీయత మెలంగఁదా ముక్తుఁడగున్.

ఆ.వె. పుణ్యతీర్థసేవ పుణ్యపురావాస
మైన యోగరీతినైన సుకృతి,
మహితపదవికిన్ గ్రమక్రమంబునఁ జేరఁ
దలఁప వలయు దనువు గలఫలమున.

కం. ఆత్మజ్ఞానము లేక
ధ్యాత్మల సద్బ్రహ్మపదము నంద ననిత్య
త్వాత్మీయత మెఱఁగు నస
త్వాతులకున్ వశమె ఘననియమికిన్ దక్కన్.

వ. కావున సాంఖ్య లింబాపింగళా హఠాది రాజయోగాత్మకంబగు రాజయోగంబు
నం దవులపలయుఁ దత్క్రమంబెఱిఁగించెద.

సీ. యమనియమాసనక్రమము ప్రాణాయామ
మెలమిఁ బ్రత్యాహారకళన, ధ్యాన
ధారణలు సమాధి వారక యష్టాంగ
యోగము యమనియమోపరహిత
మైన షడంగము నట్టి యోగస్థితి
యొప్పగు నష్టాంగయుక్తిఁ దనరు
యమ మది నైజకర్మాచార నిరతియౌ
నియమంబు సద్వ్రతనిష్ఠ వెలయు

తే.గీ. నాసనంబుల భేదంబు లలరు పెక్కు
పద్మకుక్కుట మాయూరి భద్రకూర్మ
మత్స్య సుఖవీరసిద్ధ విమల నిరోధ
చాపగోముఖరౌద్రోగ్రసంజ్ఞ లమర.

కం. దిట్టగ సిద్ధాసనమున
గట్టిగ గుహ్యమునఁ గాల్లు గదియించి కడు
న్నెట్టుగ భ్రూమధ్యస్థితిఁ
బట్టుగ చూపమరు సిద్ధపటిమ దనర్చన్.

తే.గీ. అట్టి సిద్ధాసనమ్మున నైన మఱియుఁ
దనకొనరిన యాసనస్థత దృఢముగ
నిలిచి హృదయంబు మిగుల నిశ్చలముగాఁగ
నిరత మంతర్ముఖత్వంబు నెరయు వరుస.

ఉ. దంతము లొక్కటొక్కటిని దాఁకఁగనీయక మౌనవృత్తితో
సంతసమొందు వేళ జనసంఘము చేరనిచోట నొంటిగా
నెంతయు దేవతాగృహ వనేషితరమ్యతలంబులన్ మదిన్
జింతదొలంగఁగాఁ బ్రణవసేవకుఁ బొచ్చుట యుక్తమెన్నఁగన్.

ఆ. వె. ఆదియు మూఁడు దెఱఁగులగు ప్రాకృతంబు వై
కృతమునాఁగ మఱియుఁ గేవలాఖ్య
కంబు ననఁగ లోనఁగల్గు ప్రాణాపాన
ములను నాత్మదిరుగు వెలికి లోన.

ఆ. వె. ప్రాణుఁడయ్యపానుఁడవన నధోర్ధ్వగ
క్రమ హకారమున సకారమునను
దివియ జీవుఁడడరు పవనచాలనదీప
భాతి స్థిరత మాను రీతి నచట

సీ. తనకు నయ్యక్షరద్వయిసందు బిందువు
జనియించు వలన హంసయన శబ్ద
గతి దివారాత్రులొక్కటు నిఱకడలేక
వేగ నిర్వదియొక్క-వేయు నాఱు
నూఱుమాఱుల దొక్క- వారంబుగా నిట్టు
లైన ప్రాణాయామ మాని స్థిరత
గావింపఁగా స్వప్రకాశుఁ డౌనటులొన
రించుటచేఁగాదె ఋషులు సురలు

తే.గీ. ప్రబలి చిరకాల జీవులై పాతకములు
బాసి కర్మంబు లెడలైన భవ్యపదవు
లను మెలంగుదు రంతకంటెను దపంబు
గలదె! పరికింప మూఁడులోకములయందు.

కం. అజపాగతి పంచాశ
ద్భజనాక్షరయుక్తి నొడువఁ బ్రాకృతమయ్యెన్
వృజినాపహమగు ప్రాకృతు
ల జపింపన్ వైకృతంబు లలితంబయ్యెన్.

కం. పూరకసంఖ్యకు నినుమడి
నారూఢిని గుంభకంబునందును సగముం
గా, రేచక మొనరింపఁగ
పారత వైకృతమనాఁగఁ జను ప్రణవ మిలన్.

కం. ఇడ చంద్రనాడి దాన
న్వడిఁబూరింపుచును భానువరనాడి తగ
న్విడుచుచు సుషుమ్నలోపల
నిడినందగు పవనసిద్ధి యింతయును వినన్.

మ. ఇవి రెండున్ విడనాడి యేకగతిగా నివ్వాయుయుగ్మంబు చే
ర్చి వెసంగా మణిపూరకంబుదిగువన్ జెల్వొందు వైశ్వానరున్
రవణన్ బ్రజ్వలితంబు జేసి యట చేర్పన్ గుండలిన్ లేపి యం
దవలంబించి త్రికూటమౌ హృదయసీమారూఢి నింపొందుచున్.

క. లీవిగ నత్తఱి సుశ్రమ
మౌ వగనాడీపథమున నభ్రమునఁ జేర్పన్
గేవల కుంభకమగు నది
పావనతన్ రాజయోగ పటిమ దనర్చున్.

కం. ఇది ప్రాణాయామము వెలిఁ
బొదలెడి యంగములు కూర్మముం దనలోనే
యొదుగుగతి నింద్రియముల
నొదవగునెడఁ గుదురు చేయఁ బ్రత్యాహరమౌ.

ఉ. పూని యుపాసనాఫలవిభుండగు నప్పరమాత్మ నెప్పుడున్
మానససీమఁ జేర్చి యసమానమతిన్ దదధీనమౌట యే
ధ్యానము తద్విభాద్యుఁ బ్రథితంబుగ నిట్టులు జేరనీక డెం
దానఁ గుదుర్కొనం జలుప ధారణ నానుతి కెక్కు నెక్కువన్.

తే.గీ. జ్ఞానమయుఁడును వైరాగ్యమానఖనియు
నిష్ప్రపంచకుఁ డాద్యుండు నిర్మలుండు
నైనఁ దద్దర్శనమున నప్రాకృతమతి
వెలయు నది యోసమాధి నా వినుతికెక్కు.

ఉ. ఇట్టి మహామహత్త్వమున కెల్లను మూలము వాయుధార్య మ
ప్పట్టున వేగురించి తడఁబాటున రోమములన్ వెలార్చినన్
గొట్టగు కుష్ఠముఖ్య జననిందితరోగము లట్లుగావునన్
గట్టిగఁ గ్రొత్తయేన్గు వలెగా నలవాటొనరింప మేలగున్.

క. ఆవరణకు నిర్మలకును
భావన మేకాంతవృత్తి పవనరహితమున్
గా వెలయుచోటుదగు యో
గా వహచిత్తులకు నెపుడు నభ్యాసదశన్.

సీ. ఆత్మ జీవాత్మస్థుఁడగు నాత్మ నీక్షించు
నాతఁడె తలఁపఁగ నాత్మవిదుఁడు
మది నంతరాత్మసమ్మతిఁ గూర్చు వలనఁ బ్రా
ణాపానములను దదాత్మ గూర్చు

వలన నింద్రియములఁ దలరఁ గూర్చుటవల్ల
మది నాత్మనొనఁగూర్చు మహిమవలన
యోగాఖ్య విలసిల్లె నొదవు బాహ్యేంద్రియ
మంతర్ముఖము జేసి యదియె మనసు

తే.గీ. దవుల నొనరించి దాన క్షేత్రజ్ఞునైతిఁగి
యతనివలనను నంతస్థ స్వామినై యాత్మ
దర్శనము మన మన్య శాస్త్రములు గ్రంథ
విస్తరంబులు కడు నప్రశస్తములును
గురుని దయ ముక్తిదంబది కరము వేడ్క.

కం. గాలికి జలములు కదలిన
పోలికఁ బ్రాణానిలములఁ బోరి జీవుండుఁ గ
ాలనుడుగు పత్సరతకు
గాలలి పవనమును నిలుపఁగా దగు మనతగ్.

సీ. అంఘ్రిమి లకారయుక్త్యనిలు నిల్పుట నజు
సరవిఁగాంచిన భూమిజయము గల్గు
శ్వసనుఁ బకారోక్తి జానువులను నిల్పి
శార్ఙ్గిఁ గన్గొన వారిజయముగల్గు
రేఫతో నాభి నర్తిలి గాలి నిల్పి యం
దథవుఁజూడ లభించునగ్నిజయము
కన్ఫొమ మొదల యకారోక్తి మాహేశు
నటఁ గన వాయుజయంబు గల్గు

తే.గీ. నవల భ్రూమధ్య నిటలంబునందుఁ బవన
జితి హకారంబుచే సదాశివ నిరీక్షుఁ
డైన సుజ్ఞానముక్తుఁడౌ నతనికరుణ
గణనఁజెల్వౌగు పంచధారణలు నిట్లు.

ఆ.వె. ఒదవునైష్ఠికమున యోగమ్ము సిద్ధించు
తన్నుదానె తెలియ దానఁజేసి
భ్రమరకీటసరణి భావనచే బ్రహ్మ
మహితచిత్తశుద్ధి మహిమఁబొసఁగు.

సీ. తనరెడు యోగరంధ్రమున హృత్పాత్రమ్ము
గీలొల్కల్పు టరిది తత్కృతము వలనఁ
గనఁ గుమారస్త్రీసుఖంబులకై వడి
జ్యోతిర్మయస్థానశుద్ధిఁ బొసఁగి
యస్ఖలితంబగునానందమునఁ గూడి
చిత్తదర్పణమున శివుఁ బరేశు,
నాత్మఁ గాంచుటలొప్పు చూపట్టఁడితర శ
ర్మముల రోగవిహీనుఁడమలు నభవుఁ

తే. గీ. గానలేఁడంధుఁడల శశికాంతిఁ దెలియ
లేనికైవడి, దారువుల్ పూని త్రచ్చి
యగ్నిఁ గనురీతి మదినీవు నరయవలయు
లలితమతులైన సుజ్ఞానులకుఁ దలంప.

సీ. అందులకాధారమునఁగ స్వాధిష్ఠాన
కంబును మణిపూరకము ననాహ
తము నాజ్ఞయును విశుద్ధము రతిమేరుశి
ఖగమును బ్రహ్మచక్రము శిఖాఖ్య
మీ తొమ్మిదింటిలో నీశ్వరావాసంబు
తన్మాత్రలకు నెల్లఁ దావలంబు
బహురంధ్రమును శశిభానువహ్ని యుతంబు
సగుణనిర్గుణము హంసమున కిరవు

తే. గీ. ఘనత గగనత్రయాధారకమును నాద
బిందుకళలకు నునికియుఁ బేర్మి నిర్మ
లమును క్షేత్రంబు ననఁదగు దమని దామ
నిశమని స్తంభనియుఁ బావనియు ననంగ.

కం. ఐదగుపేరులఁ బ్రాణము
లైమఱి భరియించు దేహమంతయుఁ దాపై
యాదియు గాసిద్ధుల కవి
యాదట జ్ఞానమయుఁడైన యాత్మకు నెలవై

ఆ. వె. ఇలకునుప్పుగలసి సోమరసంబన
నమరురీతి మనసు నాత్మ గూడు
టవి సమాధి యైక్యతానందసంపత్తి
కదియు తుద మహాత్ములకయు నెడల

ఆ.వె. యమము తెల్విదగు నియమము చిత్తమునిల్పు
నాసనములు బలద మఘహరణము
ప్రణవవృత్తి శుద్ధి ప్రత్యాహరము ధ్యాన
మాత్మజయము ధారణాత్మఁజూపు.

కం. వినుఁడు సమాధియె మోక్షం
బనఘంబు తురీయ మదియూహర రాజములన్
ఘనసంజ్ఞ కదియె యర్థము
జను నున్మనియనఁగ నదియె సత్యంబగుచున్.

ఆ.వె. అది మనోలయంబు నజ్ఞానరహితము
ధారణమగు వాయుధారణంబె
మూఁడుబంధనములు ముద్రలు మూఁడునై
కలవు సాధనప్రకాశమగుచు.

కం. ఆసన భేదమ్ములచే
భాసితమగు పవను నెచట పరగ నిలుపుటల్
వాసిగ ధారణయనఁదగు
నా సంజ్ఞలుగలవు పెక్కు లవయవములన్.

సీ. సరవి మూలోడ్యాణజాలంధరములను
బంధత్రయంబందుఁబవను నూర్థ్వ
గతిని నాకుంచనక్రమమునఁ దవియంగ
మడమచే యోగిసమస్థలమున
నానుట మూలబంధాఖ్యమౌ నాభికి
నెగువను దిగువ నిల్పుగల వాయు
వదియె యోడ్యాణ మయ్యనిలుని హృదయ ము
ఖకములు బంధించి పాసఁగ జివ్వ

తే.గీ. నైకిని గిడించి యట సుధాపాన మొనర
బంధురస్థితిఁజేయ జాలంధరమగు
ననిమిషత్వమ్ము లోన లక్ష్యమ్ము బహిని
దృష్టియుంచుట ముద్రగాఁదెలియ వలయు.

చం॥ అది యట నూర్ధ్వదృష్టియగు నప్పుడు నంబరముద్రనాఁగ నా
ప్పిదమగు ఖేచరీ యనఁగ నట్టిద యల్లన నల్లనేత్ర ము
గ్రదశను దృష్టి నిల్పుట కరంబగు ముద్ర పొసంగు దృష్టిసం
పద సమమైనచో నమరు పావనమైన మహాఖ్యముద్రమై

సీ॥ పవను నపానైకపథమున నరికట్టు
మూలబంధము తగులీల నాత్మ
నల మహాఖగము నొయ్యన నిల్పుటకునుడ్
డ్యాణ బంధమ్ము దయ్యెనఁ దొసంగు
జాలధారణకుఁ గా జాలంధరంబొప్పు
పరమాత్మఁ గనుటకుఁ బరమ ముద్ర
యాత్మశోధనకు సూర్యాంబునాడులఁ గూర్చ
రస మిపుర మహాఖ్య పొసఁగు జిహ్వ

తే.గీ. పైకి నిగిడించి యంచిత బ్రహ్మరంధ్ర
మాని యచటి సుధాంశు నందమృత మాను
టకు మహాబల ముద్రయే ప్రకట మగును
బంధములు ముద్రలిట్లగు పవను నిలుప॥

తే.గీ. వ్యాహృతుల మున్నుగాఁ బ్రణవములు దనర
నమరు గాయత్రి శిరసులో నందుఁ గూర్చి
మూఁడు మాఱులు జపియింపఁ బొడిమలర
నదియుఁ బ్రాణానిలాయామ మనఁగ వెలయు॥

క. ఇడ పదియాఱిఁట పూరక
మడరఁగ నరువదియు నాల్గు నట కుంభకముల్
పడి ద్వాత్రింశద్రేచక
మొడపని ప్రణవములఁ జేయుటిది యటులయ్యెన్॥

మ. తను ప్రాణానిలరావముల్ దలఁప నాదంబయ్యె హృచ్చిత్త బు
ద్ధ్యను సంయోగము బిందునామమగు క్షేత్రజ్ఞైకచైతన్య జీ
వనిరూఢాఖ్య కళాభిధానమగు తేపల్ మీఱ నిమ్మూఁడు గూ
డినచో నున్మని రాజయోగమగు బ్రౌఢిన్ సత్సమాధ్యాకృతిన్॥

క. పరమాత్మకు నెలవగునది
పరికింపఁగ నిట్టి యోగపటిమ దనర్పన్
జిరకాల జీవియును సు
స్థిరతానందుండు నగుచు నెగడు నరుఁడిలన్॥

క. ఇడిపింగళలు సుషుమ్నయు
నడఁగూడుటవలన భానువహ్నిశశులటన్
దొడరువలన నుభయపవను
లడరి ఖగాత్మతఁ ద్రికూటమనఁగా జెల్లున్ ”

తే.గీ. అది చతుష్పథకంబు శృంగాటకంబు
నననగు నదగు కర్ణ నాసికా జనిత రంధ్ర
ములును నాలుగు కలియుట వలనఁజేసి
యది త్రివేణీయుతంబన నలరుచుండు

క. ఇడ పింగళలును గుండలి
వడి గంగాయమునలనఁగ వాణియు ననఁగా
నడరియవి కలయు వలనది
జడరహితత నాత్రివేణి సంజ్ఞంజెల్లున్॥

సీ. రహి సమాధికిఁ బేర్లు రాజయోగంబు ను
న్మని యమరయోగంబు తనరు తత్త్వ
మును మనోన్మని లయంబును జరంపద మను
నస్కము ద్వైతశూన్యమును శూన్య
మును నిరాలంబనమును నిరంజనమును
సహజ జీవన్ముక్తి సంజ్ఞలమరి
తుర్యంబుననఁజెల్లు ధ్రువ బుద్ధి నస్తి భా
తి ప్రియ రూపముల్ దెలియ నామ

తే.గీ. కలన బ్రహ్మాంశములు నైదు గలవు గాన
నాద్య శబ్దత్రయంబు బ్రహ్మమగు తుదివి
రెండును జగంబులగు నిట్టి రీతు రెఱిఁగి
యాత్మచింతన సేయ సౌఖ్యంబుగల్గు॥

క. విడుచుట కొన్నియు సేయఁగ
నడరుట లోకకొన్ని గ్రాహ్యమని కొన్నియ నాఁ
బుడమింగలదే బ్రహ్మం
బెడయకనన్నియును నగుచు నెయ్యెడ నమరున్॥

క. యోగరతుఁడు బహుచర్యల
రాగియుఁ గృద్ధుండునున్ విరాగిజడుఁడు నా
భాగుఁగ గర్మవశంబుల
చేఁ గడఁగుట దోషశుద్ధి చింతింపంగన్॥

సీ. వినుఁ డసంప్రజ్ఞాత మనఁగ సంప్రజ్ఞాత
మును నవికల్పంబు దనరు నిర్వి
కల్పంబనఁగ నందుఁగడగి మనోవృత్తు
లనయంబు లోపల నాఁచి యాత్మ

యందు లీనంబైన యది యసంప్రజ్ఞాత
  మగు నేను బ్రహ్మంబు సనైడి మనసు
పరగ సంప్రజ్ఞాతపటిమ నొప్పగు మఱో
  గత కామములకు నిల్కడగు చేత

తే.గీ. నంబె సాక్షిత్వ మాత్రంబె నాఁదగు నవి
  కల్పగతి స్వానుభూతి నెక్కడివి గనక
  ఘనతఁదద్ద్రిస కలితమై యొనర నిలుపఁ
  గల్పమనైడి సమాధి నా గణనవనరు॥

వ. సూర్యభేదనోజ్జాయి సీత్కార శీతల భస్త్రికా భ్రమరీ మూర్ఛా కేవలాఖ్యలఁ గుంభకము లెనిమిదియు, మహాముద్ర మహాబంధ ఖేచర, ఓడ్యాణ, మూలబంధ, జాలంధర కరణ, విపరీత, వజ్రోలి శక్తిచాలనములను ముద్రలు పదియును, ధౌతి వస్తి, నేతి, త్రాటక నౌలిక, కపాల, భాతులనైడి కరణషట్కంబును నేతత్సాధకంబులు గావున-

మత్తకోకిల. ఏ విధంబుననైన యోగి రహిన్ భవంబులు గాఁచుటన్
  బోవ నిశ్చల సాంఖ్యమొందుట భూరి వైభవహేతువౌ
  పావనంబగు దేహమెత్తిన భాగ్య మూరక రోగ సం
  భావితస్థితి బోవఁ డీడకనట్లు గట్టుగటొప్పగున్

సీ. మేధతోముక్తికి సాధనంబగు మేను
    దేశకాలగుణానుధృతు లెఱింగి
  యోగి యాత్మజ్ఞాన మొదవ మెలంగక
    మదవృత్తి నసియనూప్పదత కొలఁది
  కి మిగుల నన్నపానములు గొన్నను వాత
    పైత్యముల్ శ్లేష్మంబు ప్రబలమగును
  వాతమెచ్చిన మేని వడఁక గుదియఁగఁగ జేయు
    పైత్యంబు కృశమును భ్రమ యొనర్చు

ఆ.వె. శ్లేష్మమే [మేచ?] ముక్కువెళ్ళు లడ్డగించు ని
  ల్లైన నల్పణములు ప్రాణవాయు
  పంచకముల నెలవు వాపి [జీర్ణని?] మెయి
  నుండ నీక లిఖచి యుదర దరిను

క. కర్మేంద్రియములు దనుతమ
ధర్మములను వహించుఁగాని తడవఁగఁగలదే
యర్మిలి జేతోగతులవి
మర్మిత జ్ఞానేంద్రియముల కడమలఁగి మెలఁగున్

వ. అట్టి యింద్రియంబుల మనస్సున, మదిని బుద్ధియగు నటులది యహంకారంబు గా నదియు జ్ఞానంబుగా నొకటించుకొనిన యాపోజ్యోతివిధంబున బహిరబహిఃప్రకాశంబై సకలమయమగు బ్రహ్మస్వరూపంబెఱుంగగాను నందునం గలయునది సమాధి. యిట్టి యోగంబునకు ననేక మార్గంబులు గల వందొకటైననఁ గ్రమక్రమ ప్రాప్యంబగు, నింక మీమాంసాద్వయంబు వివరింతునని సూతుం డిట్లనియె—

సీ. పూర్వమీమాంస యొక్క ద్వివిధములయి దాన
వఱలు సేశ్వర నిరీశ్వరములనఁగ
వ్యాస జైమిని మునుల్ చేసిన సూత్రాను
సంగతి ధర్మవిస్తార ఫణితి ·
వ్యాస సూత్రముల బ్రహ్మ ప్రతిపాద్యమై
యుత్తరమీమాంస యొక్కనందు
భేద మభేదంబు పేర్మి భేదాభేద
మగు నర్థమట్టి శాబ్దాళి నమరు

తే.గీ. పూర్వపక్షంబు సిద్ధాంతమును బొసంగ,
నట్టి రాద్ధాంత మర్మంబు లరయ బ్రహ్మ
మొక్కటియె పెక్కు రూపము లమరఁదనరు
నమిత శబ్దమయంబఖిలాత్మ యగుట ॥

వ. కావున బ్రహ్మ ప్రతిపాద్యంబగు నుత్తర మీమాంసార్థంబునకుఁ గా వసిష్ఠ శ్రీరామ సంవాదంబు గలదు తద్విధం బెఱింగించెద, రామభద్రుం డడుగ వసిష్ఠముని యవస్థాత్రయక్రమంబనం దెలియ నిట్లనియె—

సీ. రవి స్థూలసూక్ష్మ కారణ దేహముల యంద
హంకారములు మాని యర్ధుజంబు
స్థూలంబు దుఃఖంబు సూక్ష్మంబు జడము కా
రణమనిన . . . వారలకు దృశ్య
మగు ప్రపంచ మభావమగు నంత సత్తు చి
దానందములు నిత్య మగుట దృఢము
గాఁ, గలనుతియు జాగ్రదవస్థలో ని జా
గ్రంబని యంద్రు సుజ్ఞాను లిదియు

ఆ.వె. తత్పదార్థదర్శితము సచ్చిదానంద
ముననై పుట్టి పెరిగి పొలియు సకల
మదియు నిత్య మనుట లగును జాగ్రత్స్వప్న
మదియు సత్పదార్థ మగుచు నొరయ॥

తే.గీ. అంబు పరిపూర్ణరీతి చిదభ్రమగుచు
నుండఁదయుతాని వేఱె యొండొండవదనైడి
యొఱుక గల్గియు విషయత్వ మింద్రియములు
నిద్రఁజెందుట జాగ్రపు నిద్రయండ్రు ॥

వ. ఇది యసిపదార్థదర్శనంబీ త్రివిధంబు తత్త్వంబు మఱియు—

ఉ. జీవుఁడ నానొ కానొ! యనుచింత దొలంగి తిఱుంగలేని యా
భావముచే ననేకములఁ బాటిలు జన్మము లొంది యిప్పుడా
దేవు ననుగ్రహంబున మదిం దిరమయ్యె గురూపదిష్టమం
దీవిభవంబు దాఁకుమును నెన్నమి స్వప్నములోని జాగ్రతల్ ॥

వ. ఇది కారణోపాధి దొలంగ నిష్ఠయొనందగు—

సీ. జీవాత్మహేతునుస్థితిని మూలాధార
మటు గురుకృపవల్ల నడఁగు పిదప
గనునది యతనికిఁ గనుపించునది త్రిపు
టాదిగా నొక్కటిదైన లేద
టంచు నెఱుంగుట లది నిశ్చయ జ్ఞాన
మది స్వప్నమున స్వప్న మనిరి బుధులు
ధృతిఁ గారణోపాధి త్రిపుటి, దీఱని నిష్ఠ
యిది నిశ్చలపుబుద్ధి నైసఁగమోక్ష

తే.గీ. శోభ గురుబోధనంబుల చొప్పుదెలియ
వచ్చుటయు తత్పదార్థమున్ వరదృఢమది
స్వప్నమునను సుషుప్తినా జరగు నిదియు
నతి గద రమేశదర్శనానుభవనిష్ఠ ॥

క. అంతః కరణ చతుష్టయ
మంతయు నటులుండ నింద్రియాధిక్య ప్ర
జ్ఞాంతచిదానందిడె
యింతయు సుప్తిదగు జాగ్రదితహితయుక్తిన్

క. పొందుగ సత్యజ్ఞానా
నందాకృతి యనుభవంబు నొందగు నిది యీ
చందము వలనం గాంచుచు
నందఱు సంతసముదొలక దగుకొని ? మఱియున్

ఆ వె. గాలిలేనిచోటఁ గదలని దీపంబు
పగిదిఁ జిత్స్వ భానుభవము లయము
పొందు సమయ మందె పొంద సుప్తి స్వప్న
మదియె ముత్స్వ రూపకానుభవము

ఉ. పూనికతోడ నిష్ఠులగు బుద్ధి విమర్శన భావనాగతిన్
మానక వృద్ధిఁజెందు మతి మాటికి నన్య మెఱుఁగఁజొక బ్ర
హ్మానుభవంబు పూర్ణగతి నైనది సుప్తిని సుప్తియయ్యె యు
ట్లా నగ నిర్వికల్పపు సమాధి యగున్ బరమంబు గాఢనన్

తే.గీ. శ్రవణ మనన నిదిధ్యాస చర్యలందగు
నిట్టి తొమ్మిది విధముల నెన్న వరుస
మూఁడు గుణముల తెలుఁగు రామునకు నావ
సిద్ధయోగీంద్రుఁ డెఱిఁగించె నిష్ఠ వెలయ ॥

వ. ఇట్టి బ్రహ్మస్వరూపంబు వరుణ భృగుసంవాదాదీతిహాసంబులు మున్న యెఱింగించితి నట్టి యానందమయంబును నఖండంబును నఖిలపూర్ణంబును నగుటం జేసి ఘటాకాశ మఠాకాశ చిదాకాశముల వలన పరమవ్యోమ ఖ్యాతంబగుట దెలియందగు దేహంబులు గుహయనందగు నందు నిహితంబగుట ఘటమఠాకాశక్రమంబునఁ దత్ప్రచ్ఛన్నములగు నెడనెప్పటి యట్ల నఖండగతిన్ బూర్ణత్వంబునం దగు హృదయ కమల మధ్యంబున దీపక్రమంబున వేదాంతసారంబగు నయ్యానందరూపంబు వర్తించుచు వెలుపలనంతయుఁ దానెయగు నాహోజ్యోతి చండంబున వెలుగులనుండియు నీవారశూకవత్తన్వీపీతాభాస్వరూపంబునఁ దద్దీపశిఖయందుఁ దేజరిల్లు నద్దివ్యతేజంబును బహింగల మహావ్యోమతత్ప్రకాశమును నేకీభావం బొనర్చిన యోగి సమాధి నిష్ఠుఁడౌంట నివృత్తి మార్గంబునఁ జన సులభదర్శనంబైన యట్టి బ్రహ్మంబె తానగు మఱియును—

తే.గీ. నిర్మమత్వంబు నిస్సంగనిరతి నాత్మ
దృష్టిఁగన్గొనఁ జేయుచుఁ దేజరిల్లు
నప్రయోజన కార్యము లభిలషించి
కష్టపడు దుర్మతులకు సౌఖ్యంబు గలదె,

తే.గీ. వ్యావహారికు జాగ్రదవస్థ ప్రాతి
భాసికుని స్వప్నమును నిద్ర పారమార్థి
కుని నిరూపించు మాయకు నొనరు నావ
రణము విక్షేప శక్తియు గణనకెంచు

క. పొలఁకుచు నక్షరమాత్ముని
నలవడఁ గప్పుకొనియుండు నావరణమగున్
జెలఁగు చరాచర సంతతి
వెలయం గనుపించుటదియ విక్షేప మగున్ ॥

సీ. పరఁగ రజ్జువున సర్ప భ్రాంతి శుక్తిని
రజతంబు తోఁచు విభ్రాంతి రీతి
బ్రహ్మంబునందు నేర్పడ జగంబులు గను
పింప సన్మతి వివేకింప బ్రహ్మ
మమును సత్యాత్మకమగుచు నాత్మ ధ్యాన
నిష్ఠులు దక్క తక్కింపఁ గర్మ
పరులు గానరు వెలుపలఁ గాలమయ్యెడు లో
ప ల నణువైయుండు లలిత యోగ

ఆ.వె. యుక్తి నిర్వికారు నురుతేజు గనఁదగు
ప్రకృతి నెడసి శుద్ధ భావులగుచు
నామరూపములకు నాశనమగుట న
వ్యక్తు సత్యుఁ గనుటలది శుభంబు ॥

కం. ఉత్తమము తత్వ చింతన
మొత్తుక జపచింత మధ్యమాకృతి యధమం
బెత్తఱిని శాస్త్రచింత మ
హోత్తర నింద్యము లౌక్యమగు చింత తగన్ ॥

కం. ధరణీసురులకు నగ్ని ని
జరయోగులకెల్ల నాత్మవహ్ని ప్రతిమ ల
స్థిరతాల్ప బుద్ధులకు నే
ర్పరులగు సమదర్శులకుఁ బరుఁ డెందమునన్

ఆ.వె. దేహబుద్ధిఁ జూడదేవుని దాసుండు
జీవబుద్ధినట్టి దివ్యాంశ
మాత్మబుద్ధిఁ జూడనాదేవుఁ డేతాను
మతుల కొలఁది నిట్టిధృతి పొసంగు

వ. జాగ్రత్స్వప్న సుషుప్తుల విశ్వతైజస ప్రాజ్ఞ సంజ్ఞల నేత్ర భ్రూమధ్య బ్రహ్మస్థానంబుల నుండియు వ్యాపకశక్తి నంతటం దానయైన యప్పరమాత్మ విచారింపలేని మూఢులు దారిభూముల కరిగి సేయందగు ప్రయోజనంబు లెవ్వియునియుంగలవె! కావున హస్తగత మాణిక్యమ్ముఁ గైకొన నేరక గనులు శోధించు జడభావులనింబలె నగునన్ని యత్నంబులనైన బ్రహ్మ విచారంబు సేయవలయు "నాత్మజ్ఞానీ సంసారం తరతి" యను శ్రుతి ప్రమాణ బనియును వాఙ్మనగోచరంబగు బ్రహ్మంబిట్టిది యని వేదాంతంబులు నేర్పరింపనిచో నెవ్వరు తెలియం జాలరనియును, అయినను గొండగఱియుడిన కరణి భావనచే నఖిలమయుం గననగుననియు దెల్పి మునులకు సూతుండు వెండియు నవ శాస్త్రంబులగు భరతకళాలంకార శిల్పగజాశ్వ పశురత్న సాముద్రిక గణిత శాస్త్రంబులు వినుండని యిట్లనియె.

కం. ఆది సదాశివరచిత
ప్రాదుర్భవమగుచు నందిపటు వాఙ్నిపుణ
శ్రీదనరి భృంగిముఖ్యవి
నోదంబై ఋషి చయప్రముఖగతి వెలయున్

వ. రత్నాకర చూడామణి తాళకళా విలాస సంగీత మణిదర్పణ చతుర సభావిలాస కాత్యాయన జైమినిమత నారదీయాది నామంబులఁ జాతుర్లత గ్రంథ వితతంబై.

ఆ.వె. భరతశాస్త్రమనఁగ సురముఖ్య సభల యం
దప్సరోమనోజ్ఞ మగుచు ధరణి
నర్జునాది కల్పనారూఢిఁ జెలువొందె
నాట్య లక్షణముల నవ్యమగుచు ॥

తే.గీ. తాళమార్గ క్రియాంగాది లీలఁ దనరి
లయ యనఁగ నాట్య జీవ విలాసమయ్యె
నట్టి లయకనుకూలమై యమరు తాళ
సప్తసూళాదులిరవగు జగతియందు

కం. శివశక్త్యాత్మకమగుచున్
బ్రవణగళ ప్రాణకమును భాసుర మగు తా
ళవిధం బెఱిఁగిన పండితుఁ
డవనిం దత్త్వజ్ఞుఁ డగుచు నతి శుభమొందున్ ॥

కాలమార్గ క్రియాంగముల్ గ్రహము జాతి
కళయు లయయును ప్రస్తారకమును బదియుఁ
దాళమునకును బ్రాణముల్ దనర వాటి
కాదియగు కాలనిర్ణయమది వినుండు

సీ. సరసిజచ్ఛదముల శతమొక్కటిగఁ జేర్చి
యొకపరి సూదిచే నొనరఁ బొడువఁ
దెగునది క్షణమనఁ దగు నవి యెనిమిది
లవ లవ లన్ని కాష్ఠవిధిఁ దనరు
కాష్ఠ లెన్మిదియైన గణుతింప నిమిషమ్ము
నిమిషమ్ము లన్నియే నెఱిఁ గళయగు
తొడిఁ గళల్ రెండు చతుర్భాగ మనఁదగు
నదియె యనుద్రుతాఖ్య మది రెండు

ఆ.వె. ద్రుతము తద్ద్వయమ్ము గలియున్న లఘువగు
గురువనాఁగఁ దల్ల ఘుద్వయమ్ము
ప్లుతముమూఁడు గురువు లతి వేడ్క లఘుచతు
ష్కంబు శబ్దరహిత కాకుపదము

కం. ఇది కాలము మార్గంబును
నదియున్ మాత్రా ప్రధానమైదు లఘువు లిం
పొదవఁగఁ బలుకుట మాత్రా
స్పదమగు తన్మాత్రరీతి పాటింపఁ దగున్

సీ. దక్షిణ మార్గంబు తగ నష్టమాత్రలు
వామ మార్గము నాల్గు వరుస చిత్ర
మార్గమ్మునకు రెండు మాత్రలు నొకకళ
యొదవు చిత్రతరంబు నొక్కమాత్ర
దనరిన కళ చిత్రతర మార్గమునకు న
య్యొకకళ కళయన నొనర నర్ధ
మాత్రమానను ద్రుత మర్యాదయట్టిద
యతి చిత్రితాధ్వమ్ము నర్ధమాత్ర

తే.గీ. కచటతపయను నంతను గడగుమాత్ర
యదియ లఘు సంజ్ఞ వర్తిల్లు విదిత మగుచు
నిట్టి మార్గంబు క్రియలచే నెసఁగ వలయు
ద్వివిధ మరయంగ మార్గమ్ము దేశియనఁగ

తే.గీ. మార్గమనిరిశుద్ధమనది శుద్ధ మార్గ మచట
నమరు నిశ్శబ్దము నశబ్దమగుచునాల్గు
దెలుఁగులా వాప నిష్క్రామ సరస విక్షే
ప ప్రవేశంబులకును శబ్దంబులేదు

కం. ధ్రువమును శమ్యము తాళము
నవిరళమగు సన్నిపాత మనియెడునాల్గుఁ
బ్రబల సశబ్దము లియ
ప్పి విధంబులు శుద్ధ మార్గ సంజ్ఞలు దలఁపన్

సీ. అరచేయి మీఁదుగ నట బొటనవ్రేల్సాచి
వరుస వ్రేళ్లు ముడువ నావాప మగును
నరచేయి క్రిందుగ నన్ని వ్రేల్ సాచిన
నిష్క్రామ మగునది నెమ్మి దక్షి
ణమునకుఁ జిమ్ముట యమరు విక్షేపమై
యరచెయ్యి మీఁదుగ నన్ని వ్రేళ్లు
మణఁచి రొమ్మునకునై మలుపఁ బ్రవేశంబు
చిటిక వేయుట నంత శిఖరిహస్త

తే.గీ మెలమి దిగవిడ ధ్రువమగు నలరు దక్షి
ణతలమెడమతలమ్మున హతి యొనర్చు
టదియె శమ్యము నెడమ చెయ్యెట్ల సేయఁ
దాళమగునది సన్నిహతంబు దెలియ

తే. దేశిక్రియలు ధ్రువము చేసినఁ గుడిచేయి
యెడమ కిడకుఁ గ్రిందఁ దొడరఁ దీయ
సర్పిణియగు నదియు సవ్యంబునకుఁ దీయఁ
గృష్యమగును దేశి క్రియఁ దనర్చి

కం. అరయఁగ నిట్లగు హస్తమె
యరచే క్రిందుగను దివియ నది పద్మమగున్
సరవి నది వామకరమున్
సరి మున్నిడి నట్టిచో విసర్జన మెన్నన్

తే. అటుల మున్నిడి సాచిన హస్తమునను
వర్జనియగుగూడ నాల్గువేల్ దనరవంచి
వెనుకకై తీయ విక్షిప్త విధ మదియగు
తలము పార్శ్వోర్ధ్వమైనఁ బతాకయగును

కం. అట్టిపతాకయు క్రిందికి
నెట్టఁగ దిరియంగఁ బతితనిర్ణయ మరయన్
బట్టుగ నివి క్రియలనఁ దగు
గట్టిగనిక సంగవిధము గణుతింతుఁ దగన్

సీ. జాతులైదగు చతురశ్రత్ర్యశ్రమిశ్రము
లోలి ఖండమ్మును మీఱినట్టి
సంకీర్ణ మొగినిట్టి సంజ్ఞకు నాల్గేని
లఘుగురుద్రుతములు లలిఁ దలిర్ప
చతురశ్రమును మూఁడు సరవినిట్టివి గూడఁ
ద్ర్యశ్రమమిట్టి చందములఁ దక్క
తాళమ్ము లెఱుఁగుఁడు తజ్జ్ఞులీరైది
యుందుఁ జతురశ్రమున్ త్ర్యశ్రమములు

తే.గీ. రుద్రకళలను జనియించి రూఢిఁ దనరె
సభవు నాలుగుకళలై నయాచతుర
మమున సగమును మిశ్రమునమరఁ గూడి
రైదు గురువులఖండమై యతిశయిల్లె

కం. అలచతురశ్రమసమమున
నెలమిమెయిన్ ఖండయుక్తి నేడు గురువులై
యలవడియె మిశ్రమంబ
ట్లలరంగఁ జతురశ్రమమ్ము నందలి సగమున్

తే.గీ. మిశ్రయుక్తమ్ముగాఁగఁ దొమ్మిది గురువులు
నమర సంకీర్ణమయ్యె శాస్త్రాంతరముల
సరణులెన్నైననగు నైన శార్ఙ్గదేవు
మతము లివి జాతిభేద సమ్మతముదలఁప

కం. ఇవి ప్రస్తారించినచో
నవిరళ శతకోటి సంఖ్యలగు తాళముల్
భువిఁ బ్రఖ్యాతిగ వాడుక
కవి యేరొండ నొదవనట్టిదగు పరికింపన్

కం. చచ్చత్పుట చాచపుటముల
నచ్చుగ లఘు గురువిభేదమై యొప్పగు న
త్యచ్చయత యథాక్షరభా
స్వచ్ఛరత నేకకళ నిసంజ్ఞతఁ దనరున్

అమరు చచ్చపుటంబున నపుడు రెండు
గురువు లొకలఘువటఁ బ్లుతంబొరసెఁ గాన
నది యథాక్షర తాళమై విదితమయ్యె
చాచపుట మట్టి గురులఘు సంజ్ఞ గనుఁడు

కం. కళ యనియెడి దెలిఁగించెదఁ
బలు సంఖ్యావాచకములపై కళ యనినన్
వెలయ గురువితరములచోఁ
గళయన లఘు వమరు శాస్త్ర గణనము వెలయన్

తే. ద్వికళయుఁ జతుష్కళయునది ప్రకటితమగు
ద్వికళ చచ్చపుటంబది ద్విగుణమైనఁ
దగఁ జతుష్కళయన నివ్విధమున చాచ
పుటము గురుసంఖ్య సంజ్ఞల పొలుపు లిటుల

తే.గీ. షట్పితాపుత్రకమ్మును సరివిఁ దాళ
మదియు ద్వాదశకళయగు నట్టిచో య
థాక్షరము ద్వికళ చతుష్కళాఖ్యలైన
దదియుఁ ద్రివిధంబులగు వెండి నందువలన

తే.గీ. పొలుచు నేకకళ షట్పితాపుత్రక మది
యుత్తమము పంచపాణి నా నొప్పు మిగుల
మఱియుఁ బ్రస్తారమునఁ గల్గు మహిత తాళ
గతుల కీరితి భేదముల్ గలవు మిగుల

కం. సంకీర్ణతి నైఁదేడున్
బొంకమ్ముగఁ దొమ్మిదియును బొసఁగఁ బదియు నొం
డుంకువగఁ బదియు గురువులు
సంకురితములయ్యెఁ దగ మతాంతర ఫణితిన్

సీ. సరవి నిశ్శబ్ద సశబ్ద క్రియానంత
రమున విశ్రాంతి విరతిలయయను
నన లయయగు నది యమరుఁ ద్రివిధముల
ద్రుతమధ్యమ విలంబగతు లనఁగ
నందు శీఘ్రము ద్రుత మల్లన నడచుట
లగు విలంబము రెంటియందుఁ దత్రుల
కెడసిన మధ్యమం బీగతులగు నెడ
గురువును నవిరళ సొరిది లఘువు

తే.గీ. తాళమున కవయవములై తనరు లఘు గు
రువుల నంటిన మధ్యము మవిరళముగ
రెంటి నంటమి లయ లేమినంటి యొకటి
గదిసియుండినను లయమై విదితముగను

కం. స్వరబద్ధమగుచుఁ దాళ
స్ఫురణన్ గురులఘువు లొకటఁ బొంపుగ నడవన్
దొరకొనుట మధ్యమంబీ
తెలుఁగున లయలయ్యె మూఁడు తెలుఁగుల దెలియన్

కం. ద్రుతమధ్య విలంబములొక
గతిఁ ద్రోవన్ మువురు చనుచుఁ గఁవడి నొకరుం
డతని వెనుకొకఁడు వానిక్
నతిమందత వెనుక నొకఁడు నరుగువిధమగున్

తే.గీ. పదము దప్పక మూఁడు నేర్పడక క్రియలు
చరణ విన్యాస విశ్రాంతి సంయుతములు
భేదములనయ్యె దప్పనిపేర్మి నడచు
నవి లయాఖ్యలఁ దగు ప్రాణమగుచు మఱియు

ఆ.వె. చిత్రమార్గ వృత్తి క్షిప్రభావము ద్రుత
మమరు వార్తికాధ్వమైన మధ్య
భావనిరతి మధ్య పటిమ దక్షిణ మార్గ
చిరత నవ్విలంబశీల మమరు

కం. పదియిరువది త్రింశతులై
యొదవినయా లఘువులరసి యొక్కొకపరిగాఁ
బదపడి పొడివెడు కతమున
విదితములగు త్రివిధలయలు విన వాటి యెడన్

కం. ఒక్కొకలయలో మూఁడున్
మక్కువఁ ద్రిగుణీకరణము మహిమం దగుఁబొం
పెక్కు లయజ్ఞులు నీగతి
నెక్కుంబు తెలుంగవలయు నిర్మలబుద్ధిన్

ఆ.వె. అట్టిలయను గీతమడరి పొందదు గానఁ
బొందవలసి యతి యనందనర్చు
పొరిదిఁ ద్రివిధమగుచు స్రోతోవహంబు గో
పుచ్ఛసమములనఁగఁ బొల్చుయతులు

కం. వేడుకఁ బూఁడు తెఱంగుల
నాడిక లయ యయ్యె మార్గమది నిల్కడచే
కూడినవియతులు నొకటొక
టోడక త్రివిధముల మార్గయుక్తిం దనరున్

తే.గీ. మహివిలంబ మధ్యమముల ద్రుతంబునఁ
దవిలియతులు నడచుఁ దాళగతుల
నొక్కటొకటి మూఁట నొనరు నీత్రివిధంబు
లైనయతులు మఱియు యతులు గలవు

వ. గ్రహక్రమం బెఱింగించెద—

సీ. సమము నతీత మెంచఁగ ననాగతమన
గ్రహములు మూఁడొప్పఁ గలుగు నందు
గీతవాద్యంబులు నాతతనృత్యంబు
సరియైన గ్రహసమస్ఫురణ నొనరు
మొదట తాళము వెన్క మొనయు నృత్యము గీత
మైన యతీతగ్రహాఖ్య నమరు
గీతము ముందరగా తాళ నాట్యంబు
లడర ననాగతమనఁగ జరగు

తే.గీ. ఇవియు నన్వర్థనామత నెసఁగుకతన
మది వివేకింపఁ దగు విషమగ్రహమని
కొందఱను కొంద్రుఁగాన మక్కువను నాట్య
శాస్త్రతత్త్వజ్ఞులౌననఁ జతుర ఫణితి

వ. ఇంక జాతుల తెఱంగెఱింగించెద—

కం. చచ్చపుట చాచపుటములు
తచ్చనగా నట్టి షట్పితాపుత్రకముల్
హెచ్చగ సంపద్వేష్టయు
నచ్చగఁ బంచముఖ సంజ్ఞ నమరిన జాతుల్

కం. ప్రస్తార గతుల నిల్పిన
విస్తులగురులగు సమంబు నెరి నంగము నాఁ
బ్రస్తుత భరతాగమధీ
విస్తారకులండ్రు నాట్యవిదులౌనంగన్

కం. నష్ట ప్రస్తారము ను
ద్దిష్ట ప్రస్తారమనఁగ ధృతిఁ దా రైక
స్పష్ట ప్రస్తారములు ప్రది
విస్పష్టమత మగుచు మూఁడు విధములఁ జెల్లున్

వ. ఇవి తాళదశ ప్రాణంబులింక నాట్యక్రమంబు వినుండు—

కం. శిరమున్ గన్నులు పదములు
కరములు నభినయగతులకుం గలికాలమున్
గలనాట్యకళా విదులగు
చెలులకు భావాభినయము చిన్నెలుఁ దలఁపున్

సీ. అంచితంబును సాచి కుంచి సమంబులు
సంచరోద్గ్రములు పార్శ్వమును బ్లుతియు
నుద్వృత్త మమితము వాగి తాడితోత్సేధ
నములు పార్ష్ణియునన నమరు పాద
తలగతులివి త్రయోదశ తానకము లొప్పు
వైశాఖ సమపాద వైష్ణవములు
మండలాలీఢముల్ మఱియుఁ బ్రత్యాలీఢ
గతులుగఁ బుంస్థానకంబు లాఱు

తే.గీ. ఘనత నవహిత్థ మ్మాక్రాంతగతము లాగ
తము విరత సుంబువినివర్తనమును మేలి
తమును స్త్రీ తానకము లైదు దనరు పాద
జంఘ లూరులు కటియొక్క సమముగాఁగ

కం. కలచేష్ట చాలయనఁదగు
నలవడ నాకాశచారు లట భూచారుల్
గలయవి పదేసి చారులు
చలనము తానకము నిల్పు చందంబరయన్

కం. తలమెడ కరములు పాదం
బులు తమతమ పడంగ నటనముల ఘనకీర్తిన్
వెలఁకువల నలరవలయున్
దలముగ ధరతాగమార్థ తత్త్వజ్ఞులకున్

సీ. ఆకంపితము ద్రుత మావిధూతంబును
  ద్వ్యాహితాథోముఖుల్ వరుసతోఁ బ
రావృత్తలోలిత భావవాంఛికములు
  పరివాహితము ననుభవము నైరయ
దేవతాన్వృత్తముల్ దివిని దొమ్మిదియును
  మస్తకగతులంద్రు మతియునైదు
శార్ఙ్గదేవుఁడు దెల్పె సమము నాలోకిత
  కము లిరశ్చిన ప్రకంపితములు

తే.గీ. సమరు సౌందర్యము ననాఁగ నమరు వాటి
యందు సమ మనునదియుఁ బుష్పాంజలులకై
నిశ్చలతఁ బూనమిని యోగనిరతి కెసఁగు
సఫల నాలోకితము గూడి శాస్త్ర సరణి

కం. ఐహి లక్షాగోచరమగు
రహిని బనులయొడఁదిరశ్చినంబి
మ్మహి పావపూర్ణ విస్మయ
సహజములఁ బ్రకంపితంబు సమ్మత మెందన్

తే.గీ. పాడవునను గ్రింద విన్యాసమునను పార్శ్వ
చలనము నొనర్ప సౌందర్యకలన నమరు
నేయుమనుటకు సంజ్ఞగాఁ జెలఁగు యోగ
యుక్తి పొందియు నిది చెల్లు నుచితగతులు

కం. వినిగూఢగములకు నొప్పుగఁ
గననగునిది పంచమస్తక విలక్షణముల్
ఘననాట్యశాస్త్ర కోవిద
వినుతియు సమ్మతము నగుచు వెలయఁగ నెందున్

తే.గీ. సరవి నాలోకితంబును సమము సాచి
తము ప్రలోకిత ముల్లోకితము విలోకి
తంబు ననువృత్తమన నష్టధా వహించగు
చూపులని పల్కి రాదిమ సూరివరులు

సీ. వెస రెండు రెప్పలు విప్పి చూచుటయె యా
  లోకనమదియు భావాకరంబు
రెప్పపా టొదవనిరీతి సమంబగు
  సాచి నాఁగడకంట సాఁగుచూపు

పోకఁ బార్శ్వములఁ బ్రలోకితమగు
పృష్ఠగతిఁ జూచుటది విలోకిత మనఁదగు
నుల్లోకితంబగు నూర్ధ్వ భాగము జూడ
ననువృత్తమగు సారెఁ గనుగొనుటలు

ఆ.వె. నడరఁ గ్రిందు చూచుటవలోకనంబగు
నింక శార్ఙ్గదేవుఁ డెన్న సత్త
విధములందుఁ గరుణ వెలయు మీలిత మింగి
తము ద్రుతోగ్ర సూచనములు మఱియు

కం. దూరాలోకనమనఁదగు
కారుణ్యము విరహితైన క్రమమున నటనో
దారతకు నుచిత వాక్యవి
కారతకుం జెల్లుఁ బూర్ణమగు చూపగుటన్

కం. అరచూపు మీలితంబగు
వరముని జన నాట్య భావభర సురతాంత
స్ఫురణముల భావముల నని
ధర సూచన నేయు భావతత్త్వజ్ఞులకున్

కం. కడకంటి చూపులింగిత
మడరన్ శబ్దార్థయుక్తికట వారసతుల్
దొడరదు నాట్యంబులకున్
గడు వేడ్కన్ భావమగుచు గరిమన్ జెల్లున్

కం. కనుగ్రుడ్లు రెండు గదలిం
చిన ద్రుతమది గీత కార్యచిర శబ్దములన్
ఘన వీరరసమునన్ వ
శ్యనిహిత వారాంగహార సంజ్ఞలఁ జెల్లున్

కం. చెలువగు గన్నుల రక్తిమ
గలుగుట యుగ్రమది మత్తగతులన్ గోపం
బుల భయరసమున జెల్లున్
బొలపునఁ జేదోయి గూర్పు చో లలి నెలమిన్

తే॥ కదలు చరమోడ్పుగల చూపు గడగు సూచ
నాఖ్య నది దేశవిధముల నడరు గుణము
భావమున బాణసంస్థాన పటిమ నటన
మంటయు శృంగార రసమునన్ బరగు నెలియ

తే.గీ. కించిదూర్ధ్వ వికాసత గాంచ దూర
దృష్టియగు నాది యలరుచోఁ దెలియఁ బేర
ణమున మధుపాన నర్తక నటనలకును
భావ్యమగు నింక హస్తసంభవము వినుఁడు

సీ. ప్రాణ హస్తంబులు పదెండు సంయుత
ములగు ప్రసారిణ ముఖ్యము లవి
ఇరువదిరెండు రెండెసఁగు పతాకాదు
లాగిఁ బదియాఱు సంయుతముల నడుఁ
గౌశలాభినయ ప్రకాశత నంగుళు
లన్నిసాచఁ బ్రసారణాఖ్యఁ దనరు
నంగుళి కుంచిత మది కుంచితంబగు
ధృతివేళ్ల గదల రేచిత మధిముఖ

తే॥ రేచితంబైన గుంచిత రీతియైన
నైరపుట ప్రసారిత పతాకనిరతి పుంఖి
కంబథోముఖ మపనేష్టకము ప్రసారి
తాంచితంబది రేచిత కుంచితముల

ఆ.వె. ఊహరచనకేళి నొదవుస్థూలమున సం
కేతమగును మున్నురీతి కరము
గుతిగఁ జూపఁ జిహ్వ పరి పరార్థారోప
ణంబు లేక నగుక్రమంబు తోడ

వ. మఱియుఁ బతాక త్రిపతాక యర్ధపతాక కర్తరీముఖ మయూర అర్ధచంద్ర అరాళ శుకతుండ ముష్టిశిఖర కపిత్థ కటకాముఖ సూచి పద్మకోశ బాణ సర్పశిర సింహముఖ లాంగూల అలపల్లవ చతుర భ్రమర హంసాస్య హంసపక్ష సందంశ ముకుర తామ్రచూడంబులను నసంయుతహస్తంబు లిరువదాఱు. అందుఁ జేదోయి యొద్దిపుష్పాంజలి సేయుట స్వస్తికంబయ్యె కర్తరి స్వస్తిక దోలాది వైష్ణవ హస్తంబులివి పదియాఱును సుద్వృత్త తలాముఖ విప్రకీర్ణ గజదంతాది ముద్రా హస్తంబు లిరువది రెండును గలవిముద్రాహస్తములకు దక్షిణ తక్కినవాటికిఁ బత్తదుచిత వినియోగంబులు గలవు.—

మ. ఇనువారమ్మున బుష్య బుఱుకున బుట్టింపారఁగాఁ దెల్పు న
ట్లనుచాపప్రశ్నము గొప్ప కన్నుగవ శృంగారాంకముల్ ధాత వే
ల్పును శాండిల్యుఁడు మూని ఘ్లఁడుకు గృహంబుంగా ననుష్టుప్పు హా
ర విధానంబు ధ్రువంబగుల్ లఘువు బేరుల్ గౌరవం బొప్పఁగన్

చం. ఎఱుపగునట్టి కోక తగ నిందునివారము హస్తభమున మే
ర్పడఁగఁ బుట్టి సొమ్ములటఁ దాములు మేలి విరాట్టు చందమున్
బెరిమగు మేను కౌశికుఁడు ప్రీతి మునీంద్రుఁడు వేల్ప గౌరియున్
గుటిని గుశాంతరీపము లఘుద్వయ వక్రగమైదు పెంపగున్

ఉ. గురువారంబునఁ బుబ్బనుం బొడమి తళ్కున్ జిత్రవర్ణంబు న
వ్వరుసన్ వస్త్రము సొమ్ములుంగలిగి వేదన్ గ్రౌంచపున్ రావు నే
ర్పడఁగంగా జమదగ్ని మౌని యట రథుంపాతాళ మింపొందు ని
ద్ధర విశ్రామము మీఁద ద్విద్రుతము లంతన్ బైలఘుప్రాప్తిగన్

మ. కుజవారమ్మున సిందుబుత్తమున నిర్గుంబగరుంజాయ న
క్క్రజమై పుట్టి సువర్ణచేలమును నాగస్ఫూర్తి భూషన్ శుభ
ప్రజభాగ్యోరి రమ వేల్పుగా నలరి విశ్వామిత్రసన్మౌనియున్
నిజమై రూపకమొప్ప రెండులఘువుల్ నైమిత్తగ్రమంబై తగన్ ॥

తే.గీ. రుద్రసౌమ్య వారయుతమై చిత్రవ
ర్ణమును బట్టు చీరయమరఁ ద్రిపుట
రహిని శాల్మలిన్ భరద్వాజముని విరా
మాంతమునఁ ద్రిద్రుతములమర గౌరి॥

మ. రవివారమ్మునఁ జిత్రనుం బొడమి స్వర్ణచ్ఛాయయౌ నంబరం
బు వహిన్ ముత్తెపు సొమ్ములన్ మిగులనొప్పన్ గశ్యపాఖ్యానమౌ
ని వెసన్ హాస్యరసంబునన్ వికృతి వర్ణింపంగఁ జందం బటం
చవనిన్ మధ్యద్రుతద్వయంబు లఘువాద్యంతంబునన్ బొల్పగన్ ॥

మ. శనివారమ్మున స్వాతి బుత్తమున నిచ్చన్ బుట్టి నైల్యమ్ము నె
ఱ్ఱనికన్నుంగవ పీతవస్త్రమును సర్వంబొందు శాకాంతరీ
పనివాసంబు త్రిమూర్తి తత్త్వమయ రూపంబై మృదంగాత్మకం
బును మోదావహ సర్వదైవతమునై పొల్పొందు నేకాఖ్యగన్ ॥

క. నృత్తము తాళాత్మకమగు
మాత్రకనాదాత్మకంబె యగుతాళంబున్
వత్తన్నాదాత్మ కళిరుఁ
జిత్తమ్మున నిల్పి కొల్తు నేనములాదవ్రున్.

ఉ. సరసిజసూతి తాళధరి సారసనాథుఁడు మారజాంకుఁడున్
గరిమను వాణి గాయని వికర్తనచంద్రులు రాశికుల్ వృషే
శ్వర శరజుల్ మృదంగికులు సారవిధానుఁడు తుంబురుండునై
సురగణముల్ సహాయులుగ శోభనసర్త కుఁడీశుఁడొప్పగున్.

ఆ.వె. అట్టి శిల్పివలన నభినిర్మితంబైన
పాటి విస్తరించె భరతమౌని
దాన భారతీయమై మతికెక్కె నీ
భరతశాస్త్రమెన్న ధరణియందు॥

క. భరగభకారము భావం
బరయన్ రేఫయది రాగ మమరు తకారం
బిరవొందుఁదాళ సంజ్ఞన్
బరువడి నిలిమూఁడు గూడి భరతంబయ్యెన్॥

సీ. తగఁ బ్రారంభమున నెదుర గనిల్చు పాత్రకుఁ
గుడిప్రక్క మార్దంగికుండు రుచిర
వామభాగంబున వాంశిక శాంఖికుల్
నిలుతుఁ గాయకుఁడున్ను బెరయ వాని
వెనుకగా వాళ కాంస్య జనము లన్నిఁటఁ బరా
మరిక నేయుచుఁ దాళధరియు మెలఁగి
సరివెన్కఁ గుందరగరిమ నొప్పఁగ దగ
మురజంబు వామత మెలఁగెనేనిఁ

తే.గీ. గుడిని వాంశిక కాంస్యముల్ నడపవలయు
నందుఁ దాళజ్ఞుఁడెనిమిదిర్వైన లక్ష
ణములఁ బదిలక్షణముల సొంపమరవలయు
భరతశాస్త్రోక్తనర్తన ప్రౌఢులకును!

క. మఱియున్ మాధుర్యలఘు
స్థితివాగ్వ్యక్తులు హస్తకేముషి దృఢసం
గతియున్ వ్యాప్తియు వృత్తో
న్నతిగల్గిన వాద్యవేది నాఁ దగు సభలన్॥

తే.గీ. స్థిరతరేఖయు భ్రమరియు దృష్టిజీవ
మ్మ శ్రమంబును మఱియు మేధాతిశయము
గీత పుష్టియు శుభవచోరీతి పాత్ర
కును పది ప్రాణములు నాఁగఁ దనరు నెలమి

తే.గీ. శిరము గరములు వక్షంబు వరగు పార్శ్వ
కటిపదము లంగములు బొమల్ కన్నుదోయి
చెక్కులధరంబు చిబుకనాసికము లాఱు
దనరఁగ నుపాంగములు భరతక్రమమున.

క. గ్రీవోదర ముఖ చరములు
లావల జంఘోరు వితతులగు ప్రత్యంగం
బివగఁదగు స్వర్గంబున
దేవాంగనలభినయించు దెఱఁగులు దెలియన్.

తే.గీ. అంగభావాభినయచారు లలఘుప్రాణ
దశకమును గల్గుపాత్రవృత్తంబు సలుప
గీతవాద్యవిలక్షణ రీతు లమరు
నటనఁ గనుగొన్న శుభము లెన్నంగఁగల్గు.

వ. ఏతల్లక్షణవ్యతిరిక్తనాట్యంబులు గను గొన దురితంబులగు నింక నలంకారాది శాస్త్రశేఖరంబగు కళాశాస్త్రంబు వివరించెద

ఉ. జాతులు సత్త్వముల్ రతులబంధము చూపుల లక్షణంబు భా
వాలిగుణేంగితమ్ములు రసాకర వేశజధర్మముల్ క్రియా
రీతులు ద్రావకర్థతులు ప్రేమకు గుర్తులు బంధభేదముల్
నాతుల చర్యలుం దెలుపు నాణెముగా రతిశాస్త్ర మిమ్మహిన్

మ. స్మరవాత్స్యాయనకూచిమారమతముల్ కట్టమ్ములౌ గాన నా
స్మరశాస్త్రంబది జాతిధర్మము కళాస్థానంబులుం దెల్పు నా
ర్వర వాత్స్యాయనుఁడెంచు సత్త్వములు తేవన్ గూచిమారుండు బా
హ్యరతి ప్రక్రియ లెంచు వశ్యముగ సంయమ్యానుకూలస్థితిన్.

క. ఘోణీ పుత్రుఁడు మందుల
రాణల్ వచియించు సమసురతలాలనచే
నాణెములను బాంచాలుఁడు
ప్రాణముగా నెంచనైదు ప్రకరణములగున్.

క. చయ్యన స్వకీయయున్ బర
కీయయు సామాన్యయనెడి కిసలయచరణల్
నెయ్యము పుట్టించుట చే
నెయ్యుడఁ బ్రియ మొదవఁగా వహింతురు చెలిమిన్.

క. విశదసరసానుకూలత
శశిముఖికిడు సౌక్యి వలపు సమకూరంగా
వశమైనఁ గలయు టొప్పున్
బహుసురతంబైన సుఖ శుభావము గాదే.

చ. సమరతి నొందుచో మృగమదశయ్యయఁ బుష్కలయ మిక్కిలైన య
శ్వము నమునెక్కు నాతులతి జాణ సబంధ విశేషసంగతిన్
గ్రమమునఁ బూవుదీవెయనఁగాఁ దగుమానిని పొందు మోహిని
భ్రమకరమట్టి కాంత నరపాలసమర్చిత ధారుణీస్థలిన్.

క. క్రమమున ముగ్ధామధ్యమ
లమరెడి ప్రాగల్భ్యత్రివిధలగు నాయిక తా
సమరతి బహురతి బంధ
క్రమరతి వశ్యంబులిట్టి కాంతలకెందున్.

తే॥ బాల యౌవనప్రౌఢయు లోల యందు
బాల కాలన యౌవనబహుళరతుల
ప్రౌఢధనమిచ్చుచో లోల ప్రాపువలన
వశ్యమైయుండు రెంతయు వాంఛగల్గి.

సీ. ఇరువదెనిమిదంగులరతుల్ పరగు బాహ్యాభ్యంత
రాఖ్యల బాహ్యంబు లవియు రెండు
దర్శనస్పర్శ విమర్శము లభ్యంత
రములు తొంబదియాఱు రతుల బంధ
గతు లెన్నఁబడునాల్గు ధృతిఁ దంత్రరతులైదు
నైతి సమనీచాతినీచపరము
నీచలు నుచ్చయు నెమ్మి నత్యుచ్చయుఁ
బరమోచ్చ యనెడి సప్త విధములను

ఆ॥వె॥ వెరసి భద్ర ముఖ్య పురుష వద్మిన్యాది
జాతభేదములను సమము నుచ్చ
నీచరతులు గుహ్యనిర్ణయ వివర ప్ర
మాణములఁ బొసంగు మహితవృత్తి.

సీ. అంగుళి నాభిమధ్యమునఁ జాలన మొన
రింపఁ జేటికతంత్ర మింపు మీఱు
మధ్యమాంగుళిచేత మన్మథ గృహశోధ
నము కుట్టితంబను నామ మయ్యె
నలరువేడుకఁ జికురాకర్షణము నామి
తంబనునట్టి తంత్రముగ మెలయఁ
బదముఖంబుల నింతి పాదమూలంబాను
టది క్షిత్ర మను తంత్రముగునఁ జెలిక

తే॥ విద్యమది ఘట్టితంబునఁ బేర్కొనఁ దనరు
చేటికయు గుట్టితము సామితాటనంబు
క్లిష్ట ఘటితములివి ద్రైదు కీర్తనీయ
తంత్రతరతులయ్యె బాహ్యవిధములఁ గలియ.

ఆ. వె. మూర్తి భద్రదత్త మూచికూరులకుఁ బాఁ
చాలునకును ద్వాదశ దశములు నె
నిమిది యాఱు నంగుళములు లింగప్రమా
ణములు మదనశాస్త్ర సమ్మతముగ.

క. మఱి శంఖినిచిత్తినులకుఁ
బికించఁగ హస్తినికిని బద్మినికిన్ లో
తిరవుగ మరుగృహ మిట్లగు
ఐమసన్ భద్రాది పురుషవర్గ్యుల కరణిన్.

క ధర దేశమతాంతరముల
పురుషుల శశ వృషభ తురగ భూరిఖ్యాతిన్
దరుణులు శశి వృషభయు మఱి
తురగియు ననఁ ద్రివిధజాతి ధూర్వహలీలన్

తే.గీ. అందుఁబద్మిని పాంచాలు లరయ లేమి
సుచ్ఛసమనీచరతులు సొంపొప్పు భద్ర
హస్తినీముఖ్యమైన జాత్యానురూప
నమరి గుహ్యాంగుళ ప్రమాణములు నట్లు.

వ. జాతులతెఱంగెఱింగించెద—

సీ. మొగము తేఁటయు నైల్యమగు కచములు దీర్ఘ
ఘ్రాణమ్ము గడుగొప్పకుచయుగమ్ము
రక్తాంగకము తీవ్రరతి జలగుహ్యమ్ము
బహుజనప్రీతి ఘుంభత్క్రుధయును
కటులిత్తముల మీఁదఁ బటుతర ప్రేమయు
రక్తభూషాది వస్త్రములు దాల్చు
టును దులోలత్వమ్ము నంగుళ ద్వాదశ
గుహ్యంబు భద్రమైఁగూర్కి ప్రథమ

యామరతినింపు హరిణ గత్యానురూఢి
కరిమదము కంపు నులివెచ్చగల ద్రవంబు
గలిగినది హస్తినీజాతి కాంతయగును.

సీ. కొద్దియా లోతు నెక్కొనునట్టి కనుదోయి
చపలచిత్తము కేశసంకాననము
నతిదీర్ఘమును జిత్రితాంబర ప్రీతియు
గురుకుచయుగ్ములు నల్పగోష్ఠి చిత్ర
రతి గొప్పపెదవి స్మరగృహ కక్షాల్పరో
మములు దుర్గంధమ్ము నమరునదియు
మరుగృహస్థలి తొడల్ బిరివియు సత్యంబు
తెలుపు సున్నపు మరుజలము గోడి
ఆ. వె. నడయు దత్తు మూర్తి యుడుపని రతి పది
యంగుళముల గుహ్య మట ద్వితీయ
యామమునరతవాంఛ ప్రేమ మిక్కిలిఁ గల్గు
చిత్రినీలతాంగి చిరసుఖతను ॥

సీ. కఠిన పయోధర ఘనతర దుర్గంధ
కచయుగ్మయు దీర్ఘకంఠి రక్త
హస్త సుమధ్య కృశాంగి పంకజనేత్ర
విస్తారగుహ్యోరు విపులజఘన
జిగి పలువరుసయుఁ దగఁ జూటు నేర్పును
నీలభూషణ వస్త్రజాల నిరతి
స్వల్పోష్ఠియల్పభోజన ముభయుక్త దు
ష్టమదన గేహ తత్స్వాధ నహీన
తే. రోమ, యష్టాంగుళిక గుహ్య ప్రేమగంది
యధికదుర్గంధజల మయూరాఖ్యగమన
మూర్తియాఁడవ జాముసఁ గూచిమారు
సమరతియుఁ గల్గు శంఖినీ సారసాక్షి ॥

సీ. పద్మగంధమ్మును బద్మాసనమ్ము
జిలునవ్వు నిద్దంపు జెక్కుఁదోయి
హార శుభ్రాంబరాహారు భూషణ గంధ
సుమమాల రాయంచ సొబగునడపు

సమ సుందరాంగియు సవినయ భూషణ
సౌశీల్య సత్యవిశారదయును
చాంచాల్య సమరతి భవ్యవిద్యాయుత
నాలవజాముగఁ గేళి వెలయు

తే. గీ. సత్యవాద పతివ్రతా చారనిరత
యరయఁగ నపూర్వ యాఱు వేళ్లచటి లోతు
శీతల సుగంధ మన్మథ సీమసలిల
పద్మినీ కామినీ మణి భవ్యసరణి.

క. అమరిక నయ్యా జాతుల
సమరతి యగు నెచ్చు తక్కు సరణి దిగుడుచోఁ
గ్రమమున నీచలగుఁ బ్రా
పము లట్లన యగుచునుండు వనితల కెందున్ ॥

ఉ. జాతులచే నెఱుంగమిని సత్వలచేత నెఱుంగఁగాఁదగున్
నాతుల చిత్తవృత్తులు ఘనంబగు వాంచలు మర్మకర్మముల్
బ్రీతి నెఱింగి నేని సుఖవృత్తికిఁ బట్టగు నాయకుండు న
త్యాతత చేష్టలన్ సతి గుణానుగతిన్ ముదికింపు నింపుచున్ ॥

క. తీవికిఁ దగు సంభోగ
ప్రావీణ్యము మంచిరూపు పలుకుల నేర్పున్
శ్రీ వెలయు నకుటిలస్థితి
పావనయగు దేవసత్వ పరికింపఁగన్.

శా. అత్యాచారము యోగ్యవస్తురుచిరాహారమ్ము సాధ్వీవ్రత
ప్రత్యాసన్నత సత్యభాషణ ప్రతి ప్రాగల్భ్య హీనక్రియా
చిత్యాంతన్నిశి సంగమంబు శుచియౌ శీలమ్ము నుం గల్గు నా
న్నత్యన్ సంయమిసత్వగాఁ దలఁతు రెన్నన్ మారశాస్త్రి స్థితిన్

తే. గీ. ఇట్టిగుణముల నియమవ్రతేచ్ఛయగుచు
సంతతింజాలగాంచి యాచారగరిమ
నమరు నట్టిలతాంగిరో యమరు చైత్ర
సత్వయైతగు శుభసదాచారకలన॥

క. తేటమొగ మెఱుపు మేనన్
నీటుగు నొయ్యార మధిక నిర్మలచర్యల్
పాటలు నాటలు గల్గిన
బోటిరో గాంధర్వసత్వ భూనుతలీలన్.

క. వనుల యెడ నేర్పు నణకువ
వినయము సంగీత విద్య విభవము మైనిం
పును ముక్కు నిడివి గలయది
యనుపమగతి యక్షసత్త్వ యనఁగాఁదనరున్.

క. పాడవున్ వీణారవమున్
గడు మీఁదుదువలుకు సౌఖ్యగతిరతి కేళిన్
గడిదేలి మెలఁగు విధముల
వడిఁ గిన్నరసత్త్వయైన వామాక్షియగున్॥

క. వారని నిష్ఠయు సఖరతి
చారువినయవర్తనమ్ము సద్వ్రతసత్యో
దార విహారము లలవడు
వారిజముఖి సిద్ధసత్త్వ వర్ణింపఁదగన్.

క. ఏ యెడ నిద్రింపుచు మృదు
వైయుండెడి మేను భూషణాసక్తియు నే
ర్పైయొదవు పనులు గల్గిన
యాయింతియె నాగసత్త్వ యని కోపియగున్.

క. ధనధాన్య పుత్ర వాంఛయు
ఘనలోభంబజ్ఞతయును గడు దామసమా
పనులున్ గఠినోక్తులు గల
వనిత మనుజసత్త్వయనఁగ వసుమతిఁ బరగున్॥

క. క్రూరాహారం బఱుచియు
పోరికు గలహంబు కఠిన సాహసభావల్
సారా చార ద్వేషము
దారుణరతి దైత్యసత్త్వ తరుణి దలంపన్॥

క. ఘోరాకారము దుష్టా
చార మశుచి చిత్రకేశ జాలము క్రోధం
బేరిం గలహించుచుఁ దగు
నాగిరి పైశాచసత్త్వనా ధర నమరున్॥

క. ఏ తద్గుణములు గల్గిన
నారిన్ ధరమిశ్రసత్త్వ నాఁ దెలిసి తదీ
యాతత సంతోష క్రియ
లాతరి వొనరింప సౌఖ్యమమరున్ రతులన్॥

కం. ధర్మార్థ కామమోక్షము
లర్మిలిఁ బురుషార్థ రీతులగుగానఁ గడున్
గూర్మిని గామార్థంబుల
పేర్మిన్ స్త్రీ గుణము తెలిసికొని ప్రియ మొందఁ దగున్

వ. ఇంక బాహ్యరత్యంగములగు దశసంస్కారము తెలిసికొంచెద ,-

తే.గీ. తాడన నఖక్షతములు దంతక్షతంబు
చుంబనంబులు పేటన చూషణములు
వితత పంచాంగులిక వషట్కృతులు పీడ
చాలనంబును బదియు సంస్కార విధులు

సీ. చరచుట తాడన మరియు మీఁటుట పేట
నము నఖదంతముల్ నాఁటు క్షతము
చుంబనమగు ముద్దు చూషణచాలన
ములు పీల్చు టలకపాణుల చరతము
తగ వషట్కృతి కూటితంబు పంచాంగుళి
వాస్త కృత్యంబు పంచాంగుళమగు
నాలింగనాదులు లీలఁ బీడన మిట్టి
దమరఁగఁ బదిచుంబనముల నెలవు

తే.గీ. లన్నిచూడల నఖక్షత మమరు చోటు
లూరులు నితంబపృష్ఠవక్షోరుహకర
కక్షకర మూల గుహ్యముల్ కటియు చెక్కు

— — — —

వ. ఇట్టిస్థలంబులఁగల నఖక్షతంబులకుం గ్రమంబున నామంబులు :-

కం. ఛురితము కుండలకున్ బ్లుత
మిరవొందఁగ నర్ధ చంద్ర మిషుశిఖ పదమం
బరి కుముద పత్ర శశకము
లరయన్ మణిమాల యన నఖావళి నెలవుల్

కం. ఫాలము నధరము సూరుక
పోలాక్షిస్తనయుగమ్ము బోరి మరునిల్లున్
మేలిమెడ నాభి నాసిక
తాళిం బది చుంబనములకగు నెలవులౌగిన్

ఉ. తాడన పేటునాదుల ముదంబొనఁ గూడఁగఁ దత్తదష్ట సం
క్రీడల సంగభోగములఁ గృత్యములొంగఁ బొసంగ జేసినన్
వేడుక పుట్టు వశ్యమగు వేలలనామణియున్ దదీయ పూ
జాడ తళాస్థలమ్ము లనిశమ్ము నెఱుంగ శుభమ్ము చేకుఱున్

సీ. అంగుష్ఠ పదగుల్ఫసంగతి జాను జఘన
నాభి వక్షోజ ఘనకుచాగ్ర
కచ కంఠకపోల కర్ణోష్ఠ నేత్రాళి
కముల మూర్ధమున శుక్లగతి నెక్కు
కళ దిగు కృష్ణ పక్షమున మతాంతర
ములఁ జాంద్రమానర్తువుల ముహూర్త
గతుల పొలంగ రక్త (ప్రవర్తి) దినముల్
తల నుండు గళలిలఁ జెలుల కెల్ల

తే. హస్తినికి శుక్లగతి దక్షిణాంశ నెక్కు
నెడమ దెస చిత్తినికిఁ గళ లెక్కు నిశల
శంఖినికి శుక్లగతి వామసరణి నెక్కుఁ
బద్మినికిఁ గృష్ణగతి వామభాగ మెక్కు

కం. ఎల్లతెలంగుల జాతుల
పల్లవపాణులకు నెక్కు భాగేతర మం
దల్లన దిగు కళ లంటినఁ
బల్లవితంబగుచు సుదతి పరగున్ బళిరా

ఆ.వె. స్తంభ విధము ప్రళయ సరణి రోమాంచంబు
స్వేదమున్ వివర్ణ వేపథులును
అశ్రు విస్వరమ్ములష్టవిధంబుల
సాత్త్వికోదయములు స్వకీయలకును

కం. ద్రవకాలుశ్యమతి ప్రియ
మవిరళముగఁ గొంచెమైన నల్ప ప్రియమూ
ద్రవమేమి లేమి రొల్లమి
యెపుడన్ నాయకుఁడు దెలియనగు జెలుల కడన్

చం. ప్రియమగుచోట శుభ్రమును బెద్దయు నప్రియ మించుకైనచో
నొయిదిన చిత్రవర్ణమగు నేమియు లేమిఁ జెమర్పు దండు న
ట్లయినఁ గదుష్ణ శీతలము లత్యధికోష్ణము శోకమంబునన్
నయవిదుఁడై యెఱుంగఁ దగు నాయకుఁడింతుల కాద్రవంబులన్

సీ. చెప్పరా టఖి మేఘదృష్టి విమర్శింత
సంతోషభావ విస్పష్ట మదిరా
కుటిల చూపులు దగు కుంచిత నామమై
దృతకోప భావంబు దెల్పునదిరా
ఆకాశవీక్ష యూర్ధ్వా లోకనంబగు
పరికింపఁగ విచార భావమదిరా
యరమోడ్పుగను చూపు ల్లర్ధ వీక్షణ నామ
మగుజుగుప్సా భావమరయ నదిరా

తే. చిడుపచూపులు ఖండదృష్టి విషమదియు
నటుఁ గటాక్షావలోకన మదియు ప్రేమ
నీవదృష్టిరా దుఃఖము నెలఁత సమ్మ
దృష్టి భావము లీగతి దెలియవలయు

చం. చులుకనఁ జూచుఁ గేళికిని జూన్పదు వీడఁగనాడు నొండొరుల్
దలఁచుఁ బ్రియంబు సల్పదు వృథావచనమ్ములఁ బ్రొద్దు పుచ్చుచున్
గలహము సేయు వేనలుకఁ గైకొను చూచినయంత విన్ననౌ
వలవని కాంత నిందలిడు వైఖరిఁ బూను నిరంతరంబిలన్॥

ఉం. కలకలనవ్వు కన్గొనఁగ గౌతుక మొందుచు గారవించు ని
చ్చలు గొనియాడు నంటు నెడ సాత్త్విక ముప్పతిలంగఁ గేళి, పై
యలయిక దోర్చు దైన్యవచనానుగతిన్ బ్రతిమాలు జోడుగా
గలజలముబ్బు ప్రేమదగు కామిని నాథుని సేవ సేయుచున్॥

కం. పరకీయయు సాధారణ
యరయఁగ బాహ్యాంతర క్రియార్థ్ములు దలఁచన్
బురుషరతియును నీతద్వయ
సరణి స్వకీయలకు మాన్పఁ జనుఁ బతి కెందున్॥

చం. కనుఁగొనినంతఁ గన్గవ వికాసము నొప్పది గూర్చుటల్ దినం
బును గడు గోర్కులున్ వగపు పొల్పగు పల్కులు జాగరమ్ముగా
ర్శ్య నిరభిలాష ఖేదన విసర్జన సంజ్వర హృచ్ఛలమ్ములున్
ఘనతర మూర్ఛ వైధనము గల్గునవస్థలు మోహజన్యముల్॥

కం. సమజాతియు సమరతియును
సమశుక్ల స్రవము మోహసంజనితమ్ముల్
సమరహితమైన మందుల
గమక ము చేర్పులును స్థితము గావరయంగన్

సీ. పాడ్యమి మొదలుగఁ బౌర్ణమి యొక పక్ష
మార్తవం బాదిగ నన్నినాళ్లు
పగఁటి ముహూర్తముల్ పదియేను నివి శుక్ల
పక్ష మన్యము కృష్ణపక్షములగు
రహి నిందులన్ బాహ్యరతి నల్పవరుసలు
తాడనపేటన పీడనములు
చుంబన చాలన చూషణ పంచాంగు
ళనఖదంతక్షత లలిత మణిత

తే. క్లిత్తములు తంత్రసంస్కారకృత్య పంచ
దశకమొక్కక్కటాదిగ దగు క్రమమున
నన్నియు నొనర్చి రతి సేయనలివవలచు

వ. మఱియు మోహనస్తంభన ద్రావణా కర్షణ క్రియలః మణిమంత్రౌషధయంత్ర తంత్రంబులు గలవవిదేశకాలజాతి భేద ఫలితములగు నాభ్యంతరంబులయందెనుబది నాల్గు తెఱంగులఁ బద్మనాగర నాగకూర్మవృషకుక్కుట మాయూరాది బంధమ్ములు గలవ వియు నెఱుంగందగు నిట్టి కళాశాస్త్రాంగమ్ములును నాయికా నాయక గుణసూచకమున గు నలంకారశాస్త్రమ్ము వినుండని సూతుండిట్లనియె॥

సీ. రసయుక్తి నింపుగా రచియింప రౌచికుఁ
డగు వాచకుండు శబ్దాతిడంబి
యర్థగాంభీర్యోక్తి నార్థికుఁ డగు నర్థ
భాసుర శబ్దకల్పకుఁడు శిల్పి
మధురమార్దవయుక్తి మార్దవానుగుఁడగు
శాస్త్ర వాక్యజ్ఞుడెంచఁగ వివేకి
ఘనతరాలంకారగతి భూషణార్థియా
నమరు నన్నిఁటను మహాకవియన

తే. గీ. సకల సద్గుణియును సదాచారి విద్య
తెలుఁగు జనశీలకవి గోష్ఠినెసఁగు ఘనుఁడు
సరవిఁ గృతినాయకుల్ ధీరశబ్దపూర్వ
విల సుదాత్తోద్ధతులు శాంత లలితులనఁగ॥

మ. అలకావ్యమ్ము ద్విభేదమై వెలయు బ్రేక్ష్యశ్రావ్యములై, ముఖా
ఖ్యల నాద్యంబు దశప్రకారములఁ జోద్యంబైత గన్ నాటకో
క్త్యల దీపమ్మగు భాణ సత్ప్రకరణ వ్యాయోగ వీథ్యంక ని
ర్తల హాస్యోడ్డిమ భాస్వరత్సమవకారస్ఫారనామమ్ములన్ ॥

తే. గీ. భావశబ్దార్థరస పరిపాకశయ్య
లయ్యలంకార రీతులు వ్యంగ్యభేద
గతులు పది ప్రాణము లివెల్లఁ గావ్యములను
గాన నిర్దోషకావ్యమ్ము గడుశుభమ్ము

కం. ఈ భాగులు గల కవివరు
లా ధీరోదాత్తముఖ్యులగు పతులకు స
న్నేత నొసంగిన కృతులవి
సాధుస్తుతి నుభయలోకసౌఖ్యము లొసఁగున్

చం. ఉదధి పురర్తు శైలతనయోదయ సంగరరంగ నాయకా
భ్యుదయ వివాహ దౌత్యమృగయోత్సవ పాన సరోవిహార స
మ్మదతరుణీరతీ విరహ మాన దురోదర దండయాత్ర లిం
పొదవఁగఁ జంద్ర సూర్యగతు లొప్పఁ గృతి క్రియ వర్ణనాంశముల్ ॥

వ. అందష్ట నాయికా విధమ్ములు .—

సీ. పడకిల్లు కైపుగాఁ బాటించి పతి విముగ్న
న నేయు వాసకసజ్జిక దయ
ధవుని చిన్నెలు మదిఁ దలఁచి చింతిలు
విరహోత్కంఠితా నాయికోత్పలాక్షి
విభుఁడు దా నాడివిన విధమున మెలఁగఁగ
జతురయా స్వాధీనపతిక యెపుడు
వా డాడికాని క్రేవన్ బతి జేరని
రీతిని కలహాంతరిత నెలంత

తే. గీ. పతిని దండించు ఖండితా భామ ధవుని
బలిమి మదిఁ గోరు ప్రోషితభర్తృక పతి
దను మొఱఁగఁ గుంద విప్రలబ్ధావధూటి
హత్తు సంకేత మభిసారికోత్తమాంగి ॥

ఉ. ఒక్క సఖీలలామ కెనరొందినవాఁ డనుకూలనాయకుం
డెక్కువ పెక్కు కాంతల రతిన్ సమవైఖరిఁ గూడఁ దక్షుఁడౌ
నెక్కువ గుర్తులుండి వెలినెంచక దగ్గఱు వాఁడు ధృష్టుఁడౌ
కక్కస మాత్మకామినికిఁ గాక మఱెందును లేశమందిలన్

కం. ఒనరఁగఁ గావ్య శరీరం
బున బద్యావయవములకు భూషణ లన్ప్రా
స నిబంధవృత్తులాదులు
గనుక నలంకారమని పొగడఁగావలనెన్.

కం. చెంది గుణాలంకారము
లందువ వేశమ్ము క్రియయు నాశ్రయరీతుల్
పొందుగ సంఘము కావ్యము
నందున్వివరింప గుణము లనిపించుకొనున్

వ. శబ్దార్థోభయగతమ్ములుగఁ జిత్రములు త్రివిధమ్ములైయమరు నర్థాలంకారమ్ము
లు చతుర్విధంబందుఁ గొన్ని ప్రతీయమానవస్తువులు కొన్ని ప్రతీయమానరస భావములు
కొన్నియస్ఫుటప్రతీయమానములు సమాసోక్తి పర్యాయోక్త్యాక్షేప వ్యాజస్తుత్యు
పమేయోపమానానన్వయాతిశయోక్తి పరికరా ప్రస్తుత ప్రశంసానుక్తనిమిత్త విశే
షోక్తులుంగాక మఱియును.—

సీ. ప్రతిమాన వస్తురూపక పరిణామసం
దేహ స్మరణ తుల్య దీపకములు
నుల్లేఖ భ్రాంతి మదుత్ప్రేక్ష లుపమాస
హోక్తి దృష్టాంతముల్ యోగితమును
వ్యతిరేకమును ప్రతివస్తు సందర్శన
శ్లేష లూర్జస్వి విశేష భావ
ములయందు రసభావములు జెందు నుపమాన
భానురార్థాంతర న్యాసములు వి

తే. రోధభావ నిమిత్తైక రూపలలిత
విలసిత విశేష సంయుక్త కలమి విషమ
కలిత చిత్రాధి కాన్యోన్య కారణములు
లికావళీ వ్యాఘాత మాలికలును.

వ. మఱియుఁ గావ్యలింగా మమాన సార యథాసంఖ్యార్థాపపత్తి పరిసంఖ్యా
దికకలాపముల యందు సముచ్చయ సమాధి ప్రత్యనీక ప్రతీప విశేష మీలన తద్గుణవ్యా
జోక్తి భావోక్తి భావి కోదాత్తములయందు సహృదయ హృదయాహ్లాది ప్రస్ఫుట
ప్రతీయ మానములు లేవు. వీఁటియందు ద్వివిధంబున నలంకార లక్షణలు వివరించెద.

తే. గీ. తనరు సాధర్మ్యములు త్రివిధమ్ము లగుచు
భేదము నభేదభేదా విభేదముఖ్య
ము లయి యుపమానము నుపమేయ మొనరు నిట్టు
లవియె భేదమ్ము లగు నవాస్తవములగుట.

వ. ఇందురూపక పరిణామ సందేహ భ్రాంతిమదుల్లేఖాపహ్నవాదులు అభేద ప్రాధాన్య సాధర్మ్య నిబంధనమ్ములు దీపకతుల్య యోగితా దర్శనదృష్టాంత ప్రతివస్తూపమా సహోక్తి ప్రతీప వ్యతిరేకాదులు భేద ప్రాధాన్య సాధర్మ్య నిబంధనమ్ములు ఉపమానద్వయోపమేయోపమా స్మరణాదులు భేదాభేద సాధర్మ్య మూలములు, ఉత్ప్రేక్షాతిశయోక్త్యధ్యవసాయ మూలములయందు విభావనావిశేషోక్తి తద్గుణాన్యోన్యవ్యాఘాత భావిక విశేషణాదులు విరోధ మూలములు యథాసంఖ్య పరిసంఖ్యార్థాపత్తి వికల్ప సముచ్చయమ్ములు వాక్యన్యాయమూలమ్ములు ప్రత్యనీక సమాధి స్వభావోక్త్యుదాత్తములు వ్యవహారమూలమ్ములు కావ్యలింగానుమానార్థాంతర న్యాసతర్కములు న్యాయమూలమ్ములుఁ గారణమాలైకావళీ మాలాదీపక శృంఖలాదులు వైచిత్ర్య మూలమ్ములు వ్యాజోక్తి వక్రోక్తి మీలనాపహ్నవములు సమాసోక్తి పరికరములయందు వైచిత్ర్య మూలములగు నిట్టి యర్థాలంకారములకు మున్నుగ శబ్దాలంకారమ్ముల నెతింగించెద.

సీ. ప్రాసమా ఛేకానుపటిమ ధీరాధార
ధారా ధరోదారసారుఁ డనిన
నిదియె యనుప్రాస మిల వృత్త్యనుప్రాస
మీ వారి మీవారి కిమ్మటన్న
కమలా కరంబిది కమలాకరంబన్న
యమకమా గిరిదరి హరికిరి యన
నొకయర్థమునను వేఱొక ధ్వనిదోఁప
శబ్దాలంకరణమగు హరపరాక్ర

తే॥ మప్రభా విభవోన్నత మహిముఁడనఁగ
చక్రభుజగాది బంధముల్ చాల చిత్ర
కవితలఁ గూడి యొనరఁగ వివిధగతుల
నొప్పు నందమ్ముదళ పద్య మొప్పునిట్లు

శ్లో. యాతాయస్యా సమగ్రాసతి మహ కనకస్థాన సత్కాసనాయా
యానాసక్తాస నస్థా సుఖయతు కమలాఖ్యాస నుజ్ఞాను మాయా
యామానుజ్ఞాను సఖ్యా క్షితిపతి తిలకం జ్ఞాతిరక్తా సగేయా
యాగేసక్తారతిజ్ఞానుకృతిషు పలితగ్రామ సస్యాయతాయా.

వ॥ ఇట్టివి చిత్రబంధవిధంబులు—

తే. అంబునిధివంటి గాంభీర్య మమరశిఖరి
వంటి యౌన్నత్య గరిమ దిగ్వారణముల
వలె ధరణిఁ దాల్చె రఘుకులవర్యుఁడనఁగ
నర్థయుక్తి నలంకారమై తనర్చు

మ. రాతిరి యాననప్రభల రామలు పోరదు లిత్తురా మురా
రాతికి నన్న శ్లేషయగు రామక రాస్యపి దైత్య రాజబిం
బాతతసంగ్రహార్థ్యమను నర్యాడ యౌవకమా ను రాచలం
బాతడ నాఁ బ్రతీపకసమాఖ్య నలంకరణమ్ము చెల్వగున్.

సీ. ధర్మార్థ కామ సంతతి యొక్కచో నిల
శబ్దమ్ముచేఁ దోఁచు సరవి నొదవు
మితి యతు మానోపమేయమై తొమ్మిదో
దిక్పతియా విష్ణుదేవుఁ డొక్క
యను నెడ సందేహమను నలంకారమ్ము
హరికీర్తి చంద్రిక నా చకోర
కములు సంతస మందెఁ గదు నన్న భ్రాంతి
మత్తగు వేంకటాచలం బఖిలజనులు

తే. మోంతురమ కున్కి యని దైత్యముఖ్యులమిత
శౌర్యమున కెల్లయనియు నిశ్చలులు జ్ఞాన
మయమనియు నెంచుసాధర్మ్య మహిత మయ్యు
లీలఁగను పట్టు టుదిరెూ యుల్లేఖ మగును.

ఆ. వె. సైన్యరజము గాదు జయహేమధామ మం
చనుట పహ్నవాఖ్య నమరు పూర్ణ
లుప్తయనఁగ నుపమలు ద్వివిధములు త
చ్ఛబ్దభానురార్థ చర్యనమరు.

క. ఆటుదెలంగులఁ బూర్ణలు
మీటుగ బందొమ్మిదైన మితి లుప్తలగున్
ధారుణి యయాతి రాజుల
తీటున ధర్మజుఁడు పూనె ధృతి నపుడనినన్.

సీ. ఉదయాద్రి నినుఁడుండి యదన సారసముల
నలరించు రీతి సింహాసనమున
జననేత్రముల వికసనము నర్చి రమేశుఁ
డన శ్రోత్రియుల్ బూర్ణమర్త్య మతియుఁ

దద్ధిత యద్ధియుఁ దగవాక్యగయు సమ
 రసయు నానొప్పు పూర్ణ ద్యుతులు లాఱు
వనజాప్తునెడఁ జక్ర వాకముల్ చంద్రుని
 యందుఁ జకోరము లలరుల తొడ

తే. నళినచయం బెట్టు లట్టుల నంజనాద్రి
విభుని సేవలఁ బ్రజలు నావిధము లుత్త
లివిరె పూర్ణుల పేరుల నెసఁగు మఱియు
గలవు పదములఁదు భేదముల్ దెలియ వరుస.

క. వెన్నెలలై యమృతంబై
యన్నీరజ నేత్రు కీర్తి యమరె నటన్నన్
ఎన్నఁగ ననుక్తధర్మి ప్ర
సన్నత లుప్తయగు నుపమచందము దెలియన్.

క. హరిభుజ దండము దానవ
వరులకు యమ దండమగుచు వర్తిలు ననుటల్
ధర సుక్తేతరధర్మ
స్థిర నామాలంకరణము చెలువగు మిగులన్.

సీ. గురుని శిష్యులరీతి సురలెల్లఁ గొల్తురీ
 హరిననిన ప్రతీప మనఁగ నొప్పు
దినకులంబెల్ల రాముని చేఁ బరిష్కృతం
 బైనట్లు యదువంశ మమరెఁ గృష్ణు
చేతనా నర్థప్రతీతి యౌ మెఱుపుతోఁ
 గలజలదంబన్న నైలమి సీత
తోనున్న రాముఁడు దోఁచుఁ బింబప్రతి
 బింబ భావమనంగఁ బేర్మి నమరు

తే. ద్రవిడస్వర్గంబు వేంకటధర సురపురి
యచటి జనములు దేవత లబ్జనాభుఁ
డింద్రుఁ బోలెడి విభవాలి సాంద్రమహిమ
ననుట యుపమాఖ్యఁదగు బుధజనఘనోక్తి.

క. శారద శరదురు నీరద
నారదశర పుండరీక నందిత మిహికా
పారదరుచి మీఱున్ హరి
గౌరవ యశమునిన మాలికోపమగున్.

ఉ. రాముఁడు రాములీల జనరంజకుఁ డన్న ననన్వయంబగున్
రాముని యందుధర్మము శిరంబగు నర్థము రీతి నర్థమ
ప్పెల్లిమతిఁ గామమా ద్వివిధ మానసఁ బ్రత్యవమర్శనామమా
నోమిక నొందుఁజూచి మతి యొండొరుఁగన్ స్మరణాఖ్య మొప్పగున్.

తే. వేంకటాద్రీశుఁ డాశ్రిత వితతి కాత్మ
సేవ దయ సేయుచో భోగసీమ వెలయ
నట్టి పరవాసుదేవు నైయ్యమునఁ దలఁచుఁ
గా నొనర్చుట లారోప గర్భమయ్యె.

సీ. వహి సావయవ నిరవయవ విధాష్ట క
రూపకాలంకార రూఢులందు
హరి జయ యాత్రాంబుదావళి ఘోరని
స్స్వాన నిర్ఘోషణ శత్రుశైల
ములు పగుల్చుచు వారి లలనల కన్నీటి
జడి యశోంకుర సముచ్చయ మొనర్చ
ప్రౌఢి నావస్తు రూపక మగు హరి కల్ప
వృక్షాకృతిన్ గుణవితతి ధూప

తే. వాసనలు నించె జగములు వాసి గనన
బరగు నట నేకవర్తి రూపక మనంగ
కరమథనశైలమున శత్రు కంధిఁ ద్రచ్చి
రహి యశస్సుధ లోకామరత్వముగను.

వ. గాంచెననుట సావయవరూపకంబగు, నందక రాహువు దైత్య రాజమండలమ్ము గ్రసించెననుట, పరంపరరూపకాలంకా రమ్మగు మఱియును.

క. దానవ భంజన కరుణాం
భోనిధి సత్స్వార్థి పంక్తి పారి దిక్తతులం
దానె ననుట శ్లేషోక్తియ
గానఁ బరంపరితరూప కంబై వెలయున్.

సీ. జయ యాత్రదలఁచు శేషనగాధి పాజ్ఞాను
య ప్రసక్త్యయం బఖిలామరగణ
మట సప్రమకుటంబు నట్టులంకారా
ఖిలాన భణించు విలాస గతుల

నగునెడి యర్థము సమానాధికరణశ్లేష
పరిణామమనఁ నలంకరణమయ్యె
హరి కటాక్షములు బ్రహ్మాదులు కల్ప
కామములో ! చింతామణి మహిత రుచులో !

తే. రహిఁ బరుసో నిధులో! సిద్ధరస తరంగ
సంఘమో! యని యెంచి నిశ్చయము సేయు
నైన నిశ్చయ పర్యవసానసంశ
యాఖ్యమైన యలంకారమగుచు వెలయు.

క. హరి దరహాసము దిక్కులఁ
దరలఁ జకోరములు షట్పదములున్ జ్యోత్స్నా
పరమని సుఖించె నన ను
ర్వర భ్రాంతిమదభిధ మగుచువర్తిలు నెలమిన్,

చ. అసురకులాంతకోద్భట భటార్భటికాదు చతుస్సముద్ర వా
ర్యసమ మహారవంబగు మురాంతకు ధక్కారవమ్ముగాదు సై
న్యసహితభేరి గాదనెడి యర్థ మపహ్నవనామమై తగున్
వెస నది సవ్యమై యనృతవృత్తిన నా ద్వివిధంబులై తగున్

తే. తొంబదియు నాలు నుత్ప్రేక్షలింబుగాఁగ
నవి యితర ధర్మ మొకటి యందమరఁదలఁచు
రామ పట్టాభిషేకాంబురచిత పంకి
లాంకురములనఁ బుష్పాదులమరె ననుట.

వ. మఱియాననుపాత్తనిమిత్త జాత్యభావస్వరూప హేతు ఫలగమ్యోత్ప్రేక్షాదులకుఁదత న్నామ నిర్దేశంబుల నర్థానుగతి నుత్ప్రేక్ష తెలియంగఁదగు మఱియును—

సీ. రామ దోర్దండ ధారణమున చే ధారుణి
మృదుతయ్యెనన్నట్లు మెలఁగె భూమి
ధర నివాసము మదిఁ దలఁప కప్పుడ టన్న
జాతి హేతూత్ప్రేక్ష చంద మమరు
ధరఁ గల్పకముగాఁగ ధాత రాముసృజించె
నన జాతి హేత్వాహ్వయమునఁ దనరు
నతని భేరీధ్వని యరులున్న గుహఁ గల
యగఁగఁ జొచ్చెననఁగఁ గ్రియాఖ్య నమరు

ఆ.వె. సురథుఁ గల్పవృక్ష మొనరఁ బుట్టిన యట్లు
రామచంద్రుఁ డొదవె రవి ధర నన
నతిశయోక్తి యర్థ్య నవి నాల్గు దెఱఁగు లౌ
పేర్మితో నభేద భేదగతుల.

ఉ. నారదుఁ డబ్ధిఁ జేరి నది నాథ మురారి వసించు నెయ్యడన్
గారణ మేమి నాఁ దపము గైకొన వేఁడిన నిచ్చె నిట్టు నా
క్షీర సముద్రుఁ బోలి తన చెల్వుగ, నాతిశయోక్తియౌ తగున్
మీఱి యసంగతాఖ్యమగు మేరుగధీరవరానుకారితన్.

క. మురరిపు ఖడ్గము దానవ
వర కంఠము నందుఁ గల్పవాసన కుసుమో
త్కర మనిల యుక్తిఁ బడునను
టరయంగ సహోక్తియనఁగ నతిశయ మందున్.

తే.గీ. దినదినము సూర్యుతోఁ గూడి వనజ నేత్రు
శౌర్యరమ పూర్వగిరిని నిశ్చలతఁ బొదవె
ననసురూపాసహోక్తి నానతి శయిల్లు
హరికథలులేని కృతిరమ్య మగునె యనుట,

వ॥ రమ్యతాది కోక్త్యలంకారంబగు. రామచంద్రుండు పూర్ణుండును నిష్కళంకుండు నగుచునుండు, చంద్రుండు కళంకయుక్తుండిట్లు పూర్ణుండగుననుటయు రమ్య తావినోక్తి యగు మఱియు.

సీ. ఘనతవిశేషణంబునకుఁ దుల్యంబగు
ప్రస్తుత వస్తు ప్రశస్తి వినుతి
నన్యవస్తువు దోఁచు టది సమాసోక్తియు
దానలక్ష్మీ భాస మానవృత్తి
సహస్రాంగ మహిమ నైంతంగ భద్రాత్మత
సార్వభౌమఖ్యాతిఁ బర్వె రాముఁ
డని దిగ్గజారోపణార్థమౌటది సమా
రోపణా లంకార యాధి నమరు

తే. సుకవి రతను బల్క వేఱొకటి దోఁచు
టది యౌ వక్రోక్తి యిజుఖు గా నాడు మాట
అదియె వాక్యార్థ హృదయంబున నతిశయిల్లు
గజము మదహత చలన రాఘవుఁడు నడచె

ఉ.వ అనుట స్వభావోక్తి యగుమఱియును.

క. వేంకట విభు దర్శనరో
మాంకురములు తొడమఁ బ్రముదితాంబుధి దొట్టన్
గొంకక తత్కింకరులకు
సంకోచ యని యిచ్చు దనుట వ్యాజోక్తి యగున్

తే. గీ దైత్యకాంతలు తమ తమ ధవులఁ గలయ
నపుడు రోమోద్గమంబౌట నాత్మ శౌరి
వలనిభయ మంచు విశ్వాసకలన మాని
రనుట మీలన సంజ్ఞచేఁ దనరు నెలమి

క. ఇల జాత్య కీర్తి లోకం
బుల విశదంబైన శంభుభువనాధిప శ
క్తులు నిజ వాహన రూపము
లలవడ నెఱుఁగరనఁ దద్గుణాఖ్యంబయ్యెన్.

సీ. ధర విరోధా కృతుల్ దశవిధమ్ములు వేంక
టాద్రి నాయకుఁడు పద్మాకరుండు
నైజలాశయుఁడు గాఁడన శుభతర వారి
ధారుఁడయ్యును దైత్య తాపకరణుఁ
డగు నను నివి విరోధాభాస భేదముల్
మునుపటి రాజుల ఘనయశమ్ము
రాముఁడా ధేయమ్ము గామెమ్మిఁ దగునన
రహి విశేషా లంకరణ మనఁదగు

తే.గీ. ఇదియుఁ బ్రది విధమ్ములగు నెన్న నిట్లు పెక్కు
విధముల విరొల్ల నెఱిఁగి కవిత్వ గతులఁ
గృతులుగావించు సుజనుఁడు కీర్తిఁగాంచు
వెలయుఁ గల్యాణ వేంకట విభుని కృపను.

క. యత్నముల జనులలో శ్రీ
రత్నమ్మును మఱియుఁ బురుష రత్నమ్మును స
ద్రత్నమ్ము శిలల గజహయ
రత్నమ్ములు పశువుల దొడరాజిత లీలన్.

క. శ్రీ పుంస లక్షణమ్ములు
చూపట్టఁ గనెఱుఁగ వలయు శోధిత తత్త
ద్వ్యాపార శుభా శుభ ఫల
దీపితమది యగును శాస్త్ర ధీరతి విబుధుల్.

తే. గీ. అందు స్త్రీలక్షణము వినుఁ డంఘ్రియుగము
కుదురు మృదువునఁ దాఁబేటి వడువు కాన్స
గుల్ఫము లరోమశంబులు కుదురు బటువు
మీలు దొడలట్లు కరభమ్ము పోల వలయు.

క. నునుపు జిగి యవయవంబులు
దనరినఁగడు శుభము పిఱుఁదు దళమగు టయ్యున్
వినుఁడు పురోభాగము మృదు
వనువుగ సమమైన వైభ వాధిక్య యగున్

చ. ఉదరము పై వళుల్ తెలివినొంది తగన్ ద్రివిధమ్ము లై ముదం
బొదవుచు నుండఁగావలయు నున్నతి నాభి కటారి లీలునన్
బొదలుచు గల్గిచన్నవకుఁ బొందుగ మధ్యమసీమఁ జేరి సొం
పు దనరఁ జీమచాలనఁగఁ బొల్చిన కామిని యొప్పు నన్నిఁటన్.

తే. గీ. పొగలగు వ్రేళ్లు చక్కఁల సొబగు నఖము
లమరఁ బాటలరుచి పాణులకుఁగు లున్న
కాంత యొంతయుఁ బ్రభుపరిగ్రహముగల్గి
సంతతియు వైభవస్థితి చాలఁ గాంచు.

తే. గీ. చన్నులకుఁ గ్రింద నాభితో నెన్నఁగూడి
గిన్నెయున్నట్టి చెలువున వన్నెమీఱి
కడుపు గడునొప్పె నేనియుఁ బడతి పుత్ర
వతియు సౌభాగ్య వతియునై యతిశయిల్లు.

క. తనుబొమల వంపు పలువరు
స నెడంబమరమియుఁ గచనిచయమున సన్నం
బు నిడివియు నలుపు గలిగిన
వనితామణి యైదువైతృవంబుగ వెలయున్.

క. కరములఁ బదములఁ జెక్కులఁ
గర మరుదగుకోమలంబు కలువల చెలిమో
మురు కాంతి కళములు గల
తరుణీమణి భోగ భాగ్యతన్ వర్థిల్లున్.

సీ. అళికపు సుడిమోము పులిపిరి గలసఖి
దారిద్ర్య పీడఁల దవిలి నదియు
మంటు కన్నులునైతి కుఱుచ చింపిరి వెంట్రు
కల చెలిరోగిదై యలసుటఁ బడు

వెండ్రుకలరుణముల్ విషమాక్ష విషమపాద
పుటంబి యాపదలెపుడు కొండు
గట్టి తనువు రోమకలిత చుబుకయైన
వనిత యొన్నఁగఁ గడు వంధ్యయగును

తే. పురుషవరు కంఠ నాదమ్ము కలికి మొగము
గుల్భరోమములరయ నాకుఁడు గలయది ?
విధవయగు గొగ్గి పండ్ల వెలఁది జారి
ణియగు విషమేక్షణియు నట్లనయగు పరుస.

వ. ఇంక పురుషలక్షణం బెఱింగించెద—

ఉ. సారస మందముల్ మృదువు చందము నంఘ్రుల నున్న మేలునా
యూరుల రోమముల్ దళము నుక్కిరినస్థితిఁ బర్వ నొప్పగున్
జారుకరాబ్జముల్ బొమలు సాఁగి ప్రలంబములైనఁ జెల్వగున్
వారక కేశ జానువులు వక్షము గుక్షియు నున్నతిం దగున్.

సీ॥ పాదరేఖలు కేశ పాశమ్ము లింగమ్ము
స్నిగ్ధమ్ములైయున్న నెరయ మేలు
నఖపాణి చరణోరు నయనాంతములనెఱ్ఱ
దనమైన నైశ్వర్య ఘనత నమరు
స్వరనాభి సత్వమ్ములరయ గంభీరమ్ము
లైన భూపాలకుఁడగుచు మెఱయు
గంఠోదర లలాట కామ్యత్రివళులచే
నతిభోగ భాగ్యాయురాప్తిఁ దనరు

తే.గీ జంఘకంధర కృష్ణ హ్రస్వతయు లెస్స
చరణ రేఖలు చూచుకస్తనములఁదగు
చక్రములుగల్గ వైభవాస్పదుఁడునగును
విరివి పాదోదరమ్ములు వెలయుటొప్పు.

తే. రోమ కూపాళి విస్తార రుచిరమమరు
నందు నొక్కొక్కటున్న రాజ్యానుభవము
రెండు రెండున్న మధ్యమరీతి మెలఁగు
మూఁడునాల్గైన దారిద్ర్యమునఁగృశించు.

కం. చెక్కుల భుజముల వీపున
ముక్కులఁ గర్ణముల రోమములు దట్టచెనన్
చిక్కున్ దారిద్ర్యంబున
మ్రొక్కులు గనుబాటు వడుకుల నవిగలుగన్.

కం. తలవర్తుల త్రయంబున
నిలయేలున్ వ్రేళ్ల కనుపు లిరవగు రేఖల్
వలనన్ నాలుగు రెండున్
గలిగిన దీర్ఘాయురాప్తిఁ గడు దగు గాత్రున్.

ఆ. వె. నుదుటఁ గరయుగమునఁ బదముల నాళ్గెని
రేఖలున్న భాగ్యవృత్తి నలరు
నంకుశాబ్జ వజ్రహల లసద్ధ్వజరేఖ
లడుగులన్ భోసంగ నధిపుఁడగును.

కం. కరతలమున మత్స్యాకృతిఁ
గరమొప్పగు పద్మరేఖ గల్గిన ధనద
స్ఫురణఁదగు ననామిక కడు
వరయఁ గనిష్ఠికఁ గ్రమించు నాయువు పొసఁగున్.

కం. చిటికెన వ్రేలికి నీ దటన్
బటుగతిఁ బెనురేఖ ఛిద్రభావరహితమై
యటుఁ దర్జని మొదలంటిన
బటువుగ నూరేఁడ్లు బ్రదుకు ప్రస్ఫుటలీలన్.

సీ. అంగుష్ఠము నడుమయవరేఖ గల్గినఁ
వాడి పంటలుగల్గి వరిఢవిల్లు
చిటికెన వ్రేలి క్రిందటి పెద్ద రేఖకు
నాగువ రేఖలు గల్గ మగువ లనియు
మణిబంధ తన్మధ్య మహితాల్ప రేఖలు
పుత్రులు సుతనులై పొసఁగఁ బుత్రి
కలు నటించు నెఱుంగఁగాఁదగు సంగుష్ఠ
మూలరేఖలునట్టి లీలఁదనరు

తే. వ్రేళ్ల నిడుపులు వేర్వేఱ వెలయఁ గొల్చి
నట్టి సూత్రమ్ము మూరెడంతైనయున్న
నవతి వర్షంబులాయు వెన్నంగనెంత
తక్కువైనను దద్గతి తగు నెఱుంగ.

తే. బాహుజానూరు యుగ్మమేర్పడఁగ పోల
యుగము సమముల విభుతచే జగతి వెలయు
జాను పర్యంత బాహువుల్ సరవిఁ గలుగ
నతఁడు మూర్ధాభిషిక్తుఁడౌ నధిక లీల.

కం. మడమలు మెడ భుజములు లా
వెడలక కుఱుచలయియున్న నిలకుం బతియౌ
కడు నరచేతులు కఠినం
బడరినఁ బదమృదుత నాతఁడవనివిభుఁడగున్.

తే. గీ. నిడుఁద శేఫమ్ముచే లేమి నెరయనొందు
హ్రస్వశేఫమ్మువలన ధరాధిపుఁడగు
మధ్యమంబైన నాతండు మధ్యముండు
నిరువలన గాని జాతి నౌన్నిక వహించు.

కం. అరచేత ముసలమున్నన్
వరవిద్యాశాలి యగును వసుధననుత భా
సుర రక్తిన్ బహుళ స్త్రీ
పరితోషణ నిరతుఁడగుచు భాగ్యయుతుఁడగున్.

కం. కనుబొమ నాసాపుటములు
కనుగవ శ్రుతులోష్ఠ చూచుకయుగులున్ జానుల్
ఘనకూర్పర మణిబంధము
లానరున్ గటికర పదాండ మొగి సమమైనన్.

కం. చెక్కులు పెదవులు భుజములు
మక్కువ దంతములు జత్రుమధ్యము హెచ్చున్
దక్కువలుగాక సమమై
చక్కఁగఁ గను పట్టు రాజ సన్మాన్యుఁడగున్.

ఆ. వె. ఏకవృషణుఁడైన నిలపతియగు లంబ
వృషణుఁడైన మధ్యవిధిఁ దనర్చు
విషమ కోశుఁడైన వెస రోగ దారిద్ర్య
బాధలొంది పీడబడుచునుండు.

తే. గీ. సింహశార్దూల గజవృషస్థిర గమనత
నాయురారోగ్య భాగ్యభోగాన్వితుఁడగు
నోష్ఠ హనునాసికల నైనపాదవేనేని
భాగ్యవంతుండు వాఁడె శోభనము లలరు

కం. ద్వాత్రింశద్రదనములే
కత్రింశ త్త్రింశదుచితగణనకలిగినన్
ధాత్రీశుఁడగున్ దత్సం
ఖ్యాత్రితయన్యూనతన్ మహాకృపణుఁడగున్.

తే. గీ. తనదు జొట్ర వేల దేహమంతయును నూఁట
యెనిమిదైనను భూచక్రమేలఁగలఁడు
షణ్ణవతి సంఖ్య మధ్యమసరణిఁదనరు
నంతకుందక్కువైన వాఁడధముఁడగును.

సీ. పార్ష్ణ్యంగుళీగుల్ఫపదజానుజంఘలు
కటితటస్తన నేత్రకర్ణయుగము
భుజహస్త నాశికంబులు నండములు
సమద్వంద్వంబులునుగాళ్ల తలముగోళ్లు
కన్నులు పెదవులు గడునిగుళ్లన్ జిహ్వ
తాలుత శుభవిభారక్తకములు
వక్షశ్శిరః ఫాలకుక్షి పదములు కం
ఠశ్రోత్రనాభి పృష్ఠములు విరివి

తే.గీ. వక్త్రకరగుల్ఫ జిహ్వలు వర్తులములు
కచముఖక తారకా భ్రూయుగమ్మునలుపు
దంతములు నేత్రములు చాలధవళరుచులు
గలుగు వారలు శుభసౌఖ్యకలనులిలను.

కం. పిక్కలు కచదంతమ్ములు
త్వక్కున్ వ్రేల్ సూక్ష్మమైన వాఁడధిపుఁడగున్
మక్కువఁ గత్తుభుజమ్ములు
నిక్కిన యాతండు ధారుణిన్ బూజ్యుఁడగున్.

కం. కనుబొమ తుదలఁ బ్రదక్షిణ
మునఁదగు సుడిగలిగెనేని మూర్ధన్యుఁడగున్
ఘనరేఖాస్పదత మృదు
త్వనిరూఢిన్ మాంసయుక్తిఁ దగు చరణమ్ముల్.

తే. గీ. అమరు మధుమత్స్య మాంసగంధముల శుక్ల
మునరె నేనియు సంతతిఁ దనరఁగాంచు
ఛత్రచామరపద్మ కచ్ఛపధనుశ్శ
కటమకరమీన రేఖాంఘ్రికములు లెస్స.

కం. మణిబంధరేఖ నడి(వేల్
గణుతింపఁగ నంటియున్న ఘనసిరులొందున్
(గణుత గభీరోక్తులచే
రణితాలంకార ధృతివిరాజిత వొప్పున్.

కం. తుమ్ముకడు చప్పుడైనన్
సమ్మతి నధికాయురాప్తి సమ్మతిఁ గాంచున్
ఇమ్మహిఁ బూరుష లక్షణ
మిమ్ముగ నీరీతి వెలయు నెంతయు నొప్పున్.

వ. ఇంక సకలైశ్వర్యమ్ములకు నాధారభూతంబగు గజలక్షణం బెఱింగించెద.

మ. గజజాతుల్ [గుణ] ముల్ మదస్థితులు జోకన్ హేతుభూతాది రు
గ్వ్రజనైదాన చికిత్సలున్ దెలియ తేవన్ మీఁదఁ గాప్యాయసుం
డు జగన్మాన్య విశంపనందనుఁడు శిష్యుల్ మెచ్చఁ గావించి రీ
గజశాస్త్రంబు తదీయ గర్భ జననాఘుప్రాప్తముల్ లీలలన్.

కం. పూనిక లోమశ వీతా
శ్యానకలామశ గవాక్ష సైంధవ వనముల్
వ్యానర నిరసీకములున్
స్థానంబులు ద్విరదకోటి జన్మంబులకున్.

సీ. ఈయష్టవనములు నెన్నఁ నీ దేశముల్
గిరులును గలనొటఁ గరులు దత్త
దష్టాఖ్యలం బొల్చు నందభద్రలు మంద
మృగములు సంకీర్ణములుగను జాతు
లగు నాదిచర్యయు నంతచర్యయునాగ
మలయములు దిగుట మొదలఁ దుదలను
గల లక్షణములాదిగ మఱించి నిల్చుట
యూవరింపుటు నీల్గుటడవి కొమ్ము

తే.గీ. గ్రుద్దుటది పైసరంబట్టి గుఱుతు నడత
లుమేలును గత్తెరకాలు నులిమి
యూపు సంతతధారయానేపుమీఱు
టంత చర్యయు నాఁగ గజాళికమరు

శా. చండత్వంబును గట్టికొమ్ము గవ విస్తారాలి నేత్రాంతముల్
దండిన్ లావగు కంఠభాగము మృదుత్వక్కర్ణముల్ గోళ్లను
ద్దండ ప్రాభవసాహసమ్ము విపరీతంబైన చర్యల్ మహో
తుండం బేటును మండలమ్ము మద మెచ్చున్ జాతి భద్రాఖ్యమై.

కం. నిబ్బరపు మొగముల్ గనుకను
బుబ్బగు వెన్నముక కుదురు నొరపున్ సమమై
యుబ్బురమగు కుంభము లా
గుబ్బగు దూపులును భద్ర కొమ్ము సయికమై.

మ. పొంగరున్ గంఠము ప్రాక్కునన్ శిరము నొప్పున్ పృష్ఠభాగానతం
బౌగ జాతింబగలేమి యన్యకరిపై మత్సాహితం బొప్పుటల్
తగు సత్త్వమ్ము జనమ్ము చల్లనగు వాతంబానుటల్ గల్గి సోం
పగు నా నల్ల మదంబు మందగుల ముద్యద్రాజసన్మాన్యమై.

సీ. కాలికంబమ్ము నైకము రోమములు చాల
గలచెవి మూలు గండయుగము
తోక విస్తారమ్ము తోరంపు గొమ్ములు
ప్రక్కలం గోశంబుపట్లు నుత్త
మారదృష్టియు స్వకీయారోహకానుకూ
ల్యము వామ దక్షిణలలితపార్శ్వ
వర్తులావర్తముల్ వైపరీత్యము లోటు
మద గుప్తమును సౌమ్యమహిత గణన

తే.గీ. మున్నతియు నొప్పు మృగజాతి కురువివేక
మమర గజముల కెల్ల నిట్లనుకు మీఱు
దక్షిణోత్తరములకుఁ బ్రదక్షిణా ప్ర
దక్షిణమ్ముల మృగజాతిదక్కు నెలమి.

మ. వెనుకటికాళ్ళ పైకీలును వెన్నునను న్నతి దీర్ఘహస్తముల్
ఘనతర శౌర్య దుర్గుణ వికాసము చక్కఁగ బండు కొంటుయున్
మునువెనుకల్ మదంబు క్రమముల్ దగ నబ్దమునబ్దమాయితుం
డెనయఁ బ్రకీర్ణ జాతిగల యేనుఁగు మానకఁ బ్రోది సేదినన్.

కం. ధరఁ ద్రింశత్సంవత్సర
పరిమితముల్ దంతవృద్ధి పాటిలు దైర్ఘ్యస్
స్ఫురణం బాయుర్దాయము
పెరుగున్ గజములకునెల్లఁ బేర్మి దలిర్పన్.

చం. వటువన సీమఁ దెల్పఁ దగు భద్రసజాతిగజంబు జూచి వి
స్ఫుటమగు మంతు జంతు వలిపాల్కుపచే మృగదంతిరొప్ప ని
న్నిటఁ దెలిపొందు మిశ్రకరి నిర్మల సంగర సాహస క్రియా
నటనకు దిద్ద విక్రమ గుణంబు భరించు ధురీణమెంతయున్.

కం. కండలు కొత్తరు లుఱలిన
గండడగదు భద్రదంతి గంభీర విదో
ద్దండాఖ్య నొప్పునది వే
దండకులోత్తమము నాల్గు దంతముల దగున్.

వ. కలివేళ భద్రమంద అపూర్వంబులైనను సంకీర్ణంబును దద్గుణ రూప చిహ్నములు మిశ్రంబైయుండుటవలనంగదా సంకీర్ణజాతినా దత్కాలంబున బహుళంబయ్యె మఱియును—

కం. కలుషముల కెల్ల నేమిమి
దళశృంగారమ్ము రణవిధాన జయార్థం
బలము శ్రేయస్కరమగు
నిల గజలక్ష్మి గల విభుని కెదురే! రాజవరున్.

కం. శిరమును బూర్వోత్తరములఁ
జరణద్వయ ముఖ కపోల వక్షువులున్ సు
స్థిరకర్ణ మూల మేఢ్రము
లరయం జెవిక్రింది దిక్కులమ్ము మదమ్ముల్.

కం. శీకర సాగరసిక్తక
ప్రాకటలప మేఘ మధు విభాకుండల గం
ధాక్రమాఖ్యల మదములు
శ్రీకరశర్యంగములఁ బ్రసిద్ధివహించున్.

సీ. శిరమెత్తరము మోము నిబ్బంబు బిగువును
గాలి కంబంబుల మేలికుదురు
కొమ్ముతోరంబును గొమ్ము వదిలంబు
వెన్ను విస్తారంబు కన్ను దెలివి
నిడుఁదతుండమ్మును వెడఁద వాలమ్మును
వలఁ గొనుసుళ్లచే వంతలిదెస
యప్రదక్షిణపు సుళ్లనువగువామభా
గంబును గఠినదంతంబులు వగ

తే.గీ. సమరునది రాజరాజార్హమైనగజము
భద్రమాతంగ మదియు శోభన కరంబు
చతురకరి గల్గుకంటె నైశ్వర్యమెద్ది
మేలిమిగలట్టి ధారుణీ పాలురకును.

వ. శాలిహోత్రగర్గ శ్రీశ్రుత నైషధ, గణ, మానప్రియ, అతికాంత రాజశాఖ్యలంగల శాస్త్రంబులెనిమిదియును గజరోగనిదాన హేతుభావ చికిత్సలు వక్కాణించు నందు జ్వరంబులు గజజాతికిఁ బాకలంబులును దురంగములకు వేధలుననఁదగు నట్టి పాకల దశకంబును ద్వాత్రింశత్పాదరోగంబులును గూలకుక్కుటాది సత్త్వాహనంబులును ద్వాదశ శోథలు, శాల్మలీకదళీ తండులంబులను జతుర్వింశతి నేత్రరోగంబులునుంగలవు గుణచర్య దృష్టకర్మంబుల వలన నే తద్వ్యాధిరోగంబు నెఱింగి తదుచిత చికిత్స లొనర్ప వలయుఁ బాకలంబుల యందసాధ్య బాహుళ్యంబగు నిది గజ లక్షణం బింక నుష్ట్రజాతి భేదంబులెఱింగించెద—

ఆ. వె. ద్విఖురి చక్రవాళి ధృతినొప్పునందున
త్ర్యధిక ధార సతతమమరు మదము
తలచు కేశపంక్తి కుఱుచయా కొండమేటి
బరువుమోచు ద్విఖురి తెలుఁగు నరయ

కం. బటువగు కొరిశల పాదములన్
చటుమదము వసంత వేళఁ బ్రబలఁగ నాల్ నె
ల్లటుఁ దనరు నల్పధారలఁ
జటులగతిన్ జక్రవాళి సరణిఁ దలంపన్.

చం. పశువులకైన రోగముల భంగిరా
యుష్ట్రికులామయమ్ము ల
ద్దశలరు కింశుక ప్రసవదండము
నెల్లుల రక్తముల్ గలిన్
లశునము రాలియుప్పును బలం
బొనఁగూర్చుఁ జికిత్స సేయుచో
విశద వివేకయుక్త్యధిత
విశ్రుత బుద్ధుల సిద్ధ చర్యలన్.

వ. ఇంక నశ్వలక్షణం బెఱింగించెద—

కం. ఆవర్త...వర్ణా
భావ చ్ఛాయాగతి ప్రభావనుగుణ శో
భావహలక్షణ రుగ్ధ్రు
పావళిఁ దెలియంగవలయు నశ్వములందున్!

ఉ. కందము మందముఁ గుదురు గల్గినరొమ్ములు సూక్ష్మకర్ణముల్
కందువలందు మేల్ సుడులు కాయపు నిద్దము ముద్దుమోము నీ
టందపు వాలమున్నత మహాజవముం శిరసెత్తడంబు సొం
పొందు గుణమ్ములుం గలుగు నుజ్జ్వలవాజియె లక్ష్మియున్నఁగన్!

మ. అనిలో గాయముదాఁకి ప్రేవుగమి జీరాడన్ బడిన్ రౌతు నిం
టనిడున్ నైజబలంబు డంబమర వాటంబొప్పఁ దచ్చిహ్నముల్
గన రెచ్చున్ బయనమ్మునం జడియ కేక ప్రక్రియం బొల్చు నెం
దనుమానించదు సత్త్వమాశ్వ గుణమీయందమ్ము లింపొందఁగన్!

కం. అనికిన్ వేటకు వేడుక
కును వాహన మొద్దిరయని గుఱ్ఱము బోల్పన్
జనునే! బహు గజములుగల
మనుజేశుం డశ్వవిభుని మాడ్కిం జనునే!

కం. కలన నెడి జలధిలోపల
నలవగు సైంధవము మందరాద్రిగ నరులన్
గలఁచి మథింపక యూఱక
కలుగునె! జయలక్ష్మి కార్యకలితుల కెందున్!

సీ. విదితమ్ముగా నూట పదిసుళ్లు గలవు
తురంగమంబులకుఁ దత్క్రమము లెన్ని
దగు విధంబులనందు నావర్తమని రొండి
సుడిగతి ముకుళమ్ము సొంగు మల్లె
మొగ్గ చందము జెత్తి మురువున శతపాది
పాదుకార్ధము ఖండభాగరీతి
చిప్పమాడ్కిని శుక్తి యొప్పగు పదభాగ
కొమ్మురూపమున మూకుడు విధమున

తే.గీ. తగు సమూహాయవ విధము దూడనాకుడు
కరణి నిట్టి గుఱుతు గల్గుసుళ్లు
దనరు నిట్టు సుడుల స్థానఫలమ్ములు
బోధములు నెఱుంగఁ దోడరు శుభము!

ఆ.వె. మూఁడు పదులమీఁద మొనయంగ ఋషిసంఖ్య
సుళ్లు శుద్ధములు విశుద్ధశీల
నప్పుకీఁడు సుళ్లు డెబ్బదియారని
నాఁటి కాలములు నిక వరుస వినుము!

కం. శతపాది ముక్తిపాదిక
మితముల రెండంగుళముల మితిఁద్ర్యంగుళ సం
గతి యవవిధి పాదాంగుళ
మితి ముకుళము హూహా యాదనిమిది యంగుళముల్ !

కం. ఆవర్తపాదు శార్ధము
లావాజుల తనువుకొలఁది కనువైయుండున్
రావులు కొలఁదులుదప్పిన
చో విదిత ఫలమ్ములొసఁగ జాడవుసుమ్మీ !

డం. శిరమున నుదుటం బ్రక్కల
నురమున రంధ్రమునఁదగుతిదుపరిస్థాన
స్థిరత దశధ్రువముల నా
సురుచిరముగఁగల్గువాజి శుభములొసంగున్ !

కం. నరనారాయణ గుహయ
ఉరాఉసమరుత్తులు రవిశశిదస్రులునున్
మరుఁడునధిదైవతములు
ర్వ్యరఁ దేజికిఁగలదశధ్రువములకుఁ దురున్ !

మ. సరిమస్తమ్ములు లేనివాజుల కరస్పర్శమ్మునుం జేయ రా
దరయన్ స్థానములందు లేనిచూడ లాయంబెల్ల శూన్యంబుగా
నైరయన్ వర్తిలు రావులంగలుగ నైస్నేముండ్లు వర్ధిల్లు సు
స్థిర సౌఖ్య ప్రదమౌ ధ్రువంబు లెడయన్ శ్రీ పాయు తద్భర్తకున్ !

కం. హీనాధిక్యములైనన్
స్థానమ్మున లేమి ధ్రువలు జనియింపమియున్
హానిం గనుఁగొనదోషం
బానికఁ బది ధ్రువల లేని యశ్వముకొఱయౌ !

సీ. సెలవులయందునఁ జికురంబునైడ నోఁటు
రెండేసి హుర్వ్యడ నుండు మూడు
నొసల నాలుగు సాది నుతి సున్నతంబగు
భాగమ్ములను నుభ్ము పదియు రెండు
కంఠనిగాళముల్ కరయుగమ్మున నాల్గు
కటమాను పదనసంగతుల మతియు
నానిమిది పూర్వోక్తమీ సంఖ్య స్వస్థాన
ముల నున్కి సంపదన్ గలిగి వెలయు

తే.గీ. నొసలను మతిదేవమణియున్న నెరయు శుభము
వరలఁగఁ గంఠాభరణము శోభనములిచ్చు
నివి గలుగు గుల్ఫముల నొక్క నవనిధులు
గళమునఁ శక్తి సుడియున్నఁ గలుగు శుభము !

కం. సకలైశ్వర్యమ్ములు న
త్యకళంకయశమ్ము నిచ్చు నవి గళసీమన్
బ్రకటముగఁ గల్గ మదిన
మ్మకు కంఠాభరణ దేవమణు లెడఁదైనన్ !

కం. గళమునను దేవమణి తగఁ
గల గుఱ్ఱము నెక్కి యుద్ధ కరణిన్ మెఱయన్
వెలయఁగ నదియుండరి వెసఁ
గలిగిన రిపుజయము గాంచు గను సౌఖ్యంబుల్

చం. నెలకుల రెండు సుళ్లు గల సింధుజ మిష్టములిచ్చు రంధ్ర సీ
మల నల మేఘరీతి సుడి మానుగ మేలిమి నాఁదనర్చు న
ట్లలవడు వాజి నెక్కి మణిహేమవిభూషణముల్ ధరించు నూ
బల వృషభాఖ్య సుళ్లనికి పట్టుగఁ గుండల ధారణుండగున్ !

సీ. నాలుగు మూలల నాలుగు సుళ్లాన
నంబునఁ జతురంతికంబనఁ దగు
వక్షస్స్థలమున శ్రీవత్సకి యదిగల
సైంధవంబైశ్వర్య జయములొసఁగు
రిరి మూలల మూఁడు శ్రేతాగ్ని యది ముఖ
మున నున్కి రాజ్యాది ఘనతఁబొసఁగు
నొసలి మూఁడు దొంతరని శ్రేణి రాజ్య ప్రదమ్ము
ప్రాణ్మ్యనమైనఁదనరు సుఖము !

తే. యమళమన రెండు సుళ్లు జయప్రదమ్ము
భుజములనుమూఁడుఁ సుళ్లున్న భూషణములు
గలిగి వర్ధిల్లు లక్షణ గరిమ లెఱిఁగి
మేలిజాతుల నొక్కిన మేలుగలుగు !

వ. మఱియుఁ బ్రసాద చిత్రతోరణ ధను శ్రీ సరసీరుహ వేదిక స్వస్తిక శ్రేతాగ్ని యమళ నిశ్రేణిక చతురంతిక గదా చక్ర కలశ లాంగూల శక్తి ఖర్జూర ఖంకేంద ఖడ్గాయుధ అంకుశధ్వజ రథ అశ్వత్థదళ సూర్య అష్టపద అంజలి పాంచజన్య

భావంబులను ధ్రువములుంగల తురంగంబుల నేలిన నృపతికి శత్రు జయంబును స్వరాజ్య లాభంబును గలుగు నింక దోష మహాదోషములగు నావర్తంబు లెఱింగించెద—

చం. గళమున శంఖదేశమునఁ గన్నుల క్రేవల జంఘ లందుర
స్థ్సలమునఁ గ్రిందుసందులను జానువులన్ గకుదంబునందుఁ బ్రు
ష్ఠ్కలఁగటిదంతవాలముల గల్గిన సుళ్లఁదురంగమంబు ని
చ్చలు నొదవించు రౌతున కసంఖ్యములైన యరిష్టసంతతుల్

తే. కటిమున వెన్ను దెస నాసికాపుటముల
నాభి ప్రాఙ్మధ్యమున వృషణముల జబ్బ
ల రొండ రెండేసి సుళ్లున్న హయముఁ జేరి
యంటి గ్రుంకిడి రవిఁజూచు టర్హమరయ !

కం. ఇవిదోషపు సుళ్లనఁదగు
నవిరళముగ మూఁడు నాల్గు నయ్యెడలన్
వివరమగు సుళ్లు గలిగిన
నవియె మహాదోషసంజ్ఞ లశ్వములకున్

వ. ఇంకను వర్ణ జాతి రోగ నిదాన చికిత్సాక్రమంబు లెఱింగించెద—

కం. నేలం గొరిసెలఁ గొట్టుచు
మేలిమి బంగారుఛాయ మేనున గమలో
త్పల శిరశ్చలనాశ్వము
హాళిన్ ద్విజకులము గత్తెరనఁగలిమెసఁగున్ !

కం. కొంకమున బిగువు జపాకిన్
శుక దాడిమబంధుజీవ సుమరుచియు డిత
ప్రకటిత జడియమి రాట్క్షుల
మకుటిల మది పూజకర్హ మగు లేటి ధరన్ !

తే. శక్రకోదండ పద్మకింజల్క శుక్లవర్ణ
మది వైశ్యకులమగు జాతి దాని
నొక్కనాతఁడు వెలయొల్ల నేలు యతుఁ
డిభుఁడు నాథసమంతుఁడౌ విప్రశతము గ !

కం. హరిమణికోకిల షట్పద
సురుచిర వర్ణములుగలిగి శోభనవేగ
స్ఫురణల్ ధాన్యప్రదమై
కరమొప్పగు శూద్రజాతిగలయశ్వంబుల్ !

ఉ. ముంగళ నీలజంబుగరిమం దగు గర్తభి బోరబొల్ల సా
రంగియుఁ బారి యుత్తరజరక్తియు గండియుఁ బంచభద్రయుల్
బింగళ బిబ్బ జయ్యఁడనఁ బేర్మి విధుం దళిజాతి నాఁగ ధా
త్రిం గల వర్ణసంజ్ఞలను దేజులకుం దగు నామధేయముల్.

తే. పంచకల్యాణియనఁదగు పాదవదన
పాండురంబును కర్ణముల్ వాలవరు
ములు నవియుఁదెల్పు నష్టమంగళి యనఁదగు
నశ్వమగు తేజి బోర నా నతిశయిల్లు.

కం. త్రైజకులము కాచారము
రాజనకుల్ మహాము ధేను రాజికిఁ బాలుల్
బాజికి వేగము ముఖ్యం
బోజల్ వేఱు గుణములు సూహింపంగన్.

ఆ.వె. అల్ప మూల్యలబ్ధ మాజి లబ్ధంబును
బోరలబ్ధమైనచోఁ దురగము
లక్షణమ్ము లివి నిరీక్షింపఁ బనిలేదు
సొంపు మీఱ సంగ్రహింప వలయు.

చం. శనగలు దిన్నచోఁ గయిపు సల్పినచోట జలమ్ము నార్చుచో
ననువుగఁ గింకిణుల్ గళము నందిడుచో నుపచార వృత్తిచో
ఘనముగ నేర్పరెక్కునెడఁ గల్గు హయాళికి సంతసంబు, నా
స్థానమున నుబ్బునుం బలిమి మానిత ధైర్య సమగ్ర వైఖరుల్.

కం. క్షతరోగ లోకబంధన
తతరణ గజభట నినాదతల్ వహ్నిజలా
ద్భుత మృతదశలను సురుధీ
రత లల యశ్వముల ధైర్య రహితం బనరున్.

తే. దురమునకు నేర్పులేమియుఁ గఱచుటయును
గండపుటు నప్పళించినఁ గదలమియును
తఱుటుచేఁ గొట్ట సురశమి తన్నుటయును
గలుగ తుఖ్కుతురంగ మాఖ్యను బొసంగు.

కం. వెల్లుల్లి జయజ వాకుడు
వెల్లగు మిరియాలు శొంఠి పృథుమాగధులు
ద్వల్లీలఁ గూర్చి కవణం
బల్లన నిడ వాతరోగమది మాను తగన్.

కం. నరులకు నాడియు గజముల
కరయఁగఁ దగుగతి విశేష మశ్వమ్ములకున్
బరికింప నేత్ర వర్ణము
లరవగు రోగములఁ దెలియ నివిలక్షణముల్.

ఉ. కన్నులు పద్మ పత్రముల కైవడినుండిన స్వస్థదేహముల్
ఎన్నఁగ నల్పు మించునెడ నెంతయు వాతము దాదియేకురీ
తిన్నెర పల్చనౌ తెలుపు దేఱిన శ్లేష్మముపైఁడి ఛాయదై
యున్నది పైత్యమైది తగ నున్నదియుం దగు మిశ్రరోగమై.

సీ. కన్నీరు బిందువుల్ గా నేత్రముల నుచ్చ-
జ్వరము తత్తద్వర్ణ సంగతముగ
నలుపాకు పసరును [నలి?] హరిద్రాఛాయ
యగు గచ్చకాయ యొప్పందముదగు
తెలుపు ఛాయయును గాజులరుచి ముత్తి
కోజ్జ్వలము శంఖో లూక విలసనంబు
కన్నులఁ గను పట్టియున్న గుత్తంబున
కాయువు నిర్ణయ మరయ వరుస

ఆ.వె. నైనిమదియును ఒవియు నేండ్లు పద్మాఖగు
పదియునేఁడు రెండుపదుల నిరు
దియును మూఁడు నిఌవవియునాలును బది
తొమ్మిదేండ్లు దెలియఁ డిమ్ముగాఁగ.

సీ. గుండు గుత్తములైదు గోడిగ నొక్కటి
ప్రాఙ్ముఖంబున నిల్పి రహినిషోడ
శోపచారమ్ముల నేపునఁ బూజించి
యల్లియుఁ బసపు నయ్యాత్రరేణు
విత్తులు వసయును వేపాకు జీరక
తండుల వ్రీహులత్తతిని మూట
గా గళమునను రక్షాబంధనము సేయ
టుముళ్ల మహాశనవమిని నొనర్ప

తే.గీ. సారపుతు నెల్ల సౌఖ్యమ్ముల ననుభవించు
రోగములఁ బాసి తురగముల్ రూఢిఁ దనరు
మఱియు దశవిధ ధాన్య హోమములు సూర్య
తనయు రేవంతు ప్రార్థనల్ తగవు మిగుల.

శ్లో. నమో దేవాది దేవాయ
తురంగాణాం హితాయచ
సూర్య పుత్రాయ దేవాయ
రేవంతాయ నమోనమః

సీ. రేఁపున బగఁటను మాపొద్దు శస్త్రంబు
కొమ్ము జలూకంబు కాని రుధిరము
నశ్వంబులకు రోగ మడిసి తీయఁగ నర్హ
మదిరొండు పది ద్వాదశాంగుళముల
పాదమునఁ గలరక్త మధరి వెల్వడుటన
శ్వాసములకుఁ గ్రమ మబ్ధిఫేన
గంధమణుల్ నిండు ఘనలిరుచరసమ్ము
లవి తేనెతోఁ గుక్కుటాండ యుక్తిఁ
జెలఁగఁ బిప్పళ్లు మృదువుగా నెలమినూరి
కలిక మిడినంత నక్షిరోగములు మాను
సరవి నెత్తురు దీసి రసమ్ము నిడ్డ
గంతు లడఁగు దురంగమాగణములకును.

కం. రసములకును దంగేడా
కసముఁ గట్టినను మాను సడఁగమి నవిచిం
చిసరగ నువ్వుదిమినచో
పాసఁగల్ లఘు వగుచుఁ బాదములు చెలునలరుల్.

చం. తనువునఁ గంతులున్న విదితంబుగ దోషపు వేఁకి దాఁకినన్
బెనుపగు తిప్పతీగ [illegible] గొలిమర్లు చంచుమా
లనియతి జీరతైలములు లాలితరీతి లవంగయుక్తిమై
పనుపడఁ బాలతోఁ గలయ బాగుగ నూరి యొసంగ మేలగున్.

తే. చల్లనగు మేనుతప్తమున్ జ్వరము నాము
దంపువేళ్లను వట్టివేరు గుంపువేళ్లు
పటిక పాయమ్ము [illegible] పాలుజిక్క
కాచియిడ నశ్వములకుఁ గదలుజ్వరము.

తే. శొంఠిపిప్పలి వసయును జూర్ణముగను
చేసి తొల్తఁ గషాయమత్తు పోసియిడిన
సరగ విడుచును దత్తురగ జ్వరము మఱియు
వరచికిత్సలు విహితంబు తురగములకు.

కం. తనువత్యుష్ణత సంతా
పనిరూఢజ్వరము గళముపట్టఁ గురకుర
ధ్వనులకును దోసకాయయుఁ
బనుపడఁ గొలిమర్లనరఁటి పండ్లిడమాఁకన్.

వ. ఇంక రత్నలక్షణం బెఱింగించెద—

గీ. కెంపు వజ్రంబు ముత్తెంబు సొంపు మరక
తంబు వైడూర్య పుష్యరాగంబు లింద్ర
నీల విద్రుమ గోమేధికాళి దగ న
వగ్రహాధిపరత్ననవక మిలమిని.

సీ. వెలలేని మణి కురువిందము లివి రెండు
భంగులా కురువింద పద్మరాగ
మాంస గంధియుఁ గెంపు మఱియు సౌగంధికం
బనునందు నుదయార్క పటిమ దీప్తి
పద్మరాగము పికప్రకటాక్ష రుచి
కురువిందంబు దాడిమ విరి మెఱుఁగున
కురువింద మతిరక్తతర మాంసఖండంబు
బలె మాంసగంధియు నలుపు నైజము

ఆ.వె. గలుగు నిగ్గు నీలగంధి వీక్షింపఁ గ
లాలులేఁత కోమలములుగాఁగ
ధారిద కెంపునది యశోకకింశుకలోధ్ర
సమవిభాతిఁ దనర నమరు మేలు.

తే. పేర్మి లశునత్రాస భిన్నముల్ పటలంబు
జర్ఝరంబు కర్కశమును నీల
మనఁగ దోష షట్కమగు కెంపుజాతికి
వేయువేల దాటి విస్తరింతు.

కం. పాలువయిఁ జోయఁ గనుపడు
జాలది లశునంబు సిరుల దంబడఁగించున్
వీలన్ బగిలినగతి రే
ఖాలక్ష్యము త్రాసమగుట కలహము సేయున్.

ఆ.వె. తునిఁగి పోయినట్లు తోఁచుట భిన్నంబు
బంధువైర కార్య పరిణతిఁదగు
చిద్రపత్రైన రీతిచేఁ బటలంబది
శోకకారణమ్ము ప్రాకటముగ.

కం. పొరలున్న జర్ఝరంబగు
నెరయఁగఁ గర్కశమునగును నెరి సంకటమై
నెర నైల్యము నీలమ్మగు
పరువడి వెలువకును దిగుడుపాటగు నెందున్.

కం. సున్నయగు మీఁదబిందువు
లున్నన్ జూడంగదోష మొదవుం దానన్
వన్నెదగు పద్మరాగం
బన్నది వెలకెచ్చు సూర్యుఁ డధిపతి మొసఁగున్.

సీ. హిమ మతంగమ్ముల నిలబుట్టు కృతమున
కాశ్మీర కోసల ఘనవిశాల
ములఁ బుట్టు త్రేతను వెలయంగఁ బాండ్యసౌ
రాష్ట్ర భూముల ద్వాపరంబునందు
సింహళ దేశ విదూర భూములయందుఁ
గలికాలమునఁ బుట్టు నెలమివజ్ర
ములు దాఁకటఁ బెట్టి గణన సంబెటను
వేసిన తగ్గకయు విరిసియును బోక

తే.గీ. బెడిసియంతటఁ బడునది విరుదువజ్ర
మదిపురుష రత్నజాతియై యతిశయిల్లు
శుక్రుఁ డధిదైవతముగాన శుభములొసఁగు
ననఘ మగునేని రాజ భూపార్హ మగును.

కం. పుల్ల విరిబాయ ద్విజకుల
మల్లనఁ బల్లవము చాయనగు రాట్కులమున్
పొల్లవుఁ బసిమిన్ [వైశ్యము]
పొల్లన నలుపైనశూద్ర మిత్తెఱంగమరున్.

తే. పరగు సుకృతమ్ము కలిమియుఁ బాపహరణ
విభవములు గల్గు వరుసతో వీటిఁ దాల్ప
నా యుసూలలఁ బదియు రెండైన ధార
లమరుఁ జుల్కనగల వజ్రమది యేమేటి.

సీ. నడుమ నల్లని రేఖ లడరఁగాక పదమ్ము
దాఁచిన వాఁడు నిర్ధనికుఁడగును
చింతచాయలు గల్గ విచ్ఛాయ నిజచాయ
తనియిది మలినమ్ము లీనకోణ
ధారలు లేనిది తగ ముండనంబగు
జరగు దోషములు వజ్రముల నిట్లు
శుద్ధవజ్రము దాల్ప శత్రుఁడు వరమిచ్చు
వినుము త్తెఱులు దశవిధములరయ

తే. జలదజమ్ములు నిర్జరసమితి దాల్చు
మానుతేల యది గురుగింజ భాతి విషహా
రంబునగు కీచకజము తారకముభాతి
దాల్ప శ్రీవశ్యకము శుభదంబునగును.

ఆ.వె. గండుమీలఁ గలది వెండి మల్లియచాయ
లడరు దాల్పనగ్ని యంటదెందు
నిలను జెఱకువలన వెలయు ముత్తెమ్ము శ్రీ
రాజవశ్యకము ధరాతలమున.

కం. కిటిదంత సంభవంబది
చటు భూపార్హమ్ము రేగువంటి గతిఁ దగుఁగా
న్స్ఫుటతామ్రకర్ణి సింగళ
నటరావణ శుక్తి మౌక్తి కావళు లెలమిన్.

ఆ.వె. తామ్రపర్ణిఁ దక్క దక్కిన పరుదుకుం
భినిఁదలంప మఱియుఁ జినుకు లెంత
గొట్టు శుక్తిఁబడిన నట్లన నంతేని
మౌక్తికములు పుట్టు మహితగతిని.

కం. తెంజాయ సింగళమ్మున
రంజిలు బంగారువన్నె రావణమున ని
గ్గుంజను సురాక మాణియు
మంజుల పాణియను ద్రివిధ మౌక్తికజాతుల్.

తే. తనరుఁ ద్ర్యశ్రంబు పార్శ్వకుంఠనము కాక
పాణిస్ఫుట కంబు శుక్తికాస్పర్శనంబు
నరయ నతిరక్త మత్స్యాక్షులనఁగ జా[గ]
ఠంబు ధూమాంకమనఁగ దోషంబు లమరు.

కం. గోమూత్రములోఁ బడనిడ
నామిక దేలినది లెస్సయట మునిఁగినచో
నాముత్తెము కృత్రిమమగు
శ్రమహితముం దాల్ప విధుఁడు నేమము లొసఁగున్.

సీ. పాలపక్షి గఱుత్తు బాగునెమలి పురి
యందము గాజు పెంచెందగురుచి
యలదూర్వముల వన్నె బలు రక్కసపువిరి
సహితదీప్తియుఁ బాలు మానికొమ్మ
చిలుక ఱెక్కల జిగి నలశిరీషప్రసవ
రుచులఁ దెలుపందు మరకతములు
పెంపు లక్షణము లీ సొంపున నన్నియు
బుధుఁడిచ్చు ఫలము లెవ్వఁడును దాల్ప

తే.గీ. దృష్టిదోషమ్ము విషములు దీఱుదాన
వర్ణవిధములు దక్కఁగ నిర్ణయములు
తెలియఁదగు కురువింద జాతికిని బలెను
నీలలక్షణ మెఱిఁగింతు లీలవినుఁడు.

కం. నైరరంగు నింద్రనీలం
బరయఁగ ధర దొరకదెందు నమరపురిఁదగున్
నౌరి ముప్పాతిక రంగునఁ
బోరి నీలము నౌన్న వెదురుఁబూరుచి దనరున్.

సీ. అది మహానీలమా నలిరంగు నీలమ్ము
గులుతు విష్ణుక్రాంతకుసుమ భాతి
నిలఁదాస భిన్నపటల శిలాగర్భ మృ
ద్గర్భ శోణిత బిందుగతులు గలుగు
టలు మహాదోషముల్ మలినంబు విచ్ఛాయ
ముష్టికురంటి నైక్కనిన వాలు
కాస్పర్శనములు నాఁ గలవు సామాన్య దో
షంబులు త్రాసజర్ఝరితముఖ్య

తే. రీతులాకెంపు నొలిఁగిన భాతినొరయ
వలయుఁ బరిశుద్ధ నీలమ్ము నెలమిఁదాల్ప
శని ఫలప్రదుఁడగుచు నిచ్చలునుబ్రోచుఁ
గీడు దొలఁగించి యింతయు వేడుకలర.

కం. గోమూత్ర కాంతి నమరుఁ
గోమేధిక రత్నవరయ గురువిషహరమై
భూమిసుతుఁడు కేతు వెప్పుడు
శ్రీమహిమం దాల్చునట్టి శిష్టులకెల్లన్.

తే. పుష్యరాగమ్ము బంగారు పోలుపువనరు
నదియు వైడూర్యమును దాల్ప నధికశుభము
లిచ్చు రాహువు మిక్కిలి మచ్చికలర
విద్రుమంబునఁ గుజుఁడిచ్చు విభవములను.

కం. అది మణిపంటి ఛాయన్
బదపడి యలచంద్రనిష్ప భాగునఁ దనరున్
విదితము గా నవరత్నము
లదనం దెలియంగ నిట్టివగు గతులమరున్.

వ. అని సకల వ్యవహారంబులకు నాధారంబగు గణిత శాస్త్రం బెఱింగించెద ;
నూతుండు శౌనకాది మునుల కిట్లనియె—

కం. గణితములు పదివిధమ్ములు
ప్రణుత స్థిత్యష్టసంఖ్య పరికర్మములన్
గణుతించి వేఱువేఱుగ
ఫణితిన్ సంక్షేపరీతిఁ బలికెదఁ దెలియన్.

సీ. సంజ్ఞయుఁ బరికర్మ సరణి భిన్నాధికా
రము ప్రకీర్ణమ్ము త్రైరాశికమ్ము
సూత్రంబు క్షేత్ర మచ్చుగ ఖాత గణితంబు
కరణసం స్థితి ఛాయ గడఁగు పదియు
ప్రబలత గుణకార భాగహారమ్ములు
లల వగు వర్గ మూలములు ఘనము
ఘనమూల మమర సంకలిత మువ్యుత్కలితంబు
లను పరికర్మంబు లతిశయిల్లు

ఆ.వె. నందు మొదలిటైన యట్టి సంజ్ఞలయందుఁగ
కొలఁగఁ గూడలేమి యుర్వరగాఁగ
భూమి తాల ధాన్య హేమ తులా క్రమ
ములఁగఁ బల్కెదిపుడు వరుసగాఁగ.

కం. పరమాణు వాది యష్టా
ష్ట రుచిర వారాభివృద్ధిఁ జను నంగుళమై
నెరి నవి జానెడు మూరెం
డరయఁగఁ బదియాఱు జాన లవి దండమగున్.

తే. దండములు వేయి క్రోశమై తనరు నాల్గు
క్రోశములు యోజనము నేల కొలఁత నిడివి
వెడలుపాక కోల గుంటె డాకడఁక నిరువ
దేను గుంటెడు తూమెడు మాన మిట్లు.

కం. నిమిషమ్ములు పదునెనిమిది
యమరంగాఁ గాష్ఠ కాష్ఠలగు కళ త్రిదశ
క్రమమున నవి యాఱొకఘటి
క మఱియు దివసాబ్దముఖ్యగతులగు దానన్.

సీ. ధర నవశతసంఖ్య ధాన్యమ్ము సోలెడు
మానెడౌనవి నాల్గుమానికె లన్ని
కుంచెడు నాలుగు కుంచముల్ తూమెడు
నవి యిరువది పుట్టెడనఁగఁబరగు
నాలుగు వడ్లెత్తు లీలతో నొకగుంజ
యవినాల్గు కూక యొత్తవియు నాల్గు
ధరణమ్ము రెండవి తగ గద్దె గద్దెలు
పదియాఱు గూర్చిన పలము పలము

తే.గీ. లిరువదొక వీసె యవి నూఱు పరగ బారు
వరయ నేకాంగుళాకృతి యంత జలము
లిల వరాయెత్తు షట్పలమ్ములును బాద
భాగమొక గుంజెడిది జలభావ మరయ.

ఉ. వన్నియలెన్న తద్గణన వర్ధనసేయుచుఁ గూర్చియెత్తు న
వ్వన్నెలయట్లు నింతని ధ్రువంబొనరింపుచుఁ దాన వన్నెఁబా
ల్గొన్నను వన్నెయా పయిఁడి కోరి పుటంబిడి నందునన్ బదో
వన్నియ కుందనం బొకటి వన్నియ వెండి విమర్శనస్థితిన్

క. కాసులు నాలుగు వీసము
మాసక నవి పదియు నాలు మహిఁజిన్నె మగున్
పూషిక నేకదశస్థా
నానీకము దశగుణోత్తరాధిక్య మగున్.

వ. ఇవి సంజ్ఞా ప్రకరణమ్ము లయిన యింక సకల పదార్థపరికరంబున వినుండు—

కం. ఏకోత్తర వృద్ధిన్ బది
దాకా లెఖ్ఖలిడి కూడఁ దగు నేఁబది పై
దీకరణి రెంటి లెక్కలఁ
గైకొని యినుమడగునట్టి క్రమ మెఱుఁగుటలన్.

ఉ. పెక్కగు లెక్కలిట్టివియు పేర్మిఁదగన్ గుణితక్రియార్థమై
హెచ్చువ తక్కువల్ సుళువు లిట్లిడ నిట్లగునన్ విధంబులున్
దక్కక నెందు కందు వెసఁదార్కొనఁగా సమతొల్ప రీతు ల
ట్లక్కజమైన రెండపదియూ పరికర్మ మనేకభంగులన్.

శా. కొన్నిన్ బుద్ధిని గొన్నిఁటిన్ గుణకసంగుప్తమ్ములన్ దంత ని
ష్పన్నార్థి గ్రహణాధికారముల నెచ్చన్ గొన్ని మధ్యార్తతన్
గొన్నిన్ సంకలితోక్తి వర్గగతి గీ లెక్కన్నింటినిన్ బ్రశ్నలన్
జెన్నొందన్ వివరించి తేటపఱుపన్ భిన్నాధికారమ్మగున్.

కం. నిర్ణయమునకై తత్త్వ
ద్వర్ణత నొనఁగూర్చి యొండు వైఖరి దానిం
బూర్ణము చేయుట లవియు ప్ర
కీర్ణకమను పరికరంబు కీర్తితమయ్యెన్.

తే. రమణఁ ద్రైరాశికము పంచరాశికమ్ము
సప్తరాశిక మనఁగల సంఖ్యలరూడ
భాగముల నిర్ణయించు శోభనవిధమ్ము
దనరుఁ ద్రైరాశికమ్మునా వినుతికెక్కె.

కం. చిత్రములు భాగవిధములు
పాత్రార్థ వివేకసిద్ధి పటిమయుఁ దగఁ ద
త్సూత్రమునఁ గాక వేత్తాక
సూత్రము వివరింప కుదికి సూత్రంబయ్యెన్.

కం. లీలఁ గొలయఁ జుట్టుకట్టుల
చేతన్ గుంటలు ఘటింప క్షేత్రగణితమా
ఖాతపు మట్టున్ వివివియు
జ్ఞాతిన్నివరింప ఖాతసంజ్ఞ దనర్చున్

ఉ. చుట్టును గొల్చు కోలలవి చూచుక పాతికపాలు గూర్చియా
దిట్టమె గుంట తెన్నఁదగు తేకువతో వలయింపఁ జేలకున్
పట్టుక తక్కువాటికినిఁ బట్టి ప్రతిక్రమ సంఖ్య లర్థమా
గుట్టుగఁ గోల యిన్నడియె గుంట చతుర్గుణ మన్నికందగున్.

సీ. వారకు వార యేర్పఱచు లోతు వెడల్పు
నిండు మట్టైనచో నిండుగుంట
యరయఁ బాతిక పుట్టుతెనసట్లగు సంఖ్య
నిడివి వెడల్పును నిండలేక
నటరైనచోనది... నిండు మట్టి
పాతికకుంటయై పరిధ విల్లు
త్రవ్విన మట్టియంతయుఁ బోడవు వెడల్పు
కొలగని గుంటల కొలఁది దెలియ

తే.గీ. వలయు పనికి నటులఁ గొలఁత వెంబడిమట్టు
క్రమత భుంజ కమ్ములమరఁ జేసి
పరకపాలు పెంచి పాటించి కూడినఁ
గణన సమము వచ్చు గణికులకును

కం. ఛాయాప్రమాణ గణనన్
బాయక లెక్కించి బింబపటునిర్ణయమున్
జేయుటలవి యెన్నంగా
ఛాయాపరికర్మమనఁగ సభల న్వలయున్

వ. గుణక క్రమంబు దశమపరికర్మంబగు నది యెనిమిది తెఱంగుల గుణకార భాగహార వర్గ మూలఘన ఘనమూల సంకలితవ్యుత్కలితంబులను దత్తదుచిత కృత్యంబులకు పాత్ర మగు నేక దశ శత సహస్ర దశసహస్రలక్ష దశలక్ష కోటి దశకోటి శతకోటి అర్బుద న్యర్బుద ఖర్వ మహాఖర్వ పద్మ మహాపద్మ క్షోణి మహాక్షోణి శంఖ మహాశంఖ క్షితి మహాక్షితి భూరి మహాభూరి అంత్య అతర్క్య అప్రమేయ సముద్ర సాగరా నంతంబులను ద్వాత్రింశత్స్థానంబుల నమరె నిది గణిత ప్రకరణంబిక పశుచికిత్సాక్రమం బెఱింగించెద.

చం. కమలభవుండు మున్ సురభి క్రమసుధారస మాదరంబుతో
నమరుల కిచ్చి భూప్రజకు హవ్యము గవ్యము చేకుఱన్ దయా
క్రమమున ధేను సంతతులఁగల్గఁగఁ జేసెఁ దదీయరక్షణ
త్వము లతి ధర్మ మెవ్వరికి ధాత్రిఁ బవిత్ర చరిత్ర సంపదన్.

కం. విహితంబుగ ధన్వంతరి
సహదేవుఁడు దచ్చికిత్స శాస్త్రోక్తత స
న్నిహిత మొనర్చిరి జగతిన్
వహిఁ దద్విధ మిపుడు వినుఁడు వైఖరి నెరయన్.

ఆ.వె. నెమరు బెట్టదార్పు నీరు విడుచు మేఁత
బట్ట దప్పుడపుడు బడు ధరిత్రి
పశుఁకు ముకు జెమర్చు వడిఁదొమ్మ దాఁకినఁ
బసికిఁ దచ్చికిత్స బరగ వినుఁడు.

కం. త్రికటుకమున్ త్రిఫలమ్మును
నొక మానెడు చింతపండును నొగి మహిషపయః
ప్రకటరసమ్మున గొట్టెడు
సుకరిత నిడఁ దొమ్మ తెవులు సురుగున్ బసికిన్.

తే. ఎలుఁగునెత్తురు కరదూప మొలమి పంది
పాడియుఁ గల్లుప్ప నల్లని పడువు మేక
పంచితమ్మున నిడఁ దీరు పసిఁడి కొట్టు
గంజియున్ గాఁకనీళ్లిడఁగా వలయును.

సీ. ఒరిమొమ్ము సంధిమపలి ? త్రొమ్ము ముక్కునై
తోఁక క్రిందటఁ బాఁడ దొమ్మదిరుగు
నెరిడిదాఁకిన మేపు నీళ్లు నొల్లదు క్రుక్కుఁ
గొమ్ము లడ్డము పడు నిమ్ముగాఁగ
కొట్టు చూర్ణము పరి గూర్చిన కరదూప
మది నూనెతో నస్యమమరఁ జేసి
వెదురు టాకురసమ్ము వెసనిడ నది తీరు
పసపు గోతావాలు పొసఁగ బొడలు.

తే. సముఖులుగఁ గూర్చి యేకొదరునమరఁ గలినఁ
గలయఁ గరదూపమున్ గింశుక ప్రసవము
లైన సున్నంబులైన పొంపుఱనిడినఁ
దిరిసె పుంబట్టయాకాలు నెరయ నుల్లి
రసముతోనైన నిడఁ దీఱు నెసఁగు పరిది.

ఆ.వె. ఎలుగు గొత్తురైన గొలిమి పొందుగు బుర్వ్వ
రైనఁ గలిఁ బొసంగు పూని మూఁడు
తవ్వలన్ని నాళ్లఁ దగఁ బసుపులకిడఁ
బేరులేని రుజలు తీఱు వేగ.

కం. నల్లఁ బడి రొంటుపుమానిన
నల్లదెబ్బలు కింశుంబున న మజ్జిగయున్
దెల్లమిఁ గలిపిడఁ దీఱున్
మొల్లమి దిరిశమ్ము మనుజ మూత్రము నటులన్.

ఆ.వె. అర్ధరసము వేము నా వాలు నల్లేరు
వేము నేలవేము వెలయ తిలలు
గుమ్మడిఫలమునను గూర్చిన నానల్ల
తెవులు మాని పసులు తేఱి బలియు

కం. అఱుఁగడపుఁ బసికి వెల్లు
ల్లరయఁగ నావాలు నుప్పునట మజ్జిగతో
నల్లన నొక పట్టంబిడ
నల్లన నదిమాని పసరమనువుగ బ్రదుకున్

కం. వలికుట్టుల కుంజెలిమిడి గలయ
సమూలమ్ము నీళ్లఁ గ్రాఁచి కలియున
ట్లల వరిచి కాలి కెత్తిన వలిదొలఁగఁగ
బసుపు దొంటి వైఖరి నడచున్

ఆ.వె. ఎద్దు కట్టుపట్టు తెలిమిముక్కున డొక్క
కెఱఁగి నడుము చూఁడఁ బరిహరముగు
నౌషధమ్ము విడుచునగ్ని వైద్యమ్మున
సకులుననుజూఁ దలఁపనుకర మగును.

కం. కొఱనేలసీనిన పసికిఁ
దుటిమిడియున్ వెదురుటాకు దొడ్డొత్తమే పన్
నెఱచేపు నీన లేనెడ
మొరవడిగా వెదురుటాకు మేఁపిన నీనున్.

ఆ.వె. దూడఁ గుడుపనీక తోడిఁ గట్టనీయని
జాడ నల్లఁదీగె దూడ మేనఁ
బూసి నాకనీయ వాని సాకై పశ్వఁ
గుడుపఁగట్టనిచ్చుఁ గొమరు మిగుల.

కం. వెలిదిబియ్యంబును గంజియు
పులకండము నెయ్యి పాలు పాలుపుగఁ దోడల్
గలయంబూయఁగఁ దొలిదూ
లలవడఁగాఁ జేపు వ్యాధులన్నియు మానున్.

తే. నచ్చుదని నెత్తురొరలఁగ నొచ్చుఁ బసికి
బచ్చిబియ్యంబు కలిబూర్గు బంకరొస్స
దీర్ఘకేసర మనునట్టి తెళ్ళులుదవుల
వాత లిడఁ దగు నాయంబు వరుసరొత్తిఁగి.

కం. పారిఁజారి నెత్తురుగారిన
నరుదారఁగఁ దమిదె పిండి యంఁబిడఁదగున్
ధర నబికిరికాఁ బైనన్
గరిమన్ గల్లుప్పు కింశుకము-కలివలయున్.

ఆ.వె. మాడనొల్లనిదానికిఁ వేడుకలరఁ
నెన్ను నల్లేరు వెల్లుల్లి నెనయ వసయు
మిరియమున్ ద్రాక్షమును నిడమేక్షిదయనుఁ
వత్సముసకిచ్చు పాలునవ్వారిగాఁగ.

కం. నెరివెక్కుఁ దెళ్ళులునకుఁ గలి
మురువుగ భల్లాతకమును

కం.

పుడమిన్ బ్రహ్లాదమతము పూనిక నితులన్.

సీ. పుష్పాకు వసయును ములుచల్లతోనిడ
మావి చిన్నది చేపు మానితముగ
రసాదిరసేము పట్టురసమున మిరియాలు
మర్దించి మేదించి మూరు జెవినఁ
బోసినఁ గంటిలోఁ బూళ్ళు మానునిజంబుఁ
దొండాకు పసరున దొడవి రేఁచు
మిరియంపు గింజలు మేదించి కంటిలో
నిడఁబూళ్ళుమాని సొంపడరఁ బ్రబలు

తే. నెలమిఁ గల్లుప్పు శొంటి కాయలును జీల
కర ము గంధిలతోడను గలయఁ బోయ
మందగై కాను నెయ్యి గోధుమ యవాగు
పోసినఁ జేవచేఁగడు పొల్చుఁ బశులు.

కం. పల్లేరుఁ గొలిమర్లుఁ
వెల్లుల్లియు జీడిగింజ విను బెండుగఁపూ
వల్ల మారేడి జిరకర
మల్లనఁ గలి నిడిన సాధువగు దుష్టెందుఁ.

కం. ఇలఁ దగిరికయు సమూలము
గలయఁగఁ గల్లుప్పు జీలకర సమములుగాఁ
బల కండముతోఁ బెట్టినఁ
నలవడ గానైపుడు గొడ్డు టాపుఁ జేపుఁ.

సీ. పొసఁగఁ బావరకంటి రసమును బచ్చిపా
లిడఁ జాలునిల్చు నెంతేనిగొడ్డు
టావులకైనఁ దోడోత్తవస మేకల
నెయ్యి వెట్టిన నైన నిలుచుఁ జాలు
పొడుచువాటికిఁ గంటునిడఁదగునూనె రా
న్నాళ్లి సాధువై వనిచియుండు
... గుండె చివురుకు నొగఁ గుంటుదానికి
మిరియపు గింజలు నిరువదొకటి

తే. చేరి లిప్పాకు రసముతో నూరి తెవినిఁ
బిండినంతన కుంటులు పెర్మిఁదేలు
కసవునందికి దిగదీసి మొసఁగఁ జేయ
దృష్టితాఁకుట పశులకుఁదీఱిపోవు.

చం. దిరిసెము వేము బారిజము తేకువ తక్కెళ సింధువారముల్
నెరవసరుల్ సమంబుబుగ నేయియు నూనియ యాముదంబు న
ట్లురయిక పొంగనీక కమలాగ్నిని నైల మొనర్చి పోసినన్
ధరఁ బశుజాతి వాయువులు దార్కొను బాధలు మాయు నన్ని

కం. కందరసము పులిచల్లయుఁ
గందువతోఁ ద్రివిధ......గంటిని బోయన్
పొంది నముల్ వనులోఁ జెలుఁ
వందన్ బైలుఁటికి పతువు లల్లనఁ బ్రబలున్.

ఆ.వె. పేర్మి మావి పడమిఁ బేలాలపిండి పు
ప్వాకు రసము గూర్చి యనపకట్టు
తోడఁ ద్రిదినమిడిన వీడి మావిలఁబడు
నటులఁ గామి కరగిరైనఁ బడును.

ఆ.వె. పరగుమేడి చెక్క భారంగి పత్రాకు
పసుపు టల్ల నూనెపాసఁగఁగూర్చి
పొలుచుఁ ద్రిదినగణన పువ్వాకు కట్టిడ
మాని యిపురుగండె మహినిఁబడును.

సీ. కను గ్రుడ్లు గ్రుంగితోఁక న్వ్రాండ్రులు పడి
చిక్కగువ్వ తెగులు చెందుపసికి
కల్లుప్పు నావాలు నల్లంబు కలుబంద
పలుకులు సమముగాఁ గలయఁ గ్రుమ్మ
పులిచల్ల కడవలోఁ బోసి జామొకటార
నిచ్చి త్రావఁగఁ బెట్టియిడిసినట్టి
తోఁక ఖండింపుచుఁ గాకనూనియునద్ది
నంతమాత్ర[నె తెవు?] లణఁగిపోవు

తే. పొసఁగ వెంపలి మూలంపు రసముఁ నశ్వ
మమరఁ జేసిన దగ్గుతుమ్మపుడు మాను
నేలవేము నడ్డ సరము లీలఁ గలియు
విడిన దగ్గులు తుమ్ములు కడఁక నణఁగు

కం. కలితో పొదుగ పుష్పం
గలయఁగఁ దిలపుష్పమిడినఁ గదలున్ దగ్గుల్
అల గుండె పగులు దీననె
తొలగు పసులకున్ జికిత్సతో డో జేయన్.

ఆ. గోరుపండ్ల రసము గోక్షీరమును నిడి
దూడమేనఁ బూయదూడ గొనును
కొమరుటీవె గడ్డ కూర్చుక తలవిరి
యాడు నూరియిడిన నవియు నటుల.

ఆ.వె. తెలిమిరాకు నూరి తేలియఁ గల్లుప్పును
గలయఁ బూయ దూడ గజ్జిమాను
పరగ గంజరాకు పసరట్టి గుణమిచ్చు
నొడలు గడుగ వలయు నొదవి పిదప.

ఆ.వె. ఒప్పు పచ్చ కంద ముమ్మెత్త విత్తులు
జుట్టు పాకురసము సొరిది నతుల
పాలతొమ్మి చిన్ని పసికిఁ బ్రక్కలు చూడి
కలి పలాశకుసుమకలిత మిడుడు

కం. తెలఁది విరుపారు లేగకు
నలవడ మావేరు నూనె నద్ది తిన నిడన్
వలయు బ్రతి యాకు చిక్కలి
కలుపున్ గొట్టిడఁ గడుపు గట్టున్ వేగన్.

కం. పాలుగుడిచి కడుపారెడు
నాలేగకు మహిషదధియునటు వంజాకున్
లీలనిడ గట్టు గంజా
కాలిలన్ బెట్టఁ బాలుగలుగున్ బెలుచన్.

కం. తంగేడు కొనలున్ దధియుఁ
బొసఁగ నిడ నజీర్ణ మణఁగు పురటిం బెన్నే
రుంగడ్డయు గంజాయా
కుం గూర్చక నిడ నజీర్ణగుణములు మానున్.

తే. పరగ జొన్నలు వేపాకు బ్రత్తి గింజ
లుప్పు నిప్పుల నీఘామ మొనర వీథిఁ
జల్లినంతన దృష్టిదోషములు దొలఁగు
మఱియు నిప్పులు జడిసిన నెరయుమేలు.

కం. ఈనంగలేని పసికిన్
బూనిక గురిగింజవేళ్ళు పుల్లని కలితో
నూనె యిడి పొత్తికడుపున
మానక లేపనము సేయ మక్కువ నీనున్.

కం. సంగలి కుత్తుకవాపు
య్యాంగిటముల్ దీఱు కంఠమనువుగఁ గూడన్
పొంగు ముకుబంతి తలకై
క్కంగా మత్స్యంబు నాళిఁ గలనస్య మగున్

సీ. మిరియంపుఁ బొడిజుట్టు పురిడంబు నిడవాత
ములు దీఱుఁ బసులకుఁ దల యొరిసిన
తలతిండి యాశృంగములఁ బుట్టు రోగంబు
తలవిసరుక్ బాధవాలక దొలఁగు
నావాలు చవిలెత్తు వెల్లుల్లి శొంఠియు
గాలిమిడి పసరుతోఁ గూర్చి చెవుల
ముక్కున నిడఁ గర్ణముల నిల్వఁగట్టిన
శృంగ రోగంబు లణంగి పోవు.

ఆ.వె. కాళ్లు పీపురాక కదలమి యాడుప
పచ్చిపాలు రావి పట్ట మిరెము
కూర్చి నాల్గు నాళ్లు గొట్టైడు పెట్టిన
రోగమణఁగి పసికి రూఢి మెఱయు.

చం. పదములు నాల్గుతుంటు లిఁపైఁ బడునట్లుగ నోరగిల్లు మే
పొదవక చిక్కి నాకురమ కోపక జుట్టును తేగ కుత్తుకన్
దుదిఁ గరశల్యముక్ దెలివితోడుత [గూడ?] శరీరమెల్ల నొ
ప్పిదపుఁ గరీష భస్మమటఁ బేర్మిగ నించినఁ దీఱునయ్యెడన్.

ఆ.వె. ఆవటపుఁ దీగతోఁ జెప్పుకట్టయైన
కంఠమునఁ గట్టి పిడకలఁ గల్పినట్టి
బూది మెయినిండఁ జమరినఁ బోవు కురుము
జాలు కుంటెడు పసులకు లీలతోడ.

కం. జిల్లేడు కొనలు ముక్కల
నల్లల్లనఁ జొనిపి తీసినంతన తీఱున్
తెల్లమిగ మెత్తగాల్ దురు
వెల్లనఁ జక్కరయుఁ గరగఁ బేర్మిన్ దనరున్.

తే. క్రొత్త సున్నంబుతోడి కా గూర్చి మెదిచి
గిరుక నిడుక గలంచిన మెఱయుఁ గాళ్ల
కడుపు శూలకుఁ బసి ముందుకాళ్ల క్రింద
దొడరి ముసలమ్ము నలుమారు దూరవేయ.

సీ. చంటి కుంటుకువెక్క చరణము గొరిజ
విడఁగఁగ గొట్టి నీళ్ళనిడఁగఁ దొలఁగు
దివసమా కుంటుకు దెస నేడు క్రేల్ దూఁటు
కాదేని నర్క దుగ్ధములు నించు

డెన్నలఁ గడుపుబ్బు నిల్ప్రాత దంతము బూ
దియనీళ్ల ద్రావించి దృష్టి నిడుఁడు
మతి యుబ్బ లిడి మందిమలము నీళ్లిడఁదీయు
నిరు వాయిగట్టి నీపిరి వెడలమి

తే. కలియు గురుగింజ పసరుతోఁ జులుక నగును
దురియ కిచ్చినఁ బ్రేవులు దునియఁబారు
చేరివానికిఁ దంగేడు చిగురునూరి
చల్లతో నిడ నవిమాను సరసముగను.

కం. బారిజ పాకును మిరియము
నీరధి లవణమ్ము నూరి నెరి నిడినఁ బ్రాం
పాయత్తరేణి వెల్లు
ల్లారపి నిడ వ్రణము లెల్ల నడఁగుఁ బసికిన్.

తే. ఉత్తరేణాకు వెల్లుల్లి యుప్పు మిరెము
నూరియిడఁ బుర్వు చచ్చివే యారు వ్రణము
కాకి యూగయుఁ దజ్జిహ్వ దాఁకనీక
పదిల మొనరించిరేనియు వ్రణము లణఁగు.

ఆ.వె. పులుగు రాళ్లకాల్చి పరగఁ జూఁడినఁ గంతి
పగిలి మిగులఁ బలుచఁబాఱి యణఁగు
కడఁక నట్టి వృశ్చికమునకు గచ్ఛపా
దయును మిరెము కలిక మయినఁదీయు.

ఆ.వె. కడఁగి రేలకాయగంధమ్ము కలియిడఁ
బురువు కాటుదేరు పురువులంటు
నెండ వానకోర్వ దిట్టట్టు పసు భార
మోర్వదార్పదట్టి మొదవుఁ బసికి.

కం. ఆవిసము లెల్లఁ దీఱుం
బావనమగు నడ్డ సరవుఁ బస్సరుసు మిరియం
బారునెయి కొంతి పసపుం
బావకపక్వముగ వేఁడువల నిడి నంతన్.

వ. అనిన విని కౌతూహలాయత్త చిత్తులై శౌనకాదు లత్త పౌరాణికశేఖరుండగు రోమహర్షణి నిరీక్షించి స్వప్నలక్షణం బెఱింగింపు మనిన నతండు—

సీ. పంచీకృతంబైనఁ బాంచభౌతికమగు
స్థూల గాత్రమ్మున లీలసాత్త్వి
కంబు జాగ్రదవస్థఁ గలుగు షోడశవికా
రముల లింగశరీర మమర రాజ
సాహంకృతియు స్వప్నమగు కారణాఖ్య మ
దమముచే స్వాపమా క్రమముతోడ
విశ్వతైజసులన వెలయుఁ బ్రాజ్ఞుండన
నాత్మలొప్పగు నిట్టిదగు నవస్థ

తే.గీ. అను ప్రమాణమ్ములను సూక్ష్మతనువు కాయ
దనఘ పరమాత్ముఁడుఁ జెందునంత దనుక
కారణ శరీర మెడయగు కలయఁ బోలయుఁ
గానఁ జిత్సుఖ మాస్వాపగతిఁ బొసంగు.

తే. స్వప్న మింద్రియ దశక హృత్పంయుతైక
ప్రాణ పంచక పర్య ప్రపంచకమగు
కంఠ హృన్నాభి గుదములఁ గదలు వాయు
దానముఖ్య చతుష్కమౌ ప్రాణగతులు.

కం. వ్యానుఁడు సర్వశరీర
స్థానవ్యాపకుఁడు గాన సకలేంద్రియముల్
వాని వెనువెంట నెందున్
గానన్ దలఁచినవి విన్న కన్నవవెల్లన్.

చం. కనుపడినట్లు సూక్ష్మతను కారణమై కనుపట్టి నట్టివిన్
వినుఁడవి రాజస ప్రకృతి వింతగఁ జైత్య గుణోల్బణమ్మునన్
గనునవి పుష్యమాసమునఁ గల్గు ననేకవిధంబు లట్టివిన్
దినములుగా కలల్ గలవు దీని నెఱుంగఁదగున్ ఫలోన్నతిన్.

ఆ.వె. కొంకు పలుకునతఁడు పొసఁగఁ గన్గొనుకల
రోగజన్య మదియు రూఢికెక్క
దందు వరుస నాలుగగు జాల యందష్ట
షట్త్రిమాస ఫలద శాస్త్రి మరయ.

కం. పనుల విధుడనైడఁ గనుకల
పొసఁగన్ నాత్రైదునాళ్ల బూనిక ఫలద
వ్యసనము సర్పము కుడిభుజ
మొసఁగఁ గఱవఁ గనిన శుభము లెంతయుఁ గల్గున్.

సీ. హస్త్యశ్వరథడోలి కాందోళికలువెన్క
నడచుఁగాఁ బ్రభువులు గడలుదేలు
రక్తధార లమేయరత్నములుఁ బసుగణ
బ్రాహ్మణులఁ గన్నఁ బరమశుభము
జలగ పామును దేలు నెలమినంటుఁగఁగన్న
భార్య ప్రియంబాడ బావిఁబడఁగఁ
గన్నెలఁ జూడఁగ ఘనసౌధ గిరులపై
జనులఁ గూడుండఁగ జలధిదరిని

తే. నుండఁగాఁ గలఁ గన్న వేలోకరిదాస్య
మమరునట్టుగ వ్రణగాత్రు నధికహర్మ్య
ధన కనక శ్రేష్ఠవనములఁ గనుటలెస్స
శయ్యనుండంగఁ గలఁ గన్న సౌఖ్య మొదవు.

చ. లకుముకి కోడి క్రౌంచ మొకలావుక గన్గొన నన్ని పిల్వఁగాఁ
ప్రకటిత వాహనస్థితులఁ బాడుగృహమ్ములలో సుఖాసన
ప్రకరములన్ వసించు స్ఫుటపంకజపాండుర వస్త్రువున్ గనన్
ముకర విభాలియున్ శుభము శోభనమున్ గలుగున్ గ్రమంబునన్.

కం. నీలాంబర సుమభూషణ
జాలాన్విత సతులఁ గనిన సరితాఁదాల్పన్
లీలన్ సూర్యుఁడు చంద్రుఁడు
బోలన్ గలఁగనిన రోగపుంజము లాదవున్.

ఆ.వె. కొమ్ములున్న మృగకులమ్మునఁ బలుకోఁతి
నట సివంగి నెగయునట్టి పక్షి
నంత్య దుష్టజనుల నంబు వర్షము జల
మింకఁగనెడు కలల నెసఁగు కీఁడు.

ఆ.వె. నలుగు బెట్టఁగనిన నల్లనై తెల్లని
వస్త్ర చయములున్న వడువుగనిన
రక్తపుష్ప గంధరాజిఁ గన్గొనఁ గీఁడు
కనని వినని కాంతఁ గవయ గ్రహము.

సీ. కొండి ముక్కిడి పాండ్ర దండహస్తులఁ
బాశఖడ్గ సంభృతుల వికారతనుల
చెట్టు గొట్టగనెంచు చెట్టువెన్నయు నెయ్యి
తిరుగు తైలాంగుల ఖర ముఖగత

కాక గృధ్రమ్ములఁ గాష్ఠ పంకమ్ముల
దుర్లక్షణమ్ములలోన వెలఁగఁ
దానంబు నేయంగఁ దైలాంగుఁ డగుటయు
హోమకుండము తేరు భూమిమిట్టు

తే. పుట్ట సౌధంబు నొంటిగాఁ బొల్చియెక్క
క్రొత్త పోఁక ధరింపఁగఁ గోరియొకరు
వలువలును బిల్వఁ దానవ్వఁ గలఁగనిన
శోక భయపీడ చింతనా నీకవొదవు.

కం. పచ్చని కోకలు సొమ్ములు
నచ్చఁగఁగల చెలులఁ గనిన నదిసంపద తా
నిచ్చలు వృతి [గతు?] కుణపము
నెచ్చఁగఁ గనుగొనుటఁ గల్గు నెంతయు శుభముల్.

తే. అన్నముల్ భక్ష్యములు దీని నట్టులారుతు
తినఁగఁ గనినట్లు సైరి భోష్ట్రి నవ గార్ద
భయుత రథమెక్కినట్లుఁగ బాత్రనీళ్ల
ముంచఁ జేరఁగఁగల గన్న మొనయుఁగీఁడు.

కం. ఘననిధి పొంగుచు నింకఁగఁ
గనుకల నాశంబు బంధుగణ నాశముగల్
ఘననృత్త గీత వాద్యము
విను నూతనభాండ తామ్రమవీక్షలు కీఁడుల్.

చే. తొండలన్ గూరమల్లెను బండుటాకు
పాలపుటియుఁ గాకి గన్నట్టు చెట్టు
ఘృతము పరమాన్న భోజనోద్వృత్తి పొగయు
బీడునేలను గలం గనఁ గీఁడులొదవు.

సీ. సంకెళ్ల బంధన సంతాప మొనఁగూర్చు
కోరి ముత్తెముగన్న కొడుకు గలుగు
మశక మత్కుణముల మత్స్య మాంసమ్ములఁ
గలఁగన్న సంపదల్ గలిగి వెలయు
మంచివారలఁ జూడ మంచిది చేకుఱు
మంటఁ గన్గొన శుభ మహిమఁ దనరు
నమితపాద ముఖాదయవ దేవతలఁ గన్న
దేవతార్చనలు తప్పక గనుట

తే. కాల సుఖములు నారోగ్య ఖేలలందవు
నిట్టి స్వప్న ఫలమ్ముల నింగితమతి
వెలయ జనులు శుభా శుభకలిత గతులు
తెలియ నిహపర సౌఖ్యముల్ గలుగు నెలమి.

వ. ఇట్టి స్వప్న లక్షణమ్ములు రోగనిదానమ్ములు నెఱింగి నిశ్చింతాగదంకారులు సాధ్యా సాధ్యాంశ నిర్ణయులై దేశకాల ప్రకృతి విశేషమ్ములు దెలిసి ఋజు మార్గంబునఁ బ్రతిక్రియం బూనవలయు నింక శిల్పశాస్త్రం బెఱింగించెద—

కం. హరిహర మందిర రథస
త్వరవిగ్రహ చిత్రకర్మ వాసవిధంబుల్
ధరగృహ గోపుర నిర్ణయ
సరణిన్ వివరించు శిల్పశాస్త్రము వెలయన్.

చం. వరుసగ నొక్కటాది పదిపాల్తుద తాళ విసంజ్ఞ మూర్తవి
స్తరతను మానభేదక విధానము సింహతలాట భూతి ధీ
కరతల సాలభంజి పృథుక ద్విర దానన యక్షమర్త్యులన్
సురగిరి జాకృతుల్ మురహ కాలి విధాత్ర శుభాంగ భాగముల్.

సీ. ఇట్టి యంశముల యందేకభాగ శిరము
నవలి భాగములు కాయంబుగాఁగ
దారు ద్రుమ మూర్వ చిత్రముల నేతద్విధ
జాతి రూపము లొప్పు ఖ్యాతి దేవ
తాకృతులకు మితిగైకొని యిది మూట
యిరువదినాల్గు పాళ్లసఁగ నందు
నుష్ణిష మకుటమ్ము లొనర షడ్భాగమ్ము
లగురెండు కేశనేత్రాంతరమ్ము

ఆ.వె. ముక్కు తలయు హనువు నిక్కుచ యట్లన
యందునుండి చుబుక మూఁడు పాళ్ళ
చానగళము సగము దగనాల్గు పాళ్లు వ
క్షంబు ద్వాదశాంశ సరణి నాభి.

ఆ.వె. నాభిదిగువ మేహనం బూరుపర్యంత
మమరునట్టి యంశలలరు తాళ
కాంశ జానులొప్పు నటియుగాంశము జంఘ
లడుగు లొనరు వలన నాలుపాళ్లు.

కం. పాదాంగుష్ఠము పార్ష్ణియును
మోదత సప్తదశభాగములందగు పాదం
బాదిగ భాంశంబుల నొగి
పైదగు కూర్పరము బాహు లవి శాస్త్రోక్తిన్.

తే. అమర మణికట్టు దనుక నంద్రైదుపాళ్లు
నదము 8 నాపాళ్లుదగు ప్రకోష్ఠమున మిగుల
నలరు మధ్యాంగుళా గ్రాంశ లనటు నాల్గు
వెడల్పు పఱచేత మూఁడుపాళ్లడరవలయు.

సీ. పండ్రెండు తొమ్మిదిపాళ్లు గ్రీవాగ్రంబు
గ్రీవమూలము వెడల్పా విధమున
బాహ్వాది మూర్ణ్ణిపాఁ తదగ్రంబు
రెండు నాలుగునైదు రీతి ప్రక్క
లటు తొమ్మ్యసార్ధ వేదాంశము వెడలుపు
నా క్రిందఁ ద్రితిద్వయాంశకమ్ము
నడుము ద్వయాష్టాంశ మడరునంగంబుల
నిడివిని తగు వెడల్పిడుటు చితము

ఆ.వె. స్త్రీ ప్రతిమల కిట్టి స్థితిని ముప్పాతిక
పాలు పరక కొదవఁ బాడిగాఁగ
సేయు టొప్పు నిట్లు చెలువున దేవత
తత్స్వరూప యుక్తిఁ దరల దెపుడు.

ఆ.వె. తనరు వలయునంత ధరనాల్గు దిక్కులు
సమముగాఁగఁ గొలిచి యమరదాని
ద్వ్యష్ట కోష్ఠములుగ నంశమ్ము లొనరించి
నడిమి నాల్గు బ్రహ్మ కిడి క్రమమున.

సీ. ఉన్న పండ్రెండు పాళ్లొప్ప రాసు లొనర్చి
తనరాశి నైనను దానఁ జేసి
యైన వర్గువునైన నథవదిశాదిగాఁ
దనదిక్కు వైరంబు తలఁగ కునికి
యలవడ సింహధ్వ జాలయ గుణముల
వాస్తుని గావించి శస్తమహిమ
గ్భాగ సమము హస్తమ్మునఁ గొల్చిద్వా
రము లుంచఁగాఁ దగు రమ్యముగను

ఆ.వె. భాద్రపదము మొదలు ప్రాగాది మూఁడేసి
నెలలు వాస్తు పురుషుఁ డలరునాల్గు
దిశల నతని శిరణ దిశ సూర్యుఁడుండుట
లెఱిఁగి విడిచి వాస్తు విడఁగ వలయు.

కం. గృహమునకు వలయు ధారుణి
వహి నిర్వ దెనిమిది పాళ్ల వాస్తు పురుషుఁడా
రహిఁ బదునొండూర్ధ్వాంగము
విహితతఁ బదియారు క్రింద వీటికి నడుమన్.

తే. వీక భాగమ్ము విడివియా తెలిఁగి యచట
శంఖు స్థాపింపఁ దొలఁగును జంద్రజీవు
లున్న రాసులునవి నిల్పుటొప్పు మిగుల
వాస్తు పురుషుని నెఱుఁగఁగ వలయునిల్లు.

ఆ.వె. బుధునిరాశి వాసపోసి శుక్రునిరాశి
కప్పుగప్పెనేనిఁ గలుగుశుభము
స్తంభమునకు ధరణిఁ ద్రవ్వుచో నుముకయుఁ
గేశచయముచూడఁ గీఁడులౌదవు.

సీ. అందుదకమునించి యలరువోయఁగను
ప్రదక్షిణమైనచోఁ దగు శుభములు
నిండ కుండిన లెస్స నెరి నప్రదక్షిణ
మైన కారాదట్టు లరయ వలయు
శ్రవణార్ద్ర లుత్తరాత్రయ శతభిషపుష్య
వసు పంకజములు సూర్ధ్వములు ధరణి
యాశ్లేష పూర్వత్రయము మూలముఖకృత్తి
కా విశాఖ లధోముఖములు జ్యేష్ఠ

తే. యశ్వినీ పునర్వసులు మృగహస్త రేవ
తులు ననూరాధ స్వాతి చిత్రలును దిర్య
గాననములందు మాత కృత్యము ప్రచార
గతులు తిర్యఙ్ముఖంబున ఘనఫలమ్ము.

కం. ఓడల బండుల బావుల
జాడలు నవియూర్ధ్వములఁ ప్రశస్తము సస్య
క్రీడారామ గృహక్రియ
లాదక నిమ్నాడ్ని నేయ నురుశుభములగున్.

మ. శరదంభోరుహపత్రనేత్ర! కలుషా శారామరారీశవి
స్తర సైన్యాటవి వీతిహోత్ర! దివిషత్పాలామరజ్యేష్ఠ శం
కరయక్షోరగ సిద్ధ సాధ్య మునిసంఘ స్తోత్ర చారిత్ర! శం
బరద శ్యామల వర్ణగాత్ర! యలమేల్మంగా కళత్రా! హరీ.

కం. శరచర కచ్ఛప కిటినర
హరివామన రామ రామ హలధర బుద్ధో
ద్ధుర తురగపారారోహక
హరహరి విధివినుతి పాత్ర హరిహర నేత్రా.

పంచచామరము. మురామరారి వీరఘోర మూర్ధ పంక్తిఖండనా!
హారాజ రాజ మౌనిశేఖరార్చన ప్రతోషణా!
చిరంత నప్రసిద్ధ శుద్ధ సేవకాఘ పోషణా!
సరోజరోచ కోటిరూప! సారరమ్య భాషణా!

గద్య॥ ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదా సుకవితా విచిత్ర మహాంశాళ్యప్ప కొండార్య పుత్ర సకలసుకవిస్తోత్ర పవిత్రగాత్ర వినయగుణానునయ వేంగయకవి సహాయ శేకుమళ్లాన్వయ పయః పాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబాక ప్రియామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయిప్రణీతంబైన శ్రీ వాణీవిలాసవనమాలిక యను మహాప్రబంధంబునందు, ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వవేదంబు లెఱింగించుటయుఁ దర్కదండనీతి సాంఖ్యయోగ పూర్వమీమాంసోత్తరమీమాంసాది షట్ఛాస్త్ర ప్రశంసయు భరతశాస్త్ర కళాశాస్త్ర అలంకారశాస్త్ర శిల్పశాస్త్ర గజలక్షణ అశ్వలక్షణ పశులక్షణ రత్నలక్షణ సాముద్రికలక్షణ గణితలక్షణాద్యనేకశాస్త్ర వివరణంబును స్వప్నాధ్యాయ ప్రశంసయు నను కథలంగలది చతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

ఓం తత్సత్.